ఆనందాశ్రమగ్రంథరత్నమాల.

# హరిశ్చంద్రోపాఖ్యానము.




ద్విపద కావ్యము

గౌరనమంత్రి ప్రణీతము.

తంజనగరము - తేవప్పెరుమాళ్ళయ్యగారిచే

లఘుటీకాయుక్తముగాఁ

బరిశోధితము.

44

మొదటికూర్పు.

ఆనందముద్రాయంత్రాలయమున

ముద్రితము.

వేమూరు వేంకటకృష్ణమసెట్టి అన్డ్ సన్సుచేఁ

బ్రకటితము.

1911.



[Price Re. 1.




శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# ఉపోద్ఘాతము.



ఈ ద్విపదకావ్యమును రచించినకవి గౌరనమంత్రి. ఇతనితండ్రి యెల్లమంత్రి; తల్లి పోచాంబ. కూర్మపురాణమును రచించిన రాజలింగకవి

'రంగనాథుని రామలింగకవిని, సూరపరాజును గౌరనామాత్యుని'

అని చెప్పియున్నాఁడుగాన యతఁడు రామకృష్ణునికిఁ దరువాతను, కూర్మపురాణమునుండి యప్పకవిపద్యము నొకదాని నుదాహరించియుండుటచేత నప్పకవికిఁ బూర్వమునను, అనఁగా ౧౬౫౦ వ సంవత్సరప్రాంతమున నున్నవాఁడగుచున్నాఁడు. ఆకవి గౌరనను బేర్కొనియుండుటచే గౌరన యతనికిఁ బూర్వుఁడుగా నుండవలయుననియు నేర్పడుచున్నది. అనఁగా గౌరన పదునాఱవశతాబ్దమునడుమ నుండవచ్చునని తోఁచుచున్నది. మఱియు గౌరనద్విపదం జూచి హరిశ్చంద్రోపాఖ్యానమును బద్యకావ్యముగ రచించిన శంకరకవియు

'అలఘుప్రతాపకుతుబన
మలకేంద్రకృపాసముద్రమహిమాన్విత కా
ర్యాలనిగ్రామనికేతన
జలనీమారక్షణైకచాతుర్యనిధీ.

అని కుతుబనమలకనిఁ జెప్పియున్నాఁడు. కుతుబనమలకఁ డనఁగా మహమ్మద్ కుతుబ్షా. ఈకుతుబ్షా క్రీస్తుశతకము ౧౫౮౧-౧౬౧౧

సంవత్సరము లందున్నవాఁడు. కనుక నితని కాలము వాఁడైన శంకరకవికిఁ బూర్వమందే, యనఁగాఁ బదునాలవశతాబ్దమునడుమనే. గౌరన యుండఁగూడును.

ఇవి యిట్లుండ గ్రంథస్థనిదర్శనములంబట్టి కాలము నిర్ణయించుట కాధార మంతఁగా గానరాదు. ఇతని పెదతండ్రి పెద్దనపోతరాజు,

> 'సింగనమాధవక్షితిపాలమణికి
> మంగళమూర్తికి మంత్రియై జగతిఁ
> బొగడొందు పెద్దన పోతరాజు'

అన్నట్లు సింగనమాధవరాజునొద్ద మంత్రిగా నుండెనఁట. కాని యా రాజెవ్వఁడో, యే కాలము వాఁడే, యేరాజ్యమేలెనో తెలియరాదు.

ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమున మల్లికార్జునదేవునిని భ్రమరాంబికను మున్నుపొగడి, పిదప విఘ్నేశ్వరునిని, సరస్వతినిని, నవ్వలఁ గాళిదాసాదులనును స్తుతించియుండుటంబట్టి వీరశైవుఁడని తెలియుచున్నది. ఇతఁడు రచించిననవనాథోపాఖ్యానమును వీరశైవప్రబంధము గాన యితఁడు వీరశైవుఁడనుటకుఁ బ్రబల నిదర్శనముగా నున్నది.

గౌరనశైలి మిక్కిలియుఁ బ్రౌఢము. కొన్నియెడల లక్షణదోషములు గానిపించుచున్నను మొత్తమున కితనిశైలి మిక్కిలి రసవంతమై వర్ణనాచమత్కృతియుఁ బాకవైలక్షణ్యమునుగలిగి ముద్దులుగులుకుచుఁ దద్దయు మృదువై యుండును. తిక్కనవలెఁ దఱుచుగా నచ్చతెనుంగుపదములనుగాని, దగుకొలందిని విడిపలుకులనే బెడఁగుగా నల్లి, భావమంతయుఁ జిత్రించి, రసంబుఁ జిప్పిలం

జేయుచాతురి యీకవియందును జాలఁగలదు. ఆయారసముల
కనురూపముగాఁ బదము లలవరించి మిక్కిలియు స్వభావానుగు
ణముగా వర్ణనములు సేయుటయం దీకవి యసమానుఁడు. సొబగై
న స్వభావోక్తులును, జాతీయములును, లోకోక్తులును నందంద
నెరసి బెరసి యీతనికవిత కెంతయు మురువు గూర్చుచుండును.

'అని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట
వినియును విననట్లు విస్మయంబంది
చ్యవనుఁ డూరకయుండె శార్ఙ్గరవుండు
నవుడుకొట్టెను నీళ్లు నములెఁ గశ్యపుఁడు
వామదేవుఁడు నేల వ్రాసె మరీచి
సోమరియై మిన్ను చూచుచునుండె
గౌతముఁ డత్రికిఁ గనుగీఁటె నతఁడు
శాతాత్మకునిఁ బల్కుసన్నఁ గావించె
నాతఁ డగస్త్యుని నల్లన గోఁకె
నీవిధి నుత్తరం బీక యొండొరులు
నీవు నీ వని చూపి నిఖిలసన్మునులు
గుజగుజలాడ' (ప్రథమభాగ.119-131)

విద్వద్గోష్ఠి మొదలుగా వెంగలి ముచ్చటవఱకును, సార్వ
భౌముఁడాదిగా సేవకుని పర్యంతమును, స్వర్గము మున్నుగా శ్మ
శానవాటిదనుకను నిట్లయ్యైపదవుల యుచ్చనీచకాష్ఠలును దద
వాంతరదశలును గలుగు పాత్రములకుఁ గథాసందర్భమున కను
గుణముగా వేషములను బొందుపఱిచి, తత్తదుచితపరిభాషాది
పరికరము కొఱవడనట్లు రచించురచనలు మిక్కిలి పొంకములును
ప్రౌఢములును రమణీయములునై కవిరసజ్ఞతాపటిమను, లౌకిక
పరిజ్ఞానగౌరవమును వర్ణనాప్రాగల్భ్యమును నెంతయుఁ బ్రక

టించుచున్నవి. ఏదిచెప్పినను, ఏపాత్రమును చిత్రించినను, బదా
డంబరమును సమాసారభటియు లేక సరసములైన తేటపదము
ల సొగసుగాఁగూర్చి కోరినరసము లొలికించుచున్నాఁడు. మఱి
యు శబ్దవిస్తరమునకును వర్ణనాబాహుళ్యమునకుఁ జోరక
యొకకొన్ని బంతులలోఁ దలఁచినవర్ణనమును, నర్థగౌరవము
నం జేసి మెచ్చులుగులుక, రసము చిప్పిలునంతరంజకముగాను,
మోమున ప్రేలునంత విశదముగాను, మనస్సున నచ్చొత్తినంత
గాఢముగాను, వర్ణనము సేయుటయం దితఁడు దిట్ట. ఉదాహ
రణము.

'కొలఁదె హరిశ్చంద్రుగుణములు వొగడఁ
దనువెల్ల సత్యంబు తలఁపెల్లఁ గరుణ
పనులెల్ల ధర్మంబు పలుకెల్లఁ బ్రియము
బొంకు నాలుకకుఁ జేర్చుట కానివాని
యింక నన్నియుఁ జెప్ప నేమికారణము'
'జడలుగట్టుట వృథాశాంతి యాతనికి
నుడుగకముక్కున నుండుఁ గోపంబు'

ఈ కవిపదసందర్భమును మిక్కిలి ప్రగల్భముగా నుండును. సంద
ర్భోచితమగుపదప్రయోగ మతిచతురమై కవికిం గలయతులభా
షాప్రవేశవైశిష్ట్యమును విశదీకరించుచున్నది. చంద్రమతీవర్ణ
నమున

'సుందరి గా దిది సొబగురాయంచ
యంచ గా దిది నడపాఱు క్రొమ్మించు
మించు గా దిది రాచమెచ్చులప్రతిమ
ప్రతిమ గా దిది పచ్చపగడంపులతిక
లతిక గా దిది నవలావణ్యసరసి'

యని సౌందర్యాతిశయమును వర్ణించి కలహాకంఠికను

'మెదుకపట్టైనతల మెడగండమాల
నుదుటిమీఁదిటిసుడి ముడిగొన్న బొమలు
బుఱ్ఱముక్కును లొట్టపోయినకన్ను
వెఱ్ఱిచూపును దెగి వ్రేలాడుచెవులు
మిడిపండ్లు చెక్కిలిమీఁదిపుల్పిరియుఁ
బసి వ్రేలుచన్నులు బడబాకినోరుఁ
గఱుకునల్లనిమేను గలిగి దర్ప్యంబు
మఱపింపఁ దగునుచ్చమల్లి చందమున'

నని వికారవైభవమును రూపించినాఁడు.

మఱియుఁ జంద్రమతిని వెనుకొని కాలకౌశికునితోడం బోవులోహితాస్యునిం జూచి జనులు

'వెన్నముద్దకు రూపు వెట్టినమాడ్కి
నున్న మెత్తనిమేన నొప్పెడువాఁడు
ఎన్నఁడు నెండఁ గన్నెఱుఁగనిసువు
కన్నుల ముత్యాలు గాఱ నేడ్చెడిని
నేచెల్ల నో యమ్మ యీచక్కనన్న
రాచతేజము గలరత్నాలపెట్టె
నడువ నెట్లోర్చెనో నాముద్దుఁజిలుక
కడుపు చుఱుక్కనుఁ గన్నవారికిని'

అని వర్ణించువర్ణన మత్యంతరసోద్దీపకమై తద్దయుఁ బ్రౌఢముగా నున్నది 'వెన్నముద్దకురూపు వెట్టుట' 'కన్నులముత్యాలుగాఱుట' యను రెండొకపలుకుల వర్ణితములైన సౌకుమార్యసుమనోజ్ఞత్వాదులు, నిరతిశయములై నిరవధికచమత్కారకారులుగా నున్నవి. మఱియుఁ జంద్రమతిని గొనితెచ్చినమగనిం జూచి కలహాకంఠిక

'కటకటా ! కాటికిఁ గాళ్లు సాఁచియును
విటతనంబులజాడ విడువఁ డీబడుగు
కొండంగి వీనివెక్కురుతలఁ దఱుఁగ
ముండగోష్ఠికి ముక్కు మొగ మేడ తనకు'

ననుట యెంతయు స్వభావానుగుణమై సునిపుణముగా నున్నది.

ఇక్కవియే మొట్టమొదట హరిశ్చంద్రకథను బ్రత్యేకముగా రచించినవాఁడుగాఁ గనుపట్టుచున్నాఁడు. ఇతనినిజూచియే శంకరకవియు కంచి శరభకవియుఁ బెక్కువర్ణములను గయికొనియున్నారు.

'సకలదీవులు నేలుజనపతిపుత్రుఁ
డకట! చేరెఁడు నేల కర్హుండుగాఁడె.' — గౌరన.

'అకటా! చేరెఁడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టీభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళ నిర్గళత్కిరణ శుంభత్పాదుఁడై నట్టిరా
జకుమారుండు.' — శంకరకవి.

'సప్తద్వీపసముద్రముద్రితమహా సర్వంసహాచక్రసం
ప్రాప్తశ్రీకమనీయలక్షణజగత్పావిన్యాసత్యవ్రతో
ద్దీప్తప్రాభవుఁడైనరాజసుతుఁ డర్థిన్ దైన్యభావోదయ
వ్యాప్తిన్ బెత్తెఁడు నేల కైనఁ దగఁడే.' — శరభకవి.

ఇత్యాదులు పెక్కింటిఁ జూపవచ్చును. మఱియు

'ప్రజతండములు బరాబరిసేయ మత్త
గజములు నీవెంటఁ గదిసి రావేల ?
తాజితోఁబడివాగె నొప్పుసాంబ్రాణి
తేజీలు నీవెంటఁదిగిచి రావేల' — గౌరన.

[illegible] యీవర్ణమునకు సాటిగా రామరాజభూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానమున

రావేల మదనిర్ఘరావేలపరిమళలోభలుబ్ధాళిభద్రేభఘటలు
తగవేలచూడఁ గ్రొత్తగవేలసంఖ్యలై పడివాగెఁ బఱతెంచు ప్రౌఢహరులు

అని కానిపించుచున్నది. రామరాజభూషణుఁడును బదునాఱవశతాబ్దమునడుమ నుండినవాఁడు. ఇట్టీకవు లిరువురు సమకాలికులుగాఁ దోఁచుటచే నెవరిని జూచి యెవ రనుకరించినదియు నిర్ణయింప నయితి కాకున్నది.

ఇందుఁ గలలోకోక్తులు పెక్కులాంధ్రజనగృహములం దెల్ల నిప్పటికిని వాడంబడుచున్నవి. కొన్ని యుదాహరించెద.

'లెక్కింప నపకీర్తి లేనిజీవనము
నిక్కంబుగా నొకనిమిషంబె చాలు'
'పనుపడ మొగిలులోపలినీళ్లు నమ్మి
దొననీళ్లు చల్లువేఁడుఱు నెందుఁగలఁడె'
'అంతుగా నాఁబోతు అంకె వేసినను
గంతులు దక్కునే కంఠీరవంబు'
'కులము ప్రధానమే గుణము లేకున్నఁ
గలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు'
'పంద నందఱు బాధపఱుతురుగాని
యెందు సాహసునిది కెవ్వరుఁ బోరు'

ఇట్టివి పెక్కులున్నవి. మఱియిందలి దృష్టాంతాదులు నిరుపమానములు. పెక్కువాక్యములచే సమర్థింపవలసిన యర్థమొక్కదృష్టాంతముచేతనే, యొక్కలోకోక్తిచేతనే, సాధితమై సంవాదమునకు శబ్దసంగ్రహప్రయుక్తమైన యర్థసంపదసొంపు గూర్చుచున్నది.

'నీఱువట్టాఱునే నెయిఁద్రావికొనిన'
'తమ్ము మాలిన యట్టిధర్మంబుఁ గలదె'
'...........తల్లి దెగనమ్మి దాసిఁ
బిలిచి పాలిచ్చిన ప్రియము చింతింప'
'కాదని ముకుఁద్రాటఁ గాలు దూయకుము.'

మఱియు నిందు నందంద నిడుద యగునొక్కొక సమాసంపు ధాటి యెంతయు నీటు గులుకుచుండును.

> 'మందారమంజరీ మంజుమరంద
> నంద దిందిందిర నందనారామ
> కమనీయ వికసిత కనకారవింద
> కమలినీ తటలతా గారలతాంత
> ... ... ...
> సహిత చింతామణి సౌధపాళికల'

> 'దారుణకరవాలధారాహతారి
> కిరకోటీర నవీనమాణిక్య
> రంగవల్లీ రణరంగవిఖ్యాత
> మంగళవిజయరమాకరగ్రహణ
> శస్త్రమైనట్టియాక్షత్రియోత్తముని
> హాస్తమేరీతిని నలవడుఁ గృషికి'

ఇందు నపూర్వము లయినయచ్చతెనుఁగు పదము లనేకములు గానిపించుచున్నవి. పెక్కుపదములకుఁ బ్రయోగాంతరము దొరకక శబ్దరత్నాకరకారులగు శ్రీమాన్ బ - సీతారామాచార్యులవారీగౌరనప్రయోగములనే యుదాహరించియున్నవారు. ఇట్టిగ్రంథమును మొట్టమొదట బ్రౌణ్‌దొరగారు ముద్రితముంగావించిరిగాని యందును దప్పులు పెక్కులుండుటంబట్టి తాళకోశములఁ గొన్నింటిఁగొని యథామతి దీనిని సవరించినాఁడను. అయినను విశ్వసనీయము లైనప్రతులు వలయు నన్ని నాకు లభింపవయ్యె. దీనియందుఁ గలిగిన కఠినపదముల కర్థములును, గొన్ని యెడల నన్వయములును, గొన్నిచోట్లఁ దాత్పర్యవివరణమును బొందుపఱిచియున్నాఁడను.

తం - తేవప్పెరుమాళ్ళయ్య.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ద్విపద

### దేవతాప్రార్థనాదులు.



శ్రీగిరిజాధీశు శ్రీగిరినాథు
నాగచర్మాంబరు నాగకేయూరు
బాణవత్సలుఁ బంచబాణసంహారు
వాణీశవినుతు గీర్వాణేశవంద్యు
గంధర్వకిన్నరగాంధర్వలోలుఁ
గంధరశ్యామలకంధరోదారు

---

టి. మొదటఁ గవి తనయిష్టదైవ మగుశివుని స్తుతించుచున్నాఁడు.—శ్రీగిరిజా నాథుఁన్ = పార్వతికి పతియైనవానిని, శ్రీగిరినాథుఁన్ = కైలాసపర్వతమునకు అధిపతియైనవానిని, నాగచర్మ + అంబరుఁన్ = ఏనుఁగుతోలు వస్త్రిముగాఁగలవానిని, నాగకేయూరుఁన్ = సర్పములు బాహుపురులుగాఁ గలవానిని, బాణవత్సలుఁన్ = బాణాసురునియందు ప్రీతిగలవానిని, పంచబాణసంహారుఁన్ = మన్మథుని సంహరించినవానిని, వాణీశవినుతుఁన్ = సరస్వతికి పెనిమిటియైన బ్రహ్మచేత స్తుతింపఁబడినవానిని, గీర్వాణ ఈశ వంద్యుఁన్ = దేవతలకు ప్రభుఁడైన యింద్రునికి వందనము సేయఁదగినవానిని, గంధర్వకిన్నరగాంధర్వలోలుఁన్ = గంధర్వులయొక్కయు కిన్నరులయొక్కయు సంగీతమునందు ఆసక్తుఁడైనవానిని, కంధర ... దారు - కంధర = మేఘమువలె, శ్యామల = నల్లనైన, కంధర = కంఠముచేత, ఉదారుఁన్ = గొప్పవాఁ

దారుణాంధకదర్పదళనప్రచారుఁ
జారుజాంబూనదశైలకోదండుఁ
గారుణ్యజలధి గంగాధరు నభవు
శారదాచందనశారదాంభోద 10
మల్లికాకర్హారమాలికాయశుని
మల్లికార్జునదేవు మహితప్రభావు
మాపాల నేపట్ల మమ్మేలువేల్పుఁ
బాపాళిఁ బాప సద్భక్తిఁ బూజించి
పరమయోగీంద్రహృత్పద్మ సద్మముల
మరిగి క్రీడించెడిమాయల తేఁటిఁ
గడు నొప్పు భ్రమరాంబికామహాశక్తిఁ

---

నైనవానిని-విషము త్రాగుటచే నల్లనికంఠము గలవాఁడనుట. దారు...చారు-దారుణ=భయంకరమైన, అంధక=అంధకాసురుని యొక్క, దర్ప=గర్వమును, దళన= చీల్చుటయను, ప్రచారున్=ప్రవృత్తి గలవానిని, చారుకోదండు - చారు=మనోజ్ఞమైన, జాంబూనద శైల=బంగారుకొండ యనెడు, కోదండున్=విల్లు గలవానిని- మేరుపర్వతము విల్లుగాఁ గలవానిని, కారుణ్యజలధి= దయాసముద్రుని, గంగాధరున్=గంగను దాల్చినవానిని, అభవున్=పుట్టుక లేనివానిని- ఈపదము శివునియందు రూఢము. శారదా...యశుని-శారదా=సరస్వతి, చందన=చందనము, శారద అంభోద=శరత్కాలపు మేఘము, మల్లికా=మల్లెలు, కర్హార=కర్హారము, మాలికా=విరజాజులు, వీనివంటి, యశునిన్=కీర్తి గలవానిని, ఇట్టివాఁడగు మల్లికార్జునదేవుని, పూజించి అను క్రియతో అన్వయము. పాపాళిన్=పాపసమూహములను, పాపన్ = తొలఁగించుటకు, పరమయోగీంద్ర...మాయల తేఁటి-పరమయోగీంద్ర=శ్రేష్ఠులైన యోగీంద్రుల యొక్క, హృత్ పద్మ=హృదయారవిందముల నెడి, సద్మములన్=గృహములందు, మరిగి=మచ్చిక పడి, క్రీడించు=విహరించు, మాయల తేఁటి=కృత్రిమమైన తుమ్మెద-తుమ్మెద తామరలయందు

దడయక వరములు దయ సేయఁ గొలిచి
సారంబుగా వేడ్క సమకొల్పుబీజ
పూరంబు వలకేలఁ బొలుచురత్నాల 20
హారంబు డాకేల నాదిత్యమకుట
హీరంబు నెదఁ గల్గుహేరంబుఁ బొగడి
వల్లకీమృదుపాణి వరనీలవేణిఁ
బల్లవారుణపాణిఁ బరమకల్యాణిఁ
జారుహారశ్రేణి సైకతశ్రోణి
వారిజాసనురాణి వాణిఁ బ్రార్థించి
యాకాళిదాసాదు లగుమహాకవులఁ
జేకొని యభిమతసిద్ధికిఁ దలఁచి
చెలఁగి ఋగ్వేదప్రసిద్ధుఁడ జగతి
వెలయుహరిశ్చంద్రవిభుపుణ్యచరితఁ 30
గవితాచమత్కృతిఁ గాంచి హర్షించి
కవు లందఱును శిరఃకంపంబు సేయఁ

---

విహరించునట్లు మచ్చికతో భ్రమరాంబిక పరమయోగీంద్రులహృదయములందు విహరించుననుట. పరమయోగీంద్రులు హృదయములం దెప్పుడును భ్రమరాంబికను ధ్యానింతురనిభావము. వలకేలన్ =కుడిచేత, బీజపూరంబు=మాదిఫలము, డాకేలన్ =ఎడమచేత, ఆదిత్య మకుట హీరంబు=సూర్యునికిరీటమందలి వజ్రమణి. ఎదఁగల్గుహేరంబు=ఱొమ్మునందుండు విఘ్నేశ్వరుని. వల్లకీమృదువాణి=వీణియవలెమృదువైన పలుకులుగలది. వరనీలవేణి=మేలయిన నీలములవంటిజడ గలది. పల్లవ అరుణపాణి=చిగుళ్లవలె ఎఱ్ఱని చేతులుగలది. పరమకల్యాణి=మిక్కిలి మంగళస్వరూపిణియైనది. చారుహారశ్రేణి=మనోజ్ఞములైన హారములసమూహము గలది, సైకతశ్రోణి = ఇసుకదిన్నెలవంటిపిఱుఁదులు గలది. వారిజాసనురాణి=బ్రహ్మకు

బచరించి వీనులపండువు గాఁగ
రచియింతు మత్కులక్రమ మెట్టి దనిన
సింగనమాధవక్షితిపాలమణికి
మంగళమూర్తికి మంత్రియై జగతిఁ
బొగ డొందు పెద్దనపోతరాజునకుఁ
దగినతమ్ముఁడు యశోధనుఁ డెల్లమంత్రి
చెట్టపట్టంగ నోఁచినభాగ్యవతికిఁ
జుట్టాలసురభికి సుందరీమణికి 40
ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబ గోరి
కనినపోచాంబకు గారాబుసుతుఁడ
ధరణి నమాత్యరత్నం బనఁ బరఁగు
ధరణిమంత్రికిఁ గూర్మితమ్ముఁడ ఘనుఁడ
భూతనాయకపాదపూజాభిరతుఁడ
గౌతమగోత్రుండ గౌరనాహ్వయుఁడ
సరససాహిత్యలక్షణవిచక్షణుఁడ
బిరుదవిఖ్యాతిచేఁ బెం పొందువాఁడ
శ్రీకరంబుగ విరచింప నేఁ గోరు
నా కథావృత్తాంత మది యెట్టి దనిన. 50

పట్టపుదేవియైనది. పచరించి=అమర్చి, చెట్టపట్టంగ నోఁచినభాగ్యవతికి=(ఎల్ల మంత్రి) పెండ్లాడుటకుఁ దగినపుణ్యము సేసిన ధన్యురాలికి, చుట్టాల సురభికి= చుట్టములకు కామధేనువు అయినదానికి–ఇవి కవితల్లియైనపోచాంబకు విశేషణ ములు. గారాబుసుతుఁడు=కూరిమికొడుకు. భూత...రతుఁడ–భూతనాయక= శివునియొక్క, పాదపూజా = పదములనర్చించుటయందు, అభిరతుఁడ=ఆసక్తుఁ డైనవాఁడను, విచక్షణుఁడ=పండితుఁడను

# అవతారిక.



గురుతపోబలనఖాంకుశముల నూఁది
దురితమత్తేభసందోహంబు నడఁచి
పొలుచుసన్మునిసింహములకు వసింప
వలనైనయా ద్వైతవనములోఁ బ్రబలి
యెల్లకాలమును బెంపెసఁగెడుబాల
పల్లవంబుల లసత్ప్రసవమంజరుల
పరిపక్వఫలముల పారిజాతముల
మురువున నెంతయు ముద మొదవించు
సహకారభూజంబుచల్లనినీడ

టి. గురు...కుశములన్ - గురు = గొప్పలైన, తపోబల = తపోబలములనెడి, నఖఅంకుశములన్ = అంకుశములవంటి గోళ్లను, ఊఁది = తాల్చి, దురిత...దోహంబు - దురిత = పాపములనెడి, మత్తేభ = మదపుటేనుఁగులయొక్క, సందోహంబున్ = సమూహమును, అడఁచి = అడఁగఁద్రొక్కి, పొలుచు సత్ మునిసింహములకున్ = ప్రకాశించుచున్న శ్రేష్ఠులైన మునులనెడు సింహములకు, వసింపన్ = వసించుటకు, వలను = అనువు, ఐన, ఆ, ద్వైతవనములో = ద్వైతవనమునందు - ఇచట ద్వైతవనమును ఒకవనముగాను అందలిమునులను సింహములుగాను వారి తపోబలములు అంకుశములవంటి గోళ్లుగాను పాపములను మదపుటేనుఁగులుగాను రూపించినాఁడు - అనఁగా ఆద్వైతవనమందలి ఋషులు సింహము అంకుశమువంటి వాఁడిగోళ్లచే మదపుటేనుఁగుల నడఁగఁద్రొక్కినట్లు తమతీక్ష్ణ తపోబలముచే పాపసమూహమును దూలఁబుచ్చినవారనుట. పల్లవములు = చిగుళ్లు, లసత్ ప్రసవ మంజరులు = ప్రకాశించుచున్న పూగుత్తులు, మురువునన్ = ఈచిగుళ్లు మొదలగువానిమనోజ్ఞతచేత, ముదము = సంతోషము, సహకార

సహజన్ము లందఱు సద్భక్తిఁ గొలువ 10
ననఘవర్తనుఁ డైనయా ధర్మరాజు
మునులసద్గోష్ఠి నిమ్ముల నున్నవేళఁ
గుఱుచకెంజడలు బాగుగ నెత్తిఁ జుట్టి
మెఱవడిగా భూతి మెయి నిండ నలఁది
చారురుద్రాక్షభూషణములు దాల్చి
సారంగచర్మంబు జాఱుగాఁ గప్పి
సురుచిరస్ఫటికాక్షసూత్రంబుఁ బుణ్య
సరిదంబుపూరితోజ్జ్వలకమండలువుఁ
గరముల విలసిల్లఁ గణ్వకుత్సాద్యది
వరమునీశ్వరు లిరువంకలఁ గొలువఁ 20
జను తెంచుదీప్తవైశ్వానరతేజు
ననఘు మార్కండేయుఁ డనుమునిచంద్రుఁ
బొడగాంచి తానుఁ దమ్ములు నెదురేఁగి
పుడమిఁ జాఁగిలి మ్రొక్కి పూజ లొనర్చి
సమ్మదంబున సుఖాసనమున నునిచి
యమ్మునీశ్వరు సేమ మంతయు నడిగి
యుచితసద్గోష్ఠిమై నున్నయా వేళ

---

భూజము=తియ్యమామిడిచెట్టు, సహజన్ములు=తోఁబుట్టువులు, అనఘవర్తనుఁడు=పాపములేని నడవడిగలవాఁడు, సారంగచర్మము=జింకతోలు, సురుచిర...సూత్రము-సురుచిర=సొగసైన, స్ఫటిక=పటికపురాలతోఁజేయఁబడిన, అక్షసూత్రము, పుణ్య...కమండలువు - పుణ్యసరిత్ = పవిత్రమైన నదియొక్క, అంబు=జలముచేత, పూరిత=నిండింపఁబడిన, ఉజ్జ్వల=ప్రకాశించుచున్న, కమండలువు, దీప్తవైశ్వానరతేజుఁ=ప్రకాశించుచున్నఅగ్నివంటితేజస్సుగలవాఁడు,

సుచరిత్రుఁ డగుధర్మసూనుఁ డిట్లనియెఁ
బిన్న యానాఁటఁ బొంపిరి వోవుభక్తిఁ
బన్నగకంకణుఁ బరఁగ మెప్పించి 30
మెఱుఁగుకోఱలతోడిమృత్యువునోరు
తఱలక డాకాలఁ దన్ని దట్టించి
మునులముత్తాతలై మూఁడులోకముల
వినుతి కెక్కిన తపోవృద్ధులు మీరు
ముందు మీ రెఱిఁగినభూతలాధీశు
లందు రాజ్యంబు వోనాడి క్రమ్మఱను
భుజవిక్రమంబున భూచక్ర మెల్లఁ
బ్రజలు సన్నుతి సేయఁ బాలించినట్టి
మనుజేశతిలకుని మహితచారిత్ర
ననురాగ మిగురొత్త నానతీవలయు 40
నని విన్నవించిన నా ధర్మపుత్రుఁ
గనుఁగొని పలికె మార్కండేయుఁ డెలమి
ననఘాత్మ నీవు నన్నడిగిన మాట
కొనర నుత్తరముగా నొకకథ వినుము.

---

పొంపిరివోవుభక్తి=అతిశయించునట్టి భక్తి, పన్నగకంకణున్=సర్పములు కడియములుగాఁగల శివుని, మెఱుఁగుకోఱలతోడి మృత్యువునోరు=మెఱయుచున్న కోఱపండ్లుగల మృత్యువునోటిని - మృత్యువునకు జంతువులను గబళించు సాధనముగా మెఱుఁగుకోఱలనుచెప్పుటచే దాని భయంకరత్వమును సూచించినాఁడు. తరలక=చలింపక, డాకాలన్=ఎడమకాలిచే, దట్టించి=అదల్చి, భూతలాధీశులు=రాజులు, మనుజేశతిలకుని=రాజశ్రేష్ఠుని.

# కథారంభము.

## ప్రథమభాగము.

శివుని కెంజడలలోఁ జెలఁగుజాహ్నవికి
సవతు సేయఁగఁ దగుసరయునుపాంత
ధరణిదేవికి ముఖదర్పణం బనఁగఁ
బరుల కసాధ్యమై పరఁగునయోధ్య
చెలువొందు నందులచిగురుమావులును
గలయఁ బెంపెసఁగుచెంగల్వబావులును
సోమరిగాలిచే సుడియుతావులును
ప్రేమఁ గాముకులు చరించుతావులును
దరుణప్రవాళలతావితానములుఁ
బరిఖాంబుసారసబహువిలాసములుఁ 10
జెన్ను మించినమంచిచెఱకుఁదోఁటలును

---

టీ. జాహ్నవి=గంగ, సవతుసేయఁగన్=సాటిసేయఁగా, ధరణిదేవికిన్=భూదేవికి, ముఖదర్పణము=మొగము చూచుకొనెడియద్దము-అద్దమునందు ముఖసౌందర్యాదులు ప్రతిఫలించునట్లు భూదేవి పెంపుసొంపులన్నియు నందు ప్రకాశించుచుండుననుట-భూమియందుఁగల మనోజ్ఞతలును అతిశయములునెల్ల అందుఁగనుపట్టుచుండుననిభావము. తావులు=చోట్లు, తరుణ...వితానము-తరుణ=లేఁత, ప్రవాళ=చిగుళ్లయు, లతా=తీఁగెలయు, వితానములు = సమూహములు, పరి...విలాసములు—పరిఖా=అగడ్తయొక్క, అంబు=జలమునందలి, సారస=తామరలయొక్క, బహువిలాసములు=అనేకము లైనయొప్పిదములు. చెన్ను=

మిన్నులతో రాయుమేటికోటలును
గమనీయవజ్రసంగతకవాటములుఁ
గొమరారుముత్యాలకొలువుకూటములు
రాజితం బగు గృహరాజిమేడలును
భూజనంబులు మెచ్చి పొగడుమాడలును
వేడుక మది కొదవించువీదులును
నీడలు దోఁచుమాణిక్యవేదులును
గనకచిత్రితపతాకావితానములుఁ
బెను పొందుమాగధబృందగానములు 20
బహువిధదేవతాప్రాసాదములును
మహనీయతూర్యసమ్మదనినాదములుఁ
బరతత్త్వవిదులైనబ్రాహ్మణోత్తములుఁ
బురుహూతుఁ బురుడించుభూపసత్తములు

---

అందము. మిన్నులు=ఆకాశము, కమ...కవాటములు-కమనీయ = మనోజ్ఞములైన, వజ్ర=వజ్రములతో, సంగత=కూర్పఁబడిన-వజ్రములు పొదిఁగిన, కవాటములు=తలుపులు, కొమరు+ఆరు=అందము నిండియున్న. రాజితంబు=ప్రకాశించునది. గృహరాజి=ఇండ్లవరుసలు, ఒదవించు=పుట్టించు, నీడలుదోఁచు=ఛాయలుప్రతిఫలించునట్టి, మాణిక్యవేదులు=రత్నపుటరుఁగులు. కనక...వితానములు=కనక=బంగారముతో, చిత్రిత=చిత్రింపఁబడిన-బంగారు చిత్తరుపనిగల, పతాకా=ధ్వజములయొక్క, వితానములు=సమూహములు, పెనుపు ఒందు=వృద్ధిఁబొందెడి, మాగధబృందగానములు = వంశావళికీర్తకులసమూహములగీతములు. దేవతాప్రాసాదములు=దేవాలయములు. మహ...నాదములు - మహనీయ=గొప్పవైన, తూర్య=వాద్యముల, సమ్మద=సంతోషకరములగు, నినాదములు, ధ్వనులు, పురుహూతుఁ = దేవేంద్రుని, పురుడించు = సరిపోలునట్టి, భూప

నలకాధిపతికి జోడైనవర్తకులు
నలఘునృత్యప్రౌఢి నలరు నర్తకులు
మందారములఁ బోలి మను మహీజములు
నెందుఁ బోఁ దలఁచిన నేఁగెడు తేరు
లవిరళ మదగంధు లగువారణములుఁ
బ్రవిమలరత్నదర్పణతోరణములుఁ 30
దివిరి కేలెత్తినఁ దెంపుజోదులును
రవళించి దాఁటుసాంబ్రాణి తేజీలుఁ
బగఱతూపులగండ్లబలుగాయ లొడలఁ
దగుభూషణము లైనదండనాయకులుఁ
దెగువ మత్తేభముఁ దెమలించి తుండ

సత్తములు=రాజశ్రేష్ఠులు, అలకాధిపతికిన్=కుబేరునికి, మందారములన్=కల్ప వృక్షములను, మనుమహీజములు=వర్తించుచున్నవృక్షములు, ఎందుఁ బోఁదలఁ చినన్ ఏఁగెడు తేరులు = కామగమనము లైనరథములు. అవిరళ=దట్టమైన, మద=మదజలము చేత, గంధులు=పరిమళించుచున్నవి. వారణములు=ఏనుఁగులు. ప్రవిమల=మిక్కిలి నిర్మలము లైన, రత్న=రత్నములతో నైన, దర్పణ=అద్దము లుగల, తోరణములు=గృహద్వారములు, తివిరి=యత్నించి, కేలుఎత్తినన్=మా ర్కొనుటకు చేయి యెత్తఁగానే, తెంపు=నఱకునట్టి, జోదులు=యోధులు- చేయె త్తితాఁకుటకుమునుపే తెగటార్చునంతటిబలపరాక్రమములు గలవా రనుట. రవళించి=ధ్వనించి- సకిలించి, దాఁటు=గంతులు వేయు, సాంబ్రాణి తేజీలు=ఉత్త మములైన గుఱ్ఱములు, పగఱ=శత్రువులయొక్క, తూపుల=బాణములచేత నైన, గండ్ల=రంధ్రములందుగలిగిన, బలుగాయలు= పెద్ద కాయలు- బాణములు ఉచ్చి పోయినగండ్లు మానినగాయములే, ఒడలన్ = దేహమునందు, తగుభూషణము లు=ఒప్పినసొమ్ములు, ఐన=అయినట్టి, దండనాయకులు = దళపతులు, తెగు వన్=సాహసముతో, మత్తేభంబు = మదపుటేనుఁగును, తెమలించి=కదల్చి,

మగలించి మరలించునాధోరణులును
నరుదుగా రౌతును హయముఁ బల్లమును
దురమున వ్రేటూఅుతునియలు గాఁగ
వడిగొని యడిదాన వైచి కందానఁ
దుడుచురౌతులుఁ గత్తి డొంకెనఁ బొడిచి 40
పోటుగండ్లనె తూఱి పోవుసద్భటులుఁ
దాటించి కరి నైనఁ దఱుముమల్లులును
గలుగునప్పర మేలు కమనీయమూర్తి

---

తుండము=తొండమును, అగలించి=నఱికి, మరలించు=మరలిపాఱునట్లుచేయు, ఆధోరణులును=ఏనుఁగునెక్కుబంటులును, అరుదుగాన్ =ఆశ్చర్యముగా, రౌతును=గుఱ్ఱపురౌతును, హయమును = వాఁడెక్కినగుఱ్ఱమును, పల్లమును=గుఱ్ఱముపైపఱచెడుమెత్తపఱుపుగంతను, తురమునన్ = యుద్ధమునందు, వ్రేటు = ఒక్కకత్తివ్రేటు, ఆఱుతునియలుగాఁగన్ = ఆఱుతునుకలుగాఁగ, వడిగొని=మిక్కిలివేగముతో, అడిదానన్=కత్తితో, వైచి = వేసి, కందానన్ = తమగుఱ్ఱపుమూఁపునందు, తుడుచు = తమకత్తికిఁ దగిలిననెత్తురు పోవఁగా తుడుచునట్టి, రౌతులును = గుఱ్ఱపుబంటులును – ఈరౌతులు కత్తిగొని యతిలాఘవముతో పగవారిరౌతును ఒక్కవ్రేటువేయఁగా ఆయొక్కవ్రేటునను ఆరౌతును వాఁడెక్కినగుఱ్ఱమును దానిపయిపల్లమును చెఱిరెండేసితుండ్లుగా పోవుననియు కావున ఒకవ్రేటునను ఆఱుతునుకలగు ననియు కత్తికిఁదగిలిన నెత్తురు గుఱ్ఱపుమూఁపులనుఁ దుడిచివైతురనియు నర్థము–ఒకవ్రేటునను ఆఱుతునుకలగునంతటి భుజబలమును వీర్యమునుగలవారని భావము. కత్తిన్ =కత్తితోను, డొంకెనన్ =వంకరయులుఁగుగల యీఁటెతోను, పొడిచి=పగవారినిపొడిచి, పోటుగండ్లనే=అట్లుపొడిచినరంధ్రములలోనే, తూఱిపోవు = చొచ్చిపోవునట్టి, సత్ భటులు=మేలయినబంటులును–పోటుగండ్లనే తూఱిపోవుదురనఁగా అతివేగముతో నెదిరి నాక్రమింతురనుట. కరి = ఏనుఁగు. కమనీయమూర్తి =

నలరు హరిశ్చంద్రుఁ డను చక్రవర్తి
పరఁగ నీ యుగములు పదునాల్గు వరుస
నరుగునంతకు భువి నంతయు నేలె.
హరిహరబ్రహ్మాదు లచ్చెరు వొంద
జరపె సన్నుతి కెక్క సత్య వ్రతంబు
నోజతో నమరముఖ్యులు పంపు సేయ
రాజసూయమహాధ్వరం బొనరించె 50
నాజులఁ దన కెదురైన పేర్చు కరుల
వాజుల సుభటుల వడిఁ దునుమాడి
రాజుల నుదయమార్తాండ ప్రచండ
తేజులఁ బఱపి మర్దించి కప్పంబు
లేర్పడఁ గైకొని యెల్లదీవులను
దర్పించి నిజజయస్తంభముల్ నిలిపి
యెన్నిక కెక్క నీ రేడులోకముల
వెన్నెలగతిఁ గీర్తి వెలిఁగించె నట్టి
భానుకులాధిపుఁబట్టంపుదేవి
మానినీమణి చంద్రమతి యనులేమ 60

---

మనోజ్ఞమైన ఆకారముగలవాఁడు, భువి = భూమి. అచ్చెరువు = ఆశ్చర్యము, సన్నుతి = పొగడ్త, ఓజ = వరుస, అమరముఖ్యులు = దేవతాశ్రేష్ఠులు, పంపు = ఆజ్ఞ-నియోగము, మహాధ్వరము = గొప్పయాగము, ఒనరించెన్ = చేసెను, ఆజులన్ = యుద్ధములందు, పేర్చు=విజృంభించు, వాజులన్ =గుఱ్ఱములను-గుఱ్ఱపురౌతులననుట, ఉదయ... తేజులన్ -ఉదయ= ఉదయించినట్టి, మార్తాండ = సూర్యునివంటి, ప్రచండ=తీక్ష్ణమైన, తేజులన్ = ప్రతాపము గలవారిని, పఱపి=పాఱఁదోలి, దర్పించి=గర్వించి, భానుకుల అధిపు=సూర్యకులమందుఁబుట్టినరాజు,మానినీమణి= స్త్రీరత్నము. కోర్కులు...

కోర్కులు నిండించుకూరిమితనయుఁ
డర్కతేజుఁడు లోహితాస్యుఁ డన్వాఁడు
వార్త కెక్కినమంత్రివరులలో నెల్లఁ
గీర్తింపఁ దగుసత్యకీర్తి ప్రధాని
యిట్టిప్రతాపంబు నిట్టి వైభవము
నిట్టి భాగ్యమును బెం పెసఁగునారాజు
తల్లియుఁ దండ్రియు దాత యై ప్రజల
నెల్లఁ బ్రోచుచు నేల నేలుచు నుండె
భానుకోటిప్రభాభాసురం బైన
యానాకలోకమునం దొక్కనాఁడు 70
పరమసమ్మదమునఁ బాకశాసనుఁడు
హరిచందనము మేన నలవడ నలఁది
సరి లేనిరత్నభూషణములు దాల్చి
సరసమందారపుష్పంబులు దుఱిమి
పొసఁగ దివ్యాంబరంబులు లీలఁ గట్టి
యసమానశృంగార మలవడఁ జేసి
తళతళ మనుపైఁడితళుకుల మించు
నెలరాలతిన్నెలు నీడలు దోఁచు

తనయుఁడు-కోర్కులునిండించు=ఆశ లెల్లఁదీర్చు, కూరిమితనయుఁడు=గారాబుకొడుకు, అర్కతేజుఁడు = సూర్యునివంటి తేజస్సు గలవాఁడు, వార్తకెక్కిన=ప్రసిద్ధికెక్కిన. భాను... భాసురము-భానుకోటి=కోటిసూర్యులయొక్క, ప్రభా=కాంతిచేత, భాసురము=ప్రకాశించుచుండునది, నాకలోకము=దేవలోకము, పరమసమ్మదమునన్=మిక్కిలి సంతోషముతో, పాకశాసనుఁడు=ఇంద్రుఁడు, నెలరాలతిన్నెలు=చంద్రకాంతశిలలతోఁ జేయఁబడిన యరుఁగులు, నీడలు...

నీలాలకంబాలు నిర్మలస్ఫటిక
సాలభంజికలుఁ బచ్చలగవాక్షులును 80
బగడంపువాచూర్లుఁ బద్మరాగముల
మొగడులు వైడూర్యములమందిరములు
సలలితశశికాంతచంద్రశాలలును
వెలఁదిముత్యంబుల వెలయువాకిళ్లు
నవపుష్యరాగరత్నములకుడ్యములుఁ
బ్రవిమలవజ్రసోపానమార్గములుఁ
గలిగి నానాధూపగంధ బంధురముఁ
బొలుపొంద యవనికాభోగ భాసురముఁ
గర్పూరచందనకాశ్మీరమిళిత
దర్పసారాంబుసిక్తప్రదేశంబు 90

---

కంబాలు=ఛాయలు ప్రతిఫలించునీలరత్నస్తంభములు, నిర్మల... భంజికలు-నిర్మల=అచ్ఛములైన, స్ఫటిక = పటికపురాలతోఁ జేయఁబడిన, సాలభంజికలు=బొమ్మలు. వాచూర్లు=ఇంటిముంజూర్లు, పద్మరాగముల = కెంపుల, మొగడులు=ఇంటినడికొప్పులు. సలలిత=మిక్కిలి యొప్పిదములైన, శశికాంత=చంద్రకాంత శిలలతో రచింపఁబడిన, చంద్రశాలలును=పయి మేడలును, వెలఁదిముత్యములన్ = నిర్మలములైన ముత్తెములచేత. కుడ్యములు=గోడలు. ప్రవిమల=మిక్కిలినిర్మలములైన, వజ్ర = వజ్రములతో రచింపఁబడిన, సోపానమార్గములు = మెట్లదారులు, నానా... ధురము-నానాధూప = నానావిధములైన ధూపములయొక్క, గంధ=వాసనలచే, బంధురము=తఱుచైనది, యవని... భాసురము-యవనికా= తెరలయొక్క, ఆభోగ=పరిపూర్ణతచే-విఱివియైన తెరలచేతననుట, భాసురము=మనోజ్ఞమైనది. కర్పూరచందన కాశ్మీర=కర్పూరముతోను, చందనముతోను, కుంకుమముతోను, మిశ్రిత=కలపఁబడిన, దర్ప=కస్తూరిచేత, సార=శ్రేష్ఠమైన, అంబు=జలములచేత, సిక్త=తడుపఁబడిన, ప్రదేశంబు=స్థలముగలది

నై దిశావలిఁ బర్వ నతులితప్రభల
దేదీప్యమాన మై తిరముగా మెఱయు
నిరుపమనిజసభానిలయంబునందుఁ
బరఁగుచింతామణిభద్రపీఠమునఁ
దనర నాసీనుఁ డై తగుప్రియం బెసఁగ
ననలకృతాంతాదు లైన దిక్పతులుఁ
గిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగ సన్మునిప్రవరులుఁ గొలువ
రవలకంకణములరవము లెసంగ
సరవి నచ్చరలు వింజామర లిడఁగ 100
నారదరణితవీణానినాదాను
కారి యై తుంబురుగాన మింపెసఁగ
వినుతరంభానృత్యవిభ్రమగతులు
కనుఁదమ్ములకును వికాసంబు నెఱపఁ

---

-కర్పూరాదులుగలపి కలయంపిచల్లుదురనుట. దిశఆవలిన్ =దిక్కులసమూహము లందు, అతులితప్రభలన్ =సాటిలేని కాంతులచే, దేదీప్యమానము=మిక్కిలిప్రకాశించుచుండునది. తిరముగాన్ =స్థిరముగా. నిరుపమ=సాటిలేనిది. అనలకృతాంతఆదులు = అగ్నియముఁడు మొదలైనవారు, సరవిన్ =క్రమముగా, అచ్చరలు=అప్సరసలు. నారద...కారియై-నారద = నారదునిచేత, రణిత=శబ్దింపఁబడిన-వాయింపఁబడిన, వీణా=వీణెయొక్క, నినాద=శబ్దమును, అనుకారియై=అనుకరించునదై, తుంబురుగానము=తుంబురునిపాట, ఇంపుఎసఁగన్ =మిక్కిలి ప్రీతిగొలుపఁగా-నారదుఁడు వీణవాయించుటకుఁ దగునట్లుగా తుంబురుఁడు పాడుచుండెననుట. వినుత = పొగడఁబడిన, రంభా=రంభయొక్క, నృత్య=నాట్యముయొక్క, విభ్రమ = విలాసముయొక్క, గతులు. పారిజాత

పారిజాతోద్భవ ప్రసవమంజరుల
సౌరభంబులు వెదచల్లుచుఁ బొలయు
బాలానిలంబుచేఁ బలుమాఱుఁ గదలు
నీలాలకంబులు నెఱిని నటింపఁ
జతురవిద్యాధరసన్నుతు లెసఁగ
నతులితంబైనమహావైభవమున 110
నొనరంగఁ గొలువున నుండి సన్మునుల
కనియెఁ బ్రసంగోక్తి నపు డొక్కమాట
మూఁడులోకంబుల మునుమిడి మీరు
చూడని యట్టిరాజులు మఱి లేరు
వారక మును చన్నవారిలో నున్న
వారిలోఁ బుట్టెడివారి లోపలను
బలికి బొంకని మహీపాలుండు గలఁడె
తలపోసి చెప్పుఁ డిందఱు నట్టివాని
నని యిట్లు దేవేంద్రుఁ డాడిన మాట
వినియును విననట్లు విస్మయం బంది 120
చ్యవనుఁ డూరకయుండె శార్ఙ్గరవుండు
నవుడు కొట్టెను నీళ్లు నమలెఁ గశ్యపుఁడు
వామదేవుఁడు నేల వ్రాసె మరీచి
సోమరియై మీఁదు సూచుచు నుండె

---

ఉద్భవ=కల్పవృక్షమునఁబుట్టిన, ప్రసవమంజరులు=పూగుత్తులు, సౌరభంబులు=వాసనలు, బాల అనిలము = చిఱుగాలి, నీల అలకంబులు = నల్లని నెఱికురులు, మునుమిడి=ఎరుసగా, నవుడుకొట్టెను=మిణకరించెను, నీళ్లు నమలెన్ =నీళ్లునమలు నట్లు నోరు తెఱవక యే మెదల్చెను, నేలవ్రాసెన్ = బొటనవ్రేలితో నేల పైవ్రాసె.

గౌతముఁ డత్రికిఁ గను గీఁటె నతఁడు
శాతాత్మకునిఁ బల్కు సన్న గావించె
నాతఁ డగస్త్యుని నల్లన గోఁకె
నాతఁడు జమదగ్ని నదిమె హస్తమున
నీవిధి నుత్తరం బీక యొండొరులు
నీవు నీ వని చూపి నిఖిలసన్మునులు 130
గుజగుజ లాడఁ గన్గొని సభ వారి
గజిబిజిఁ జే యెత్తి కలయ వారించి
నిరుపమవిజ్ఞాననిధి వసిష్ఠుండు
పురుహూతుతోడ నద్భుతముగాఁ బలికె
వినుము సురేంద్ర యీవిశ్వంబునందు
వినుతి కెక్కినమహావిక్రమోన్నతుఁడు
తనరుషోడశమహాదానవినోది
వినయభూషణుఁడు వివేకసంపన్నుఁ
డతులసత్కీర్తి మహాభాగ్యశాలి
వితతధనుర్వేదవిద్యాధికుండు 140
కరుణాపయోనిధి గాంభీర్యఘనుఁడు
దురితదూరుఁడు బుధస్తోత్రపాత్రుండు

---

నెఱిని=క్రమముగా, పురుహూతుతో=ఇంద్రునితో, మహావిక్రమ ఉన్నతుఁడు=గొప్పపరాక్రమముచే అధికుఁడైనవాఁడు, షోడశ...వినోది-షోడశమహాదాన=పదియాఱువిధములైన గొప్పదానములందు, వినోది=క్రీడించువాఁడు-దానములెల్లఁజేయుట యతనికి వినోదమనుట, వినయభూషణుఁడు=అడఁకువయె అలంకారముగాఁగలవాఁడు, అతులసత్కీర్తి=సాటిలేని మేలియశస్సు గలవాఁడు, వితత...ధికుండు=విస్తరించినదైన ధనుర్వేదమనెడి విద్యయందు అతిశయించినవాఁడు, కరుణాపయోనిధి=దయాసముద్రుఁడు, దురితదూరుఁడు=పాపమునకు

సర్వశాస్త్రార్థవిచారకోవిదుఁడు
గర్వితరిపుగజకంఠీరవుండు
వరుస నార్వురుచక్రవర్తులలోనఁ
దరమిడి మున్నెన్నఁ దగుచక్రవర్తి
నిత్యప్రసన్నుండు నీతిపాలకుఁడు
సత్యసంధుండు త్రిశంకునందనుఁడు
నిరుపమవిజ్ఞాననిధి భానువంశ
శరధిచంద్రుఁడు హరిశ్చంద్రుఁ డన్ రాజు 150
పోఁడిమి మదిఁ దలపోసి చూచినను
వాఁడె పో బొంకనివాఁడు దేవేంద్ర
యనిన విశ్వామిత్రుఁ డంబుదధ్వనికిఁ
గనలి సింహము మాఱు గర్జించినట్టు
లావసిష్ఠునిఁ గోప మడర వీక్షించి
యీవిధంబున మృష లేల వాక్రువ్వ
నోజ దధ్యాజ్యశాల్యోదనమాంస

దవ్వయినవాఁడు, కోవిదుఁడు=పండితుఁడు, గర్విత...కంఠీరవుఁడు-గర్విత=గర్వించిన, రిపుగజ=శత్రువులనెడియేనుఁగులకు, కంఠీరవుండు=సింహమైనవాఁడు, తరమిడి-తరముఇడి=ఎక్కువతక్కువనుబట్టి, మున్నెన్నన్=మొదట గణించుటకు-మొదటివానినిగా చెప్పుటకు, త్రిశంకునందనుఁడు=త్రిశంకునికొమారుఁడు, నిరుప...నిధి-నిరుపమ=సాటిలేని, విజ్ఞాన=విజ్ఞానమునకు, నిధి=నిధానమైనవాఁడు, భానువంశ=సూర్యవంశమనెడి, శరధి=సముద్రమునకు, చంద్రుఁడు, పోఁడిమి=ఒప్పు-విధము, అంబుదధ్వని=మేఘధ్వని, కనలి=కోపించి, వసిష్ఠునిస్వరము మేఘధ్వనివలె గంభీరముగాను శ్రావ్యముగాను ఉండెననియు విశ్వామిత్రునిస్వరము సింహగర్జనమువలె గంభీరముగాను భయంకరముగాను నుండె ననియుఁ దెలియునది. మృషలు=కల్లలు, వాక్రువ్వన్=చెప్ప, ఓజన్=వరుసగా, దధి

భోజనంబులు పరిపూర్తిగా మెసఁగి
మత్తులై వర్తిల్లుమానవేశ్వరులు
సత్తుగా బొంకుట సత్య మెయ్యెడను 160
జనపతు లేయూరు సత్య మేయూరు
వినఁగూడ దీమాట విడువుము చాలు.
ఏడ హరిశ్చంద్రుఁ డెక్కడిసత్య
మేడ నమ్మెడి దిది యినవంశజులకు
హితవు మీఱినపురోహితుఁడవు గాన
శతముఖంబుల రేఁగి సన్నుతిఁ జేతు
వభిమతం బింద్రున కైనఁ గానిమ్ము
సభవారి కీమాట సమ్మతి గాదు
దోషము వినఁగ నీదుర్వాక్కు లనిన
రోషించి పలికె నరుంధతీవిభుఁడు 170
అంతుగా నాఁబోతు అంకె వేసినను
గంతులు దక్కునే కంఠీరవంబు
కల్లజంజాటంబు కౌశిక యిచటఁ
జెల్లదు సుమ్ము వసిష్ఠుఁ డుండంగ
నురగకంకణుతోడ నూరజోగులను

---

ఆజ్య శాల్యోదన మాంసభోజనంబులు=పెరుఁగు నేయి వరిబియ్యపుటన్నము మాంసమును అనెడి ఆహారములు, మెసఁగి=భుజించి, సత్తుగాన్ = రూఢిగా, ఇనవంశజులకున్ =సూర్యవంశమునఁ బుట్టినవారికి, సన్నుతి=స్తోత్రము, అభిమతము=సమ్మతము, అంతుగాన్ =చప్పుడుగా, ఆఁబోతు=ఎద్దు, కంఠీరవంబు=సింహము, కల్లజంజాటంబు= వట్టితగులాటము, కౌశిక=విశ్వామిత్రా, ఉరగకంకణుతోడన్ =శివునితోడ, ఊరజోగులను = ఊరియందలి సామాన్యులైన యో

సరిచేసి యెన్నినచందాన నీవు
నమితసత్యవ్రతుం డగుహరిశ్చంద్రు
సమముగా నృపపిశాచముల లెక్కింతు
వామహారాజేంద్రు నతికాలివ్రాలు
భూమిపాలురఫాలముల నైనఁ గలదె. 180
యెవ్వనిగాఁ జూచి యినకులేశ్వరునిఁ
గ్రొవ్వి దూషించెదు కొలువుమధ్యమున
నాసార్వభౌము నిట్లాడిన నీకు
వాసి వచ్చెనొ వానివన్నె యుడిగెనొ
యట్టిసత్యవ్రతు నారాజచంద్రు
నట్టితేజోధను నాహరిశ్చంద్రుఁ
దివిరి పల్కాకు నిందించెద వేని
శివు డెఱింగెడుఁ జుమీ చెప్పెడి దేమి
యనిన విశ్వామిత్రుఁ డలుక రెట్టించి
మనమునఁ బెనఁగొన మఱియు నిట్లనియె. 190

---

గులను, చందానన్=విధమున, నృపపిశాచములన్=పిశాచములవంటి రాజులను, అఱికాలివ్రాలు=అఱికాలియందు వ్రాసినవ్రాలు, భూమిపాలురఫాలములనైనన్ = ఇతరరాజులనుదుళ్లయందు సైతము, కలదె. హరిశ్చంద్రునియఱికాలిరేక తక్కినరాజులనెత్తులందుఁగూడ లేవనుట. ఇనకులేశ్వరుని = సూర్యవంశపురాజును - హరిశ్చంద్రుని ననుట, నీకు, వాసివచ్చెనా=కీర్తికలిగెనా, వానివన్నెయుడిగెనా=వానిమేలిమితగ్గెనా-నీ వాహరిశ్చంద్రుని దూషించి నంతనే నీకుఁ గీర్తిహెచ్చలేదు ఆరాజునకుమేలిమియుఁదగ్గలేదనుట. తివిరి=యత్నించి. పూని. శివుఁ డెఱింగెడున్ చుమీ=శివునికే యెఱుక యగును బో-మహాపాపము కలుగు ననుట. మనమునన్ పెనఁగొనన్=మనస్సుందు తగులు

వలదు వసిష్ఠ యీపట్టిజర్ఝరుల
కలుగునే కౌశికుఁ డల్పునిరీతి
దందడి డీకొని తగరు దాఁకినను
గొందల మందునే కులపర్వతంబు
సొలవక నినుఁ బుత్త్రశోకాబ్ధి ముంచి
మలఁగంగఁ జేయుట మఱచితే నేఁటి
కొకరాజకీటంబు నొకదుర్మదాంధు
నొకని నామ్ముందట నొకకొండఁ జేసి
పూని నీవతనిపైఁ బూయనిపూఁత
లేనిసత్యంబు గల్పించి యెక్కించి 200
నలి రేఁగి వానిగుణంబులు గాఁగఁ
గలవి లేనివి కొన్ని కాఱులు సెప్పి
యందంద నామది కలిచలం బెసఁగ
వందిచందమునఁ గైవారంబు సేసి
దంటమాటలు గొన్ని తడవాటు వన్ని
గెంటక నోరార్చి గెల్వఁ జూచెదవు

---

వడఁగా, పట్టిజర్ఝరులకున్ = రిత్త బెదరింపులకు, దందడిన్ = దొమ్మిగా, తగరు=పొట్టేలు, కొందలము=తత్తఱపాటు, సొలవక=వెనుదీయక, పుత్త్రశోక అబ్ధి=పుత్త్రదుఃఖ మనెడిసముద్రమునందు, మలఁగఁగన్=వెనుదీయునట్లు, రాజకీటంబు = రాచపురుగు-పురుగువంటియొక రాచవాని ననుట. కొండఁజేసి= కొండంతగొప్పవానినిగాఁ బొగడి, పూయనిపూఁత=నిజముగా లేనట్టి వన్నెను, లేనిసత్యంబు = స్వభావసిద్ధము కానిసత్యసంధత్వమును, ఎక్కించి = వాని యందు ఆరోపించి, నలి=మిక్కిలి, కాఱులు=వ్యర్థపు మాటలు, వందిచందమునన్ =బట్టువానివిధమున, కైవారము=స్తోత్రము, దంటమాటలు=నేర్పుమాటలు, తడవాటుపన్ని=అల్లికచేసి, గెంటక=చలింపక, నోరు, ఆర్చి=ఆడించి-ఊరక

యక్కజంబుగ నబ్ధి నాపోశనము గ
గ్రుక్క గొన్నట్టియాకుంభజుఁ డుండఁ
బన్నగధరున కేర్పడ నతికాలఁ
గన్నుఁ జూపినయట్టిగౌతముఁ డుండ 210
నలిననాభుని జగన్నాథు ముకుందు
నలిగి తన్నినయట్టియాభృగుఁ డుండ
దృష్టించి బ్రహ్మాదిదేవత లెఱుఁగ
సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసినయట్టి
యే నుండఁ దక్కినయీమును లుండఁ
బూని నీ వెంతయుఁ బ్రోడయపోలె
నాకేశుతోడ మున్నాడి పల్కితివి
మాకంటె నొకతపోమహిమాధికుఁడవె
నర సురాసుర యక్ష నాగ గంధర్వ
వరులందు మఱియు నెవ్వారలయందు 220
బొంకనివారలఁ బొడగాన మేము
శంకరునాన ముజ్జగములయందు
ననిన వసిష్ఠుఁ డిట్లనియె నాతనికిఁ
జనదు గా కాత్మప్రశంస గావింప
నంభోరుహాక్షుండు హరుఁడును గమల

---

నోరు ఆడించుటయే కాని మాటల పసలేదనుట, అక్కజముగన్ = ఆశ్చర్యముగా, అబ్ధిన్=సముద్రమును, కుంభజుఁడు=అగస్త్యుఁడు, ఆపోశనము=భోజనమప్పుడు పుడిసిట జలము పోసికొని మంత్రపూర్వకముగా పుచ్చుకొనుట, పన్నగధరుఁడు=శివుఁడు, ముకుందున్=విష్ణుని, ప్రోడ=ప్రౌఢుఁడు, నాకేశుతోడన్=ఇంద్రునితో, మున్నాడి=ముందుగా, అంభోరుహాక్షుఁడు=విష్ణువు, కమ

సంభవుండును దగుసాక్షులు గాఁగఁ
బరఁగంగ మనతపోబలములకోలఁది
పరమేష్ఠి నిర్ణయింపఁడె మొట్టమొదలఁ
దడవినమాటకుఁ దగినయుత్తరము
నుడువక ప్రాజ్ఞుండు నోరొత్తుకొనునె 230
యలరెండువేలజిహ్వలవానికైనఁ
గొలఁదె హరిశ్చంద్రగుణములు వొగడఁ
దను వెల్ల సత్యంబు తల వెల్లఁ గరుణ
పను లెల్ల ధర్మంబు పలు కెల్లఁ బ్రియము
బొంకు నాలుకకుఁ జేర్చుట కానివావి
యింక నిన్నియుఁ జెప్ప నేమికారణము
వారిజగర్భునివ్రాఁత దప్పినను
వారిజాప్తుఁడు దూర్పువంకఁ గ్రుంకినను
మేరువు గ్రుంగిన మిన్ను వ్రాలినను
ధారుణీచక్రంబు తలక్రిందు వడిన 240

---

లసంభవుఁడు=బ్రహ్మ, పరమేష్ఠి=బ్రహ్మ, నుడువక=చెప్పక, నోరొత్తుకొనునె=నోరుమూసికొనునా, రెండువేలజిహ్వలవానికైనన్=ఆదిశేషునికైనను, కొలఁదె=తరమా, తనువు ఎల్ల సత్యంబు=దేహమంతయు సత్యము-కేవలసత్యసంధుఁడనుట, తలఁపు ఎల్లన్ కరుణ=తలఁపులన్నియుఁ గరుణతోఁగూడియుండును-కరుణమాలినతలంపే యతనికిఁ గలుగదనుట, పనులు ఎల్లన్ ధర్మంబు=అతఁడు చేయుపను లెల్ల ధర్మయుక్తముగా నుండును-అధర్మమైనపని సేయనే చేయఁడనుట. పలుకెల్లన్ ప్రియము = మాటాడుమాట లెల్ల ప్రియముగానే యుండును-అప్రియ మెంతమాత్రమును పలుకఁడనుట, బొంకు... కానివావి-బొంకు=అసత్యమును, నాలుకకుఁజేర్చుట=నోటఁజెప్పుట, కానివావి=తగనిపాడి, వారిజగర్భుఁడు=బ్రహ్మ,

వారిధు లింకిన వజ్రాయుధంబు
ధార దప్పిన మాట తప్పఁ డారాజు
నావుడు నమ్మునినాథునిశ్చయము
భావించి క్రమ్మఱఁ బలికెఁ గౌశికుఁడు
మేలు నీమాటలు మెచ్చి రందఱును
జాలుఁ బురే రిత్తసంవాద మేల
విన్నమాటల మాకు విశ్వాస మొదవ
దన్న రేంద్రునిసత్య మరసినఁ గాని
యేయుపాయముల నే నిటమీఁద వాని
మాయలఁ గుదియించి మాటల నొంచి 250
యుల్ల మంతఁ గలంచి యూచముట్టుగను
గల్లలాడించినఁ గలదె పన్నిదము
నిక్క మింతకుఁ జాలి నిలిచెద నేను
జక్కఁగా మున్నె విచార మే మైనఁ
గల దేని వానికిఁ గఱపి నీపూన్కి
వెలయఁ దిరంబు గావించి రమ్మనినఁ
జిఱునవ్వ నవ్వి వసిష్ఠుఁ డాగ్రహము
మెఱయఁ గౌశికసంయమికి నిట్టు లనియె
సన్నుతం బగునట్టిసత్యవ్రతంబు
వెన్నతో నిడినఁ దా విభునకు మున్నె 260

---

వారిజాప్తుఁడు=సూర్యుఁడు, వారిధులు=సముద్రములు, చాలుబురే=చాలుభళీ, కుదియించి=క్రుంగునట్లు పట్టిచి, ఊచముట్టుగన్ =సాంతముగా, తిరంబు=స్థిరము, కౌశికసంయమికిన్ =విశ్వామిత్రమునికి, సన్నుతంబు=పొగడఁబడినది, సత్యవ్రతంబు=ఎప్పుడును సత్యమే పలుకుదు ననెడినియమము, వెన్నతోన్ ఇడినది=బాల్యమున వెన్నతోఁగూడ తినిపింపఁబడినది- బాల్యమునుండియే అలవాటు పడ్డది

కఱపెడిదేమి యక్కమలాప్తకులుని
తెఱఁగెఱుంగక పూని దేవేంద్రుతోడ
నఱిముఱి వే మించ నాడంగ నేమి
చిఱుతవే యిఁక నిన్ని చెప్ప నేమిటికి
నీ వొకండవె కావు నీవంటిమునులు
వేవురు గూడి వేవేలచందముల
మాయలు పన్నిన మరులు కొల్పినను
బాయనియిడుములపాలు సేసినను
జననుతుఁడగుహరిశ్చంద్రభూవిభుఁడు
మనసున వాక్కున మఱి చేఁతలందుఁ 270
గలలోన నైనను గలవరింతలను
నలఁకువ వచ్చిన నవ్వులకైనఁ
గులసతిఁ బాసినఁ గొడుకు పోయినను
దలమీఁద వచ్చినఁ దాలిమి దూలి
మఱచి తా నాడినమాట బొంకినను
మఱి నీవు నవ్వ బ్రాహ్మ్యమునకుఁ బోలఁగి
తపమును వేదశాస్త్రములును మఱచి
యుపవీతసూత్రంబు లాగిఁ బుచ్చివైచి
జపమును సంధ్యాదిసత్క్రియ లుడిగి

---

యనుట, మున్నె=మునుపే, కఱపెడిది ఏమి=నేర్పుటయేల? కమలాప్తకులుని తెఱఁగు=సూర్యవంశపు వాని విధమును, అఱిముఱి=సంభ్రమము-తొట్రుపాటు, చిఱుతవే=పసివాఁడవా? పాయని యిడుమలపాలు=ఎడ తెగని ఆపదలవశము, చేఁతలందుఁ=కార్యములందు, నలఁకువ=పీడ, తలమీఁదవచ్చినన్=తలపోవునంత సంకటము గలిగినను, బ్రాహ్మ్యమునకున్=బ్రాహ్మణత్వమునకు, ఉపవీత సూత్రము

వపన మై యథ్యాత్మవాసన మాని 280
విపులవల్కలములు విడిచి నెన్నుదుట
నపవిత్ర మైనట్టియంకంబు దాల్చి
ఘనగార్దభము నెక్కి కష్టమానవుని
పునుకలో మద్యంబుఁ బోసి త్రావుచును
జను లెల్ల నేవగింపఁగఁ దల వాంచి
కొని దక్షిణాభిముఖుండ నై చనుదు
నని వసిష్ఠుఁడు వల్కినతులప్రతిజ్ఞ
విని కౌశికుఁడు క్రోధవివశుఁ డై పలికె
ననిమిషవల్లభుఁ డాదిగా సురలు
మునివరు లింక నాపూనికి వినుఁడు 290
సాధించి యాహరిశ్చంద్రభూవిభునిఁ
గ్రోధకాళికి బారిగొఱియగాఁ జేసి
పలుకుపంతము చెల్లుబడి గాఁగ నతనిఁ
జలపట్టి బొంకింపఁ జాలక యున్న
సిద్ధచారణమునిసేవితం బైన
సిద్ధాశ్రమంబున శివుని నేఁ గూర్చి
గాలి యాహారంబు గాఁ గ్రోలి యొక్క

---

లు=జందెము, ఒగిన్=క్రమమున, వపన మై=క్షౌరము చేసికొని, అధ్యాత్మవాసన =ఆత్మస్వరూప విషయమైన సంస్కారము, విపులవల్కలములు=వెడలు పైన నారచీరలు, నెన్నుదుటన్=ఫాలమునందు, అపవిత్రము=పరిశుద్ధము కానిది, అంకంబు=గుఱుతు-బొట్టు అనుట, గార్దభము=గాడిద, ఏవగింపఁగన్=అసహ్యాపడుకొనఁగా, అనిమిషవల్లభుఁడు=దేవేంద్రుఁడు, క్రోధకాళికిన్=నాకోపము అనెడి కాళికాదేవికి, బారిగొఱియ=బలికొఱకైన గొఱ్ఱె, పలుకుపంతము=మాటాడిన ప్రతిజ్ఞ, చెల్లుబడి గాఁగన్=సాఁగిన దగునట్లుగా, చలపట్టి=చలముతో, సిద్ధ

కాలూఁది యూర్ధ్వముఖంబుగా నిలిచి
రెండుచేతులు నెత్తి ఱెప్పలు విచ్చి
చండాంశుపై దృష్టి చక్కఁగా నిలిపి 300
యెన్నఁగఁ బెక్కువేలేండ్లు తపంబు
మున్ను నేఁ జేసినపుణ్యంబులోన
సగ మిచ్చి భువనప్రశస్తంబు గాఁగ
యుగములు నాలుగు నొగి పదునాల్గు
వరుసలు వర్తింప వసుధ నేలింతు
మఱి చతుర్దశమహామన్వంతరమున
నింద్రునిసరిగద్దె నీస్వర్గమందుఁ
జంద్రకళామాళి సాక్షిగా నునుతు
నని భయంకరముగా నమ్మహామునులు
చెనఁటిప్రతిజ్ఞలు సేసిన బెదరి
పన్నగేంద్రుని వేయుపడగలు గ్రుంగె
మిన్ను బిట్టదరె నిమ్మేదిని దిరిగె
జలధులు గలఁగె నక్షత్రముల్ రాలెఁ
గులగిరు లగలె దిక్కులు వ్రక్కలయ్యెఁ

---

శ్రమము=ఇది విశ్వామిత్రమునియాశ్రమమునకు పేరు. ఊర్ధ్వముఖముగాన్ = మొగము పయికెత్తి యుంచుకొని-సూర్యుని చూచుచు ననుట, చండాంశుపైన్ = సూర్యునిమీఁద, భువనప్రశస్తంబుగాఁగన్ = లోకములందుప్రసిద్ధమగునట్లుగా, యుగములు నాలుగు=నాలుగుయుగములు గల ఒకమహాయుగము, ఒగిన్ =క్రమముగా, పదునాల్గువరుసలు వర్తింపన్ =పదునాలుగుమహాయుగములు వరుసగాచెల్లునంతవఱకును, వసుధన్ =భూమిని, చంద్రకళామాళి=ఈశ్వరుఁడు, చెనఁటి=వ్యర్థము, పన్నగేంద్రుని=ఆదిశేషుని, మిన్ను=ఆకాశము, బిట్టు=అధికముగా, మేదిని=భూమి, జలధులు=సముద్రములు, అగలెన్ =పగిలెను, వ్రక్కలు=

బెల్లుగాఁ గావిరి బెరసి యద్దంపు
బిల్లపోలికి రవిబింబంబు దోఁచె
గుండె జల్లనఁ జేతికులిశంబు వైచి
పండెఁ బొమ్మని దేవపతి కొల్వు విచ్చె
జున్నురేచినరీతి సుర లెల్ల బెదరి
కన్నవారేఁగిరి కన్నత్రోవలకు 320
నుదరి తాపసు లెల్ల నొండొరు గడవఁ
బద పదం డిదె మహాప్రళయంబు వచ్చెఁ
జిటిమి వసిష్ఠకౌశికులకోపాగ్ను
లుఱక లోకంబు లాహుతి గొను ననుచు
జడలు వీడఁగఁ గళాసములు విదిల్చి
మడిచి చంకల నిడి మరలి చూచుచును
జనిరి దిగ్గున నిజాశ్రమముల కల్లు
చనిరి వసిష్ఠవిశ్వామిత్రు లంతఁ

---

తునుకలు, కావిరి=నలుపు, బెరసి=వ్యాపించి, రవిబింబము=సూర్యమండలము, పండెన్ బొమ్ము=ఫలము ఒనఁగూడినది పో-ఇదిసంతాపార్థక మైనమాట-అనర్థము పుట్టినదని భావము. దేవపతికొలువు=ఇంద్రునిసభ, జున్ను రేచినరీతిన్=తేనెతుట్టెనుకదల్చినట్లు-దానిని కదల్పఁగా తేనెటీఁగలు చెల్లాచెదరగునట్లు అనుట, సురలు=దేవతలు, కన్నవారేఁగిరికన్నత్రోవలకున్=వారువారు ముందువెనుక చూడక వారివారికి తోఁచినదారులను బోయిరనుట, ఉదరి=బెదరి, తాపసులు=ఋషులు, ఒండొరున్=ఒకరినొకరు, కడవన్=దాఁటుకొని-ఇది తొందరపాటును సూచించుచున్నది, చిటిమి=చెలరేఁగి, కోపాగ్నులు=కోపము లనెడినిప్పులు, ఉఱక=విడువక, ఆహుతి గొనును=ఆహుతిగా కాల్చివైచును, కళాసములు=చర్మ

దూలఁగ హిమంబు చంద్రుఁడు మెఱుఁ గెక్క
వెలిఁగెఁ దియ్యనివిల్లు వెస నెక్కువెట్టి 330
మెలఁగెఁ గంతుఁడు నుబ్బు మీఱి నల్గడలఁ
జెలరేఁగి కోవెలల్ చెలఁగె ఝుమ్మనుచు
మ్రోసెఁ దుమ్మెదలుం గుంపులు గట్టి ఱంతుఁ
జేసె రాచిలుకలు చెలు వగ్గలముగఁ
గ్రాలె జక్కవలు చెంగల్వదీర్ఘికల
వ్రాలె నంచలు ముద్దువగఁ గ్రొత్తననలు
దోఁచెఁ బొన్నలఁ దఱితో నటమున్నె
పూచె మోదుగువృక్షములు విఱ్ఱవీఁగఁ
గాచెఁ జూతంబులు కమ్మనై మలసి
వీచె సోమరిగాలి విరహులు బెదరఁ 340
బొలుచు నమ్మధుమాసమున నొక్కక్రతువు
వెలయ హరిశ్చంద్రవిభుఁ డొనరించి
భూరి బెట్టిదువార్త బోరన మ్రోయఁ
గ్రూరచిత్తుఁడు కౌశికుఁడు విని యుబ్బి
కలిగెఁ బో సందు నాకడఁగినపనికి
నలఘుసత్యవ్రతుం డగుహరిశ్చంద్రుఁ

---

ములు, హిమంబు=మంచు, తియ్యనివిల్లు=చెఱకువిల్లు, కంతుఁడు=మన్మథుఁడు, ఱంతు=కలకలధ్వని, చెలువు=అందము, అగ్గలముగన్=మిక్కుటముగా, దీర్ఘికలన్=నడబావులను, ముద్దువగన్=సొగసైన విధమున, ననలు=పూవులు, తఱితోన్=తగినకాలమురాఁగా, చూతములు=మామిళ్లు, సోమరిగాలి=మందమారుతము, మధుమాసమునన్=చైత్రమాసమున, క్రతువు=యజ్ఞము; సందు=తెఱపి-అవకాశము, అలఘుసత్యవ్రతుఁడు=కేవలము కాని సత్యనియమముగలవాఁ

దలము దప్పినయట్టిధనరాశి వేఁడి
కలఁచి బొంకించెదఁ గా కని పోయి
మేదినీవిభుఁ గాంచి మేల్మి యక్షతలు
వేదమంత్రముల దీవించి యిచ్చుటయు 350
నమ్మునిచంద్రున కర్ఘ్యపాద్యమ్ము
లిమ్ములఁ గావించి యిలఁ జాఁగి మ్రొక్కి
ఘనతపోవైభవ గాధేయ నీవు
ననుఁ బ్రీతి మన్నించి నాయాగమునకు
శ్రీ విలసిల్ల వేంచేసితి గాన
భావింప నీయాగఫల మబ్బె నాకుఁ
బంపుఁ డేపనికైనఁ బరఁగఁ గావింతు
నింపార మీకు నభీష్ట మెయ్యదియొ
యనిన విశ్వామిత్రుఁ డారాజుఁ జూచి
యనఘాత్మ నీ కసాధ్యంబు లేపనులు 360
కల్పవృక్షముఁ [1] జేరి కా యడ్గినట్టు
లల్పదానం బొకం డడుగ వచ్చితిమి
యది చెప్పెదను విను మధ్వరం బిపుడు
విదితంబుగాఁ జేయ వేడుక పుట్టెఁ
బురుషుఁ డేనుఁగు నెక్కి పొడవుగా నిక్కి
వరరత్న మెగసి పోవైచినపొడవు

1 గాయత్రయ మడ్గినట్టు.

---

ము, తలము తప్పిన=శక్తికిమించిన, మేదినీవిభున్=రాజును, ఇమ్ములన్=చక్కఁగా, కాయడ్గినట్టు=కల్పవృక్షమును సార్థకములైనపండ్లను అడుగక కొఱమాలిన కాయను అడిగినట్లు మహాదాతవగు నిన్ను పసలేని యొకయల్పదానమును అడి

ధనము రాసిగఁ బోసి దాన మిచ్చినను
జననాథ కొఁద లేక సాఁగు నాయజ్ఞ
మనినఁ గృతార్థుండ నైతి నీయిష్ట
ధనమిత్తుఁ గొమ్మన్నఁ దల యూఁచి యెప్పు 370
డొడుపు దప్పినయట్టియురగంబ పోలెఁ
దడయక వచ్చిన తనపూన్కి దప్పి
మనుజేశతిలక నీ మన సొత్తి చూడ
విన విస్మయంబుగా వేఁడితిఁ గాక
నీవంటిగుణరత్ననిధి మాకుఁ గలుగ
నేవేళ ధన రాసు లేమిటఁ గొదువ
యింక మాఱుత్తరం బిచ్చిన నీకు
శంకరునాన త్రిశంకునియాన
పోయి వచ్చెద నింక భూపాలచంద్ర
యాయురారోగ్యంబు లయ్యెడి నీకు 380
ననుచుఁ గాలూఁదక యచ్చోటు వాసి
చనియె నమ్ముని నిజాశ్రమమున కంత
నాహరిశ్చంద్రుండు నంతరంగమున
నూహించి యిటమీఁద నొప్పమి వుట్టు
వెసఁ బాముఁ జంపి పైవేసినరీతి

---

గెదననుట, ఒకండు=ఒకటి, విదితంబుగాఁ=ప్రసిద్ధముగా, కొఁద=కొదువ, ఒడు పు=గుటిపెట్టియొడిసిపట్టఁగోరినపట్టు-కఱచుటకై యొడిసి పట్టినగుటి, ఉరగ ము=సర్పము, ఒత్తి చూడఁగ=పీడించి పరిశీలించుటకు, ఇంకమాఱు... నాన= ఇంత చెప్పినమాటచొప్పున ఇయ్యనంటివేని శివుని తోడు త్రిశంకునితోడు, పా

ధనము రాసిగఁ బోసి దాన మిచ్చినను
జననాథ కొఁద లేక సాఁగు నాయజ్ఞ
మనినఁ గృతార్థుండ నైతి నీయిష్ట
ధనమిత్తుఁ గొమ్మన్నఁ దల యూఁచి యప్పు 370
డొదుపు దప్పినయట్టియురగంబ పోలెఁ
దడయక వచ్చిన తనపూన్కి దప్పి
మనుజేశతిలక నీ మన సొత్తి చూడ
విన విస్మయంబుగా వేఁడితిఁ గాక
నీవంటిగుణరత్ననిధి మాకుఁ గలుగ
నేవేళ ధన రాసు లేమిటఁ గొదువ
యింక మాఱుత్తరం బిచ్చిన నీకు
శంకరునాన త్రిశంకునియాన
పోయి వచ్చెద నింక భూపాలచంద్ర
యాయురారోగ్యంబు లయ్యెడి నీకు 380
ననుచుఁ గాలూఁదక యచ్చోటు వాసి
చనియె నమ్ముని నిజాశ్రమమున కంత
నాహరిశ్చంద్రుండు నంతరంగమున
నూహించి యిటమీఁద నొప్పమి పుట్టు
వెసఁ బాముఁ జంపి పై వేసినరీతి

గెదననుట, ఒకండు=ఒకటి, విదితంబు గాఁ =ప్రసిద్ధముగా, కొఁద=కొదువ, ఒదు పు=గుటి పెట్టియొడిసిపట్టఁగోరినపట్టు-కఅచుటకై యొడిసి పట్టినగుటి, ఉరగ ము=సర్పము, ఒత్తి చూడఁ =పీడించి పరిశీలించుటకు, ఇంకమాఱు... నాన= ఇంత చెప్పినమాటచొప్పున ఇయ్యనంటివేని శివుని తోడు త్రిశంకునితోడు, పా మును జంపి పైవేసినరీతిఁ =చచ్చినపామును మీఁద వైచినట్లు-ఊరక భయాస

మసలక పోయె నమ్మలకలతపసి
యాఁప నెవ్వరివశ మమ్మహామహుఁడు
శాపించె నేని ముజ్జగములుఁ గాలుఁ
బోయినజగడంబు పోవని మ్మనుచు
నాయతశక్తి రాజ్యము సేయుచుండె 390
నట నంత నొకయుపాయంబు చింతించి
కుటిలవిచారదక్షుఁడు గాధిసుతుఁడు
చిత్రవర్ణంబులు చిత్రరూపములు
చిత్రలంఘనములు చిత్రసత్వములు
గలమహామృగముల ఘనపక్షితతుల
బలువడిఁ బుట్టించి పంచిన నవియు
నొండొండ కదుపులై యురవడిఁ బఱచి
పండినచేలెల్ల బయలుగా మేసి
కొమ్ములఁ గట్టలు గ్రొచ్చి కోరాడి
చిమ్మి తటాకముల్ చెడ నవయించి 400
మేటికాల్వల మిట్టమిఱ్ఱుగాఁ ద్రవ్వి

---

ట్టినాఁడుగాని నిజముగా బాధ సేయలేదనుట. అమ్మలకలతపసి=వంకరనడతలబుషి, ఆఁపఁగ = అడ్డగింప, పోయినజగడంబు పోవనిమ్ము=విశ్వామిత్రుఁడు రచ్చగాఁడు అతఁడు పోఁగా రచ్చయు పోయినది అట్లు పోయినరచ్చ అట్లె పోవుఁగాని మరల రాకుండుఁగాక యనుట. ఆయతశక్తిన్ =అధికమైన సామర్థ్యముతోఁ, కుటిల...దక్షుఁడు-కుటిల=కపటముతోఁ గూడిన-సరిగాని, విచార= ఆలోచనలయందు-కుట్రలందు, దక్షుఁడు= నేర్పరి, గాధిసుతుఁడు=గాధికి కొడుకైన విశ్వామిత్రుఁడు, లంఘనములు=దాఁట్లు, సత్వములు=దేహములు, బలువడిన్ = అతివేగముగా, ఒండొండ= ఒకటొక్కటిగా= వేఱువేఱయనుట, కదుపులై=గుంపులై, ఉరవడిన్ = వేగముగా, నవయించి = స్రుక్కించి, మిట్టమిఱ్ఱుగా = మిక్కిలి మిట్టగామన్ను త్రవ్విపోసి కాలువలనెల్ల పెద్దమిట్టలుగా జేసినవనుట.

తోఁటలఁ జెఱకుఁ [1]దుత్తుమురుగాఁ జేసి
మదమునఁ జెలరేఁగి మందలఁ బాఁడి
మొదవులఁ దిని వృషముల బెట్టు విఱిచి
పల్లెలమనుజులఁ బట్టి చెండాడ
హల్లకల్లోల మై యఖిలభూజనము
లడరి కూయుచు వచ్చి యాహరిశ్చంద్రుఁ
బొడగాంచి యందంద భువిఁ జాఁగి మ్రొక్కి
భూమీశ నీ రాజ్యమున నేఁటిదనుక
నేమార్గమున నెగ్గు లెఱుఁగ మెన్నండు 410
నిల నవగ్రహదోష మెన్నఁడు లేక
వలసినయప్పుడు వానలు గురియు
మున్ను రాలినధాన్యములు తిర్గ మొలచి
పన్నుగా దున్నక పండు సస్యములు
గోవులు పిదుకక గురియుచునుండు
నేవేళనైనఁ బా లేఱులు గాఁగ
జారచోరులు ననాచారులు లేరు
మారి సంకటములు మరణముల్ లేవు

1 లు తుంటలు సేసి.

---

తుత్తుమురు=మిక్కిలియు తునుకలు, పాఁడిమొదవులు=పాలు పిదుకునట్టి యావులు, వృషములు=ఎద్దులు, బెట్టు=మిక్కిలి, చెండాడఁగ=చంపఁగా, హల్లకల్లోలమై = తాఱుమాఱై, పొడగాంచి = చూచి, ఎగ్గులు = సెబ్బరలు, అవగ్రహము=కఱవు, మున్ను...సస్యములు=మొదటనొకతూరి విత్తి పయిరైన యెన్నులనుండి రాలినవిత్తనములే మరల పంటలు పండుచుండును గాన మరల దున్నకయు విత్తకయునే పంటలు ఫలించుననుట. మారి=మసూచికారోగము,

విరసంబు తిరిపెంబు వెఱపును లేదు
మఱి యిప్పు డొదవినమాపాటు వినుఁడీ 420
యిన్ని చెప్పఁగ నేల నిపు డొకలాగు
వన్నెలపులుఁగులు వాల్మీకంబులును
వీక్షింప వెఱపును వెఱఁగును గాఁగ
లక్షలు రెండేసి లక్షలుఁ గూడి
మడి తోఁట కళ్లంబు మందప ట్టనెడి
యడియాసఁ బోకార్చి యంతటఁ బోక
మసలి పల్లెలఁ జొచ్చి మనుజులఁ బట్టి
మెసఁగఁ జొచ్చిన నింద్ల మెదలంగ వెఱచి
వెసఁ గాఁపురంబులు విడిచి వచ్చితిమి
వసుధేశ రక్షింప వలయు మ మ్మనినఁ 430
గరుణామృతముఁ జిల్కుకడకంటిచూపు
పరఁగ వారలమీఁదఁ బరఁగించి పలికె
నీపాటిపనికిఁ గా నేల భీతిల్ల
రేపు మాన్చెద నింత ప్రేఁగును మీకు
నని మహీప్రజ నెల్ల నాదరం బెసఁగఁ
జనుఁ డని వీడ్కొల్పె జననాథుఁ డంత
భవచండతాండవభ్రమణవేగమున

---

విరసంబు-వ్యర్థత=పసలేమి. తిరిపెంబు=బిచ్చము, వెఱపు=భయము, ఒదవిన=కలిగిన, ఒకలాగు వన్నెలపులుఁగులు = ఒకవిధమైన వింతరంగులు గల పక్షులు, వాల్మీకములు=క్రూరమృగములు, వెఱపు=భయము, వెఱఁగు=వింత-అశ్చర్యము, మందపట్టు=పశువులకొట్టము, అడియాసల్ = వ్యర్థమైనయాశను, పోకార్చి=పోఁగొట్టి, మెదలంగల్ =వర్తించుటకు, పరఁగించి=నిగిడించి, ప్రేఁగు=భారమును, భవ... వేగమున-భవ=శివునియొక్క, చండ=ఉద్భటమైన, తాం

దివి నుండి పడినయందియ యనఁ బోలి
కిరణజాలంబుల కెంపు సొంపెసఁగ
నరుణబింబము పశ్చిమాంబుధిఁ గ్రుంకెఁ 440
గోమరారునభ మనుకొలనులో విరియు
కుముదజాలంబు బాగునఁ జుక్క లెసఁగె
సురుచిరలీలమై సురరాజుదేవి
ధరియించుకర్పూరతాటంక మనఁగ
మొల్లనె ననలొత్తు మించులఁ బొదలి
చల్లనై వర్తువ చంద్రుఁడు వొడిచె
మనసిజుం డనియెడుమటుమాయదొంగ

డవ=నృత్యముయొక్క, భ్రమణ=తిరుగుటయందలి, వేగమునన్=వడిచేత, దివి నుండి=ఆకాశమునుండి, అందియ=అందె-శివుఁడు సంధ్యాకాలమందు నృత్యము సేయునుగాన అపుడు నాట్యవేగమున ఆతనికాలియందె యూడిపడినదో యనునట్లు సూర్యునిగుండ్రని బింబము క్రుంకిన దనుట, కెంపుసొంపు = ఎఱుపుయొక్క అతిశయము, అరుణబింబము=సూర్యబింబము, పశ్చిమ అంబుధి = పడమటిసముద్రము, కోమరు ఆరు=అందము మీఱుచున్న, నభము అను కొల నులోన్=ఆకాశము అనెడు కొలఁకునందు, విరియు కుముదజాలంబు బాగునన్ = వికసించుచున్న తెల్లగలువలసమూహమురీతిని-చుక్కలు కొలఁకున పూచిన తెల్లగలువలవలె ఆకాశమున ప్రకాశించిన దనుట. సురుచిర లీలమైన్ = మిక్కిలి సొగసైన విలాసముతో, సురరాజుదేవి= దేవేంద్రునిభార్య యగుశచీదేవి, ధరియించు కర్పూరతాటంకము=తాల్చునట్టికప్పురపుకమ్మ, ననలొత్తుమించులన్ = మొలకొత్తుచున్న కాంతులతో-తలసూపుచున్న కిరణములతో, పొదలి=వర్ధిల్లి-చంద్రుఁడు గుండ్రడైన కిరణములు ప్రకాశింపఁగా శచీదేవితాల్చినగుండ్రని కప్రపుకమ్మవలె తూర్పుదిక్కున పొడిచెను-తూర్పుదిక్కున నుదయించుటచే ఆ దిక్కుననుండు శచీదేవిని కవి గ్రహించినాఁడు.మనసిజుండు=మన్మథుఁడు,మటు

జనులపై మంత్రించి చల్లినయట్టి
మోహనభస్మంబుమురువున విరహి
దాహక మై పర్వెఁ దళుక్కు వెన్నెలలు 450
పదపడి యుడురాజుపై దిననాథుఁ
డదె వచ్చెనని చెప్ప నరుదెంచురీతి
వేగువాఁడునుబోలె వేగురుఁజుక్క
బాగుగాఁ బొడిచిన బలబల వేగ
నలిఁ దమం బనెడుదానవుమీఁద నలిగి
జలశాయి వ్రేసినచక్రమో యనఁగఁ
గలువలు మూయ నక్షత్రముల్ మాయ
జలజముల్ వికసింప జను లుత్సహింపఁ
దఱుచు మెఱుంగులు తళతళ మనఁగ

---

మాయదొంగ = ఖిక్కిలి మాయకాఁడైన దొంగ, మోహనభస్మంబుమురువునన్ = చొక్కుపొడివిధమున, విరహిదాహక మై = విరహిజనులను తపింపఁజేయున దై, తళుక్కు వెన్నెలలు = తలతలలాడు వెన్నెలలు, పర్వెన్ = వ్యాపించెను. ఉడురాజు = నక్షత్రరాజు - చంద్రుఁడు, దిననాథుఁడు = సూర్యుఁడు. అరుదెంచురీతి = వచ్చెడు విధమున, వేగురుఁజుక్క, సూర్యుఁడు చంద్రునిపైనెత్తి వచ్చుచున్నాఁడని చెప్పుటకై వచ్చిన వేగువాఁడువలెనుండెననుట - వేగుచుక్క సూర్యోదయము త్వరలో కలుగునని సూచించినదనుట. తమం బనెడుదానవుమీఁదన్ = చీఁకటియనెడు రాక్షసునిపయిని, జలశాయి = సముద్రమునందు పవ్వళించియున్న విష్ణువు, వ్రేసిన చక్రమో = ప్రయోగించిన చక్రాయుధమో సూర్యుఁడు తూర్పుదిక్కున సముద్రమునుండి పైకిపొడుచునట్లు కనఁబడుటచే సముద్రమున పరుండియున్న విష్ణువు వైచినచక్రాయుధమువలె గుండ్రనై చూపట్టెననుట - సూర్యుఁ డుదయింపఁగా చీఁకటి విరిసె నని భావము. మూయన్ = ముకుళింపఁగా, మాయన్ = కాంతిమాసిపోవఁగా, జలజముల్ = తామరలు, ఆదిత్యుఁడు = సూర్యుఁ

నెఱిఁ దూర్పుఁగొండపై నిలిచె నాదిత్యుఁ 460
డట మున్న మేల్కాని యాచక్రవర్తి
తటుకున నిత్యకృత్యము లెల్లఁ దీర్చి
పాటించి కన్నులపండువు గాఁగ
వేఁట సింగారంబు వెలయఁ గావించి
తనయుండు మంత్రియుఁ దనకూర్మిసతియుఁ
దనతోడఁ గూడి రాఁ దగురథం బెక్కి
[1]కోరమీసలు జుంజుగొప్పలు బిరుసు
[2]బారెఁడు చెవులును బరడుపిక్కలును
జేవవిండ్లును నెఱ్ఱసెరలగన్నులును
జేవురుబొట్లును జిల్లకోలలును 470
మొల నీలికాసెలు మోటకత్తులును
తలముళ్లు బదనికదండకడెంబు

1. చోఱమీసలును జుంజురుగొప్ప బిరుసు
2. వాఱెడు మేనులు జరడుపిక్కలును.

---

డు, వేఁటసింగారంబు=వేఁటకుఁ దగినవేషాలంకారము, కోరమీసలు = పెద్ద మీసలు, జుంజుగొప్పలు = చింపిఱికొప్పులు, బిరుసుబారెఁడు చెవులును = బిగువై వెడలుపైన చెవులును, పాఠాంతరమున-చోఱమీసలు=చోఱచేఁపవంటిసన్నని నిడుదమీసలును, జుంజురుగొప్ప = చింపిఱికొప్పు, బిరుసు వాఱెడు మేను లు=బిఱుసుగానుండు దేహములును, బరడుపిక్కలును = బొబ్బరవలె గట్టులైన పిక్కలును, చేవవిండ్లు=చేవగలవిండ్లు, ఎఱ్ఱసెరలకన్నులును = రక్తరేఖలు గల కన్నులును, జేగురుబొట్లు=ఎఱ్ఱనితిలకములును, చిల్లకోలలును= చిల్లలు పెట్టినకోలలు-తోమరములనుట. నీలికాసెలు=నల్లనిదట్టీలు, మోటకత్తులు=మద్దుకత్తులు, తలముండ్లు = తలముళ్లు-ఇది వేఁటకైన యొకసాధనవిశేషము, బదనిక= చెట్టుమీఁద మొలచెడు ఒకయోషధి - ఇది మృగవశీకరణసాధనము. బద...కడెం

గలిగి భయంకరాకారకింకరుల
పొలుపున గర్జించుపొలపర్లు గలసి
కోదమసింగముఁ బోలుకుక్కలఁ దెచ్చి
కుదియించి బంగారుగొలుసులఁ బట్టి
కడఁగి సింహము మీఁదఁ గవిసిననైన
నడుగు దీయక గుండె లవియ మోఁదుదుము
పులి నైనఁ బైఁబడి పొట్టటివలెను
బలిమిమైఁ బొరలించి పట్టి వే యొడ్డు 480
మెగసి మిన్నులఁ బాఱునిఱ్ఱుల నైన
నిగిడి కూడఁగఁ బట్టి నేలకు వైతు
మని బంటుపంతంబు లాడుచుఁ గొల్వఁ
జనియె నాతఁడు వింధ్యశైలంబుత్రోవ
భల్లాతకీ పారిభద్ర మధూక
సల్లకీ కురవక స్సాల హింతాల
కుటజ కుచందన కుంభీ పలాశ
వట పీలు పాటలీ వ్రజి ఖర్జూర

---

బు=బదనికతో చేయఁబడినసందిటికడియము, భయం...పొలుపున = భయంకరమైనయాకారములు గలయమదూతల విధమున, పొలపర్లు=వేఁటకాండ్రు, కోదమసింగము= సింగపుఁబిల్ల, కుదియించి=పన్నించి, మీఁదఁగవిసిననైనన్=మీఁదికి వచ్చినప్పటికిని, అడుగుదీయక= వెనుకకు అడుగు పెట్టక, మిన్నులన్ పాఱు= ఆకాశమునఁ బరుగెత్తు, బంటుపంతములు=బిరుదుమాటలు-ప్రాగల్భ్యములు, భల్లాతకీ=జీఁడిచెట్లు, పారిభద్ర=దేవదారువులు-లేక వేఁపచెట్లు, మధూక=ఇప్పచెట్లు, సల్లకీ=అందుగుచెట్లు, కురవక = ఎఱ్ఱగోరంటలు, సాల=మద్దిచెట్లు, హింతాల=గిరకతాటిచెట్లు, కుటజ=కొండమల్లెలు,కుచందన=బుజపత్రి, కుంభీ=పినగుమ్ముడు, పలాశ=మోదుగుచెట్లు, వట = మఱ్ఱిచెట్లు, పీలు=గోలుగు

ఖదిర శమీ బిల్వ కకుభాశ్వకర్ణ
బదరి తిందుక శింశుపా నక్తమాల 490
పాటలా తింత్రిణీ ప్రముఖవృక్షముల
గాటమౌ నడవులఁ గలసి రాఁ బ్రబలి
మొల్లదీఁగెల నంటి ముడిపడి యిసుకఁ
జల్లిన రాలక చల్లగాఁ బ్రబలు
నాకుఁజప్పరములయం దినరశ్మి
లేక చీఁకటు లగ్గలించుచు నెఱయఁ
బోరిగోనునలు గన్నపులుఁగులు దక్కఁ
బరు లెఱుంగనియొకపాటికాఁ డడవి
నురవడిఁ జొచ్చి బిట్టుజేమినరీతి
మురువున శింజిని మ్రోయించి విభుఁడు 500
పిడుగులకంటెను బెడిదంబులైన

చెట్లు, పాటలీ=మొక్కపుఁజెట్లు, వజ్రి=ఆకుజెముడు, ఖర్జూర=పేరీఁదు, ఖదిర=చంద్రచెట్లు, శమీ=జమ్మిచెట్లు, బిల్వ=బిల్వము, కకుభ=ఏఱుమద్దిచెట్లు, అశ్వకర్ణ=ఇనుమద్దిచెట్లు, బదరీ=రేఁగుచెట్లు, తిందుక=తుమ్మికిచెట్లు, శింశుపా=ఇరుగుడుచెట్లు, నక్తమాల=కానుగుచెట్లు, పాటలా = కలిగొట్టుచెట్లు, తింత్రిణీ=చింతచెట్లు, ప్రముఖ=మొదలయిన, వృక్షములన్, గాటము=దట్టమైనది, ఆకుఁ జప్పరములు=ఆకులు పెనఁచుకొని నలుచదరముగా తీరిన పందిరి - మొల్లతీఁగెలతోఁ గూడ పెనఁగొని యిసుక చల్లినను రాలనట్లు దట్టముగా నున్న చెట్లయాకుల పందిళ్లయందనుట - మొల్లతీఁగెలతో పెనఁచుకొనుటచే అవి యిసుకచల్లినను రాలనంతగుత్తముగాదట్టములైనవని తెలియునది, ఇనరశ్మలు=సూర్యకిరణములు, అగ్గలించుచున్ = అతిశయించుచు, పోరిగోనునలు గన్నపులుఁగులు తక్కన్ = చంపునట్టి మెడగల పక్షులుతప్ప, ఒకపాటికాఁడడవి = ఒకవిధమైన దట్టపుఅడవి, శింజిని = అల్లెత్రాటిని, బెడిదంబులు = ఘోరములు, వెడఁద

వెడఁదవాతులు గల్గువివిధబాణముల
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు గొనఁగ
గతి గతిఁ గఱవ నొక్కట వేయుటయును
బగులు భేరుండముల్ పడుశరభములఁ
దెగుసింహములు జిట్టఁ దిరుగు నేనుఁగులఁ
దూలుగండకములఁ దునియుబెబ్బులులఁ
గూలు నెల్గులఁ దన్నుకొను మహిషములఁ
బొరలుదుప్పులు ఘూళి ద్రుంగునిఱ్ఱులను
దెరలుసూకరములఁ ద్రెళ్లుసివంగు 510
లొఱగుజింకలును బిట్టొరలుమన్బిళ్లు
మఱుఁగుగవయములు మడియు నేఁదులును
నడఁగుజంబుకములు నై యట్ట పొట్ట
దొడ మెడ బరి కాలు దోరంపుఁజెవులు
గొరిసె వాలము మోర కొమ్ము లెమ్ములును
బరికించి చూడ నేర్పఱపంగ రాక

---

వాతులు=విశాలములైన ముఖములు, గతిఁ గతిఁ గఱవ=ఒకబాణపు టెక్కును మఱియొకబాణము టెక్కు తాఁకునట్లు- ఒకటిని మఱియొకటి దాఁకినట్లె పోవునంత ప్రయోగవేగాతిశయముతో, శరభములు= ఎనిమిదికాళ్ల మృగములు, జిట్టఁ దిరుగు=జిట్టని సుడియు, ఘూళిఁ ద్రుంగు= దుమ్ముచే ఆవరింపఁబడు- నేలం ద్రెళ్లునట్టియనుట, తూలు=చలించు, తన్నుకొను=నిలవిలఁగాళ్లు విదుల్చు, తెరలు=పలాయితములగు, త్రెళ్లు= కూలు, ఒరగు=వ్రాలు, బిట్టుఒరలు=మిక్కిలికూలు, మఱుఁగు=తపించు, ఎల్గులు=ఎలుఁగుబంట్లు, మహిషములు=ఎనుపోతులు, సూకరములు=పందులు, మన్బిళ్లు= మన్నుబిళ్లు, మడియు=చచ్చుచున్న, ఏఁదులును= ఏఁదుపందులును - ముండ్లపందులనుట, జంబుకములు = నక్కలు, అట్ట= మొండెము, బరి = ప్రక్క, తోరంపు = పెద్ద, మోర := పశ్వాదుల ముఖము,

కత్తులపచ్చడి గాఁ జేసినట్లు
తుత్తుమురై రూపు దోఁపక కలసి
నెత్తురుమడుఁగుల నెఱిఁ దేలి యాడ
నత్తఱి రోఁతయు నలసట వ్రేడమ 520
వేఁటఁ జాలించి యావిపులాధిపుండు
వేఁటకాండ్రను జేరఁ బిలిచిన నార్చి
వలలోనఁ బడఁ దార్చి వడి వధియించి
కలయ ఖండించియుఁ గాఁడ నేసియును
లోవలు వెడలక లోఁగిన వాని
లోవక చొచ్చి లోలోనఁ గ్రుమ్మియును
సురుఁగఁగ నడుగులచొప్పునఁ దగిలి
యురవడిఁ గుక్కల నుసిగొల్పి కొల్పి
సందుగొందులఁ దప్పి చనుమెకంబులను
బందిపోటులఁ బాటు పఱిచియు మఱియు 530
జాలెడేగల మంచిజావడంబులను
సాళువంబుల మంచిజలకట్టెయలను

---

కత్తులపచ్చడిగాన్ = కత్తులతోఁ జితుకఁగొట్టినట్లుగా, అత్తఱిన్ = ఆసమయమున, రోఁతయున్ = అసహ్యతయు, ఆర్చి = సింహనాదముసేసి, వలలోనన్ పడన్ తార్చి = వలయందుతగులుకొనునట్లు రాఁజేసి, వడిన్ వధియించి = వేగముగా చంపి, కలయన్ ఖండించియు = అంతటనుతునిమియు, కాఁడనేసియు = తూపులు ఉచ్చిపోవునట్లు ప్రయోగించియు, లోవలన్ = లోయలందు-కొండపగుళ్లను, లోఁగినవానిన్ = దాఁగినవానిని, లోవక = వెనుదీయక, లోలోనన్ = దానిలోపలనే, క్రుమ్మియున్ = ఆయుధములతోఁ బొడిచియును, సురుఁగఁగ = కనఁబడకపోఁగా, అడుగులచొప్పునన్ తగిలి = అడుగులజాడను వెంబడించి, బందిపోటులన్ = దారియడ్డగించుటలచేత, పాటుపఱిచి = బాధపెట్టి, జాలె,

బెద్దసారణముల బెట్టుగా విడిచి
గ్రద్ద యులూకంబు కాకంబు కౌఁజు
కొక్కెర బెగ్గురు కొంగ రాపులుఁగు
కక్కెర యాఁడెలు కన్నియలేడి
వెలిచె లావుక లాది వేర్వేఱుజాతి
పులుఁగుల నన్నిటిఁ బొరివుచ్చి తనిసి
వేఁటఁ జాలించి యుర్వీవల్లభునకు
మేటిదంతములును మేటిజల్లులును 540
గరివరాహజమౌక్తికములుఁ గస్తూరిఁ
బరఁగ నిచ్చినఁ దనభామిని కిచ్చి
పరువడి వారికిఁ బసదనం బొసఁగి
సరసంబుగాఁ దనసచివునిఁ జూచి
యరు దైనయీమహావ్యసనంబుకతనఁ
దరమిడి యెంతయు దవ్వు వచ్చితిమి
యిదె జాహ్నవీనది యీచెంతఁ దపము
వదలక యొనరించువరతపోధనుని
గురుని వసిష్ఠునిఁ గోరి దర్శించి
మరలి పోదము గాక మనపురంబునకు 550
ననుచు నజ్జననాథుఁ డామంత్రివరుని
యనుమతితోఁ గూడి యచ్చటి కేఁగి

---

జావడము, సాళువము, జలకట్టె, సారణము, అనునివి డేగజాతిభేదములు. మేటిదంతములును= మేలయినదంతములును, మేటిజల్లులును=మంచిచామరములను, కరి=ఏనుఁగులవలనను, వరాహ= పందులవలనను, జ=పుట్టిన, మౌక్తికములు=ముత్యములు, భామినికిన్ =కాంతకు=చంద్రమతికి, పసదనము=పారితోషికము, సచివునిన్ = మంత్రిని, మహావ్యసనము= వేఁటయనుగొప్పవ్యసనము, తరమిడి=మితిమీఱి, జాహ్న

యమ్మునివరుఁ గాంచి యడుగుల కెఱఁగి
సమ్మదంబునఁ గరజలజముల్ మొగిచి
యున్న యారాజేంద్రు నుచితసత్కృతుల
మన్నించి మునిశిఖామణి యిట్టు లనియె
ననఘాత్మ పతి కతివ్యసనంబు చనదు
మనువంశమునఁ బుట్టి మఱతురే నీతిఁ
క్రూర మృగ వ్యాళ ఘోరనిశాట
భేరుండసంచారభీకరం బైన 560
గహనభూములఁ గులకాంతయు నీవు
విహరించు టిది యవివేక మింతయును
బురి కేఁగు మిం కొక్కబుద్ధిఁ జెప్పెదను
జొరకు మెన్నఁడు గాధిసుతుతపోవనము
జడలు గట్టుట వృథాశాంతి యాతనికి
నుడుగక ముక్కున నుండుఁ గోపంబు
ననుచు వీడ్కొలుప విశ్వామిత్రుఁ డెఱిఁగి
మను జేశు నలయించుమార్గ మూహించి
తనతపోమహిమచేఁ దత్క్షణంబుననె

---

వీనది=గంగానది, అడుగులకు ఎరఁగి=పాదములకు మ్రొక్కి, కరజలజముల్ =హస్తపద్మములు, అతివ్యసనంబు = మిక్కుటమైనవ్యసనము-మిక్కిలిగా వేఁటయనుట, క్రూర=క్రూరములైన, మృగ = మృగములయు, వ్యాళ=ఏనుఁగులయు-లేక సర్పములయు, ఘోర = భయంకరులైన, నిశాట= రాక్షసులయు, భేరుండ=గండభేరుండములయొక్కయు, సంచార=తిరుగుటలచేత, భీకరము=భయంకరమైనది, గహన=చొరరానియడవి, గాధిసుతు=విశ్వామిత్రునియొక్క, జడలుగట్టుట=జటాబంధనము, వృథాశాంతి=వ్యర్థమైనశాంతి-శాంతి సార్థకముగా జడలుదాల్చినవాఁడుగాఁడనుట, అలయించుమార్గము = శ్రమపెట్టు నుపాయము,

మునిశిఖామణి జగంబుల లేనిదాని 570
ముత్తెంపుఁజిప్పల మురళించుమోముఁ
గ్రొత్తనీలపురంగు గులుకుకన్దోయి
పగడంబు నునుఁగెంపుఁ బచరించుచెవులు
ధగధగ మను పైఁడితళుకుల మేను
దఱచువజ్రములతోఁ దడఁబడుతొడలు
మెఱుఁగుఁబచ్చలడాలు మీఱుగొర్సెలును
నొఱపువెన్నెలఁ గాయునుదరంబు గలిగి
వెలిచినగతి దిశల్ వీక్షించికొనఁగఁ
జెలువును బలుపును జిగియును బిగియు
బలమును జలమును బటులంఘనములు 580
దత్తఱమును మేనితళుకును బెళుకు
నుత్తమమణిరుచి నొప్పెడుపాడలు
మురువును బరువును ముదమును మదము

---

పగడంపునును గెంపు=పగడముల నిద్ధమైన యెఱ్ఱనికాంతిని, రంగు = కాంతిని, మురళించు=తిరస్కరించు, పచరించు=ప్రసరింపఁజేయు, పైఁడితళుకలమేను= బంగారుతళుకులు తలతలలాడుదేహము, వజ్రములతో తడఁబడు తొడలు=వజ్రములవలె భ్రాంతిని గలిగించుతొడ లనుట, డాలు=కాంతి, ఒఱపువెన్నెలఁ గాయు=చక్కనివెన్నెల కాయునట్లు తెల్లనికాంతు లీనునట్టి, ఎలయించి=ప్రక్కకుమరల్చి, వెఱచినగతిన్ = బెదరినట్లు, చెలువు=అందము, బలుపు=అతిశయము, జిగి=కాంతి, బిగి=బిగువు, చలము=పట్టు, పటులంఘనములు= పెద్దదాఁట్లు, తత్తఱము=సంభ్రమము, మేనితళుకు = మేనిమొక్కతళుక్కను కాంతి, బెళుకు= కన్నులబెళుకును, ఉత్తమమణిరుచిన్ = మేలయినరత్నములకాంతితో, మురువును=శృంగారపునిక్కు, పరువును=పరుగెత్తుటయు, ముదము=ఉబ్బు, మురిపెం

మురిపెంబునొఱపును ముద్దును వింత
ఖచరంబు నచరంబు గబ్బును గుబ్బుఁ
బచరింప వన్నెలపైఁడిమృగంబు
నలవడఁ బుట్టించి యాహరిశ్చంద్రు
నెలయించి చయ్యన నిందుఁ దె మ్మనుచుఁ
బంచిన నిజదేహభాసురప్రభలు
ముంచి దిక్కులఁ బర్వ మురియుచు నేఁగి 590
యాచిత్రమృగరత్న మమ్మహారాజు
లోచనోత్సవము గా లోలత నిలిచె
తల యూఁచి మెచ్చులు దలకొన విభుఁడు
నీయొప్పు గలదీని నిటు చూచి చూచి
యేయఁ బూనఁగఁ జేతు లేగతి నాడు
వేయుదెఱంగుల వెనుకొని పట్టి
యీయిఱ్ఱి నిచ్చెద నీకొమారునకు
ననుచు సారథిఁ జూచి యాపైఁడిమృగము
మనకు లోఁబడునట్టిమతముఁ జింతించి 600

---

బు=నడలయొయ్యారముయొక్క, ఒఱపును=ఒప్పిదమును,వింతఖచరంబు=ఆశ్చర్యమైనఆకాశమున చరించుటయు-వింతదాఁట్లు అనుట,అచరంబు=మిన్నకుండుటయు, గబ్బు=వాసన, గుబ్బు=ఎగవు, వన్నెలపైఁడిమృగంబు = రంగులుగులుకు బంగారుజింకను, అలవడన్ = పొందికగా, చయ్యనన్ = శీఘ్రముగా, నిజ...ప్రభలు=తనదేహముయొక్క ప్రకాశించుచున్నకాంతులు, ముంచి=ఆవరించి, పర్వన్ =వ్యాపింపఁగా, మురియుచున్ = కులుకుచు, లోచనోత్సవము గాన్ =కన్నులపండువుగా, లోలతన్ =ఆసక్తితో, మెచ్చులు=మెచ్చుకొనుటలు, తలకొనన్ =కలుగఁగా, క్రిందటన్ గాలిగాన్ =క్రిందుప్రక్క వాసన పొలయునట్లుగా-అనఁగా మృగమువంక తమగాలి ప్రసరింపనట్లుగా - తమగాలి వీ

క్రిందట గాలిగాఁ గేడించి రథము
నందుపాటుగఁ దోలు మనుచుఁ దోలించి
కదియఁ బోవుటయు నక్కపటమృగంబు
బెదరి పట్టీక కుప్పించి బిట్టెగసి
చెరలాడు జిఱకొట్టు చెలఁగి పేరెంబుఁ
దిరుగుఁ బర్వెడుఁ దీఁగె దీసినరీతి
గిరగిర మైఁ ద్రిప్పఁ గెరలు నల్గడల
ఖురముల నౌదలఁ గోఁకి కేడించు
బరులతీటకుఁ దరుపంక్తితో నొరయు
మరిగినగతిఁ జేరి మలయు నంతంత 610
నేఱఁ గల్వ రేకులు నెఱపినపోల్కి
వెఱపునఁ దననీడ వీక్షించి దాఁటుఁ
గుఱుచవాలము ద్రిప్పఁ గొమ్ముల బయలుఁ
జిఱిమి చిత్రములు గాఁ జిమ్ము నీరీతి
నెడపక నారాజు నెలయించికొనుచు
వడిఁ గౌశికునితపోవనము సొత్తెంచి

---

చినయెడ మృగము తమజాడ తెలిసికొనుననుట, కేడించి=తొలఁగించి, అందుపాటుగా=అందుకొనుటకు అయితిగా, కుప్పించి=ఊపిరిఁ బట్టి, చెరలాడుట=తిరుగాడును, జిఱకొట్టుట = జిఱ్ఱునఁదిరుగును, పేరెముతిరుగు=పరుగిడును, తీఁగెతీసిన గతిన్=తీఁగసాఁగినట్లు-నిడుదదాఁట్లతో, ఖురములన్=గొరిజల, ఔదల=నడినెత్తి, బరుల తీటకు=ప్రక్కల దురదకు, తరుపంక్తితో = చెట్లవరుసతో, మరిగిన గతిన్=మచ్చికపడినట్లు, చేరి=కదియవచ్చి, మలయు=క్రమ్మఱును, కల్వ... వీక్షించి=కలువరేకులచాలు నిగిడ్చినట్లు చూపులు నిగిడ్చి తననీడనుజూచి, కుఱుచవాలము=పొట్టితోఁక, బయలుఁ జిఱిమి=పట్టిబయలనుపొడిచి, ఎడపక=విడువక, సొత్తెంచి=ప్రవేశించి, కనుఁబ్రామి=కనుచూపును మోసపుచ్చి-మఱుఁగై, కొద

కనుఁబ్రామి పోఁ జూచుకపటమృగంబు
మను జేశుఁ డలుక నెమ్మనమునఁ గదురఁ
గొదమనాగముఁ బోలెఁ గోలమిడ్గురులు
సెదరంగ దొనఁ దీసి శింజిని దొడిగి 620
తెగ గింగురనఁ బాపి దృష్టి సంధించి
తెగ నేయుటయు దానఁ దెగక యామృగము
వడి నెత్తుటను దోఁగి వడఁకుచు గాధి
కొడుకుముందటికేఁగి గొబ్బున నడఁగె
నప్పార్థివేంద్రుండు నమ్మాయమృగము
త్రిప్పుల నడవులఁ ద్రిమ్మరి యలసి
వదనపద్మంబు కైవ్రాలంగ దప్పి
గదిరి చల్లనినీటికందువ నరసి
చని చని ముందటఁ జంపకంబులను
బనసల నిమ్మలఁ బాటలంబులను 630
సురుగుల మారేళ్లఁ జూతపోతములఁ
గురవకంబుల గేదఁగుల నశోకములఁ
బొగడలఁ బొన్నలఁ బోఁకమ్రాఁకులను
బొగ డొందుఖర్జూరములఁ జందనములఁ
బుల్లమామిళ్లఁ గర్పూరభూజముల
నల్లనియరఁటుల నారికేళములఁ

---

మ నాగము=పసిపాము, కోల = బాణము, మిడ్గురులు = నిప్పుకలు, దొనఁ దీసి=పొదినుండి ఎత్తి, తెగ=ఎక్కు, గింగురనన్=గింగు అని శబ్దించునట్లుగా, దృష్టి సంధించి=చూపు గూర్చి - గుఱిపెట్టి, వదనపద్మము = ముఖారవిందము, కై వ్రాలంగన్=సోలఁగా, నీటికందువ=నీరున్నచోటు, నాగవలీ లతా=తము

గమ్మరేఁగులను బ్రేంకణముల నలరుఁ
గొమ్మలఁ బెనఁగొన్న కొదమరుద్రాక్ష
తీఁగెల గురువెందతీఁగెల జాజి
తీఁగెల మిరియంపుఁదీఁగెల నాగ 640
వల్లీల తైలా లవంగాదిలతల
మల్లికాలతలసంపద నొప్పుపొదలఁ
జల్లనినీడల జాతివైరంబు
లెల్లను విడిచి పేరెలమితోఁ బొదలి
కొదమసింగములను గోరి తుండముల
ముదమున నొయ్యనఁ బుడుకునేనుఁగులు
వానిచెక్కులతీట వక్రనఖాళిఁ
బూని గోఁకుచు నున్నపులులును వాని
కూనలకును జన్నుఁగుడిపెడు లేళ్లు
వానితోఁ జెరలాడ వచ్చు రేఁచులును 650
వానితోఁ గ్రీడించి పఱలుముంగిసలు

---

లపాకుతీఁగెలచేతను, ఏలా లవంగ ఆది లతలన్ =ఏలకితీఁగలు, లవంగపుతీఁగలు మొదలైనవానిచేతను, మల్లికాలతలసంపదన్ =మల్లెతీఁగలపెంపునను, ఒప్పుపొదలన్ =అందము అతిశయింపఁగా, జాతివైరము=జాతిభేదములవలనగలిగినపగ, పేరు ఎలమి=మిక్కిలిసంతోషము, పొదలి=అతిశయించి, కొదమసింగములను=సింగపుపిల్లలను, ముదమునన్ =సంతోషముతో, ఒయ్యనన్ = మెత్తగా, పుడుకు=నివురు, వానిచెక్కులతీటన్ =ఆయేనుఁగుల చెక్కిళ్లయందలితీటను, వక్రనఖ ఆళిన్ =వంకర లయినగోళ్లవరుసలచేత, వానికూనలకును=ఆపులులపిల్లలకు, లేళ్లు=ఆఁడుజింకలును, వానితోన్ =ఆలేళ్లతో, చెరలాడవచ్చు రేఁచులును=ఆటలాడుకొనవచ్చునట్టిరేఁచుకుక్కలును, పఱలు=విలసిల్లు, వానితోఁ బ్రాఁకెడువరపన్నగములు=ఆముంగిసలతోఁగూడ నేలపై జరుగుమేలిసర్పములు, వానికి నీడగా ప్రా

పానితోఁ బ్రాఁకెడువరపన్నగములు
వానికి నీడగా బ్రాలు నెమిళ్లు
వానిపీఁపులమీఁద వచ్చుపిల్లులును
వానిప్రక్కలఁ గూర్కు వరమూషికములు
వీనుల కెంతయు విన నింపు గాఁగ
సామంబు లలవడఁ జదువుకోవెలలుఁ
గామించి మినుకులఁ గఱపుచిల్కలును
గలయఁ గమ్మనియాజ్యగంధముల్ మేన
నొలయంగ వెదచల్లుహోమధూమములుఁ 660
గలుగువిశ్వామిత్రుఘనతపోవనము
వల నొప్పఁ జొచ్చి యావనమధ్యమునను
గమనీయవిలసితకమలకల్హార
కుముదనీలోత్పలకుసుమసుగంధ

---

ళ్లు నెమిళ్లు=ఆపాములకు నీడ గలుగునట్లు పయిని పింఛెలు విరియించి వ్రాలునట్టి నెమిళ్లు, వానిపీఁపులమీఁద=ఆ నెమిళ్ల పీఁపులపై నెక్కి, కూర్కు=నిదురించు, వర మూషికములు=మేలయిన ఎలుకలు-ఇంతవఱకు జాతివైరము లేకుండుటను జెప్పినాఁడు. సామంబులు=సామగీతములు-అలవడన్ = అభ్యాసముకాఁగా-లేక-పొందికగా-ఆశ్రమప్రదేశమగుటచే మునులసామగానములు విని నేర్చి యట్టి యందలి కోవెలలును పాడుననుట, కామించి=కోరి, మినుకులన్ = వేదములను, కఱపు=నేర్పునట్టి, కలయన్ = అంతటను, కమ్మని అజ్య గంధముల్ =కమ్మనైన నేతి వాసనలు, మేనన్ ఒలయంగన్ = మేనికిఁ దాఁకునట్లు, వలను ఒప్పన్ =అనువు మీఱఁగా, కమనీయ... ధ్వనులు—కమనీయ=మనోజ్ఞముగా, విలసిత=ఒప్పిన యట్టి, కమల=తామరలు, కల్హార=ఇంచుకంత యెఱుపును తెలుపునుగల కలువలు, కుముద=తెల్లగలువలు, నీల+ఉత్పల = నల్లగలువలు, అనేడి, కుసుమ= పువ్వులయొక్క, సుగంధ=మంచివాసనచేతను, మధుకర= తుమ్మెదలయొక్క,

మధుకరమిథునసమ్మదకరమృదుల
మధుతరసంగీతమహితతరంగ
లలితడోలాకేళిలాలసచక్ర
కలహంస బక బిసకంఠికా క్రౌంచ
సరస టిట్టిభ మద సారసప్రముఖ
వరజలఖగకులధ్వనుల నిం పెసఁగ  67
సారలామజ్జక జలద కచ్ఛూర
సౌరభవాసితసలిలమై చైత్ర
దర్పితవనదేవతాకరస్ఫటిక
దర్పణంబునుబోలెఁ దనరారుచున్న
కొలను గనుంగొని కువలయేశ్వరుఁడు

---

మిథున = దంపతులయొక్క, సమ్మదకర = సంతోషమునుజేయు, మృదుల= మెత్తని, మధుతర = మఱింతమధురమైన, సంగీత = గానముచేతను, మహిత= అతిశయించినవియు అగు, తరంగ = అలలందు, లలిత = సొగసైన, డోలాకేళి = ఊగునట్టిక్రీడయందు, లాలస=ఆసక్తమైన, చక్ర=చక్రవాకము లు, కలహంస=రాజహంసములు, బక=కొంగలు,బిసకంఠికా= పెంటికొక్కెరలు, క్రౌంచ=కౌంచపిట్టలు, సరస=సొగసైన, టిట్టిభ=లకుముకులు, మద=మత్తిల్లిన, సారస= బెగ్గురుపిట్టలు, ప్రముఖ= మొదలైన, వర=శ్రేష్ఠములైన, జలఖగ=జల పక్షులయొక్క, కుల=సమూహముయొక్క, ధ్వనులన్ = ధ్వనులచేత, ఇంపు ఎసఁగన్ =సంతోషము అతిశయింపఁగా, సార=శ్రేష్ఠమైన, లామజ్జక=వట్టివే ళ్లు, జలద=ముస్తెలు, కచ్ఛూర = గంధకచోరములు, వీనియొక్క, సౌరభ=వా సనచేత, వాసిత=పరిమళించునట్లు చేయఁబడిన, సలిలమై=జలముగలదై, చైత్ర... బోలె-చైత్ర=చైత్రమాసముచేత, దర్పిత = విఱ్ఱవీఁగినట్టి-చైత్రమున పల్లవిం చియు పుష్పించియు ఫలించియు నుండునట్టి సొంపు పెంపుగలిగినట్టియనుట,వన దేవతా=వనదేవతయొక్క, కర=హస్తమునందలి, స్ఫటికదర్పణంబునుబోలె=




లలనయుఁ దాను నల్లన తేరు డిగి
కరతలంబున మంత్రికర మూఁదుకొనుచు
సరసిలోపలఁ జొచ్చి జలములు గ్రోలి
యవగాహ మొనరించి యాతీరభూమి
నవకంపుఁబొన్నలనడుమఁ జెన్నారు 680
సురుగులతోఁ బ్రాఁకి చుట్టు రాఁ బ్రబలి
పర పైనగురువెందపందిరిక్రింద
నొఱ పైనచిగురాకు లొనరించి తీర్చి
పఱచినమృదు వైనపానుపుమీఁదఁ
దిలకించి చంద్రమతీదేవితోడలు
దలగడ గాఁగను దగ విశ్రమించి
మరువంబు గొనల నమర్చినయట్టి

---

పటికపుటద్దమువలె-చిగిర్చి పూచియున్న వనదేవతసౌభాగ్యసంపదలన్నియు ప్రతిఫలించుచున్న పటికపురాతియద్దమువలె ననుట, తనరు+అరుచున్న = ఒప్పునిండుచున్న, లలన=స్త్రీ), అల్లనన్ = మెల్లగా, కరతలంబునన్ = అఱచేత, సరసి = కొలను, గ్రోలి=త్రాగి, అవగాహము ఒనరించి = స్నానముచేసి, నవకంపుపొన్నలనడుమన్ =మృదువులైన పొన్నచెట్లనడుమ, చెన్ను ఆరు సురుగులతోన్ = అందము మీఱుసురిగితీఁగలతోఁ గూడ, ప్రాఁకి = పెనఁచుకొని ప్రాఁకి, చుట్టి రాన్ =ఆపొన్నలచుట్టును పైని వ్యాపింపఁగా, ప్రబలి=దట్టమైన జొంపముగొని,పరపుఅయిన=విరివిగాంచిన, గురివెందపందిరి= బండిగురిగింజతీఁగలతో నైనపందిరి. చుట్టును లేఁతపొన్నచెట్లు, వాని పైని బండిగురిగింజతీఁగలు సురుగులతోఁ గలసి దట్టముగానలమికొని పందిరిగా నేర్పడిన దనుట, ఒఱపు అయినచిగురు+ఆకులు=సొగసైన చిగుళ్లు, ఒనరించి=సమకట్టితీర్చి=పొందికపఱచి, తిలకించి=సంతసించి, మరువంబు=మరువమును, కొనలన్ అమర్చినయట్టిసురఁటి = కొనలయందు అమరికగాఁ గట్టిన గుండ్రని వీవన=

సురఁటివట్రువగాలి సుడియంగఁ ద్రిప్పు
తనమంత్రివరుమోముఁ దప్పక జూచి
కనుఁగొంటివే యిందుఁ గలవిశేషములు 690
వెఱఁగును వెఱపును వేడ్కయుఁ బెనిచి
వలలు నేమునితపోవనమొకో యనుచు
ననఁగఁ బండ్లును గోయ నచ్చోటి కొక్క
మునికుమారుఁడు వచ్చి మునిసింహుఁ డైన
యాగాధినందనునాశ్రమం బనిన
వేగంబె వదనంబు వెలువెలఁ బాఱి
యేడ వన్నెలమృగం బెక్కడివేఁట
యీడకు వచ్చితి మిది మోస మయ్యె
గురుమతి నాకులగురు వసిష్ఠుండు
పరఁగంగఁ బలుకకుబలె బుద్ధిఁ జెప్పె 700
పొమ్మన్న నూరికిఁ బో నేర నైతి
యిమ్ముల విధి దాఁట నెవ్వరివశము
పలుకు లేటికి మహాప్రళయంబు వచ్చెఁ

---

సుడియంగన్ = వీచునట్లు, ఏడ ... వేఁట = వింతరంగులు గలమృగ మెక్కడ! వేఁటాడుట ఎక్కడ! ఈవిశ్వామిత్రునాశ్రమమునకు వచ్చుట ఎక్కడ! అని శేషము-వేఁటయనివచ్చి మృగమునుతఱుముచుపోయి తప్పి విశ్వామిత్రాశ్రమముఁ జొచ్చితిమే. దానికిని దీనికిని సంబంధ మెట్లు కలిగినదో యని ఖేదముతోఁ గూడినయాశ్చర్యము. గురుమతిన్ =గొప్పబుద్ధితో, కులగురు = కులగురుఁడు, గురు అని డుజ్వర్ణకము లేకుండుట విచార్యము, ఇమ్ములన్ = చక్కఁగా, విధిన్ దాఁటన్ = దైవమును అతిక్రమించుటకు, పలుకు లేటికి = మాటలాడుచుండుట వలన ప్రయోజనము లేదనుట, మహాప్రళయంబు వచ్చె = మహాప్రళయమువంటి

దలఁగ మైతిమి వేఁటతమకంబుకతన
నేమి సేయుదు మింక నేది విచార
మామహామునివరుఁ డలుగక మున్నె
పొడగాంచి మ్రొక్కంగఁ బోదమో లేక
వెడలి పోదమొ కడు వేగమె పురికి
నని యిట్లు చింతింప నా సత్యకీర్తి
తననేర్పు మెఱసి భూధవున కిట్లనియె 710
నేల నీతలపోఁత లినకులాధీశ
పోలించి చూడుమీ బుద్ధిఁ గార్యంబు
మనసులు చల్లనై మదమత్సరములు
మునుపడ దిగనాడి మోహంబు విడిచి
పొగడినఁ దెగడిన ముదముఁ దాపంబు
నిగుడక నడవుల నిలిచి యెంతేని
కూరలు గాయలుఁ గూళ్లుగాఁ గుడిచి
వారక తపసులై వర్తించునట్టి
వారికి మనతోడి వైరంబుఁ బూని
పోరాడ నేధనంబులు పొత్తు వావు 720

---

విపత్తు సంభవించెను- వేఁటతమకంబుకతన=వేఁటయందలి మిక్కిలి యాసక్తి చేత, తలఁగ మైతిమి=తొలఁగిపోవకపోతిమి-ఆతమకమువలనఁ గొంచెము లేక ఈ శ్రమను జొచ్చితి మనుట, పొడగాంచి=దర్శించి, మెఱసి=మెఱయించి, ఈతలపోఁతలు = ఈ ఆలోచనలు. పోలించి... కార్యంబుఁ -నీ మనస్సులో చేయఁదగినపని యిది యని పోల్చిచూడుమీ, మనసులు చల్లనై = మనస్సులు శాంతి గలిగి, మునుపడఁ = ముందుగా, మోహము = అజ్ఞానము, పొగడిన... తాపంబుఁ =స్తోత్రముచేయఁగా సంతోషమును, నిందింపఁగా పరితాపమును, గుడక=సాఁగక-కలుగక, ఎంతేని=మిక్కిలి, వారక=ఎడతెగక, మనతోడి...

సంతాప మంద విశ్వామిత్రుఁ డకట
యింతక మున్ను మీ కే గ్గమి సేసెఁ
జన భవజ్జనకుఁ ద్రిశంకుభూపాలు
ననుపఁడే బొందితో నమ రేంద్రుపురికి
వలదు మీ కిది లేనివట్టిదుశ్చింత
దలఁకక యొక్కింతదడవు నిద్రింపు
మని కార్య మేర్పడ నాడిన మంత్రి
వినుతవాక్యంబులు విని సంతసిల్లి
కలఁగినచిత్త మొక్కటి గా నమర్చి
యెలమి కన్ మోడ్చి యొక్కింతయుఁ గూర్కి 730
చెప్ప నూఁకొన వినఁ జింతింపఁ జాల
నొప్పనికలఁ గాంచి యులుకుచు లేచి
విన్ననై దిక్కులు వెదకి వీక్షించి
కన్నీరు దొరుఁగ నంగము గంప మొంద
మానక వడఁకునమ్మనుజేంద్రుఁ జూచి
మానినీమణి చంద్రమతి సంభ్రమమునఁ

పోవు=అట్టివిరక్తతాపసులకు ధనములతోఁ బని గలుగదు-కనుక అట్టివారు మనతో కలహించిరేని వారికి మనధనము లేమియు పాల్లు పోవుట కలుగదని భావము. వారివిరోధమువలన మనకేమియు ధనహాని లేదుగాన అందులకై భయపడవలదనుట. సంతాప మంద... సేసె-అకట విశ్వామిత్రుఁడు ఇంతకు మున్ను మీకు సంతాపమంద ఏమిఎగ్గు సేసెను అని అన్వయము. చనన్ =ఒప్పు నట్లు,అమరేంద్రపురికిన్ =స్వర్గమునకు. తలఁకక =కలఁతలేక. కలఁగి...నమర్చి= చెదరినమనస్సు నొక్కటిగాఁజేర్చి కుదుటఁబెట్టి-మనస్సుఁదేర్చుకొని యనుట, మోడ్చి=మూసి, ఉలుకుచు = అదురుచు, కంపము = వడఁకు, తరుణపల్ల

దరుణపల్లవకాంతిఁ దళుకొత్తుముద్దు
గరమునఁ జెలు వొందఁగాఁ బీఁపుఁ జఱిచి
నూత్నమయూఖమనోహరం బైన
రత్నకంకణ మూడ్చి రక్షగాఁ గట్టి 740
యిది యేమి నాథ నీ వెన్నఁ డెఱుంగ
వదిరి మేల్కాని వెఱఁ గందెద విట్టు
లంతకుం డఱు ద్రొక్కి యదిమినయట్టి
జంతువు నైనను సత్కృపఁ గాచు
పరహితరతుఁడవు భాస్కరవంశ
శరనిధిపూర్ణిమాచంద్రుండ వసమ
దుర్వారబలగర్వదుష్టవిరోధి
పర్వతవజ్రి వై బాహుదర్పమున
సర్వసర్వంసహాచక్ర మంతయును
నిర్వక్రముగ నేలునీ కేల వెఱవ 750

---

వకాంతి = లేఁతచిగురుయొక్క కాంతితో, తళుకొత్తుముద్దుగరమునన్ = ప్రకాశించుచున్న సొగసైన చేతితో, చెలువు ఒందఁగన్ = అందము గలుగునట్లుగా - ఒప్పిదముగా, నూత్నమయూఖమనోహరము = క్రొత్తకిరణములచే మనోజ్ఞమైనది, అంతకుండు = యముఁడు, అఱుద్రొక్కి = మెడను ద్రొక్కి - యముని బారిఁ బడిన జంతువునుగూడఁ గాపాడ నేర్చినంత పరోపకారివి, భాస్కర...చంద్రుండవు = సూర్యవంశ మనెడిసముద్రమునకు పున్నమనాఁటి చంద్రుఁడవు - అసమ...వజ్రివి = సాటిలేకయు వారింపరాకయు నున్నట్టి బలమువలనిగర్వముచే దుర్మార్గు లయినశత్రువు లనెడిపర్వతములకు ఇంద్రుఁడైనవాఁడవు - ఇంద్రుఁడు పర్వతములను అడఁగఁ ద్రొక్కునట్లు పగవారిని అడఁగఁ ద్రొక్కువాఁడవు, బాహుదర్పమునన్ = భుజగర్వముచే, సర్వ సర్వంసహాచక్రమున్ = సమస్తమైన భూవలయమును, నిర్వక్రముగన్ = ఋజువుగా - సరిగా

నని తన్నుఁ దెలిపెడియాపువ్వుఁబోఁడిఁ
గనుఁగొని యారాజకంఠీరవుండు
కలకంఠి కొఱగానికల గంటి నిపుడు
తెలియఁ జెప్పెద దానితెఱఁ గెల్ల నేను
గోమరొప్పఁగాఁ బెద్దకొలువుఁగూటమున
రమణులు వింజామరంబులు వీవఁ
గొలువున్నతఱిఁ గోపఘూర్ణితనేత్రుఁ
డలఘుతేజోధనుఁ డగువిప్రుఁ డొకఁడు
తడయక వచ్చి నాతలకిరీటంబు
పుడమిపైఁ బడఁ గోపమున బిట్టు దన్నఁ 760
దన్ని యంతటఁ బోక తలఁ బట్టి యీడ్చి
నన్ను నుద్ధతిఁ ద్రోచె నగరంబు వెడల
నది యాదిగా దైన్య మడరి యందంద
పొదువునాపదలచేఁ బొక్కి క్రమ్మఱను
నిటలాక్షుకరుణ ననేక కాలంబు
పటుతరరాజ్యవైభవ మందఁ గంటి
నని యిట్లు దుస్స్వప్న మధిపతి సెప్ప

---

ననుట, తెలిపెడి=తేర్చెడి, రాజకంఠీరవుండు=రాజసింహుఁడు, కొఱగాని=పనలేని, కొమరు=అందము, రమణులు = స్త్రీలు, కోపఘూర్ణిత నేత్రుఁడు=కోపముచే తిరుగుచున్న కన్నులు గలవాఁడు, అలఘుతేజోధనుఁడు = గొప్ప తేజస్సే ధనముగాఁగలవాఁడు, బిట్టు=మిక్కిలి, ఉద్ధతిన్ = ఔద్ధత్యముతో, త్రోచె... వెడలన్ =నగరమునుండి వెడలఁద్రోసెను. దైన్యము అడరి = దీనత్వము కలిగి, అందంద=అచ్చటచ్చట, పొక్కి=తపించి, క్రమ్మఱను = మరల, నిటలాక్షుకరుణన్ =శివునికృపచేత, ఇచ్చను = మనస్సునందు, విప్పి=వివరించి

విని చాల వెఱచియు వెఱవనిరీతి
నిచ్చను జింతింప నేటికి మీకుఁ
జెచ్చెర గల విప్పి చెప్పెద వినుఁడి 770
యలుకమై వచ్చినయావిప్రవరుఁడు
తలపోయఁగా గాధితనయుఁ డాతండె
మఱి నేలఁ బడఁ దన్నె మకుటంబుఁ గాన
చెఱచి యాతఁడు మనసిరిఁ దొలఁగించు
నది గారణంబు గా నలజడి నొంది
పదపడి మనరాజ్యపదవి నొందెదము
గావున నెటువంటిఘనులకు నైన
భావింప నిత్యసంపద లెట్లు గలుగు
ధర్మ మెయ్యెడ నైనఁ దనుఁ గాచు ననెడి
నిర్మలవాక్యంబు నీబుద్ధి నిలిపి 780
సత్యంబు దప్పక చరియింపు మవని
నిత్యంబు లనరాదు నిఖిలసంపదలు
యని చంద్రమతి తనయాత్మేశుచింత
ననునయించుచు నుండె నచ్చట నంత
మఱియుఁ గౌశికుఁ డొక్కమతముఁ జింతించి
నెఱి నంద మై నల్పు నెఱసినకురులు
గొఱనెలయొఱపు గై కొన్నఫాలములు

---

అలజడి=కష్టము, నిత్యసంపదలు=ఎడ తెగని సంపత్తులు, ఆత్మేశుచింత=ప్రాణనాథునివగపును, అనునయించుచున్=ఊఱడించుచు, నెఱసిన=నిండిన-వ్యాపించిన, కురులు=తలవెండ్రుకలు, కొఱనెలయొఱపు=అర్ధచంద్రునిసౌందర్యము, చెఱకు

జెఱకుసింగిణివిండ్లఁ జెనకెడుబొమలు
బేడిసతళుకులబెడఁగుఁగన్నులును
దాడిమీబీజసుందరదంతములును 790
నిరుపమతిలపుష్పనిభనాసికలును
సురుచిరబింబవిస్ఫురితాధరములు
మించుటద్దములతో మెఱయుచెక్కిళ్లు
మంచివెన్నెలవంటిమందహాసములు
సలలితశ్రీకారసదృశకర్ణములు
నలరుశంఖములబాగలవడుమెడలు
బిసకాండములఁ దలఁపించుబాహువులు
కిసలయంబులవెంపు గెలుచుహస్తములు
కరికుంభములచెన్ను గలజన్నుఁగవలు
నరుదారఁ బిడికిట నడఁగుమధ్యములు 800

---

సింగిణి విండ్లన్ = చెఱకుతోఁజేయఁబడిన-అనఁగా మన్మథునిదైన-సింగాణి విండ్లను, చెనకెడుబొమలు=ఎదిరించెడు కనుబొమలు, బేడిసతళుకుల బెడఁగు కన్నులు=బేడిసచేఁపలవలె బెళుకులుగల అందమైనకన్నులు, దాడిమీ...దంతములును=దానిమ్మవిత్తులవలె అందమైనపండ్లు,నిరుపమ తిలపుష్ప నిభనాసికలు ను=సాటిలేని నువ్వుఁబువ్వునకు సమానమైన ముక్కులును,సురుచిరబింబ విస్ఫురిత అధరములు=మిక్కిలిసొగసైన దొండపండువలె ప్రకాశించునట్టి క్రిందిపెదవులును, మించుటద్దముతోన్ =కాంతిగలయద్దముతోసమముగా, మంచివెన్నెల= అచ్ఛమైన వెన్నెల. మందహాసములు=లేనగవులు-సలలిత శ్రీకార సదృశ కర్ణములు-మిక్కిలియొప్పిదమైన శ్రీ అను అక్షరముతోడ సమానములైన చెవులు, అలరు శంఖములబాగు=ఒప్పుచున్న సంకువుల చెలువు, అలవడు = అమరునట్టి, బిసకాండములన్ =తామరతూండ్లను, కిసలయంబుల పెంపు=చిగుళ్ల అతిశయమును, కరికుంభములచెన్ను=ఏనుఁగుకుంభస్థలముల అందము, అరుదు ఆరన్ = వింత నిండునట్లుగా, పిడికిట...మధ్యములు = పిడికిటిలోపల నిముడునడుములు-

సుడులకుఁ దెరువులు సూపునాభులును
గడఁగి సైకతములఁ గడచుపిఱుందు
లనఁటికంబముల గయ్యాళించుదొడలు
ననవిల్తుశరధుల నగెడుజంఘలును
బయలుదామరలఁ గీడ్పఱచుపాదములు
నయమారఁ గల్గి క్రొన్ననవిలుకాని
మరిగించుమోహనమంత్రదేవతల
మురువునఁ ద్రైలోక్యమోహినులైన
తరళలోచనల మతంగకన్యకల
నిరువురఁ బుట్టించి యిట్లని పలికె 810
మీరు విభ్రమములు మెఱయంగ నేఁగి

---

పిడికేఁడునడుము లనుట - మిక్కిలి సన్నని నడుములనిభావము, సుడులకున్ = నీటిసుళ్లకు, తెరువులు చూపు = విధములను దెలుపునట్టి - సుళ్లకు అవి యుండవలసిన తీరును జూపునట్టివనుట - సుళ్లకంటె నతిశయించినవైన యని భావము. సైకతములన్ = ఇసుకదిన్నెలను, కడచు = అతిక్రమించు - అతిశయించు, అనఁటికంబములన్ = అరఁటిబోదెలను, గయ్యాళించు = ధిక్కరించి పలుకు, ననవిల్తుశరధులన్ = మన్మథుని పొదులను, నగెడుజంఘలను = పరిహాసించుపిక్కలు, బయలుదామరలన్ = మెట్టదామరలను, కీడ్పఱచు = తక్కువపఱుచు, నయము = మెలపు - నైపుణ్యపుఁబచరింపు, ఆరన్ = పూర్ణముగా, క్రొన్ననవిలుకానిన్ = మన్మథుని, మరిగించు = మచ్చికపఱుచు - మన్మథునికి లోఁబడఁజేయునట్టి యనుట, మోహనమంత్రదేవతల మురువునన్ = మోహింపఁజేయునట్టి మంత్రమునకు అధిదేవతలైన వారివిధమున - ఆయామంత్రములకు అధిదేవత లుండునట్లు మన్మథుఁడు జగత్తును మోహింపజేయుటకై జపించుమంత్రమునకు అధిదేవతలై జగము నెల్ల వానికి లోఁబఱుచునట్టి వారివలెననుట, త్రైలోక్యమోహినులు = ముల్లోకములను మోహింపఁజేయువారు - తరళలోచనలన్ = బెళుకుకన్నులు గలవారిని, మతంగకన్యకలన్ -

సారవర్తను హరిశ్చంద్రునిఁ గాంచి
యాటలఁ బాటల నమృతంబు లొలుకు
మాటలఁ దేటల మరిపి మెప్పించి
యీరానివస్తువు లేమైన వేఁడి
కారించి తాలిమిఁ గలఁచి బొంకించి
చనుదెండు నావుడు సంభ్రమం బెసఁగఁ
బనిపూని కౌశికుపదముల కెఱఁగి
కలికిరాచిల్కలో కాయజునల్ల
గలువపూఁదూపులో కవ గూడి మెలఁగు 820
నీలంపుబొమ్మలో నెలఁత లై మించు
లాలితతాపింఛలతికలో యనఁగ
మదహంసగతులను మఱపించునడలఁ
గదులుమట్టెలు తాళగతులకుఁ దాఁక
రతినాయకునియాజ్ఞ లంతు గాఁ జాటు
గతి నందియలు గల్లు గల్లన మ్రోయ

---

మాలకన్నెలను, విభ్రమములు=విలాసములు, సారవర్తనున్ = మేలయిన నడవడి గలవానిని, మరిపి = మరిగించి, కారించి = బాధించి, తాలిమి=ఓర్పు-ధైర్యము, చనుదెండు=రండు, కలికిరాచిల్కలో=సొగసైనరాచచిలుకలో, కాయజు=మన్మథునియొక్క, నల్లకలువపూఁదూపులో=నల్లకలువల పూవులబాణములో, కవగూడి మెలఁగు=జోడుపాయక వర్తించునట్టి, నెలఁతలై = స్త్రీలై, తాపింఛలతికలో=చీఁకటిమ్రానుతీఁగెలో, మాతంగకన్యలను నలుపునుబట్టి నల్లకలువదూపులుగాను నీలంపుబొమ్మలుగాను చీఁకటిమ్రానుతీఁగలుగాను కవి వర్ణించుట తెలియునది. తాళగతులకున్ =తాళములగమనికలకు, తాఁకన్ =సరితాఁకగా, రతినాయకునియాజ్ఞ=మన్మథునియాజ్ఞను-అంతుగాన్ చాటుగతిన్ = బిగ్గఱగాచాటునట్లు-అందెలఘలంఘలధ్వనులు మన్మథునియాజ్ఞను చాటునట్లు మిక్కిలిమోహక

మొలనూళ్లగజ్జలమ్రోఁతకు రత్న
కలితకంకణములు గమకంబుఁ జూప
దంతకుందంబులతళుకులు మెఱసి
వింతగాఁ జెక్కుల వెన్నెలల్ గాయ 830
రాజిల్లునునుఁబట్టుఱవికెలమీఁదఁ
దేజమై నాణిముత్యపుఁబేరు లమరఁ
దెలిమోము లఱదోఁపఁ దిగిచినఁ గావి
జిలుఁగుముసుంగులోఁ జెంగల్వరేకు
లొనపరిగాఁ దోపి యున్నకల్హార
కుసుమగంధంబు లాగుబ్బుగా నొలయ
మృదులగోరోచనమృగనాభిసంకు
మదవిమిశ్రితవక్త్రమలయజతిలక
నవఘుర్మకణముల నఖరాంకురముల

---

రముగా నుండెననిభావము, రత్నకలితకంకణములు = మణులచే ఒప్పుచున్న చేతికడియములు, గమకంబు=తారకాణ, దంతకుందంబుల తళుకులు=మల్లెలవంటి పండ్ల తళతళకాంతులు, వెన్నెలల్=వెన్నెలవంటి తెల్లనికాంతులు, ఆణిముత్యపుఁబేరులు=సుప్పాణిముత్యాలసరులు, తెలిమోములు = తెలివిడిగాఁ బ్రకాశించుమొగములు, అఱదోఁపన్=సగము తెలియునట్లుగా, తిగిచిన = ఈడ్చిన-తొలఁగించిన, కావిజిలుఁగు ముసుఁగు-ఎఱ్ఱని సన్నముసుఁగు, చెంగలువ=ఎఱ్ఱగలువ, ఒనపరిగాన్=సొగసుగాన్, కల్హారకుసుమగంధములు=కొంచెము ఎఱుపును తెలుపును గలసినదై మిక్కిలిపరిమళము గలిగియున్న కలువపూల వాసనలు, ఆగుబ్బగాన్=అధికముగా, ఒలయన్ = వీవఁగా, మృదుల...కణములన్ - మృదుల= మెత్తనైన, గోరోచనా=గోరోజనముతోను, మృగనాభి = కస్తూరితోను, సంకుమద=జవ్వాజితోను, విమిశ్రిత = మిక్కిలికూర్పఁబడిన, వక్త్ర= మొగమునందలి, మలయజతిలక=చందనపుబొట్టునందలి, నవ=క్రొత్తగాఁబుట్టిన

నివురుచు సాంజననేత్రాంచలముల 840
సొలపునఁ బోవుచు సోలి యంతంత
నిలుచుచుఁ జనుదెంచి నృపవరుఁ గాంచి
రాజ హరిశ్చంద్ర రాజ దేవేంద్ర
రాజీవహితకులార్ణవపూర్ణచంద్ర
దిక్కులవా రెల్ల దేవర కీర్తి
వెక్కసంబుగఁ జెప్ప విని చూడఁ గోరి
పని విని నేఁడు మాభాగ్యంబుకతనఁ
గనుఁగొంటి మిటు భవత్కల్యాణమూర్తిఁ
దివిరి మీకృప నేర్చితిమి వీణె మీట
నవధారు నృప చిత్త మవధారు దేవ 850
యని సన్నుతింపుచు నాకళావేది
మనసువేడుక గని మాతంగసతులు
పవడంబు గలమంచిపసిఁడివీణియల
గవుసెనల్ వెడలించి కాంతి రాఁ దుడిచి
బాగుగాఁ గుచముల పై మోపి తగిన

---

ఘర్మకణములన్ = చెమటబొట్లను, నఖర+అంకురములన్ = గోటిమొనలతో, నివురుచున్ = పాయగీఱుచు, సాం... సొలపునన్ - సాంజన = కాటుకతోఁగూడిన, నేత్ర+అంచలముల = కనుఁగొలుకులయొక్క, సొలపునన్ = పారవశ్యమున, సోలి = బడలికచే నొఱగి, రాజీ... చంద్ర - రాజీవహితకుల = సూర్యవంశమనెడి, అర్ణవ = సముద్రమునకు, చంద్ర = పూర్ణచంద్రుఁడైనవాఁడా, వెక్కసంబుగాన్ = మిక్కిలిగా, పనివిని = వచ్చి, అవధారు = చిత్తగింపుము, కళావేది = సంగీతాదివిద్యలు దెలిసినవాఁడు, మనసువేడుక = మనస్సుయొక్క ఉల్లాసము, పసిఁడి = బంగారు, గవుసెనల్ = ఒఱలు, కాంతిరాన్ = మెఱుఁగువచ్చునట్లుగా, తగినరాగసంగతులకు = తగినట్టి రాగములయొక్క పొందికలకు - రాగములు ఒకటి కొకటి తగునట్లుగా పొందిక

రాగసంగతులకు రా సారె లొత్తి
తుదగోటికొనలఁ దంతులు గూడ మీటి
ముదమున జీవాళి మొరయఁ బుట్టించి
నవరత్నకాంతులు నన లొత్తఁ గ్రొత్త
రవలకంకణములరవరవ లెసఁగ 860
నలరునంగుళము లల్లార్చుచు వీణె
వెలయ వాయించి ప్రవీణతఁ జూపి
మఱి మయూరాదులు మహి నెలుఁగింపఁ
బరఁగుషడ్జాదిసప్తస్వరంబులును
గ్రామత్రయములు మూర్ఛనలు ముయ్యేడు
నాముప్పదియు రెండు నైనరాగములు
వానిమిశ్రంబులు వానిభేదములు
వానికి వేళలు వరుసతోఁ దెలిసి
తగ మంద్రమధ్యమతాళమానముల
మొగియుగాయకదోషములు దొలఁగించి 870
యాలాపములు సేసి యారాజుమీఁది

---

పడుటకు, సారెలు ఒత్తి=మెట్లు కుదిర్చి, జీవాళి=ప్రాణస్వరసమూహము, మొరయన్ =శబ్దించునట్లు, ననలొత్తన్ =పుట్టఁగా, క్రొత్తరవలకంకణముల=క్రొత్తవజ్రాలకడియములయొక్క, రవరవలు=శబ్దములు, అంగుళములు=వ్రేళ్లు, అల్లార్చుచున్ =ఆడించుచు, మయూర+ఆదులు=నెమిళ్లు మొదలైనవి, ఎలుఁగింపన్ =మాఱుశబ్దింపగా, షడ్జా...స్వరములు-షడ్జము మొదలైన ఏడుస్వరములు-షడ్జము మొదలైనవానికి వరుసగా నెమిళ్లు మొదలైనవి ఎలుఁగించుట తెలియునది, గ్రామత్రయములు=మూఁడుగ్రామములు, మూర్ఛనలుముయ్యేడు=స్వరముల ఆరోహణము మొదలుకొని అవరోహణముపఱకుఁ గలక్రమము లిరువది యొకటి. మంద్ర...మానములన్ -మంద్ర గంభీరస్వరము, మధ్య=మధ్యస్వరము, తాళమానములన్ =తాళములకొలఁదులందు, మొగియు = కలుగునట్టి, సూళ+ఆదులు =స్తోత్రములు

సూళాదు లింపుగ సాగియఁ బాడుటయు
నానవ్య మైనగీతామృతలహరి
నూని మహాశ్చర్య మొదవె నవ్వేళ
మొరయువీణాదండమును జిగురొత్తె
నిరుపమహారమాణిక్యముల్ గరఁగె
వలనుల వ్రాసినవన్నెచిత్రములు
దలలు గదల్చె చైతన్యతం బొదలి
క్షోణీవిభుండును క్షుధ దీరినట్లు
రాణించుటకు ననురాగంబు నొంది 880
వేయుభంగుల రసావేశంబు దాల్చి
మాయురే యని పలుమాఱును మెచ్చి
మరకతనీలనిర్మలపుష్యరాగ
వరవజ్రవిద్రుమవైడూర్యలలిత
కురవిందమౌక్తికగోమేధికములు
గర మొప్పుసొమ్ములు కనకాంబరములుఁ
జెలు వారునునుఁబట్టుఁజీరలు జీబు

---

మొదలైనవి, సాగియన్-హాయిగానుండునట్లు, నవ్యము = మనోజ్ఞము, గీతామృతలహరి = గానమనెడి అమృతప్రవాహము, వీణాదండమును= వీణకొయ్యయు, చిగురొత్తెన్ = చిగిర్చెను. నిరుపమ = సాటి లేనిది, వలనులన్ =దిక్కులందు, వన్నెచిత్రములు = రంగులతో వ్రాయఁబడిన చిత్తరువులు, చైతన్యతన్ =ప్రాణములకలిమి-ప్రాణములువచ్చినట్లు చిత్తరుబొమ్మలుతలలూఁచెనుట-ప్రోళ్లు చిగుర్చుట, మణులు కరఁగుట, చిత్తరువులు తలలూఁచుట ఆఁకలి తీఱుట మొదలైనవి గానమహత్త్వముచేఁ గలుగులక్షణములు, రాణించుటకున్ = ఒప్పుటకు, రసావేశము=రసపారవశ్యము, మాయురే = సెబాసు, కనకాంబరములు=సరిగవస్త్రములు, చెలువు ఆరు=అందము నిండు, నును కాంతిగల, జీబు

వలువలు వీడెంబు వన్నెపుట్టములు
భుగభుగ వలచుగర్పూరంబుఁ బునుఁగు
నగరుగంధముతో సమస్తంబు నిచ్చి 890
యాదరం బెసఁగఁ బొమ్మనుటయు నవ్వి
మేదినీవిభునకు మెలఁత లిట్లనిరి
'ఈరత్నభూషాదు లేటికి మాకు
నీరువట్టాఱునే నెయి ద్రావికొనిన
నింగితం బెఱుఁగని దేఁ జాణతనము
మంగళశృంగారమహిమావతార
దండితేజమున మార్తాండమండలము
మండుచున్నది నభోమధ్యభాగమున
మిట్టించి వేఁడిమి మిటమిట గాయఁ
గట్టెండతాఁకునఁ గమలె దేహంబు 900

---

వలువలు = కట్టుకోకలు, వీడెము = తాంబూలము, వన్నెపుట్టములు = పలురంగులవస్త్రములు, నీరువట్టు = దప్పి,నీరు...ద్రావికొనినన్ = నేయి రుచ్యముగానున్నదని త్రాగినయెడల దప్పి తీఱునా యనుట - నీవిచ్చినభూషణాదులు మేలయినవని తీసికొన్నయెడల నీయందలి మరులు మాకు తీఱునా యని భావము. ఇంగితంబు = మొగముజాడ, ఏఁజాణతనము = ఏమి నేర్పు-మోముజాడలను బట్టి లోపలి యభిప్రాయములను తెలిసికొనకుండుట నేర్పుకాదనుట. మంగళశృంగార మహిమ అవతార = మంగళకరమై శృంగారముయొక్క అతిశయముతోఁగూడిన పుట్టుకగలవాఁడా-మిక్కిలిశుభముగాను శృంగారరసోద్రేకముగాను ఉదయించినవాఁడాయనుట-ఇదిసాభిప్రాయశ్లేషము - [illegible] రాజరూపము తమకు శ్లాఘాజనక మగుట సూచించిరని తెలియునది. దండితేజమునన్ = మిక్కుటమైన ప్రకాశముతో, మిట్టించి = అతిశయించి, కట్టెండతాఁకు = మిక్కిలి యెండసోఁకు,

లడుగులఁ జిఱుపొక్కు లడరె వాతెఱలఁ
దడి లేదు మేనులఁ దాపంబు వొడమె
నడచిన నొడలఁ బ్రాణము లుండ వింక
గొడు గిచ్చి రక్షింపు కువలయాధీశ
యుచితసవాలక్ష లొండొల్ల మేము
పచరణ గాదు మీపాదంబులాన
యని పల్క మనసు నెగ్గని విర్గి రోసి
మనుజేశుఁ డామాలమగువల కనియె
మును సిరి వచ్చిన మోఁకాలి నొగ్గు
ననువున నాత్యాగ మందక మీరు 910
పొం దెఱుంగక వేఁడఁ బోలునే పొసఁగ
నందనిఫలముల కఱ్ఱులు సాఁప
నొనర మహారాజయోగ్యంబు లైన
వినుతవస్తువు లేడ విద్యవా రేడ
లేరో విద్యలవారు లేరో భూనాథు
లీరీతి వేఁడిరో యిచ్చిరో తొల్లి

చిఱుపొక్కులు = చిన్నపొక్కుటలు, వాతెఱలన్ = పెదవులందు, కువలయాధీశ = భూనాథా, పచరణ = నటన, విర్గి = విఱిగి - మనస్సువిఱిగి, ఒగ్గు = చాఁచు, మును.......ననువునన్ = మునుపులక్ష్మిరాఁగా మోఁకాలినిచాఁచి త్రోసిపుచ్చినట్లుగా, త్యాగము = ఈవి - నేనిచ్చినభూవణాదికము, పొందు=ఔచిత్యము, 'పొసఁగ నందనిఫలముల కఱ్ఱులు సాఁపఁ బోలునే' అవి యన్వయము - చేతికి చక్కఁగా నందనిపండ్లకు మెడలు చాఁచుట యొప్పునాయనుట. రాజయోగ్యములు = రాజులకేతగినది, వినుతవస్తువులు =పొగడఁదగిన ఛత్రము మొదలైనపదార్థములు, విద్యవారు= గానాదివిద్యలు

గోరెడివారికిఁ గొఱఁత లెం దుండు
నీరానివస్తువు లీరాదు గాన
తనుతాపములు మాన్పఁ దని వైనవానిఁ
గొనుఁ డిత్తు నీవెలిగొడుగును దక్క 920
ననుటయు నామాట కలరి యారాజు
గనుఁగొని మాతంగకన్య లిట్లనిరి
'కమలినీ మలయజ కర్పూర హార
కమనీయ కల్హార కదళీ మృణాళ
హిమజల వాలుకా హిమకర కాంత
కుముదాప్త చందనకుధరసమీర
ధారాగృహాదులదనువునఁ గొంత
వారింప వచ్చు దివాకరువేఁడి
దిరముగాఁ గరసానఁ దీడినవాఁడి

---

నేర్చినవారు, కోరెడి... లెందుండుర్ =యాచించువారికి తక్కువలెక్కడను గలిగియేయుండును;అట్లు గలవని నోరికివచ్చినట్లు అడుగవచ్చునాయనుట, తను తాపములు = దేహతాపములు, తనివైనవానిర్ =తృప్తికరమైనవానిని, వెలిగొడుగు=శ్వేతచ్ఛత్రము, మాతంగకన్యలు = **మాలపడుచులు**, కమలినీ...గృహాదులు-కమలినీ=తామరతూండ్లు, మలయజ=చందనము, హార = ముత్యాలహారములు, కమనీయ = మనోజ్ఞమైన, కల్హార=ఇంచుకయెఱుపును తెలుపును గలసి పరిమళించుగలువలు, కదళీ=అరఁటులు, మృణాళ=తూండ్లు, హిమజల=పన్నీరు, వాలుకా = ఇసుక, హిమకరకాంత = చంద్రకాంతశిలల్తు, కుముదాప్త= చంద్రుఁడు, చందనకుధరసమీర = మలయపర్వతమునుండి పొలయుగాలి, ధారాగృహము = గొట్టములు మొదలైనవానిచే జలధార లొలికెడుగృహము చేత, దివాకరువేఁడి=సూర్యునిఉష్ణము,కరసాన=రత్నాలుసానఁబట్టెడి చక్రా

మరునిపూఁదూపుల మర్మముల్ గాఁడి 930
విరవిరఁ బోవుచు విరహాగ్నిఁ గుందు
కరిగమనలకు నీకౌఁగిటిపొందు
గళకలరవగతి గతులకు విందు
బలియుతాపము డిందుపడ నదే మందు
నృపవర సూనృతనియతిఁ బెం పొందు
నెపమున మముఁ బొందు నీ కిదె సందు'
అనిన వీనులు మూసి యమ్మహీవిభుఁడు
గనలుచు నానీచకాంతల కనియె
విద్యావా రని మిమ్ము విడనాడ కున్న
మద్యపానమున మైమఱచి పల్కెదరు 940
మిముఁ జూడఁగా రాదు మిము ముట్ట రాదు
మిముఁ బొందు మన నెట్లు మీకు నో రాడె
నడుగ వచ్చినఁ జంద మణుమాత్ర మైనఁ
బొడమదు మీయందు బుద్ధి నూహింపఁ

కారమైనసాన, తీడిన = సానఁబట్టిన, మరునిపూఁదూపులు=మన్మథుని పుష్ప బాణములు, కాఁడి = గ్రుచ్చుకొని, విరవిరఁబోవుచుఁ = విలవిలఁబోవుచు, గళకలరవగతిగతులకున్ = అవ్యక్తమధురములైన రతికూజితములగమనికలకు, విందు = విందువలె మిక్కిలిఆప్యాయనమైనది - గళకలరవములకుమిక్కిలి సుఖహేతువైనదనుట, బలియుతాపము= అతిశయించుచున్న మన్మథతాపము, డిందుపడన్ =ఉపశమించుటకు, అదేమందు=అదియే ఔషధము-అనఁగాతీర్చునట్టిదియనుట. నెపమునన్ =సాఁకున-మాలకన్నెలతోనినుబోఁటికిఁగూడరాదు గనుక మాకోరినదియిచ్చుట యనునెపమున మమ్ముఁబొందుమనుట. విద్యావారు= విద్య నేర్చినవారు, పొడమదు=పుట్టదు, వాలినకిన్కమైన్ = అతిశయించిన

గరుణామై నీతప్పుఁ గాచితి నింక
నరుగక దుర్భాష లాడితి రేని
వాలినకిన్కమై వాలునీవాఁడి
వాలున జిహ్వలు వాలుతు ననినఁ
జందనగంధులు చలము రెట్టింప
మందెమేలమున నమ్మనుజేశుఁ డున్న 950
సురపొన్ననీడకు స్రుక్కక డాసి
సరసకేళీసరోజములు ద్రిప్పుచును
దివిరి క్రేఁగన్నులదీప్తులు నిగుడ
శ్రవణభూషణములు సక్కఁ ద్రోయుచును
గమనీయకక్షభాగద్యుతు లెసఁగఁ
గోమరారు మొగలిరేకులఁ జెక్కుకొనుచు
మెఱుఁగుఁజన్నులు దోఁప మించుపయ్యెదల
చెఱఁగులు దీసి లేఁజెమట లార్చుచును
వాలారుకొనగోళ్ల వన్నెలు నిగుడ
నీలాలకంబులనెఱులు దీర్చుచును 960
జిందులు ద్రొక్కుచుఁ జెలఁగి నవ్వుచును

---

కోపముతో, వాలు నీవాఁడివాలునన్ =అతిశయించుచున్నయీవాఁడికత్తితో, వాలుతున్ =కోసిపడవైతును. మందెమేలమునన్ =చనవుతో, స్రుక్కక= వెను దీయక, సరసకేళీసరోజములు = సొగసైనలీలాకమలములు, క్రేఁగన్నులదీప్తి =కడగన్నులకాంతి, కమనీ...ద్యుతులు=మనోహరములై చంకపట్టులకాంతులు-చేయెత్తిమొగలిరేఁకులు చెక్కుకొనునపుడు చంకలమెఱుఁగులు నిగిడింతు రనుట. వాలారు=వాఁడి, వన్నెలు = కాంతులు, నెఱులు=వక్రతలు, చిందులుద్రొక్కుచున్ =నర్తనములుసేయుచు, చెలఁగి=కేరి, క్రందుగాన్ =దొమ్మిగా,

గ్రందుగాఁ గరతాళగతుల నాడుచును
బహువిధవిభ్రమభంగు లేపార
మహనీయయౌవనోన్మాదంబు దనర
నటి గ్రమ్మి మఱియు నిట్లనిరి నరేంద్ర
గిటిగొన్నప్రేమ భోగినులఁ గామంబు
వెలయంగఁ గైకొని వివిధసౌధములఁ
జెలువారుచున్న పసిండియుయ్యెలలఁ
బరఁగ నాగర కూర్మ పద్మక ప్రముఖ
సురతబంధంబుల సొరిదిఁ బెనంగి 970
కళ లున్నగుఱుతులఁ గరఁచి చొక్కించి
వెల లేనిసుఖములు వేడ్కఁ గైకొనుఁడి
యీతడ వేటికి నీతిఁ గెయింటి
కేతేర నిది వేళ యేల రా వనుచు
వరమణిముద్రికావలయ కేయూర
సురుచిరం బగుమహీశునివల కేలిఁ
బల్లవకోమలపాణిపద్మముల

విభ్రమభంగులు=విలాసప్రకారములు, మహనీయ యౌవన ఉన్మాదము=మంచి యౌవనమువలని వెఱ్ఱి-యౌవనంపుమిడిసిపాటు, అటిగ్రమ్మి = అడ్డముగా నిలిచి గిటిగొన్నప్రేమన్ = స్థిరమైనప్రీతితో, భోగినులన్ = భోగమువారిని, సౌధము=మేడ, నాగర... బంధములు-నాగరము, కూర్మము,పద్మకము, మొదలైన రతికేళిబంధములు. సొరిదిన్=క్రమముగా, పెనంగి=రతిక్రీడ సలిపి, కళలున్న గుఱుతులన్=కళాస్థానములను, వరమణిముద్రికా=మేలయిన రతనాలుమిద్దె టుంగరము, వలయ=కడియము, కేయూర = బాహుపురులు, వీనిచేత, సురుచిరము=మిక్కిలిఅందమైనది, వలకేలు=కుడిచేయి, పల్లవకోమలపాణిపద్మము

నల్లన దెమలింప నాస సేయుటయుఁ
దెలిదమ్మిరేకులఁ దెగడునేత్రములఁ
జిలుఁగుఁగెంౘదమ్ములజిగి దొంగలింప 980
సైరణ దొఱఁగి పిసాళిమాలెతల
వారింతు నని పూని వసుమతీవిభుఁడు
బాలనాగముఁబోలెఁ బరఁగుపసిండి
గీలుసమ్మెటఁ గేలఁ గీలించి సతుల
తనువులు జర్జరితములు గా వ్రేయఁ
గని సంభ్రమంబునఁ గదియ నాలోన
చేవట్టి సమ్మెటఁ జెలసి రాఁ దిగిచి
పోవైచి కార్యంబు బుద్ధి నూహించి
క్షితినాథుతో సత్యకీర్తి యత్తటిని
జతురవాక్యప్రౌఢి సంధిల్లఁ బలికె 990
నోహో నరేంద్ర నీ కుచితమే యిట్టి
సాహసకృత్య మీసతులపైఁ జూనుప
విరిసి మైఁ దూఁగునీవెలఁదులజడలు
బెరయువిరోధులపీలిజల్లెడలె

లన్ = చిగుళ్లవలె మెత్తనైనచేయిఁదమ్ముల చేత, తెమలింపన్ = పట్టుటకు, తెలిదమ్మి = తెల్లతామర, తొంగలింపన్ = అతిశయింపఁగా- తెల్లదామరలవంటి కన్నులు ఎఱ్ఱదామరలవలె కోపమున నెఱ్ఱఁబాఱినవుట. పిసాళిమాలెతలు = దొంగయెత్తుగలమాలకన్నెలు, బాలనాగము = పిల్లపాము, పసిండికీలుసమ్మెట = కీల్లుగలబంగారుకళ- అనఁగా చేతుకోల- జాటి. కీలించి = ఉంచి, జర్జరితములుగా = శిథిలమగునట్లుగా, చెలసి = ఒడిసి, సంధిల్లన్ = ఒనగూడఁగా, బెరయు = మాఱ్కొను, పీలిజల్లెడలె = పికిలిపిట్టల ఱెక్కలకుంచెలు గల చామరములా,

నెఱి మించువీరల నెలవంకబొమలు
మెఱయునరాతులమేలిసింగిణులై
పరఁగ నీయింతులపటుకటాక్షములు
పరులు నీపై నేయుబాణజాలములై
గరిమతో వీరలకర్ణపత్రములు
సరవిఁ ద్రిప్పెడురిపుచక్రాయుధములై 1000
వలపులు గుల్కు నీవనితలమెడలు
వెలయువిద్వేషులవిజయశంఖములై
పెరిఁగి క్రొవ్వినవీరిబిగిచన్నుఁగవలు
పరఁగ నీశత్రులు పాటించుగిరులై
సడలి తూఁగాడెడిసతులపయ్యెదలు
బెడిదంపుమార్తురబిరుదుటెక్కెములై
యనఘ వీరలనాభు లరులు నీ కెగ్గు
లొనరించునభిచారహోమగుండములై
మిసమిస మనువీరిమెఱుఁగుఁబెందొడలు
గసిమసంగెడువైరికరటితుండములై 1010
రూపింప వీరివట్రువచిఱుదొడలు
నీపరిపంథులనీలికాహళులై

---

నెలవంకబొమల = లేఁతచంద్రునివలె వంకరగానుండు కనుబొమలు, అరాతుల = శత్రువులయొక్క, సింగిణులే = సింగిణిబద్ధవిండ్లా, కర్ణపత్రములు = చెవికమ్మలు, సరవిన్ = ఒప్పుగా, రిపు = శత్రువు, వలపులు = సొగసులు, తూఁగాడెడి = తూఁగియాడెడి - అల్లలాడెడియనుట, బెడిదంపుమార్తుర = భయంకరులైన శత్రువులయొక్క, అరులు = పగవారు, అభిచారమనఁగా పగవానిని మడియించుటకైన హోమక్రియావిశేషము, కసిమసంగెడి = వీర్యముఅతిశయించునట్టి, కరటితుండములె = ఏనుఁగుతొండములో, పరిపంథులనీలికాహళులై = శత్రువులనల్లకాహ

యుడరునీపడఁతులయందెలమ్రోఁత
కొడరునీపగతులదుందుభిధ్వనులె
యర్థులు గాని ప్రత్యర్థులు గారు
పార్థివేశ్వర వీరిపైఁ గోప మింక
వల దని చెప్పి మావంతుఁ డేనుఁగును
మలఁగించుగతి మంత్రి మరలించె విభుని
దలఁపులోఁ బాయక దలకొన్న యలుకఁ
దెలుపుచుఁ జంద్రమతీదేవి వలికె 1020
నిది యేమి నాథ నీహృదయంబు లోన
వెదకి కార్యంబు వివేకింపఁ జూడ
వాపైఁడిమృగ మేడ యడియాస లేడ
యీపుష్పవన మేడ యెలనాగ లేడ
కలుగునే మాతంగకన్యల కిట్టి
లలితవిభ్రమనవలావణ్యమహిమ
యేయుపాయంబుల నిది నమ్మరాదు
మాయురే కౌశికుమాయ గాఁబోలు
గురునివాక్యము తలకూడెనో యేమొ
పొరిది న[illegible]క చూడఁ జూడ నెల్లెడలఁ 1030
బనుగొని బహుమహోత్పాతంబు లొదవె

---

శవాద్యములా, దుందుభిధ్వనులె=భేరీశబ్దములా, అర్థులు=యాచకులు, ప్రత్యర్థులు=శత్రువులు, మావంతుఁడు=మావటివాఁడు, తలంపులోన్ = మనస్సునందు, తలకొన్న=కలిగిన, లలిత...మహిమ-లలిత=మనోజ్ఞమైన, విభ్రమ = విలాసముగల, నవ=క్రొత్తయైన, లావణ్య = ముత్తెపుతేటవంటికాంతియొక్క, లేక సౌందర్యముయొక్క, మహిమ=అతిశయము, తలకూడెనో=ఒనగూడెనో,

ననుచుండ నబ్బోటు లచ్చోటు వాసి
నెరసినయలకలనెఱులుఁ జిక్కొదవి
విరిసినజడలును విన్ననై మురువు
వాడినమోములు వన్నెయుఁ దూలి
వీడినవలువలు విరవిరఁ బోయి
తూలెడుమేనులుఁ దునిసి ముత్యములు
రాలెడుసరులును రాగంబు దొఱఁగి
వ్రేలెడుపెదవులు విభ్రమం బెడలి
సోలెడుచూపులు జొబ్బిల్లఁ గరఁగి 1040
కఱఁగినపూఁతయుఁ గంపుసొం పేది
నలఁగినవిరులును నలిఁ గపోలముల
వడిసినకన్నీరు వడియునెత్తురులఁ
దడిసినఱవికలుఁ దామఁ జూపఱకు
జొత్తుపావలఁబోలె శోకంబు నిగుడ
నత్తఱి నేడ్చుచు నరిగి కౌశికుని
యడుగులఁ బడి మేను లందంద వడఁక
నుడుగక వగచుచు నుర్వీశుఁ డలిగి
వరువుల నడిచినవడువున నేలఁ

---

పసుగొని-స్థిరముగా, నెరసిన=వ్యాపించిన, నెఱులు=వంకరలు, విరిసిన=ప్రిదిలిన, మురువు వాడిన=అందముకుందిన, వన్నెయుఁ దూలి=రంగుతగ్గి, తూలెడు=సోలెడు, రాగంబు=ఎఱుపు, సోలెడు=సొలసివ్రాలెడు, జొబ్బిల్లన్ =నిండారఁగా, కంపుసొంపు=వాసనయొక్క అతిశయము, ఏది=మాలి, జొత్తుపావలు=దేహమందు నెత్తురుదేఱుచున్న లేఁతబిడ్డలు, వరవులన్ =దాసికత్తెల, అడిచినవడువునన్ = కొట్టినవిధమున, కసి=తీట, మిట్టిమీనై=చేఁపవలెమిట్టిపడి,

బొరలఁ జేతులకసి వ్రేవంగ నడిచి 1050
దిక్కెవ్వ రట చెప్పి తెం డన్న మాకు
దిక్కు నీ వని చను దెంచితి మనిన
నలుకమై మిట్టి మీనై పడి కెరలి
వలచేతిజపమాల వసుధపై వైచి
ముఱముఱ మని బొమల్ ముడిపాటు గదురఁ
జుఱచుఱ నిప్పు లక్షుల నుప్పతిల్లఁ
పొటపొట చెమట మైఁ బొడమ నాసికయుఁ
బుటపుట గటములుఁ బొరిఁబొరి నదర
మొగమున జేవురుమురువు నటింప
భుగభుగ నిగుడునూర్పులపొగ లెగయఁ 1060
గటకటఁ బడి యౌడు గఱచి హుమ్మనుచుఁ
దటముఁ దాటించి చిందఱ రేఁగినట్లు
వేఁడివేలుపు డిగి వెచ్చి ద్వీపంబు
లే డేర్చురీతి నింతిం తన రాని
పటురౌద్రరేఖ చొప్పడ ముడి వీడి
కుటిలజటావలి గునిసి తూఁగాడ
బ్రమిసి యచ్చటిమునిప్రవరులు వడఁకఁ
దిమిరి దండము కేలఁ ద్రిప్పుచు లేచి

---

కెరలి=విజృంభించి, ముడిపాటుగదుర=ముడిపడఁగా, కటములు=చెక్కులు, జేవురు=ఎఱుపు, ఔడుగఱచి=క్రింది పెదవికొఱకి, తటముదాఁటించి=మితిమీఱు నట్లుగా, చిందఱరేఁగినట్లు=ఆవేశ మెత్తినట్లు, వేఁడివేలుపు=సూర్యుఁడు, వెచ్చి=తపింపఁజేసి, ఏర్చురీతిన్=కాల్చువిధమున, రేఖన్=విధమున, కుటిల=వంకరలైన, జట=ఆవలి-జడలసమూహము, తిమిరి=విజృంభించి, ఫాలనేత్ర=నెత్తికంటియొ

ఫాలనేత్రాభీలపావకజ్వాల
లోలిఁ గ్రాలఁగ శూల ముద్ధతిఁ బూని 1070
ఘూళి గా భువనపంక్తులఁ గాల్పఁ గడఁగు
కాలరుద్రుఁడో లయకాలుఁడో యనఁగ
మూఁడగ్నులును మునిమూర్తి యైనట్లు
వాఁడి తేజముతోడ వచ్చు కౌశికునిఁ
గనలెడు తెంపు మొక్కలమును జలముఁ
గనుఁగొని చిత్తంబు గలఁగి భూవిభుఁడు
ము ప్పగురాజ్య మిమ్మునిచేత మనకుఁ
దప్పదు బ్రహ్మశతం బడ్డపడిన
ననుచుఁ దేవియుఁ దాను నతిభీతి నెదురు
చని బహురత్నపుష్పములఁ బూజించి 1080
మ్రొక్కిన దట్టించి మునినాథుఁ డతనిఁ
దక్కక దల వట్టి తన్నెఁ దన్నుటయు
నదరక బెదరక నాత్మలోఁ దాల్మి
వదలక వగవక వనజాక్షకులజుఁ
డనఘాత్మ నీకోమలాంఘ్రిపద్మము
ఘనవజ్రమకుటసంగత మైనయట్టి
నామస్తకంబు మిన్నక సోఁకి నొచ్చె

---

కక్క, ఆభీల=భయంకరమైన, పావకజ్వాలలు=అగ్ని సెగలు, భువనపంక్తులు=లోకసమూహములు, లయకాలుఁడో=ప్రళయకాలపుయముఁడో, కనలెడు తెంపు=కోపాతిశయము, మొక్కలమును=ముష్కరత్వము-మోటుఁదనము, ముప్పగు=నాశమగును, బ్రహ్మశతంబు=నూఱుబ్రహ్మలు, దట్టించి=అదల్చి, తాల్మి=ఓర్పు, కోమల అంఘ్రిపద్మము=మెత్తని అడుగుఁదామర, ఘనవజ్రమకుట సంగతము= గొప్పదైనమగరాలు చెక్కినకిరీటముతోఁ గూడినది, మస్తకము= తల, మొఱఁగులు=

నేమిత ప్పొదవె నాయెడఁ జెప్పు మనిన
గిటగిట పండ్లను గీటి కౌశికుఁడు,
చిటచిట మిడుగుర్లు చెదర వీక్షించి 1090
మ్రొక్కులుఁ జిక్కులు మొఱఁగులు నక్క
తక్కులు నీవట్టితానకంబులును
గొలుపవు మాయెడఁ గుటిలవిచార
తలపోయ నొకపాదతల మన నేల
కలయంగ నిఖిలాంగకంబులు నొచ్చెఁ
దులువ నీచేసినదుండగంబులను
విచ్చలవిడి వేఁట విపినభూములకు
వచ్చి పోవరె తొల్లి వసుమతీవిభులు
చలమున మునులయాశ్రమములఁ జొచ్చి
చెలఁగి యిట్లుపహతి సేయరు గాక 1100
వదలక బంగారువంటినాయిట్టి
నదటు దూలఁగ నేసి యరిగాఁపుతోఁట
మరిగి చొచ్చినయట్లు మత్తపోవనము
సురుఁగక చొచ్చి కాసుకు నన్నుఁ గొనక
నాపెంపుఁగూఁతుల నలినలోచనల

---

వదరులు, నక్కతక్కులు=నక్కలు సేయునట్టిజిత్తులు, వట్టితానకములు=వ్యర్థపు మండీలు-మండికూర్చుండి ప్రార్థించుటలనుట. కొలుపవు = పనికిరావు, పాదతలము=అడికాలు, తులువ=పలుగాకి, దుండగము=ధూర్తత్వము, ఉపహతి = ఉపద్రవము, అరిగాఁపుతోఁటన్ =పన్నుగట్టువానితోఁటను,సురుఁగక = వెనుదీయక, కాసుకు నన్నుఁ గొనక =నన్ను కాసంతకూడ సరకుసేయక, పెంపుఁగూఁతులన్ = పెంచినకూఁతుండ్రను, నలినలోచనలన్ = తామరలవంటికన్నులు గలవా

నీపోఁడిమగువల నీపువ్వుబోండ్ల
నడుగ వచ్చినవారి నక్కటా యనక
కడు నల్గి గజిబిజి గాఁగ మోఁదితివి
మెచ్చు మింగిత మన్న మేకొని పోరి
మచ్చెకంటుల నేఁచుమగఁటిమి యేల 1110
బలిమిమై నార్చి నీబలములు పేర్చి
యలబలంబు గఁ జొచ్చి యరఁటులు వ్రచ్చి
రావులఁ గొట్టి వారణములఁ గట్టి
మావులఁ బట్టి క్రొమ్మావులఁ గట్టి
యుటజపంక్తులఁ జొచ్చి యూపముల్ గ్రొచ్చి
వటముల మెట్టి తీవల నూఁగఁ గట్టి
తలిరుల రాల్చి పత్రంబుల డుల్చి
యలరు లవల్చి కాయలఁ జెడ నుల్చి
ఫలరసంబులఁ గ్రోలి బావులఁ దేలి
కలయ జున్నుల రేపి ఖగములఁ జోఁపి 1120
కలయఁ గ్రేఁపులఁ బాఁడికపిలల వీడి
లలిఁ గ్రొవ్వి కందమూలంబులఁ ద్రవ్వి
పలుగాకులై బహుభంగుల నిట్లు

---

రిని, పోఁడిమగువలన్ = అందకత్తెలను, మెచ్చుమింగితమన్నన్ = మాయింగితమును మెచ్చుకొనుము అనగా, మేకొని=పూని, పోరి=కలహించి, ఏఁచుమగఁటిమి=బాధించుపరాక్రమము, నీబలములు= నీసైన్యములు, పేర్చి= విజృంభించి, అలబలంబుగన్ =కలకలముగా, రావులన్ =రాగిచెట్లను, వారణముల్ =ఏనుఁగులను, మావులన్ =మామిడిచెట్లను, ఉటజపంక్తులు=గుడిసెలవరుసలు, తలిరులు= పూవులు,ఖగములన్ =పక్షులను,క్రేఁపులన్ =దూడలను,పాఁడికపిలలన్ =పాఁడికపిలయావులను, పలుగాకులై = ధూర్తులై, పులుగాకులు = ఉపద్రవములు,

పులుగాకు లోనరింపఁ బోలదే మాన్ప
బలుగాలియును జండభానురశ్మియును
బొలయ లోఁగెడుమత్తపోవనంబునకు
నోపి నీవెక్కడనుండి వచ్చితివి
భూపకీటమ వేరుపురుగ వైతీవు
నెఱిఁగెదు గాక నేఁ డింక నాకొలఁది
కొఱవి నౌదలఁ గోకికొంటివి క్రొవ్వి 1130
నీ వేమి చెప్పిన నీకు నిచ్చకము
గా వినుతించుచుఁ గడుపుఁగూటికిని
బాయక నీయింట బడువనై పనులు
సేయుచు నుండ వసిష్ఠుండఁ గాను
నీమిట్టిపాటును నీరాజసంబు
నీమదంబును నుబ్బు నేలతోఁ గలయ
నలి మృత్యుముఖ మైననాదృష్టివీథిఁ
బొలసితి విం కెట్లు పోయెదు బ్రతికి
యలవుమై నీకు సహాయమై వచ్చు
బలములఁ దోలుదోత్త భస్మీకరింతు 1140

---

చండభానురశ్మి=సూర్యకిరణము, పొలయన్ = వ్యాపించుటకు, భూపకీటమ=రాచపురువా - పురువువలె నీచుఁడవగురాజా, వేరుపురుగవు=పురువు చెట్టువేరు దిని దానిని నశింపఁజేయునట్లే మాయాశ్రమమును అడుగంట నాశము సేసినవాఁడ వనుట. ఔదల=నడితల, బడువ=దుష్టుఁడు, మిట్టిపాటు=మిడిసిపాటు, రాజసము=గర్వమున్, మృత్యుముఖ మైన నాదృష్టివీథిన్=మృత్యువునోరివంటి దైన నా చూపుదారిని, పొలసితివి=చిక్కితివి, అలవుమైన్=శక్తితో, కుదియింతున్=అడంతును, తామరచూలి=బ్రహ్మ, తలఁకు=భయము, బాసటై=తోడై, బీరంబు=

నది విని తా నడ్డ మై వచ్చె నేని
కుదియింతు పిదప నీగురునిదర్పంబు
నామునికై పూని యరుదెంచె నేని
తామరచూలికిఁ దలఁకుఁ బుట్టింతు
నావిరించికి బాస యై నిల్చె నేని
గోవిందుబీరంబుఁ గొల్ల లాడింతు
నాసరోజాక్షునికై రేఁగె నేని
వాసుకికంకణు వశము గావింతుఁ
గా దని నీవిట్లు గారింప మఱియుఁ
మీఁదు గల్గినవారి మ్రింగుదు ననుచు 1150
విలయకాలమునాఁడు వెలయుసూర్యులకుఁ
గలప్రతాపంబును గాలకూటమున
బలిసినచుఱుకును బడబాగ్నిశిఖలఁ
దలకొన్నవేఁడియు దంభోళిధారఁ
గలిగినవాఁడియుఁ గాలదండమున
నలరెడుబెడిదంబు నలవీరభద్రు
ఘనతరరౌద్రరేఖయు నైక్య మంది
మునిరూపమునఁ బేర్చి మూఁడులోకములఁ
బెనఁచి పొంపిరి గాఁగఁ బెడచేత వ్రేయ

---

=పరాక్రమము, కొల్లలాడింతున్=చూఱపుత్తును-పోఁగొట్టుదుననుట, వాసుకికంకణున్=శివుని, కాలకూటమునన్=హాలాహలవిషమునందు, బలిసినచుఱుకును=అతిశయించిన వేండ్రమును, తలకొన్న=కలిగిన, దంభోళిధారన్=వజ్రాయుధపువాదరయందు, కాలదండమునన్ = యమునిదండాయుధమునందు, బెడిదంబు=భయంకరత్వము, పేర్చి=విజృంభించి, పెనఁచి=ఒకటిగా పెనఁచి, పొం

మొనసి హుమ్మనఁగ మోమున మంట లెగయ 1160
నున్నవిశ్వామిత్రునుగ్రతేజమునఁ
గన్నుల మిఱుమిట్లు గవిసి దిమ్మెసఁగి
వారక తలపోయ వాక్రువ్వఁ జాల
నేరక రావేల్పు నిలిచినరీతి
నిలిచినభూపాలు నివ్వెఱపాటుఁ
దెలియుట నుచితోపదేశంబు సేసి
హితవు గావింప నాకిది వేళ యనుచు
మతిలోన నూహించి మంత్రి యిట్లనియె
'జగదీశ నీ వాకజడుని చందమున
గగనంబు పైఁ గూలఁగాఁ దలంచెదవు 1170
నెగు లొందినప్పుడు నెఱిఁ దూల పోక
వగవక విద్యలు వదలక తన్ను
మఱవక వెఱవక మాట వాతప్పి
తఱలక విసువక తాలిమి గలిగి
యోపినరీతిఁ బ్రియోక్తుల నెదిరి

---

పిరిగాఁగ =ముప్పిరిగా, పెడచేతఁ = వెనుక చేత, మొనసి=ఉద్యుక్తుఁడై- ప్రళయసూర్యులప్రతాపము మొదలైనవి ఒకటిగాఁ గూడి ఋషియాకార మెత్తి మూఁడులోకములను ఒకటిగా పెనఁచి కట్టి పెడచేత వ్రేయఁ జూచినట్లు విశ్వామిత్రుఁడు గనఁబడెననుట, దిమ్ము=తిరుగుడు-భ్రమ, వ్రాక్రువ్వఁ = చెప్పుటకు, రావేల్పు=ఱాతి దేవవిగ్రహము, నివ్వెఱపాటు=మిక్కిలి భయపడుట, గగనంబు... తలంచెదవు= ఆకాశము పయిని పడ్డట్లు తలంచుచున్నావు, నెగులు= బాధ, నెఱి=పాడి-నీతి-లేక క్రమము, దూలపోక=చిన్నఁబోక, మాటవాతప్పి= నోట మాట తప్పి, తఱలక=తొట్రుపడక, తాలిమి=ఓర్పు, ఏచినయాపద=విజృం

కోపము వదిలించి కుశలంబు మీఱ
నేచినయాపద నెరియక తన్నుఁ
గాచుకోఁదగు దైవగతి యటమీఁద
స్ఫుటరోష శేషాహిఫూత్కార ఘోర
చటులవిషానలజ్వాలలకంటెఁ 1180
గుపిత కౌశికుపటుకుటిలకఠోర
విపులశాపాగ్నుల వేఁడిమి ఘనము
కిన్నరగంధర్వ గీర్వాణ యక్ష
పన్నగ రాక్షసపతు లితఁ డన్న
జలదరింపుదు రుర్వి జను లన నెంత
పలుకుల కెడ లేదు ప్రార్థింపు మనినఁ
దెలివొంది మదిలోనిదిమ్ముఁ బో విడిచి
వెలయఁ జేతులు మోడ్చి విభుఁ డిట్టు లనియె
దీనవిధేయ గాధేయ మీ కిన్క
మాని నాదెసఁ గృపామతిఁ జూడు మింకఁ 1190
బెఱికి బ్రహ్మాస్త్రంబు పిచ్చుకమీఁద
నురవడి సంధింప నుచితమే యకట
ఖేదంబు మనసునఁ గీల్కొన్న వేళ

---

భించిన విపత్తు, స్ఫుట... జ్వాలలు=ప్రకాశమానమైన కోపముగల ఆదిశేషునియొక్క ఫూత్కృతులచే భయంకరమైనగొప్పవిషాగ్ని యొక్క సెగలు, కుపిత... వేఁడిమి=కోపమునొందిన విశ్వామిత్రునియొక్క మిక్కిలి వక్రస్వభావముతోఁ గూడినవై కఠినములై మిక్కిలియగు శాపాగ్నులవేఁడిమి, ఘనము=హెచ్చు, జలదరింపుదురు=వడఁకుదురు, ఉర్విజనులు అన నెంత=భూప్రజలనఁగా ఎంతమాత్రము. ఎడ లేదు=అవకాశములేదు, దీనవిధేయ=దీనులైనవారికి వశమైనవాఁ

నీదృష్టిపథమున నిల్చి భాషింపఁ
గమలారిధరుఁడనో కమలనేత్రుఁడనో
కమలసంభవుఁడనో కమలమిత్రుఁడనో
తనయుండు చేసినత ప్పొనగూర్చి
జనకుఁ డేగతి నైన సైరింప వలదె
సురుఁగక వంటయిల్ సొచ్చినశశముఁ
గరుణసేయక కూరగా వండఁ దగునె 1200
పఱతెంచునీశాపభద్రకాళికిని
వెఱచి మీ మ్మభయంబు వేఁడుచున్నాఁడ
శరణుఁ జొచ్చినయట్టిశత్రువునైనఁ
బరికించి కావంగఁ బంత మెయ్యెడల
నెఱుఁగక చేసితి నెల్లతప్పులను
మఱచి లోఁగొని నన్ను మన్నింపు మనుచు
నోలిఁ బుత్రుఁడు దాను నువిదయు నేల
లీలఁ జాఁగిలి మ్రొక్కి లేవక నీవ
దిక్కు మా కనుచుఁ బ్రార్థింపఁ బ్రార్థింప
నెక్కొన్నకోపంబునెపమునఁ దాల్మి 1210
గడఁగి మాటాడక కరమునఁ దొలఁగ

డా, కీలుకొన్న=తగిలిన, దృష్టిపథము=చూపుమేర, కమలారిధరుఁడు=శివుఁడు, కమలనేత్రుఁడు=విష్ణువు, కమలసంభవుఁడు=బ్రహ్మ, కమలమిత్రుఁడు=సూర్యుఁడు, ఒనగూర్చి=సవరించి, సురుఁగక=పాఱిపోవక, శశము=కుందేలు, పఱతెంచు... కాళికిని=పైపడివచ్చు నీశాప మనెడిభద్రకాళికాదేవికి-భద్రకాళివలె ఉగ్రమైన నీశాపమునకు, పరికించి=అరసి, పంతము=పొడి, నెక్కొన్న=నెలకొన్న-పొదుకొన్న, కరమునన్=తొండముచే, జడియు=త్రోయు, నీచే

జడియుమత్తేభంబుజాడ నత్తపసి
చే చాఁచి యారాజుశిర మెత్తి లేవఁ
ద్రోచి వెండియు వానితోడ నిట్లనియె
నీచెయ్వు లన్నియు నీకు సిద్ధించె
నేచేటు పాటు మా కెసఁగిన నేమి
చేకొని మ్రొక్కంగఁ జేతులు గోయ
రాక గదా నిన్ను రక్షింప వలసెఁ
దప్పు గాచినమీఁదఁ దగ దెగ్గు లెన్నఁ
జెప్పెద నొక మాటఁ జేసెద వేని 1220
నాముద్దుకూఁతుల నలినలోచనల
నీమాలమగువల నిచ్చితి నీకుఁ
బ్రేమ మీఱఁగ వీరిఁ బెండ్లి యై వివిధ
కామోపభోగసౌఖ్యంబులఁ బొందు
మీచను విచ్చిన నినకులాధీశ
మాచిత్తమున నున్నమంట చల్లారు
నోడక నీధైర్య మొత్తి చూచుటకు
నాడినమాట గాదని యిట్లు దన్ను
వేఁడినయాపల్కు వేఁడి యై కొఱవిఁ
జూడినయట్లైన స్రుక్కి భూభర్త 1230

---

య్వులు సిద్ధించె=నీవుచేసినకార్యములన్నియు నీకు ఫలించినవి,ఏచేటు... నేమి=మాకేమిచేటుగాని పాటుగాని కలిగిన నీకేమి - నీవుతలఁచిన కార్యములు చేసి తీర్చితివనుట-నీవు తలఁచినట్లు మాయాశ్రమమును చెఱిపితివనుట, ఎగ్గులు= నేరములు, చనువు = స్వాతంత్ర్యము, నీధైర్య.....మాటగాదు = నీధైర్యము నిర్బంధించిపరీక్షించుటకై చెప్పినమాటగాదు-నిజముగా నే చెప్పినదనుట,

యేవిధంబున నింక నీనేల గడచి
పోవ నీఁ డీపలుపోకలతపసి
తొలఁగునె నాకన్నదుస్స్వప్నఫలము
కళవళించిన నని కౌశికుఁ జూచి
నీచపిసాళియీనెలఁతల నేలి
యేచినరతికేళి నేప్రొద్దుఁ దేలి
నగుఁబాటు నగు జాలి నమ్మిక దూలి
తగవులు వ్రోఁ దోలి ధర్మంబు మాలి
యొలయుబాధల వీలి యొండొండ సోలి
వలవంతగా నోలి వలవ దీజాలి 1240
చను నియ్యకొనునట్టిచను వైనఁ గాని
చనునె నా కీమాలచను వియ్యకొనఁగ
ననిన విశ్వామిత్రుఁ డనియె నాతనికి
మనమునఁ దలపోయ మానవేశులకు
దారుణనరకబాధలు వింత గావు

---

వేఁడిరై=వేండ్రమై, కొఱవిఁ జూడిన యట్లు=కొఱవితోఁగాల్చినట్లు, స్రుక్కి=విన్ననై, ఈనేలన్=ఈయాశ్రమప్రదేశమును, పలుపోకలతపసి=పెక్కువిధములై కపటమార్గముల వర్తించుముని, తొలఁగు...ఫలము=నేను గన్నట్టి చెడుకలయొక్క ఫలము తొలఁగునా-తొలఁగదనుట, నీచపిసాళి=హీనమైనట కటొంకులుగల, ఏచినరతికేళిన్=అతిశయించిన మన్మథక్రీడయందు, నమ్మిక దూలి=విశ్వాసము చెడి, తగవులు=న్యాయములు, ఒలయు=వానిచే కలుగునట్టి, వలవంతగా=దుఃఖము కలుగునట్లు, ఇయ్యకొనునట్టి చనువు ఐనన్=అంగీకరింపఁదగినట్టి కూటమి అయినయెడల, చనున్=ఒప్పునుగాని, మాలచనువు=మాలెతలతోడి కూటమి, దారుణ=భయంకరమైన, మానవేశులకు...వింత గావు = 'రా

వారక ము న్నెంతవారికి నైన
నవతారములు గన్న ననురాగ మొదవఁ
దవిలి యీ వెలివాడతలిరాకుబోండ్ల
మన్నించి సకలసామ్రాజ్యభోగములఁ
జెన్నొంది యొప్పు నాచెప్పినయట్టు 1250
లంతకుపై వేతె యంతకుఁ డెవ్వఁ
డింత విచారింప నేటి కిచ్చోటఁ
బరలోకసౌఖ్యానుభవ మెన్నఁ డౌదవు
నురుతరభోగంబు లొల్లక చెడుట
యడరునజీర్ణ భయంబునఁ గూడు
విడిచి యూరక చచ్చువెంగలివిధము
నీతి విచారింప నేరవు నీవు
భూతలాధీశ దుర్బుద్ధులు మాని
కా నిమ్ము నీకు నీకరకరి యేల

---

జ్యాన్తే నరకం ధ్రువమ్ అన్నట్లు రాజుల కెట్టివారికైనను కడపట నరకము వచ్చుట నిశ్చయమే కావున ఈ మాలచనువువలన క్రొత్తగా నరకము రాఁబోవు ట లేదని భావము. వెలివాడ...బోండ్ల=మాలవాడపడఁతులను,సకల... చెప్పిన యట్టులు=నేను ఆజ్ఞాపించునట్లు చేసి సకల సామ్రాజ్య భోగములచే సొంపునొం దియొప్పుము అనుట, అంతకు... డెవఁడు=నేను జెప్పినట్లు చేయక పోయితి వేని దానికంటెను యముఁడు ఎవ్వఁడు-అనఁగా నాపంపు చేయకుండుటవలనఁ గ లుగు బాధకంటె మించిన యమబాధయె లేదనుట. పర... డౌదవు=పరలోక సుఖభోగము కలుగుట, ఏనాఁటికి=అది యెప్పుడోకదా. ఉరుతర......విధ ము=పరలోక సుఖము చెడునని యిందలి గొప్పభోగములను ఒల్లక చెడుటయె ల్ల జీర్ణముకాదని భయమున కూడుదినక చచ్చునట్టి వెఱ్ఱితనముతో సాటి య గును. కానిమ్ము=నేను చెప్పినట్లు జరుగనిమ్ము, కరకరి=ద్వేషము, మందార...

భూనుతం బగుమ త్తపోవనంబునను 1260
మందార మంజరీ మంజు మరంద
నంద దిందిందిర నందనారామ
కమనీయ వికసిత కనకారవింద
కమలినీ తట లతాగార లతాంత
రచిత శయ్యాతల రతిరయ గళిత
కచభర సురపుర గణికా కపోల
కలిత ఘర్మోదక కణగణ మిళిత
మలయ సమీర కోమల కంపితాగ్ర
మహిత చిత్రధ్వజ మాలా సహస్ర
సహితచింతామణిసౌధపాళికల 1270




సౌధపాళికలన్ —మందార = కల్పవృక్షములయొక్క, మంజరీ=పూగుత్తులవలని, మంజుమరంద=ఇంపైన పూఁదేనెచేత, నందత్ =ఆనందించుచున్న, ఇందిందిర=తుమ్మెదలుగల, నందన ఆరామ=నందన వనమందలి, కమనీయ=సొగసైన,వికసిత=విరిసిన, కనక అరవింద=బంగారు తామరలుగల, కమలినీ=సరస్సుయొక్క, తట=తీరమందలి,లతాగార=తీఁగయింటియందలి, లతాంత=పువ్వులచేత, రచిత=రచింపఁబడిన, శయ్యాతల=పడుకపట్టునందు,రతిరయ=రతికేళియొక్క ఉరవడిచేత, గళిత=జాఱినట్టి, కచభర=కొప్పుల పెంపుగల,సురపురగణికా=దేవలోక వేశ్యలయొక్క, కపోల=చెక్కిళ్లయందు, కలిత=ఒప్పుచున్న, ఘర్మ ఉదక=చెమటనీటియొక్క, కణగణ=కణముల సమూహముతోడ, మిళిత=కూడిన, మలయసమీర=మలయమారుతముచేత, కోమల=మృదువుగా, కంపిత=ఆడింపఁబడిన, అగ్ర=మొనలుగల, మహిత=గొప్పవైన,చిత్రధ్వజ=వింతలగు టెక్కెములయొక్క, మాలాసహస్ర=వేలకొలఁది వరుసలతోడ, సహిత=కూడినట్టి, చింతామణి=చింతామణులచేత చెక్కఁబడిన, సౌధపాళికలన్ = మేడల సమూహములందు - అనఁగా ఈలోకమందు బొగడ్త

నందంద డెందంబునందు నెయ్యంబు
పొందొంద నీయిందుముఖులతోఁ గూడి
వేడుక సలిపెద వేని నీ బొంది
తోడనే నిన్ను నింద్రునిపురి కనుతు
నీక్షితి నీమేర కింతకు మున్ను
సాక్షి మీతండ్రి త్రిశంకుభూనాథుఁ
డనిన నజ్జననాథుఁ డమ్ముని కనియెఁ
గనుఁగొని నీపెంపు గణుతింప నరిది
తెలిసి చూడగ తల్లిఁ దెగ నమ్మి దాసిఁ
బిలిచి పా లిచ్చినప్రియము చింతింప 1280
నలయల్పసుఖమున కై పాలవంటి

కెక్కిన నా తపోవనమందైనను, లేక పూర్వోక్తములైన యతిమనోజ్ఞలక్షణములుగల దేవలోకమందలి మేడలయందైనను ఈమాలెతలఁ గూడి క్రీడింప నాసపడుదువేని నిన్ను బొందితోనే దేవలోకమునకు పంపెదననుట - దేవలోకము నందనవనమందు కల్పవృక్షముల పూఁదేనెలుగ్రోలి తుమ్మెద లానందించుచుండుననియు, అట్టి యింపైన వనమున బంగారు తామరలుపూచెడి సరస్సుగట్టునందలి తీఁగయిండ్లలో పూవుసెజ్జలపై, దేవవేశ్యలు కొప్పువీడునట్లు నిబ్బరముగా రతిక్రీడ నలుపుటచే వారి చెక్కిళ్లను గ్రమ్మిన చెమ్మట బొట్లతోఁ గలసి మందమారుత మతిభోగ్యమై వీచుచుండుననియు, అట్లాగాలి వీవఁగా నందలి మేడలపైని గట్టఁబడిన వింతవింతల టెక్కెము లల్లలాడుచుండు ననియు, ఇట్టి నిరతిశయమనోజ్ఞ లక్షణములతోఁ గూడిన యామేడలయందుఁ గ్రీడింపఁ గోరినను నేను అట్లే గావింతుననియు భావము. ఈమేరకు = ఈకొలఁదికి - ఇట్లు బొందితో దేవలోకమున కంపు నంతవట్టునకు, మీతండ్రి సాక్షి = అనఁగా మీతండ్రి త్రిశంకుని ఇట్లే బొందితో దేవలోకమున కంపియున్నానుగాన ఇదియె నిన్నును అట్లు పంపఁగలననుటకు నిదర్శనము అనుట. పెంపు = గొప్పతనము, త

కులము మాలగఁ జేసి కొని మను చుంట
చలదళపల్లవాంచలమున ప్రేలు
జలకణభాతి నాశ్చర్యంబు గాఁగ
నొడల నూటాడునాయువు నమ్మి మాల
పడఁతులతోఁ గూడి బతిమాలి పడయు
సువహితసామ్రాజ్యసుఖము నే నొల్ల
నమరలోకం బొల్ల నమరత్వ మొల్ల
బుద్ధి యొండొకత్రోవఁ బోవదు నాకు
వృద్ధరాజులు సన్నవిధిని బోయెదను　　1290
వేయుఁ జెప్పినఁ జెప్ప విడువఁ గులంబు
నాయేలురాజ్య మైనను విడ్తుఁ గాని
యనినఁ దథాస్తు మా కంతియ చాలు
జననాథ విడువు నీసకలరాజ్యముల
నిల నేడుదీవులు నేలెడు వేడ్క-
గల దది మాకు మీకతన సిద్ధించె

---

ల్లి ... మనుచుంట=పాలవలె నిర్మలమైన గొప్పకులమును అతి నీచముగా చేసికొని మాలెతలతోడి యల్పసుఖము లనుభవించుట చూడఁగా బిడ్డకు దానికన్న తల్లిని తుదముట్ట అమ్మివేసి దాదిని పెట్టి పాలిచ్చి పెంచినట్టి ప్రేమముతో సాటియే యగుననుట. మాలగన్ =మాలకులమువలె అతినీచముగా, మనుచుంట=బ్రతుకుచుండుట, చలదళ పల్లవాంచలమునన్ =మఱ్ఱిచిగురు కొనయందు, జలకణభాతి=నీటిబొట్టు విధమున-అనఁగా, అంతనశ్వరముగా, ఒడలన్ =దేహమున, ఊటాడు=చలించుచున్నట్టి, పడయు ... సుఖము=పొందునట్టి మిక్కిలి గొప్పదైన రాజ్యభోగము, అమరత్వము=దేవత్వము, ఒండొకత్రోవ=మఱియొక దారి-అక్రమమార్గమనుట, వృద్ధ ... పోయెదను=పూర్వులైన రాజులు ఆచరించిన మార్గ

వరుసఁ దోరణ గట్ట వలయు మాశిష్య
వరులఁ బంపెదము నీవల కేలి వ్రేలి
ముద్రయుంగర మిచ్చి పుచ్చుము నీకు
భద్ర మయ్యెడు నని పలికెఁ గౌశికుఁడు 1300
పలికిన నాకు మీపంపు గావింపఁ
గలుగుట మిగులభాగ్యము గాదె తలఁప
వినుతతపోరాజ్యవిఖ్యాతి నెసఁగు
మునులరాజవు నీవు మున్ను నీ వేలి
నది గాదె యీసకలావనీవలయ
మిది మీకు నొసఁగ నే నెంతటివాఁడ
మాటసందులు వట్టి మన సొత్తి చూడ
నేటికి ననుడు నయ్యినకులాధీశుఁ
జూచి నవ్వుచు గాధిసుతుఁ డిట్టు లనియె
నీచతురోక్తుల కేమి కారణము 1310

---

మున నే వర్తించెద ననుట. తోరణగట్టవలయు = తోరణములు గట్టవలయును - మా
కు నీరాజ్యమంతయు ప్రాప్తించిన మహోత్సవమునకు సూచకముగా తోరణము
లు గట్టవలయుననుట. ముద్రయుంగరము = నామముద్రగలయుంగరము, పంపు =
ఆజ్ఞ, వినుత ... విఖ్యాతిన్ = పొగడ్తకెక్కిన తపస్సుఅనెడి రాజ్యముచేఁగలిగిన కీ
ర్తిచేత - రాజ్యముచే పుష్కలవైభవ మనుభవించునట్లు పుష్కలమైన తపో
వైభవమును అనుభవించి ప్రఖ్యాతిగనుట చేతననుట - నీవు మునులకు రాజవు, నీ
రాజ్యము తపస్సు, ఇట్టినీకు నరులకు రాజైన నా కేవలభూరాజ్య మెంతమాత్ర
మని యాశయము. సకల అవనీవలయము = సమస్తభూమండలము, మాటసందులు
పట్టి = మాటాడునప్పుడు పరాకున చెప్పినదానినిగనిపెట్టి పట్టుకొని, ఒత్తిచూడన్
= కఠినముగా పరిశీలించుట, చతురోక్తులకున్ = నేర్పుమాటలకు, రాచయావు

రాచయీవులు నమ్మరా దనుమాట
యీచందమున నిచ్చి యిప్పటి కిపుడు
తప్పనాడెదవు సత్యవ్రతుం డనుచుఁ
జెప్పుదు రెందుఁ బ్రసిద్ధిగా నిన్ను
మెచ్చితి నీలాగు మేలు మే లింక
నిల్చి లేదన్నఁ బోనిత్తునే యేను
నొక పేదతపసిగా నూహించి నన్నుఁ
దకవికలాడింపఁ దలఁచితివేని
క్రూరాత్మ మద్ఘన ఘోరశాపాగ్ని
నీరాష్ట్రమును నిన్ను నీఱు గావింతుఁ
గాదేని యీయిఱకటములు మాని
లేదు బొంకితి నని లెమ్మను నంత
మునిశాపభయమున మునిఁగి యొండాడ
మొనయక యూఁకొట్టి మ్రొక్కుచు నున్న
సారవర్తను హరిశ్చంద్రుని గదిసి
ధీరతఁ జంద్రమతీదేవి వలికె 1320
నిలలోనఁ గాశికునింద్రజాలంబు
వలకు లోనైతిమి వసుధాతలేంద్ర
గొనకొని వడిఁబెట్టుకోక చందమునఁ

---

లు=రాజులు సేయుదానములు, ఇప్పటికిపుడు=ఇంత కింతలోనే, ఇఱకటములు=సంకటములు-కులము చెఱుపుకొనరాదు మాలెతలతోఁగూడరాదు రాజ్యమును బోఁగొట్టుకొనరాదు, అనెడి నిర్బంధములను, ఇంద్రజాలంబు వలకు=ఇంద్రజాలమనెడి వలకు, వడిఁబెట్టుకోక చందమున=మెలి పెట్టిన కట్టుకోకవిధమున-బిగువైననేతయు పురియుఁ గలచీర కట్టుకొనఁగా లేనిపోనిచీఁదఱలు బెట్టున

బని లేనినేఱసులు వట్టఁ దొడంగె
నేమికారణ మింక నీప్రతిభాష
లేమాటసందున నెసఁగునో బొంకు
తెనయ నిద్ధర నెల్ల నేలిననృపులు
గొని పోయిరే నేల గొడిదెఁ డంతైన
నీ నిఖిలోర్వియు నిమ్మునీంద్రునకు
దాన మిమ్మిచట నత్పాత్రంబు దొరికె 1330
నని తనచిత్తంబునందలి తెగువ
కనుకూల నై పల్కునతివ నీక్షించి
మంగళోదకములు మసలక హేమ
భృంగారమున నతిప్రీతిఁ దెమ్మనుచుఁ
దెప్పించి దేవభూదేవమాన్యములు
దప్ప సప్తద్వీపధరణి సమస్త
మష్టభోగైశ్వర్య మది మీకుఁ గలుగు
నిష్టమేర్పడ దాన మిచ్చితి ననుచు
ధారుణీపతి గాధితనయుహస్తమున
దార వోసిన జలధారకు మున్నె 1340
తొరిఁగెఁ బువ్వులవాన తోడనే మ్రోసె

---

ట్లు, పనిలేని నేరములు=ప్రయోజనము లేని వట్టితప్పులు, ఏమి... ప్రతిభాషలు=ఈ మాఱుమాట లెందుకు, ఏమాట... బొంకు=ఏమాట మాటాడినప్పుడైన తప్పి యేమి బొంకుపుట్టునో కాన మఱుమాటలు వలదనుట, కొడిదెఁడు=వంచిన చేరెఁడు, తెగువకు=తెంపునకు-రాజ్యమెల్ల నిచ్చుసాహనమునకు, హేమభృంగారము=బంగారుగిండి, భూదేవ=బ్రాహ్మణుల, అష్టభోగైశ్వర్యము=జలనిధి తరుపాషాణాదు

సురదుందుభులు మునిస్తుతులుఁ జెలంగ
గెలిచె వసిష్ఠుఁ డంకిలి లేదటంచు
వలనొప్ప నాకాశవాణి భాషించె
నావేళఁ గౌశికుఁ డాహరిశ్చంద్రు
దీవించి నేఁ డింకఁ దీఱదు నాకుఁ
బోయి వచ్చెద నెల్లి ప్రొద్దున ననుచుఁ
బోయె భూవిభుఁడును బురి కేఁగె నంత
మఱునాఁడు సంధ్యాదిమహితకర్మములు
దెఱఁ గొప్ప వేవేగ దీర్చి కౌశికుఁడు 1350
బహుశిష్యగణములు బలసి తన్ గొల్వఁ
గుహకబుద్ధులను దా గుణియించుకొనుచు
వడి నయోధ్యకుఁ జని వనజాప్తకులునిఁ
బొడగని దీవింపఁ బొడమినభీతి
వడఁకుచు నెదురుగా వచ్చి యారాజు
పుడమిఁ జాఁగిలి మ్రొక్కి పూజ లొనర్చి
కొని వచ్చి తనపెద్దగొలువున రుచులు
నన లొత్తుసింహాసనంబున నునిచి
దొరల భృత్యుల నమాత్యులను రప్పించి
యరుదార వారితో నంతయుఁ జెప్పె 1360
నాకు మీకును భువనములకుఁ బూజ్యుఁ
డీకౌశికుఁడు భక్తి నిమ్మునిచంద్రు

---

లైన ఎనిమిదిభోగములతోఁ గూడినయేలుబడి, అంకిలి=అడ్డి, కుహకబుద్ధులు=కుచ్ఛితపుఆలోచనలు, గుణియించుకొనుచు=వల్లెవేసికొనుచు, రుచులు=కాంతులు, ననలొత్తు=ఉప్పతిల్లుచున్న, నిచ్చలును=యథేష్టముగా, పరిణామము=

చరణాంబుజములు నిచ్చలును సేవించి
పరిణామ మెసఁగ మీపనులమై బ్రతుకఁ
డేను బుత్రుండు నీయింతియుఁ గూడి
కాననభూమికిఁ గదలి వే పోదు
మనిన గొబ్బునఁ గ్రమ్మునశ్రుపూరముల
ననయంబు ఱెప్పల నప్పళింపుచును
వసుధీశుపదముల వ్రాలి చిత్తమున
నెసఁగుశోకముల వా రేడ్చుచు ననిరి
వరుస నిక్ష్వాకుభూవరునాఁటనుండి
పరిణామ మెసఁగ మీపదములచెంతఁ
జెల్లఁగా మహి నెల్లఁ జనువులు మాకుఁ
జెల్లఁగా నుంటిమి చెల్లఁబో నేఁడు
మది లోన నిటు దయ మాలి కుయ్యెడఁగ
వదలక యీమునివ్యాఘ్రుంబువాతఁ
బొదివి ద్రోచెదు పశుపుంజంబుపోలె
మదిమది నుండి సామ్రాజ్యవైభవము
పోనేల విపినభూముల కేఁగ నేల
యీ నేల తపసికి నీ నేల నేలఁ
గడఁగి పేరడవులఁ గాయ పం డేటి
కుడిచి వర్తించు వెక్కురుతాపసులకుఁ

---

అభివృద్ధి, పనులమైక్ =మీమీపనులుతప్పక, కాననభూమి=అరణ్యప్రదేశము,ఎల్లచనవులు=సకల అధికారములు, చెల్లఁగా=సాగఁగా, చెల్లఁబో=అక్కటా, పొదలి=నిరాకరించి,మదిమది=నెమ్మది, ఈక్ ఏల తపసికిక్ ఈ నేలక్ ఏలక్ అని,సంధి-ఈభూమిని ఏలుటకై ఋషికియ్య నేల, వెక్కురు=వికారమైన, పొ

బొడలకళాసంబో బూతిబొక్కణమొ
జడలొ రుద్రాక్షలో సంపద లేల
తొలుత వేఁదుఱు గన్న దుష్టమర్కటము
సొలవక భూతంబు సోఁకినరీతిఁ
జెనఁటి మూర్ఖున కిట్టి సిరి వచ్చె నింకఁ
జెనకి యెవ్వరి నేమి సేయునో రేఁగి
గజిబిజి నొంది యిక్కడఁ దల్లి లేని
ప్రజల మై బాములఁ బడఁజాల మేము 1390
వత్తుము మీ వెంట వల దంటి రేని
చత్తుము మీపాదజలజంబు లాన
యనిన హరిశ్చంద్రుఁ డాపురజనులఁ
గనుఁగొని మది నిర్వికారుఁ డై పలికె
ఘనపుణ్యుఁ డైనయీగాధేయు పెంపు
విని యెఱుంగనియవివేకుల మిమ్ముఁ
గనుకనిఁ దెలుప శక్యము గాదు నాకుఁ
గనలుశూలముఁ జంద్రకళయును దాఁచి
మునివేషమున నున్నముక్కంటి యితఁడు
కినుక మై నిమ్ముని కేసరి యిపుడు 1400
కనుఁగవ నునుఁగెంపు గదుర నొక్కింతఁ

---

డల కళాసంబో=వ్యాఘ్రచర్మమో, బూతిబొక్కణమొ=విబూది సంచియో, వేఁదుఱు=పిచ్చి, తొలుత...రీతిన్=మొదటనే పిచ్చిపట్టిన చెడుకోఁతిని దయ్యము ఆవేశించినట్లు, చెనఁకి=ముట్టి, గజిబిజి=తబ్బిబ్బు, తల్లి లేని ప్రజలము=తల్లి లేని బిడ్డలము, బాములన్=బాధలను, పెంపు=అతిశయము, కనుకనిన్=శీఘ్రముగా, కనలు=వెలుఁగుచుండెడి, శూలమును చంద్రకళయును లేనిశివుఁడి

గనుఁగొన నొక్కటఁ గమరు లోకమ్ము
లెదిరి యొడ్డారింప నెవ్వరివశము
బ్రతికెద రేని దుర్భాషలు మాని
సేవింపుఁ డీతని స్థిరబుద్ధి మీకు
భావింప నిహమును బరమును గల్గు
వలవనిఅవ్వ నెవ్వరి నేమి సేసె
నలిగి యమ్మునిచంద్రుఁ డదియును గాక
నాఁకలి ఘనమైన నదరి సింహంబు
మేకలఁ బొరివుచ్చి మెసఁగునే మఱియు 1410
నడిగినఁ బ్రాణంబు లైన నిచ్చుటయు
నొడివి క్రమ్మఱఁ దప్ప నొడువ కుండుటయు
శరణన్నఁ గాచుట శత్రువు నైనఁ
గరమొప్ప మత్కులాగతవర్తనంబు
సరకు సేయుదునె యీసామ్రాజ్యపదవి
మెరమెరపాటేల మీకుఁ జిత్తముల

---

తఁడనుట, నుసుఁగెంపు=నిద్దమైనయెఱుపు-అనఁగాకోపము, ఒక్కటన్ క మరున్=ఒక్కసారినే కాలిపోవును, ఒడ్డారింపన్=మాఱు పన్నుటకు, వలవనిఅవ్వన్=అక్కఱలేని రచ్చతో, అమ్ముని చంద్రుఁడు అలిగి వలవనిఅవ్వఁ బెట్టుకొని యెవ్వరి నేమిసేసెననుట. ఒకవేళనతఁడు అలిగి అవ్వఁబెట్టుకొనునేని, సింహము ఎంత యాఁకలిగొన్నను మేఁకలను జంపి తిననట్లు తనఅవ్వ మీబోఁటి వారితోఁ బెట్టుకొనఁడు సుఁడీయని యర్థము. పొరిపుచ్చి=చంపి, నొడివి...కుండుటయు=మాటచెప్పి మరల నది తప్పిపోవునట్లు చెప్పుట. మత్కు...వర్తనంబు=నాకులమునుండి పరంపరగా వచ్చుచున్నట్టి నడవడి, సరకు సేయుదునే...పదవి=ఈసామ్రాజ్యపదవిని లక్ష్యపెట్టి ఇందులకై ఆడినమాట తప్పుదునాయనుట, మెరమెరపాటు=ఆఱట, ఇరవొందన్=నిలుకడగా, గురుబుద్ధిన్=

నిర వ్రేంద మీరు మీయిండ్లనే యుండి
గురుబుద్ధి నామేలుఁ గోరుండు చాలు
నని వార లందఱ నడ లాఱఁ బలికి
తనదేవియును దానుఁ దనతనూజుండు 1420
మునినాథునకు భక్తి మ్రొక్కి 'యే నింకఁ
బనివినియెద' నన్నఁ బకపక నవ్వి
'యవని కింతకు రాజనై యున్ననాకు
నవిరళగతిఁ బూన నర్హంబు గాక
మకర కుండల హార మంజీర వలయ
మకుటాంగదమ్ములు మఱి నీకుఁ దగునె
తెమ్ము మా కవి యని దేవిమై నున్న
సొమ్ము లన్నియు మోముఁ జూడక యొలిచి
విచ్చేయు' మనుచు దీవించి వీడ్కొలుప
నిచ్చలోఁ గలఁక యొక్కింతయు లేక 1430
పురజను లార్తులై పురపురఁ బొక్క
పురము వెల్వడి సాఁగి పోవుచు నుండఁ
బటురయంబునఁ గూడఁ బఱచి యారాజు
నట చన నీక విశ్వామిత్రుఁ డనియె
'మును మఖార్థంబుగా ముదమున నిచ్చి
కొనుఁ డన్ననాఁటికిఁ గొని పోవ లేక

---

గొప్పమతితో, అడలు ఆఱక్ =దుఃఖము ఉపశమించునట్లు, పనివినియెదర్ = పోయెదను, అవిరళగతిక్ =దట్టమైనవిధమున-దృఢప్రకారముగాననుట, మకరకుండల=మొసలివాయొంట్లు, మంజీర=అందెలు, అంగదములు=పురులు, మోముఁజూడక=మొగమోడక - నిర్దాక్షిణ్యముగా, మఖార్థంబుగాక్ -యజ్ఞముకొఱకు, కొనుఁడన్న... లేక=తీసికొనిపొమ్మన్న నాఁటికి నేను దీసికొనిపోవలేక,

యిల్లడ నీయింట నిడినవావిత్త
మెల్ల నిప్పింపక నెందుఁ బోయెదవు
మఱచిన నెఱిఁగింప మనుజేశ వలదె
మొఱఁగి పోఁ జూచితే మోసపోఁ గాని 1449
యెనయ విప్రులసొమ్ము లెన్నెన్ని యిట్లు
కనుఁ బ్రామి కొంటివో కాక వంచించి
వేవేలు వచ్చె నీవిశ్వాస మెల్ల
దైవ మెఱుంగ మాధనము తెమ్మనినఁ
బిడుగు వ్రేసినవాని బెడిదంపుఁగొఱవి
వడిచినయట్లైన నధిపతి స్రుక్కి
యలుగక చిల్లపెంచాదిగా నాకుఁ
గలధనం బంతయుఁ గపటంబు లేక
నీకె యిచ్చితిఁ దొంటి నేఁటిధనంబు
నేక మైఁ జెల్లె నీ కేల మోసంబు 1450

---

ఇల్లడ=న్యాసము, మొఱఁగి=ఏమఱించి, పోఁ జూచితేన్ = పోవఁజూచితివేని, మోసపోన్ కాని= నేను మోసపోవనుజుమా, ఎనయన్=నీకు తగునట్లు, కనుఁ బ్రామి=కన్నులుగప్పి-ఏమఱించి, కొంటివోగాక వంచించి=వంచించి తీసికొంటివోకాక, వేవేలువచ్చె=మాకు వేవేలుధనము వచ్చినట్టే-ఇక నీవిశ్వాసము చాలుననుట, దైవమెఱుంగన్=దేవునిసాక్షిగా, పిడుగు వ్రేసినవానిన్=పిడుగుకొట్టుపడినవానిని, బెడిదంపుకొఱవిన్=వేండ్రమైనకొఱవితో, అడిచిన=కొట్టిన-పిడుగుదెబ్బపడినవానిని కొఱవితో పొడిచినట్లు రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొన్నవానిని మునుపటిఋణ మిమ్మని యడిగినాఁడనుట, స్రుక్కి=కొంకి, చిల్లపెంచుఆదిగా=చిల్లపెంకు మొదలుకొని, తొంటినేఁటిధనంబు=తొల్లియియ్యవలసినధనమును ఇప్పుడియ్యవలసిన ధనమును, ఏకమై=ఒక్కటిగా, చెల్లెన్=నీకు

ఎంతటి కెంత నీ కీధనకాంక్ష
సంతోషమునఁ బొంది చను మింక' ననినఁ
దొలఁగక వాలంబుఁ ద్రొక్కినఁ బెలుచ
నలిగి భైట్టగయుకాలాహిచందమున
మునినాథుఁ డగలించి మురముర మనుచుఁ
దనచేతికోల సద్ధరణీశు ప్రేసె
ప్రేసియుఁ గరుణ పో విడిచి చిత్తమున
నీసును గోపంబు నెనయ నిట్లనియె
'గ్రామకార్యములు మాకడఁ జెల్ల వింక
నీమూఢవాక్కుల కేమి కారణము 1460
ఇచ్చి వేఁడినఁ గోప మెవ్వరి కైన
వచ్చు నెప్పుడు నది వాలాయ మరయ
నచ్చినకంటె మా కధికధనంబు
నిచ్చువాఁడవపోలె నిట్లన నేల
తొల్లింటిధనముతో దొరలినరాజ్య
మెల్ల నిచ్చితిని మీ కిది నిక్క మన్నఁ

---

చెల్లించినట్టాయెను. ఎంతటి... కాంక్ష= నీకీద్రవ్యాపేక్ష ఎంతమాత్రము-నిను బోఁటికి ఈద్రవ్యకాంక్షతో నెంతమాత్రమునుపనలేదనుట, పెలుచన్=మిక్కిలి, కాలాహి = కాలసర్పము, మురమురమనుచు-కోపసూచకమైన అనుకరణము. ఈసును=అసూయయు, ఎనయన్ = కలిసికొనఁగా, గ్రామకార్యములు= ఊరిపనులు-ఊరివారితోడ వ్యవహరించునట్టికార్యములు, మాకడన్=మాబోఁటి వారితో, అచ్చినకంటె... పోలె=మాకు అచ్చుకోవలసినంతకంటె ఎక్కువధనము ఇచ్చినట్టివానివలె, తొల్లింటి...మన్నన్ = 'మునుపు ఇచ్చెదనన్నధనముతోఁగూడ ఈరాజ్యముసంపదయు మీకిచ్చితిని ఇది నిజము' అనినీవు చెప్పితివేనియనుట- ఇట్లునీవు బొంకితివేని అనియభిప్రాయము. కొమ్ముఅనీ=తీసికొనుమని

దిరిగి పోదుము సమ్మతించి నీచిత్త
మరయుట గాదు మహాదేవునాన'
యనిన హరిశ్చంద్రుఁ డత్తపోధనుని
గనుఁగొని వెఱచుచుఁ గడుభక్తిఁ దాల్చి 1470
వదలక తత్పాదవనజముల్ నుదురు
గదియఁ జాఁగిలి మ్రొక్కి కరములు మోడ్చి
'దాసుఁ డే మైనను దప్పుఁ జేసినను
వ్రేసి కారించుట విహితంబు గాదు
కోప మేటికి మునికుంజర నీకు
రూపించి కొమ్మని ప్రోవు గాఁ బోయ
ధనము లే దని గాని తడవునఁ గొన్ని
దినములు సైరింపు తీర్తు నీఋణము
నప్పు లే దని త్రోవ నగునె యెవ్వరికిఁ
దప్ప నాడినఁ బెంపు దప్పుటే కాక 1480
లేదు చిక్కులు వెట్ట లే దని చెప్పఁ
గా దని ముకుఁద్రాటఁ గాలు దుయ్యకుము
దయ సేయు' మనినఁ గ్రోధము మాని కొంత
నయముగా నమ్మునినాథుఁ డిట్లనియె
'నగుఁ గాక నీచెప్పినట్ల చేసెదను
మొగమోట మేటికి మున్నె చెప్పెదను

ప్రోవుగా=రాశిగా, తడవునన్=ఆలస్యమున, తప్ప...కాక లేదు = ఆడితప్పిన యెడల పెంపుతప్పిపోవుటే కాని మరేమియు లేదనుట, చిక్కులువెట్టన్ = మిమ్ము చిక్కులలోఁ బెట్టను. లేదని చెప్పన్ = ఇచ్చుటలేదనియు చెప్పను. కాదని...దుయ్యకుము=అట్లు చేయుట గూడదని ముకుఁద్రాటితో కాలు నుదూర్చి కట్టకుము - పశువులను ముకుఁద్రాటితో కాలును దూర్చి బంధించునట్లు

దీనికి మితి యేమి తీర్చు టేవెరవు
పూని పల్కుము వినఁ బొం దయ్యె నేని
యెద మాలి యుండెద మెప్పటి' కనిన
ముద మంది నృపతి యమ్మునిపతి కనియె 1490
'నిమ్ముల దయ మీఱ నింక నొం డనక
యిమ్ము నా కొకనెల యెడ నాఁటిమితికిఁ
దెలఁ గొండు లే కున్నఁ దెఱవయు నేను
జెఱ నుండి యైనను సెలవు దీర్చెదము'
నావుడు నగు నని నరలోకనాథు
దీవించి చనిచని తిరిగి యేతెంచి
'మగుడి పోవఁగఁ దోఁచె మా కొ[illegible]బుద్ధి
జగదీశ లేమికిఁ జాలక నీవు
కూడినధన మెల్లఁ గూటివెచ్చంబు
వాడిన మఱి యెట్లు వచ్చు మాధనము 1500
సదరంబుగా దిద్దుబాడఁ గైకొనక
తుదిఁ బోయి వడిఁబెట్టు దోసఁ గగు ననుచుఁ



---

నన్ను మిక్కిలియుఁ గష్టపెట్టకుము, మితి=గడువు, తీర్చుటఏవెరవు=అప్పుతీర్చుటకు మార్గమేమికలదు? వినఁబొందు = వినుటకు తగినది, ఎద=భయము, ఎడ=అవకాశము, నాఁటిమితికిన్ = నాఁటిగడువునకు, తెలఁగుబొందుల్ =అప్పుతీర్చుటకు వేఱొక్కవిధమైనను, చెఱన్ =నిర్బంధమునందు - దాస్యముచేసి యైనననుట, లేమికిన్ =లేమిడికి, చాలక=తాళలేక, కూటివెచ్చంబు వాడిన= కూటికిఁగాను వెచ్చముసేసికొన్నయెడల, సదరంబుగా=నేర్పుగా - యుక్తముగా, దిద్దుబాడఁగైకొనక=నిన్ను వెచ్చింపకుండునట్లు దిద్దుపాటుచేయు పద్ధతిని అవలంబింపనియెడల, తుదిఁబోయి = కడపట, వడిఁబెట్టుదోసఁగగును = పురి

దనశిష్యగణములోఁ దనకన్న మూర్ఖు
ననలసన్నిభ తేజు నత్యంతకుటిలుఁ
గ్రూరుని నక్షత్రకుం డనువానిఁ
జేర ర మ్మని పిల్చి చెవిఁ గొన్నిఁ జెప్పి
'యలయక నీవు మాయందులభ క్తి
వెలయంగ నీరాజువెను వెంటఁ దగిలి
దొరికినధన మెల్లఁ దొడిబడకుండ
నరపీస మాది గా నప్పుడే కొనుచు 1510
నాఁకట గ్రుక్కించి యలఁత సొక్కించి
వ్యాకుల మొందించి వ్యథలఁ గుందించి
మానంబుఁ దప్పించి మనసు నొప్పించి
దీనత రప్పించి దిగులు దెప్పించి
దినములు ముప్పది దీఱునంతకును
గనలుచుఁ దరువుండి కడమ గాకుండ
ధనము తె' మ్మని పల్కి ధరణీశుఁ జూచి
'జననాథ నీతోడఁ జనుదెంచు నితఁడు
సోమ కోర్వఁగ లేఁడు సుకుమారమూ ర్తి
నామాఱుఁగా జూచి నయమునఁ బ్రోచి 1520
నవసిన నలసిన నడవ లే కున్న
నవరించికొని పోవఁ జనుఁ గృప మీఱ'
లని యప్పగించుచు నట వోయి మగుడఁ
జనుదెంచి మునిపతి జనపతి కనియె

---

పెట్టుకొన్నట్టికీడగును, తోడిఁబడకుండఁ - తొట్రుపడనట్లు = చలింపనట్లు, కనలుచు=మండిపడుచు, తరువుండి= ఇయ్యవలసినధనాదికము నిమ్మనిచేయు

'వినుము నీ కొకమాట వివరంబు గాను
మునుపె చెప్పక యున్న మోస మా మీఁదఁ
దెరలక నీవు మా దేశంబులోనఁ
దిరుగుచు నూరూర దీనత దోఁపఁ
బ్రజల నిమ్ముల వేఁడి పడసినధనము
నిజముగాఁ బోఁకయు నీకు మే మీము 1530
చెడిపోక మామాటఁ జేసి యీమాల
పడఁతులఁ బెండ్లి యై బ్రతుకు మింకైన'
ననిన హరిశ్చంద్రుఁ డాముని చంద్రుఁ
గనుఁగొని ధైర్యంబు గలఁగక పలికె
'దేవసీమలకు భూదేవసీమలకు
భావింపఁ దొల్లి యేపని లేదు మీకుఁ
గావున నేలాగొ కడమ లే కుండ
మీవిత్త మిచ్చెద మీప్రజ నడుగ
నీచభామల నొల్ల నీరాజ్య మొల్లఁ
ద్రోచి పోని మ్మింకఁ దుకతుక మాని' 1540
నావుడు నమ్మునినాథుఁ డారాజు
భావశుద్ధికి మెచ్చి బాపురే యనుచు
నురవడి మగుడి యయోధ్యకు వచ్చి

---

నిర్బంధము, సోమకున్ =శ్రమమునకు, నవసినన్ =కృశించినను, పోఁకయుఁ= పోఁకంతమాత్రమైనను. దేవసీమలు= దేవతలకంకితము సేసినమాన్యములు, భూదేవసీమలు-బ్రాహ్మణమాన్యములు, ఏపనిలేదు మీకు = ఆమాన్యములతో మీకేమి యుఁబనిలేదు-అవితప్పతక్కిన వెల్లమాత్రమె మీసొంతమనుట, కడమ=కొఱఁత-మిగులు, తుకతుక=తపించుట యందగుధ్వన్యనుకరణము - తుకతుక తపింపక మమ్ముఁ దోఁచి పోనిమ్మనుట, భావశుద్ధికిన్ =మనస్సుయొక్క నిర్మలత్వ

పరిపాటి దప్పక ప్రజలఁ బాలింప
వలను మీఱినమంత్రివరుల కొప్పించి
కలయఁ బౌరులు గుమ్పగరిగొని దూఱఁ
దలవంచుకొని వీడు దడయక వెడలి
వెలయ నదృశ్యుఁడై విభునివెన్వెంట
నింతింతఁ జనుచు వారేఁగెడిత్రోవ
నంతంత శిలలు మహాకంటకములు 1550
పుట్టలు గుట్టలు పొదలునీరములు
ఘట్టంబులును బెక్కు గల్పించి మఱియు
వెలిమంటగతిఁ బేర్చువేసవియెండ
నొలయువేఁడిమికి నత్యుష్ణంబు నెఱపి
యవిరళగతి నాకు లల్లాడ కుండఁ
బవనసంచార మేర్పడ మట్టుపఱిచి
మడువుల నున్ననిర్మలసలిలంబు
లెడపక యేఱెంకు లింకి పోఁజేసి
మూఁకటివేళల నలసి యే మైనఁ
జేకొని భక్షింపఁ జేఁదు గావించి 1560

మునకు, బాపురే=సెబాసు, పరిపాటి=క్రమము, వలను=నేర్పు, ఒప్పించి=ఒప్పగించి, కలయఁ=అంతటను, పౌరులు=పట్టణజనులు, గుమ్పగరికొని = చుట్టుకొని, వెనువెంటఁ = వెనుక వెనుకనే, కంటకములు=ముండ్లు, పొదలు ఈరములు=పెరుఁగుచున్న పొదరిండ్లు, ఒలయు... నెఱపి = వేసవికాలమందలి యెండచే వ్యాపించువేఁడిమికన్న మిక్కుటమైనయావిరి కలిగించి, అవిరళగతిఁ=దట్టమైన విధమున, ఆకులు...మట్టుపఱిచి = ఆకులుకూడఁ గదలకుండు నట్లుగా గాలిని వీవకుండ నడఁచి, ఎడపక =ఎడపడక, ఱెంకులు = నీళ్లుండెడు

తెరువులు దొలఁగించి ధృతులు గీడ్పఱిచి
పరువుల నలయించి భయ మొదవించి
నడపుల సొలయించి నయము దూలించి
తడబడ నెట్టించి దప్పిఁ బుట్టించి
కైకొని మది నింతకనికరం బైన
లేక కారించె నీలీలల నపుడు
వీడినక్రొమ్ముడివిరుల నెత్తావిఁ
గూడి జుమ్మని మ్రోయుకొదమ తేఁటులకు
నులికి ముఖాంభోజ మోరగాఁ ద్రిప్పి
మలఁగఁ బోయిన నీలమణులు నా మెఱయు 1570
కురులు దీఁగెలు వట్టికొనిన హుమ్మనుచుఁ
గరపల్లవము సాఁప కలగొన తేఁగి
కడుఁదురు లదరంటఁ గఱవ విభ్రాంతి
వడఁకుచు వీవఁగాఁ బయ్యెదకొంగు
దాసినకంపలు దగిలినఁ దొలఁగఁ
దీసి రానేరక దీనత నొంది

---

పట్టులు, తెరువులుతొలఁగించి=దారులుతప్పించి, ధృతులుగీడ్పఱిచి=ధైర్యములు చెఱిపి, నయము=మెత్తన - సౌకుమార్యము, కారించెన్ = బాధపెట్టెను. క్రొమ్ముడివిరులనెత్తావిన్ = కొప్పునందలిపూవుల మంచివాసనచేత, కొదమతేఁటులకున్ = తేఁటిపిల్లలకు, మలఁగఁబోయిన = మోము ఓరగా త్రిప్పుకొని మరలఁ జూడఁగా, కరపల్లవము=చిగురువంటిచేయి, కలగొనన్ = చెల్లచెదరుగా, కడుఁదురులు=కండిరీఁగలు, అదరంటన్=మిక్కిలి యదరున ట్లుగా,వడఁకు... కొంగు-'వడఁకుచుఁ బయ్యెదకొంగును వీవఁగాన్'అని యన్వయము-కడుఁదురీఁగలుతొలఁగిపోవునట్లు పైఁటకొంగును విసరుకొనఁగా ననుట, దాసిన కంపలు=దగ్గఱగానున్న ముండ్లకంపలు, తొలఁగఁదీసి=విడిపించుకొని,

మెఱుఁగుముత్యంబుల మ్రింగుమీనమ్ము
లఱుగక వెసఁ గ్రక్కునట్టిచందమునఁ
బలుమాఱుఁ గ్రమ్మెడిబాష్పబిందువులు
వలుఁదచన్నులమీఁద వాన యై తొరుఁగ 1580
నురిఁ బడి తూఁగాడు చున్న సారంగి
కరణి జాఱెననీవి గదియ డాకేల
నొదుపుచు నందను నొకచేతఁ బట్టి
పద నింకి బీఁటలు వాఱుకెమ్మోవిఁ
దడుపుచు నున్నత స్తనభారమునకు
నడు మోర్వ దనుభీతి నడవదో యనఁగ
నడు గ త్తె కున్నప్రియాంగనఁ జూచి
పుడమిఱేఁ డాత్మలోఁ బురపురఁ బొక్కి
'మును సౌధసోపానముల నెక్క లేని
వనజాక్షి యెట్లెక్కె వరుస శైలములు 1590
పటికంపురాకట్టుపై నెక్క నలయు
కుటిలకుంతలి యెట్లు గుట్టలు గడచె

---

అఱుగక=జీర్ణింపక - చేఁపలు ముత్యములను మ్రింగి అఱుగనందున వానిని వెడలఁ గ్రక్కినట్లు అనుట - ఇచట మీనములకును కన్నులకును మెఱుఁగుముత్యములకును బాష్పబిందువులకును సామ్యము తెలియునది. సారంగి=ఆఁడుజింక, నీవి=పోఁకముడి, ఒదుపుచున్=పొదువుచు, పదను ఇంకి=తడితీసిపోయి, బీఁటలువాఱు కెమ్మోవి=పగుళ్లుపాఱు ఎఱ్ఱని పెదవి, ఉన్నత స్తన...నడు గ త్తెకున్న-చంద్రమతి యడుగిత్తి పెట్టఁజాలకుండుటను జూడఁగా పొడవులైన చన్నుల బరువునకు తననడుము తాళఁజాలదని భయపడి నడవకున్నదో యనునట్లు తోఁచెననుట-బడలిక చేత నడవలేకుండుటకు స్తనభారముచే నట్లుండుటగా ఉత్ప్రేక్ష, సౌధసోపానములు=మేడ మెట్లు, పటికంపురాకట్టుపైన్=పటికపురాళ్ల చేఁ

ననుబొంద రత్నదేహళి దాఁట నలఁగు
ఘనకుచ యేరీతిఁ గడచె ఘట్టములు
కేళీవనంబులఁ గ్రీడింప బడలు
లోలాక్షి యడవులలో నెట్లు మెలఁగెఁ
జిలుక నక్కునఁ బెట్టఁ జెక్కు సెమర్చు
నెలనాగ నందను నె ట్లెత్తి తెచ్చె
నద్దంబుతెర వుచ్చిన ట్లుండుదీని
ముద్దులనెమ్మోము మురిపెంబు దూలె 1600
నీగ పై పడ జాఱునీయిందువదన
బాగైనపాపట పై బీఱువాఱె
మీటినఁ బగులునీమెలఁతచన్దోయి
పాటనబయ లయ్యెఁ బయ్యెద దొలఁగి
చిలుక వాలినఁ గందు చెలువమైదీఁగ
దళ మైనకట్టెండ తాఁకున వాఁడె
నానిమిత్తంబున నారీలలామ
కీనీచదుర్దశ నిటు వేఁగ వలసె
నిటువలెఁ జెలరేఁగి యెవ్వరి నైన

గట్టఁబడిన నేలమీఁద, ఘట్టలు=చిన్నదిబ్బలు, రత్నదేహళి=మణులు చెక్కిన గడప, అక్కునన్=ఒడియందు, చెక్కుచెమర్చు = చెక్కులం జెమటఁ గార్చు-బడలునట్టియనుట, అద్దంబు తెరవుచ్చినట్లు-అద్దముముసుఁగు దీసినట్లు-దుమ్ము పైనితగులకుండునట్లు గవుసెన వేయఁబడియుండు నద్దము గవుసెనతీయఁగానే నిర్మలమై తలతలలాడునట్లు, మురిపెంబు=సొగసు, బీఱువాఱె=వ్యర్థమయ్యెను, మీటినన్ పగులు= తాఁకఁగానే విచ్చునట్టి, పాటనబయలయ్యె=బట్టబయలుగా వెలువడెను; మైదీఁగ = తీఁగవంటిమేను, దళమైన కట్టెండ=దట్టమైనకటికిఎండ, వేఁగన్ = తపింప, మలఁకలఁబెట్టు = చిక్కులఁబెట్టును,

మటుమాయ విధిఁ బట్టి మలఁకలఁబెట్టు' 1610
నని తలపోయుచు నాలేమఁ గదిసి
యనునయించుచు నిజహస్తంబుచేత
నెలమిమై నూఁతగా నిచ్చి పుత్రకుని
వలమూఁపుపై నిడి వసుమతీనాథుఁ
డటు చనుచుండ మిథ్యాపరిశ్రాంతి
నటియించి సోలుచు నక్షత్రకుండు
గుది ద్రోచినట్లు హా గురునాథ యనుచుఁ
జదికిలంబడి హరిశ్చంద్రుతో ననియెఁ
'ప్రాగిలె నంగంబులు వ్రక్కెఁ బాదములు
నొగిలె నెమ్ములు చాల నొచ్చె మస్తకము 1620
కన్నులఁ జీఁకట్లు గవిసె జుమ్మనుచు
నున్నవి వీను లెట్లోర్వంగ వచ్చు
నొదవినకరుణమై నొకక్రమానినీడఁ
గదియించి ప్రాణముల్ గావు' నావుడును
భూపాలుఁ డెంతయు బుద్ధిలో వగచి
'యీపథిశ్రాంతి నేఁ డింతయుఁ దీఱఁ
బల్లెపట్టైనను బసులమందైన
నుల్ల మారఁగఁ జేర నున్నదే ప్రొద్దు
నీమునిపుత్రున కీవిధి మూఁడె

---

మిథ్యాపరిశ్రాంతి=లేనిబడలిక, గుదిత్రోసినట్లు = కాళ్లుకట్టిత్రోసినట్లు, ప్రాగిలె=మంటలెత్తెను, నొగిలె=నొచ్చెను, వగచి=విచారించి, పథిశ్రాంతి=మార్గాయాసము, ఉల్లమారఁగా=మనసునిండునట్లుగా-నెమ్మదిగా, చేరనున్నదే ప్రొద్దు=

నీమహాటవిలోన నీయెడఁ బ్రొద్దు 1630
కాలిసంకెల గాఁగఁ గౌశికుఁ డితని
నీలీల వెనువెంట నేల పుత్తెంచె'
నని మదిఁ దలపోయునాత్మేశుఁ జూచి
మన మార నాచంద్రమతి యిట్టు లనియెఁ
'గడు దూపటిల్లె నక్షత్రకుఁ డింక
నడవ నోపఁడు సుమ్ము నరనాథచంద్ర
యెలమిమై నిచ్చట నీరాత్రి మనము
నిలుచుట గార్యంబు నిక్కమూహింపఁ
జయ్యన నింక నెచ్చట నైన వెదకి
తియ్యనిజలములు దెచ్చి త్రావించి 1640
విపులపల్లవతాళవృంతానిలమున
నుపచరింపక యున్న నొప్పమి పుట్టు
బాలుండు నది గాక బ్రాహ్మణుం డసమ
శీలుండు కౌశికుశిష్యుఁ డుత్తముఁడు
కృపకుఁ బాత్రుండు రక్షింపు' నావుడును
నృపపుంగవుండు దానికి సమ్మతించి
కెలఁకులఁ గలయ వీక్షించునాలోనఁ
దొలఁగ కదృశ్యుఁడై తొల్లి యవ్విభుని
నొనర వెన్కొని వచ్చుచున్నకౌశికుఁడు
మనుజనాథుని నేఁప మదిని జింతించి 1650

---

చేరుటకు బ్రొద్దుకలదా-లేదనుట, కాలిసంకెల=కాలిసంకెలవలెనాకు స్వేచ్ఛగా నుండనీని నిర్బంధముగా, దూపటిల్లె=దప్పిగొనెను, విపులపల్లవతాళవృంతానిలములన్ = పెద్దచిగుళ్లయు వీవనలయుగాలిచేత, ఒప్పమి=కీడు, ఏఁపన్ =బాధించుట

దంతఘాతకుఁ డను దానవు నొకని
వింతగాఁ బుట్టించి విను మని పలికె
'ధరణీశు మాపటిదాఁక నిచ్చోట
మరిపి మాటలఁ బెట్టి మఱి నేర్పు మెఱసి
శాకినీ భూత పిశాచసహస్ర
భీకరం బగునల్ల బేతాళవటము
కందువ చెప్పి యాఘనమహీరుహము
క్రింద నీరాత్రి నిద్రింపఁగఁ బనుపు
మామఱ్ఱి బేతాళుఁ డమరుల నైన
దీమసం బడఁగించి దిగఁబాఱ మ్రింగు 1660
వానిధాకకు నెంతవా రోర్వ లేరు
పూని నీ విటు సేయఁ బొ మ్మన్న నపుడు
తల వడంకెడువృద్ధతాపసవేష
మలవడ ధరియించి యామాయలాఁడు
మెదిచి తెల్లనిభూతి మే నిండ నలఁది
పెదపెదరుద్రాక్షపేరులు వేసి
వింతగా జడలెల్ల వ్రేలాడ విడిచి
దొంతిబుఱ్ఱలకాయ దొడలపై నునిచి
ఘనకమండలువుఁ జెంగట నట్టు వెట్టి

---

కై, దానవున్ = రాక్షసుని, మాపటిదాఁకన్ = సాయంకాలమువఱకు, ఆటలఁ బెట్టి = ఆటలాడించుచుండి, బేతాళవటము = బేతాళుఁడున్న మఱ్ఱిచెట్టు, కందువ = విశ్రమస్థానము, ఘనమహీరుహము = గొప్పవృక్షము, దీమసము = ధైర్యము, ధాక = విజృంభణము, అలవడన్ = పొందికపడునట్లుగా, పెదపెద = మిక్కిలి పెద్ద, పేరులు = సరులు, బుఱ్ఱకాయ = సొఱకాయబుఱ్ఱ, చెంగటన్ = సమీపమున, అ

తనరారుదండంబు తరువునఁ జేర్చి 1670
నలువారుకృష్ణాజినంబుపై నడుము
నలి నిక్కఁ బద్మాసనమునఁ గూర్చుండి
కొనముక్కుమీఁదఁ జూడ్కులు సక్క నిలిపి
మునుకొని జపమాలపూస లెన్నుచును
నురునిష్ఠ నున్నట్టు లుండఁగాఁ జూచి
ధరణీశుఁ డమ్మునిదగ్గఱఁ జేర
నడచి సాష్టాంగప్రణామంబుఁ జేసి
కడుభక్తి మైఁ గరకమలముల్ మొగిచి
ముదమొప్పఁ బలికె 'నోమునిచంద్ర వేఁడి
వెద చల్లు చున్నయీవేసవియెండఁ 1680
బరితాప మొందునాపైఁ గృపామృతము
గురియ నీచూపు నిగుడ్పవే యనిన
నొక్కింతదడవున కొయ్యన బొమల
నిక్కించి యాధరణీవిభుఁ జూచి
పెనఁచి పక్షులు గూండ్లు పెట్టినకతన
విన రాదు మనువు నావీనుల కీవు
నలిగి వచ్చినజాడ నంతను మదిని

---

ట్టువెట్టి=అట ఒకప్రక్కగాఁ బెట్టి, తరువునఁ జేర్చి=చెట్టునకొఱగించి, నడుము నలి నిక్కన్=నడుము మిక్కిలి నిక్కునట్లుగా, కొనముక్కు...నిలిపి=నాసాగ్రముపై దృష్టినిలుపుట-యోగసమాధిసూచకము, వేఁడి వెదచల్లుచున్న=వేంద్రముగా వ్యాపించి కాయుచున్న, బొమలన్=కనుబొమ్మల, పెనఁచి...వీనులకున్=పక్షులు నా చెవులలో గూండ్లను పెనఁచి పెట్టియున్నవి గావున నీవు చెప్పినమాటలు వానిలోఁ జొరవనుట-దీని చే నిశ్చలమైన తపస్సమాధి సూచించినాఁడు, యోగదృష్టి=యోగసమాధి చేనైనజ్ఞానదృష్టి-నీవు చెప్పినది నాకు వినక పోయినను జ్ఞాన

దెలియఁగా మాయోగదృష్టిఁ గాంచితిమి
విక్రమలీలమై విలసిల్లు మొదలి
చక్రవర్తివి హరిశ్చంద్రాహ్వయుఁడవు 1690
తుకతుక లేక కీర్తులు మిన్ను ముట్ట
సకలరాజ్యము లోకసంయమి కిచ్చి
యెలమి నాతనికి మున్నిచ్చితి ననుచుఁ
బలికినధనము సంపాదింపఁ బూని
నీవు నీసుతుఁడును నీవధూమణియు
నీవిధి నలమరి యేఁగుచుండఁగను
గురువాక్య మొనరింపఁ గోరి మీమీఁదఁ
దరువు వచ్చినమునితనయుఁ డిచ్చోట
నొదవినదప్పిమై నుర్విపైఁ బడిన
నుదకంబు లరయుచు నున్నాఁడ' వనుడు 1700
విని మనంబునఁ జాల విస్మయం బంది
మనుజేశుఁ డత్తఱి మఱియు నిట్లనియె
'సతియు నేనును భవచ్చరణపద్మంబు
లతి భక్తిఁ గొలిచి రేపగునంతదాఁక
నిలిచెద మిచ్చోట నీసమీపమున
సొలపు దీఱఁగ మునిసుతునితోఁ గూడి
ఘనమైనమత్పుణ్యకర్మంబుకతన
నెనయుమాదుశ్చింత లిన్నియుఁ బాసె

---

దృష్టిచేనీసంగతిని నేను తెలిసికొంటిననుట, హరిశ్చంద్రాహ్వయుఁడు = హరిశ్చంద్రుఁడను పేరు గలవాఁడు, తుకతుక = కొందలము, మున్నిచ్చితి ... ధనము = రాజ్యమంతయు నిచ్చుటకు మునుపు నీవిచ్చినట్లు చెప్పినధనమనుట, అలమరి =

మునినాథ నేఁ బోయి ముద మొప్ప జలము
గొని వచ్చు నీలోనఁ గుత్తుక మిడికి 1710
మునికుమారుఁడు దాహమునఁ జచ్చె నేని
యనఘాత్మ మఱి బ్రహ్మహత్య సిద్ధించు
నెలకొన్నకరుణమై నీకమండలువు
సలిలంబు లీబ్రహ్మచారికిఁ బోసి
ప్రాణదానము సేయు' మనుటయు నవ్వి
క్షోణీశుతోడ నక్కుటిలాత్ముఁ డనియె
'నేకాకి నై తగు లేమిటివలన
లేక కాఱడవుల లీల ని ట్లున్న
నే నేల నీ వేల నెలఁతుక యేల
పూని తపోవిఘ్నమున కిది త్రోవ 1720
తరలాక్షు లన్న మాతల కంటగించు
నొరులు సన్నిధి నున్న నొదవు నాగ్రహము
వదలక మీ రిందు వసియింప వలదు
బెదరు చిత్తము నాకుఁ బిట్ట బుట్టునిన
నలినాప్తకులనాథ నాకమండలువు
జలము లల్పంబు నక్షత్రకుం డెట్లు
బ్రదుకు నీయల్పాంబుపానంబువలన

---

కొలఁది తప్పి, తరువు=తరువు కాఁడు, మిడికి=ఎండి, నెలకొన్న = స్థిరమైన, తగులు=సంబంధము, ఏమిటివలన=దేనియెడలను, నే నేల నీ వేల= నే నెక్కడ, నీ వెక్కడ - పూర్వకవిప్రయోగములందు 'ఏడ' కుమాఱుగా 'ఏల' యనియే చూపట్టుచున్నది. కంటగించును=నొచ్చును. ఒరులు... నాగ్రహము=మఱి యొకరు దగ్గఱనుండిరేని నాకు ఆగ్రహముపుట్టును. పిట్ట బుట్టునిన్=పక్షి బుట్టు

నిది బుద్ధి గాదు నీ విటు విను మింకఁ
జెలువార నిచటికిఁ జేవాటు నేలఁ
గల దొకనిర్మలకమలాకరంబు 1730
పాలు పొందున త్తటంబున మహావటము
బలసినశాఖల బయ లెల్లఁ గప్పి
యిరవొందు నచ్చట కిందఱఁ గొనుచు
నరిగి పథిశ్రమ మంతయుఁ దీఱ
నుదకంబు గ్రోలి యుర్వీరుహంబు
వదలక చేరుఁ డెవ్వరిఠావుఁ గాదు
'చనుము నీవచటి కీజాడగా'ననుచుఁ
జనియె నదృశ్యుఁడై చయ్యన నంత
రవిబింబ మపరాంబురాశిలో మునిఁగె
గవఁ బాసి చక్రవాకంబులు గుందెఁ 1740
గొఱఁకులు మాని పక్షులు గూండ్లు సేరెఁ
గుఱుకులు గట్టి చీకురువాయు లడరెఁ
బొలిచి తారలు మింటఁ బొడసూపఁ దొడఁగె

---

మని కూయఁగా, అల్పాంబుపాదంబు=అల్పమైనజలమును పానము చేయుట, చేవాటు నేల=చేతితో రాయి విసరివేయునంత దూరపుచోటు, కమలాకరము=సరస్సు, అత్తటంబునన్=దానిగట్టున, ఇరవొందున్=నెలకొనియుండును, ఉర్వీరుహంబు=చెట్టు, ఎవ్వరిఠావుఁ గాదు=అదియొక్కరిచోటును గాదు, ఈజాడఁగాన్=ఈచాయగా, అపరాంబురాశి=ఉత్తరసముద్రము, కవబాసి=జోడువీడి. కొఱఁకులు=పసులు పైరుమేసెడిపాలములు, కుఱుకులు=గుంపులు, జిలుగుగాన్=స

జిలుగుగాఁ దొలుసంజె చీఁకటి వర్వెఁ
జెవులు సిందఱలు వ్రేఁజెలఁగెఁ జిమ్మటలు
దివిరి పుట్టలు వెళ్లి తిరిగె సర్పములు
మందచూపులతోడ మలసె ఘూకములు
దండిభూతంబు లుద్దండత మెలఁగె
నప్పుడు భూపాలుఁ డా మాయతపసి
సెప్పినయామట్టి చెట్టు చక్కటికిఁ 1750
జనఁ బూని నందను జంకను బెట్టి
మునికుమారుని దనమూఁపుపై నునిచి
యఱకడంబునఁ గాంత ననువుగా నునిచి
యొఱ వాయఁ బెఱికి మహోగ్రంబు గాఁగఁ
గరమునఁ బూనినఖడ్గప్రకాశ
మరుదుగాఁ గరదివ్వె యై త్రోవఁ జూప
ననహాయశూరుఁడై యరుగు చున్నంత
* వసుమతీనాథుభావంబు గలంప
ననువు విచారించి యప్పటిమాయ
దనుజుండు తనవికృతపురూపు మాని 1760
యెలమి వసిష్ఠమునీశ్వరాకార
మలవడఁ గైకొని యధిపుకట్టెదుర

---

న్నగా-మసకగా, మందచూపులు=మంటలు గలదృష్టులు, ఘూకములు = గూబలు, దండి భూతములు=పెనుభూతములు, చక్కటికిన్ =దిక్కునకు, అఱకడము=మూఁపు, అనువుగాన్ =పొందికగా, ఒర=గవుసెన, వాయన్ =విడుచునట్లుగా, కరదివ్వె=దివ్వటీ, అనువు=ఉపాయము, పావన...చరిత=పవిత్రమైనసత్య

* ఇది మొదలుగా 1885 వ పాదమువఱకుఁగల పాఠము పెక్కుప్రతులఁ గానిపింపదు. పద్యకావ్యములను సంస్కృతమూలమునను; లేదు.

నిలిచి దీవించిన నీరజమిత్ర
కులదీపకుండును గొబ్బునఁ బొడము
ముదమున హస్తముల్ మోడ్చి ఫాలమునఁ
గదియించి పలికె 'నక్కట గురునాథ
యిచ్చటి కీవేళ నేమికారణము
విచ్చేసితిరి జగద్విఖ్యాతచరిత'
నావుఁడు 'వినవయ్య నరనాథచంద్ర
పావనసత్యసంభాషణతిలక 1770
కపటనాటకుఁ డైన కౌశికుఁ డాత్మఁ
గృప మాలి నినుఁ బట్టి కిటుకులు వెట్టి
యలయక వడిఁ బేర్చి యదలించి గుండె
జళుకు పుట్టించి నీసకలరాజ్యంబు
గోడు గుడువఁ బుచ్చుకొని యొక జిఱ్ఱు
త్రాడుగా మరువనిదావలఁ బెనఁచి
కొడుకు నిన్నును నాలి ఘోరాటవులకు
వెడలఁ ద్రోచినవార్త విని మదిఁ గుంది
చనుదెంచితిని హరిశ్చంద్ర నీవిట్టి
యనదచందమున నిట్లడవులఁ దిరుగఁ 1780
జెనఁటి యై నిన్నింతఁ జేసినగాధి
తనయుని మత్కోపదావాగ్ని శిఖలఁ

---

మును పలుకువారిలో మేటి వైనవాఁడా, కిటుకులు=చిక్కులు, జళుకు=బెదరు, గోడు కుడువన్=దుఃఖమనుభవించునట్లుగా, జిఱ్ఱుత్రాఁడుగాన్=పురియెక్కించినత్రాఁడుగా, మరువనిదావలు=మచ్చిక పడనిత్రిప్పలు-అనుభవించియెఱుఁగని కడగండ్లు, పెనఁచి=చుట్టి-పెట్టి యనుట, అనదచందము=అనాథునివి

జురచుర నెరియించి ప్రుక్కించి నిన్ను
మరిగించి నీపంపుమానిసిఁ జేసి
యెల్ల రాజ్యంబు నీ కిప్పింతు మఱల
నెల్లి ప్రొద్దున' నన్న నినకులేశ్వరుఁడు
తనసూనృతము పెంపు తలకొని మఱియు
ననియె నక్కపటసంయమివరుతోడఁ
'గొనియాడఁ దగుసూర్యకులమునఁ బుట్టి
జననుతుం డైన త్రిశంకుభూపతికి 1790
జనియించి వసుమతీచక్ర మంతయును
ఘనబాహుబలమునఁ గైకొని నిత్య
సత్యసంధుం డన జగముల నెల్ల
నిత్యసత్కీర్తుల నెగడినన్నుఁ
బూని దుర్బోధల బోధించి సత్య
హీనుఁ గావించెదో యితరునిఁబోలె
మున్ను విశ్వామిత్రమునిశిఖామణికిఁ
జె న్నొంద ధార వోసినరాజ్య మెల్ల
దాన మిచ్చుట లేదు తప్పితి ననుచు
నే నేల నేలుదు నిలను గ్రమ్మఱఁగఁ 1800
దలకొని నామేలుఁ దలఁపుట నాకు
నిల యెల్ల మీ రేల నిచ్చుట' యనినఁ

---

ధము, చెనఁటి=దుష్టుఁడు, మరిగించి = నీయందు మచ్చికపడునట్లుచేసి, నీపం పుమానిసి=నీవుపంచినపనిచేయుమనుష్యుఁడు, సూనృతము పెంపు = సత్యముయొక్క అతిశయమును, తలకొని = పూని, తలకొని... నిచ్చుట - నాకు మేలువ దలఁచుటరయే నన్ను భూమినంతయు నేలనిచ్చుట - కావున నిట్టిచెడ్డబోధనలు

జిఱునవ్వు నవ్వి యాక్షితిపతితోడ
మఱియు నిట్లనియె నమ్మాయవసిష్ఠుఁ
'డనఘాత్మ నీతలం పట్టిద యేని
వినుమింక నొక బుద్ధి వివరంబు గాఁగ
నందనుండును నీవు నాతియు వెతలఁ
బొంద నోపరు పుట్టుభోగులు మీరు
మనమార మాయాశ్రమమునకు వచ్చి
దినదినమును హోమధేనువు గురియు 1810
బహువిధాన్నంబులఁ బరితృప్తిఁ బొంది
విహరింప నభిమతవికసితకమల
కమలినీస్థలరుహకమలవనాంత
విమలచంద్రోపలవేదికాప్రాంత
పరిపక్వబహుఫలభారావనమ్ర
సరససాలరసాలసాలాగ్రకలిత
కలకంఠ శుక నీలకంఠ చకోర

---

చేయవలదనిభావము, పుట్టుభోగులు = ఆగర్భశ్రీమంతులు, అభిమత...కలాపములు-అభిమత=ఇష్టములైన, వికసిత=విరిసిన,కమల=తామరలుగల, కమలినీ=సరస్సులయు, స్థలరుహకమల= మెట్టదామరలయొక్క, వన=తంపరయొక్కయు, అంత=కడపల, విమలచంద్రఉపల=నిర్మలములైన చంద్రకాంతపురాళ్ల, వేదికా=తిన్నెలయొక్క, ప్రాంత=ఓరలయందు, పరిపక్వబహుఫలభార=పండిన పెక్కుపండ్లబరువుచే, అవనమ్ర=వంగిన, సరస=మనోజ్ఞములైన, సాల=ఏపెచెట్లయు, రసాలసాల=మామిడిచెట్లయొక్కయు,అగ్ర=కొనలయందు,కలిత=ఒప్పుచున్న,కలకంఠ శుక నీలకంఠచకోర=కోవెలలు, చిలుకలు, నెమళ్లుచకోరములువీనియొక్క,కలకల=కలకలములును, శారికా=గోరువంకలయొక్కయు,కలకలాపములు=అవ్యక్తమధురధ్వనులసమూహములు,ఫలిత...పుంజములు

కలకలశారికా కలకలాపములు
ఫలిత పుష్పిత లతాభవనాంతరాళ
సరసమరందనిర్ఝరకణశిశిర 1820
కలితమిళిందసంగతపికకీర
లలితగీతామృతలహరీవిలోల
కిన్నరకరవల్లకీనాదముదిత
సన్నుతసారంగశాబకప్రముఖ
కోమలవానీరకుంజపుంజములు
సేమ మెలర్ప నచ్చుగఁ గల' వనిన
జననాథుఁ డాధూర్తసంయమితోడఁ
దనమది ధైర్యంబు దప్పక పలికె
'ననిచిన భక్తిమై నాకు నీ వెనుకఁ
జను దేర నది యెట్లు సమకూరు వినుము 1830
పరిపాటి నే మున్ను పలికినమితికి

---

ఫలితపుష్పిత=పండియుపూచియునున్నట్టి, లతాభవనఅంతరాళ=తీఁగయిండ్ల లోపలి,సరస=రసవంతములైన,మగందనిర్ఝర=పూఁదేనెవాఁకలయొక్క, కణ=బొట్లచేత,శిశిర=చల్లనై; కలిత=ఒప్పుచున్న, మిళింద=తుమ్మెదలతో,సంగత=కూడిన, పికకీర=కోవెలలయుచిలుకలయు, లలితగీత అమృత = ఇంపయిన పాటలనెడి అమృతముయొక్క, లహరీ=ప్రవాహముచేత, విలోల=చలితమై=వ్యాప్తమై;కిన్నర=కిన్నరులయొక్క, వల్లకీనాద=వీణాధ్వనిచే, ముదిత=సంతసిల్లిన, సన్నుత=పొగడ్తకెక్కిన, సారంగశాబక = జింకపిల్లలు, ప్రముఖ=మొదలైనవానిచేత, కోమల=మనోజ్ఞము లైన, వానీర=ప్రబ్బలితీఁగల, కుంజ=పొదలయొక్క, పుంజములు = సమూహములు,అచ్చుగన్ = రూఢిగా,ధూర్తసంయమి=దుష్టుఁడైనముని,ననిచినభక్తిమైన్=అతిశయించినభక్తితోడ,పరిపాటి=

స్థిరమతిఁ దీర్చి కౌశికమునిచేత
ననఘాత్మ, నీఋణం బంతయుఁ జెల్లె
ననిపించి పిదపఁ బో మ్మనిపించుకొనక
నప్పు వై నుండంగ నన్న పానాదు
లెప్పాటఁ జవి యగు నెన్ని చందముల
నేగతి నిం పగు నింక నోం డనక
సాగి విచ్చేయుఁ డాశ్రమమున' కనిన
మైకొన కనియె నమ్మాయవసిష్ఠుఁ
'డాకౌశికునిఋణం బంతయుఁ దీఱఁ 1840
జెన్నొందఁగా ననుష్ఠించుసన్మంత్ర
మున్నది దాని నీకుపదేశ మిత్తు
నది లక్ష జపియింప నగు నిష్టసిద్ధి
విదితంబుగా' నన్న విభ్రాంతి నున్న
మనుజేశునకుఁ జంద్రమతి యిట్లు లనియె
'దినకరకులనాథ తెలియక యిచటఁ
జను నె మాటలఁ బ్రొద్దు జరపుచు నిల్వ
మునివేషరాజుఁడు జలమ్ములకు వాచారఁ
గపటనాటకుఁ డైన కౌశికుఁ డాత్మఁ
గృప మాలి మనల నంకిలి వుట్ట నిట్లు 1850
చెలఁగి పుత్తేర వసిష్ఠునిరూపు

---

కమును, ఎప్పాటక = ఏవిధమున, మైకొనక = సమ్మతింపక, విదితంబుగాక = స్పష్టముగా, విభ్రాంతి = తబ్బిబ్బు, వాచారక = పరిదేవనము సేయఁగా, కపటనాటకుఁడు = కపటములనటించువాఁడును - లేనిపోనిజాలములెల్ల ప్రదర్శించువాఁడు, అంకిలి పెట్టక = అడ్డపెట్టుటకై, పుత్తేరక = పంపఁగా, మాయకాఁ

నెలమిఁ గైకొని యితం డెవ్వఁడో యొక్క
మాయకాఁ డేతెంచి మనలను గల్ల
సేయుచున్నాఁ డెడ సేయక వీనిఁ
దెగటార్చు'మను నంత దిగ్గన వాఁడు
మగిడె నదృశ్యుఁ డై మాయ పెంపునను
నలరేఁగి యట మూఁడునాల్గు వాలములు
గల వృశ్చికంబులు క్రమమునఁ బడియె
నిరువది యేనూఱు నిన్నూఱుతలల
నరుగుపన్నగము లుద్ధతి వేనవేలు 1860
మెఱుఁగుఁగోఱలను వల్మీకముల్ వెడలి
యుఱుపుట్టకోమల నుఱికి యత్యుగ్ర
మడరంగ జిహ్వ లల్లార్చు బు స్సనుచు
నొడిసియుఁ బ్రాణంబు లుడుగక మొత్తి
యఱిముఱి మర్మంబు లందంద నొవ్వఁ
గఱచియుఁ బదములు గదియఁ జుట్టియును
బెడిదంపుఁగోఱలఁ బిరిగొన్న మెఱుఁగు
లడరంగ వదనగహ్వరములు విచ్చి
ఘూటించి నేలతోఁ గొట్టి వాలములు
దాటించి మిగుల దిక్తటములు వగులఁ 1870

---

డు=మాయలు పన్నువాఁడు, కల్లసేయుచున్నాఁడు=నిజము తప్పించుచున్నాఁడు, ఎడసేయక=ఆలస్యము సేయక, తెగటార్చుము=చంపుము, పన్నగములు=సర్పములు, యుఱుపుట్టకోమలన్=ఒప్పుచున్న పుట్ట చివరలనుండి, అల్లార్చి=ఆడించి, అఱిముఱిన్=సంభ్రమమున, పిరిగొన్న మెఱుఁగులు=ఒండొండితోఁ గలసిన కాంతులు, వదనగహ్వరములు=నోళ్లు, ఘూటించి=అఱచి, ఉదరి=చలించి,

బదివేలపిడుగులు పడినచందమున
నుదరి గొప్పచు మీఁద నుఱికియు నిట్లు
చేకొని యలఁచువృశ్చికముల నుగ్ర
కాకోదరంబుల ఘనమృగావళులఁ
జదియఁ ద్రొక్కియు నేలఁ జమరియు ముష్టిఁ
జదిమియుఁ గటములు చదియలు గాఁగఁ
బడగ లొత్తియును నిర్భరవృత్తి విషము
లుడుగక ముఖమున నొడియ నందంద
వడిఁ జిఱజిఱఁ ద్రిప్పి వసుమతితోడ
నడిచియుఁ గణికలయట్లు ద్రుంచియును 1880
దౌడలఁ బాపియు దంష్ట్రంబు లెల్ల
నూడి రాఁ బెఱికియు నుగ్రఖడ్గమున
నఱికియుఁ బొడిచియు నాలుగుదెసలఁ
బఱపియు నీరీతిఁ బరిమార్చి చుట్టుఁ
బన్నినబహువిఘ్నపటలంబు లడఁచి
చెన్నొంది పెన్నిధిఁ జేరుచందమునఁ
జటుల పాఠీన భుజంగమ మకర

---

కాకోదరములన్ =సర్పములను, చదియన్ =చితుకునట్లు, నేలన్ చమరి= నేలమీఁదఁబడఁగొట్టి, ముష్టిన్ చదిమియు = పిడికిళ్లతో గ్రుద్దియు, కటములు=దౌడలు, చదియలు=తునకలు, నిర్భరవృత్తిన్ =నిబ్బరమైనవిధమున, వసుమతితోడనడిచియు= నేలతోఁగొట్టియును, కణికలయట్లు=నలుసులవలె-నలుసులుగా, దంష్ట్రంబులు=కోఱలు, పఱపియు=పాఱఁద్రోలియు, పరిమార్చి=చంపి, చుట్టున్ పన్నిన=తననలుప్రక్కలను సమకట్టినట్టి, పెన్నిధి=గొప్పనిధానము, చటుల...జనకమై-చటుల=చలించుచున్న, పాఠీన=చేఁపలు, భుజంగమ=పాములు, మకర=

పటు నక్ర కర్కటోద్భట శింశుమార
ఘనకమఠాది భీకరజలగ్రాహ
జనక మై వనగజజలపానజనిత 1890
ఘుమఘుమశబ్దసంకుల మైన మడువు
కమలాప్తకులుఁ డంతఁ గదిసి యచ్చోటఁ
దనయుని మునిపుత్రుఁ దనకూర్మిపత్ని
నను పొంద డించి తోయములు ద్రావించి
వెనుకఁ దా సంధ్యాదివిధు లందుఁ దీర్చి
తని వార జలములు ద్రావి యాక్రేవ
నాకులతఱు చనునట్టిపెన్నెఱులఁ
జీఁకటి మేన నిల్చిననల్పు గాఁగఁ
గురుదీర్ఘశాఖాగ్రకోటరఫణుల
గరళవహ్నులు కొఱకచ్చులు గాఁగ 1900

---

మొసళ్లు, పటు=భయంకరములైన, వక్ర=కుటిలములైన, కర్కట = ఎండ్రకాయలు, ఉద్భటశింశుమార= బెడిదమైననీరుకోఁతులు, ఘనకమఠ=గొప్పతాఁబేళ్లు, ఆది=మొదలైన, భీకర=భయంకరములగు, జలగ్రాహ=జలజంతువులకు, జనకమై=పుట్టించునదియై, వనగజ...సంకులము= అడవియేనుఁగులునీళ్లుత్రాగుటచేతపుట్టిన ఘుమఘుమయను శబ్దముచేతవ్యాప్తమైనది; తనివు ఆరన్=తృప్తిపూర్ణముగాఁ గలుగునట్లుగా, ఆక్రేవన్ = దానిప్రక్కను, ఇట బేతాళవటమును కొఱవిదయ్యముగారూపించుచున్నాఁడు: ఆకులతఱచు=ఆకులజొంపము, అనునట్టిపెన్నెఱులన్ = అనెడిగొప్పవెండ్రుకలతోడ, చీఁకటి, మేననిల్చిన ల్పుగాఁగన్ =దేహమునందుండెడి నల్లనిచాయగాఁగా, గురు...వహ్నులు, గురు=గొప్పలును, దీర్ఘ=నిడుదలునైన, శాఖా=కొమ్మలయొక్క, అగ్ర= మొదళ్లందుఁ గల, కోటర=తొఱ్ఱలయందలి, ఫణుల=సర్పములయొక్క, గరళవహ్నులు= విషాగ్నులు, కొఱకచ్చులుగాఁగన్ = కొఱవులుగాఁగా, వఱలుజొంప

వఱలుజొంపముల వెల్వడుకీటమణులు
మెఱసి కన్నుల రాలుమిడుఁగుర్లు గాఁగ
నురుతరంబుగ వ్రేలునూడలు వ్రేళ్లు
విరియఁ బోసినతలవెండ్రుకల్ గాఁగఁ
గులిశదుస్సహఘూకఘూంకృతిధ్వనులు
వెలుచ హుమ్మని వెఱపించుట గాఁగఁ
దఱిమి మిన్నులతుదఁ దాఁక బిట్టెగసి
కొఱవిదయ్యము నెట్టుకొని యున్నకరణి
నున్న బేతాళవటోర్వీరుహంబు
నన్న రేంద్రుఁడు గాంచి యామ్రానిక్రింద 1910
ననుపారఁ బూరిఁ బానుపు రచియింపఁ
గొనకొని నక్షత్రకుఁడు శయనించె
నామునినందనునడుగులక్రేవ
భూమిపైఁ గట్టినపుట్టంబుకొంగు
మడతగాఁ బఱిచి కుమారుఁడుఁ దాను
నడచినయలఁతఁ బేరాఁకట మునిఁగి
పడి నిద్రఁ జెందినబాల మృగాక్షి

---

ముల్ = ఒప్పుచున్న ఆకుగుబురులందుండి, కీటమణులు = మణులవలె తళతళ మను పురుగుల మెఱుఁగులు, కన్నులరాలు మిడుఁగుర్లు = కన్నులనుండి రాలుచున్న నిప్పుకలు, కులిశ...ధ్వనులు-కులిశ = వజ్రాయుధమువలె, దుస్సహ = సహింపరాని, ఘూక = గూబలయొక్క, ఘూంకృతిధ్వనులు = ఘూంఅనుశబ్దములు, మిన్నులతుదర్ = ఆకాశముకొనను, నెట్టుకొని = నెలకొని, వటఉర్వీరుహము = వటవృక్షము, ననుపుఆరర్ = నున్నగానుండునట్లు, మృగాక్షి = లేడివంటికన్నులుగలది, ఉడురాజబింబ ఆస్య = చంద్ర

నుదురాజబింబాస్య నుత్పలగంధిఁ
దనుమధ్య నున్నత స్తనకుంభయుగళఁ
దన దేవిఁ జూచి చిత్తంబునఁ బొగిలి 1920
పాయనిమృగభూతపంక్తులవలన
నేయుపహాతులు దన్నెసఁగక యుండ
నామువ్వురను వేగునంతకుఁ గావ
భూమీశ్వరుండు తెంపునఁ గాసె బిగిచి
యురుతరభుజవిక్రమోన్నతి మెఱయఁ
గరవాలహస్తుఁడై కాపుండె నంత
నాయర్ధరాత్రంబునప్పుడామఱ్ఱిఁ
బాయక వసియించు బహుపిశాచములు
మానిసిగాలుఁ బల్లఱుఁ బసిగొనుచు
నానాముఖంబుల నలి దిగఁబాఱి 1930
కిలకిలస్వరములఁ గెరలి యొండొంటిఁ
బిలుచుచు రేఁగిన పెరయీఁగలట్ల
తఱిఁ గని కవయ నదల్చి రాకుండఁ

---

బింబము వంటి మొగముగలది, ఉత్పలగంధి=కలువపూవువంటి మేనివాసనగలది, తనుమధ్య=సన్ననినడుముగలది, ఉన్నత స్తనకుంభయుగళ=పొడవులై కుండల వంటిచన్నుల జంటగలది, ఉపహతులు = ఉపద్రవములు, వేగునంతకున్ = తెల్లవాఱువఱకు, ఉరు... మోన్నతి= మిక్కిలిగొప్పదైన బాహాపరాక్రమము యొక్క అతిశయము, కరవాలహస్తుఁడు = కత్తిచేతఁగలవాఁడు, మానిసిగాలు =మనుష్యునివాసన, పసిగొనుచు= గాలిపట్టుచు, నానాముఖంబులన్ = పెక్కుదిక్కులనుండి, దిగఁబాఱి=దిగివచ్చి, కెరలి=విజృంభించి, పెరయీఁగలు= తేనెటీఁగలు, తఱి గని కవయన్ =సమయముకనిపెట్టిక్రమ్ముకొనఁగా, బడుగు=

బఱపి భూపాలుఁ డాబడుగుదయ్యములఁ
బట్టి వధించుటేఁ పౌరుషం బనుచు
నెట్టన మొల నున్న నెఱికత్తిఁ దివిచి
కొన్నింటిముక్కులుఁ గొన్నింటిచెవులుఁ
గొన్నింటిచెక్కులుఁ గోఁతలు వెట్టి
యసికోఁతలుగ గోయ నంత నవ్విభుని
యసికోఁత లసిఁబోవ నప్పిశాచములు 1940
బేతాళపతికిఁ జెప్పిన వాఁడు నడరి
భూతభయంకరస్ఫూర్తి మైఁ బేర్చి
ఘోరిఁ దారకలు మొలపూసలు గాఁగఁ
బెరిఁగి బ్రహ్మాండంబు భేదిల్ల నార్చి
భీకరడాకినీప్రేతబేతాళ
శాకినీగణము లసంఖ్యముల్ గొలువఁ
బరుస నై పెరిఁగినపల్లవెంద్రుకలు
గరువలిచే భయంకరముగాఁ దూల
వడిఁ ద్రావ ఱొమ్మువై వఱదలు వాఱ
నుడుగక వడియుచు నున్నరక్తంబు 1950

---

కృశించినది. ఏఁపౌరుషము=ఏమిమగతనము, నెట్టనఁ=తోడనే, నెఱికత్తి=పట్టాకత్తి, తివిచి=దూసి, అసికోఁతలుగ=చిన్నకోఁతలుగా, అసికోఁతలు=కత్తికోఁతలు, అసిఁబోవఁ=తప్పిపోవఁగా, భూతభయంకరస్ఫూర్తి=ప్రాణులకుభయంకరమైనతోఁపికతో, ఘోరిఁ=మాటికిని, తారకలు=నక్షత్రములు, మొలపూసలు=మొలగట్టుకొనెడి తెల్లపూసలు-అంతపొడవుగా పెరిఁగినాఁడనుట, పరుసనై=బిఱుసై, పల్లవెంద్రుకలు=పాటలవర్ణముగలవెంద్రుకలు, కరువలి=గాలి, తూలఁగ=చలింపఁగా, వఱదలు=వెల్లువలు, కాలఅనలజ్వాలకై వడిఁ=ప్రళయాగ్నిశిఖవలె, ముసుసుల పేర్లు=ఎముకలదండలు, నరములు... పేర్లు=నరములను

కాలానలజ్వాలకైవడిఁ గ్రాలు
నాలుక నందంద నాఁకి సోలుచును
బెను పొంద నరములుఁ బ్రేవులుఁ గలయఁ
బెనఁచి వెంట్రుకలతోఁ బెదపెద్దదలలు
ముడివడ నేసినముడుసుల పేర్లు
మెడ వ్రేల వలచేతిమెఱుఁగుశూలమునఁ
బొట్ట వ్రక్కలు గాఁగఁ బొడిచి తూఁగాడఁ
బట్టినపీనుఁగుపచ్చిమాంసంబుఁ
గఱచి పీఁకుచుఁ జేతఁ గలమోటుఁబలక
పుఱియ మూఁగలు బొడబొడ మని మ్రోయ 1960
మెదట వట్లును గట్టి మెలికలు గొన్న
ముదురుజుంజుఱుమీసముల నులికొల్పి
ఘనతరలయకాలకాల మేఘంబు
మునుకొని బేతాళమూర్తి వహించి
చటులరౌద్రాకృతిఁ జనుదెంచులీలఁ
బటువజ్రనిష్ఠుర పాదఘట్టనల

---

ప్రేవులను పెనఁచి దారము గాఁ జేసికొని వానితో ఎముకలను దండ గాఁ గట్టియా దండలో పెద్ద పెద్దతలలను వాని వెంట్రుకలతో ముడివేసియున్నాఁడనుట, మెఱుఁగుశూలము= తళతళ మెఱయుశూలము, తూఁగాడఁ బట్టిన = వ్రేలాడునట్లు చేతఁ బట్టుకొన్న, మోటుఁబలక పుఱియ=మ్రాని మొద్దుతో చేయఁబడిన పునుక, మూఁగలు=దోమలు, మెదటవట్లును గట్టి= మెదడు అంటియుండుటచే పక్కులుగట్టి, మెలికలుగొన్న = ఒకటొకటితోఁ బెనఁచుకొని చిక్కుగొన్న, ముదురుజుంజుఱు మీసములు=దట్టమైన చింపిఱిమీసలు, నులికొల్పి=వంకరగా దీర్చి, ఘనతరలయకాల కాల మేఘంబు=మిక్కిలిగొప్పదైన ప్రళయకాల మేఘము, పటువజ్రనిష్ఠురపాద ఘట్టనలన్ =దృఢమైనవజ్రమువలె దెప్పరమైన యడుగు తాటింపులచేత, లపలప

లవలవ లై కుతలంబు గ్రక్కదలఁ
దవిలి యేతెంచుబేతాళునిఁ జూచి
యప్పుడు భయ మించు కైనను లేక
తెప్పిఱి నిద్రఁ జెందినచంద్రమతిని 1970
దనతనూభవు మునితనయునిఁ జూచి
తనలోన వగచి 'యి త్తఱి వీఁనిద్ర
సెడకుండ వీని నిర్జించుట కర్జ
మడరంగ' ననుచుఁ జయ్యన నెదు రేఁగి
యట ద్రోఁచి రాకుండ నడ్డమై నిలిచి
పటు ఖడ్గ మంకించి పలికె భూవిభుఁడు
'ఎందుండి వచ్చెద వేల నీవేళ
నెందటు దవ్వగా నేఁగుమీ తొలఁగి
వడిఁ ద్రోఁచి యిటు గ్రమ్మి వచ్చితి వేని
నడుము రెండుగ నిన్ను నఱికి పోవైతుఁ 1980
గయ్యాలక్రచ్చలై కడఁగి యీవచ్చు
దయ్యాలముక్కలు దఱిఁగి ఖండింతుఁ
దమకించి లోహశోధనము లాఁకటికి
నమల వచ్చు నెటు మైనపుదంతములకు
నిప్పలఁ జెద లంట నేర్చునే మాకు
నిప్పుడు నీచేయునెగ్గు లే మాను

---

లై=భేదిల్లినదై, తెప్పిఱి=తేఱి, నిర్జించుట=గెలుచుట, కర్జము=చేయఁదగినపని, త్రోఁచిరాకుండఁగ=పైపడి రాకుండునట్లుగా, అంకించి=చేతఁబట్టి, త్రోఁచి=పైపడి, క్రమ్మి=కవిసి, కయ్యాలక్రచ్చలై=జగడగొండ్లయి, తమకించి=ఆతురపడి, లోహశోధనములు=ఇనుపనిమ్మపండ్లు, లోహ... దంతములకు=మైనపుదంతములుగలవా

జెలఁగి విశ్వామిత్రుశిష్యుఁ డావడుగు
నలినలోచన యిది నాకులకాంత
యమ్ముద్దులాఁడు న న్నలరించుపుత్రుఁ
డిమ్మెయి నిద్ర వ్రాయెడుచోటికిపుడు 1990
నిద్ర వారింపఁ బూనిన నిన్ను దీర్ఘ
నిద్రఁ బొందించి నే నీగర్వ మడఁతు’
ననుటయు వాఁ డట్టహాసంబుఁ జేసి
కనుఁగవఁ గోపాగ్నికణములు రాల
వేఁడిమంటలు నోర వెడలంగ నిలిచి
వాఁడికోఱలఁ దీడి వడి నౌడు గఱచి
ఘు మ్మని ఘనగిరిగుహాలు మార్మ్రోయ
హు మ్మని మ్రోయుచు నుర్వీశుఁ జూచి
‘యోరి నా ముందఱ నోడక నిలిచి
ధీరతఁ జావఁగఁ దెగుదెంపుఁ జేసి 2000
రజ్జు లాడెదవు నారాయిడిఁ గలఁగి
ముజ్జగంబులు బెల్లు మురియుచు నుండు
దేవతులకు నైన దృష్టింప రాని
నావటమూలంబునకు వచ్చు టెట్లు
వచ్చి యీ మ్రానికావలిభూతములను
జెచ్చెర ముక్కలు సెక్కుట యెట్లు
చెక్కి యంతటఁ బోక చేరి నాయెదుటఁ

---

నికి - ఆఁకలియనిలోవాశోధనములు నమలవచ్చు నాయనుట, దీర్ఘనిద్ర=మరణము, ఘనగిరిగుహాలు=గొప్పకొండలబిలములు, మార్మ్రోయ=ప్రతిధ్వనింపఁగా, రజ్జులు=దురుక్తులు, రాయిడిచే=ఉపద్రవముచేత, మురియుచున్ ఉండు=తపించుచుం

చెక్కులు ప్రేలి దర్పించుట యెట్లు
కడఁగి మహామారికడుపుఁ బొట్టేలు
వడిఁ జొచ్చి నట్లు నావనముఁ జొచ్చితివి 2010
చచ్చితి గాకని చదలఁ గ్రొమ్మించు
లచ్చుగాఁ జెదర మహారభసమున
వడి శూల మల్లార్చి వైచిన భీతి
యడరక జనపాలుఁ డది ద్రెవ్వ వేసె
వెండియు వాఁ డొక్క వృక్షంబుఁ బెఱికి
చండాంశుకులునివక్షంబు బిట్టడిచె
దానఁ గంపింపక తరువుతోఁ గూడ
వానికరంబు భూవరుఁడు ఖండించె
మిగుల నొచ్చియు వాఁడు మిడివోనికడిమి
బెగడొందఁ బెడచేతఁ బెనురాల రువ్వె 2020
నవి యెల్లఁ జిద్రుపలై యవనిపై రాలఁ
దివిరి ఖడ్గము కేలఁ ద్రిప్పుచుఁ గదిసి
వడిఁ బేర్చి నీలపర్వతశిఖరంబుఁ
బుడమి డొల్లఁగ నేయుపురుహూతులీల
భూతముల్ భయమంది పొరిఁబొరిఁ బఱవ
బేతాళుతలఁ ద్రెవ్వ వ్రేసె భూనాథుఁ
డప్పుడు కౌశికుఁ డంతరంగమునఁ
గప్పినచలమునఁ గరుణఁ బో విడిచి

---

డును, మహామారి=మారిదేవత, క్రొమ్మించులు=క్రొత్తమెఱుఁగులు, అచ్చుగన్=ఉఱిదిగా, రభసము=తొట్రుపాటు, మిడివోనికడిమిన్=తూలిపోవనట్టిబలిమితో, బెగడు=భయము, చిద్రుపలై=తునియలై, నీలపర్వతశిఖరంబు=నల్లకొండకొన,

నిగిడి ప్రేరేచిననీలమేఘములు
గగనమండల మెల్లఁ గప్పి యొప్పార 2030
నెఱరంగునీలాలనెలకట్టుమీఁద
గిఱిగొన గాజు నిగిడ్చి పైనిల్పి
కలయంగఁ బట్టించి కాటుక రొంపి
నలికినగతి నొప్పె నంధకారంబు
నంతకంతకు దట్టమై చెట్టు గుట్ట
గుంత మి ట్టనుచుఁ గన్గొన రాక యపుడు
మున్ను ఱెప్పలు డాయ మూసిన మగుడఁ
గన్నులు విప్ప నొక్కటి గాఁగ నుండెఁ
గాలమేఘంబునఁ గాలభైరవుని
ఫాలలోచన తీవ్రపావకశిఖలఁ 2040
బొగిలెడుదిగధీశపురముల నెల్ల
నెగసి భుగు ల్లను నెఱమంట లనఁగ
మెఱుపులు ధళధళ మెఱువక మున్నె

---

పురుహూతుఁడు=ఇంద్రుఁడు, నెఱరంగు=మంచివన్నెగల, నీలాలనెలకట్టు=నీలములతోఁ బొదిఁగి కట్టిననేల, గిఱిగొనన్=నిలుకడఁగా, గాజు=గాజమన్న - నల్లనియొకదినుసుమన్ను - దానితోఁ జేయఁబడిన, నిగిడ్చి=తట్టి, కలయంగన్=అంతటను, పట్టించి=కాటుకనుపట్టునట్లు చేసి, ఆకాటుకతో, అలికినగతిన్=అంతయు నలికినవిధముగా, ఇట ఆకాశము నీలాలనెలకట్టుగాను, మేఘములు గాజునిగిడిగాను, చీఁకటి కలయంగఁబట్టించి యలికినకాటుకగాను సామ్యము దెలియునది, గుంత=పల్లము, మిట్టు=మిట్ట, డాయ......నుండె=ఱెప్పలు మూసినను తెఱచినను రెండును సమముగానే యుండెను. కాలభైరవునిఫాలలోచనతీవ్రపావకశిఖలన్=ప్రళయకాలరుద్రుని నొసటికంటికడిఁదినిప్పుసెగల చేత, పొగసెడు=రాఁజెడు, దిగధీశ... నెగసి=దిక్పాలకుల పట్టణములన్నిం

యుఱుములు బెళబెళ నుఱిమె నయ్యుఱుము
లట మిన్నుదల మ్రోయునంతకు మున్నె
పెటపెట పెటలి పెన్పిడుగులు వడియెఁ
బిడుగులు నుఱుములుఁ బృథులవేగమునఁ
బడఁబడ వడగండ్లు వడియె నెల్లెడల
వడగండ్లకంటెను వాన మున్నాడి
కడవల జలము లొక్కట వంచి నట్లు 2050
బోరనఁ గురియ నద్భుతమైనవాన
నాఱని దేజంబు నతులధైర్యంబు
నగలనిసత్వంబు నతులసాహసము
తెగనిరాజసము నై దినవాథకులుఁడు
వానఁ దొప్పనదోఁగి వఱదపెన్నీట
నాని యంగంబులు నరములు నొవ్వ
విడువక రువ్వెడువిషమవాయువున
వడఁకునింతిని బుత్రు వడుగును దిగిచి
యనునయం బెసఁగ నిజాంకపీఠమున
ననువొంద నునిచి దైన్యము నొందకున్న 2060
దఱికొని చెఱుపంగఁ దలఁచి కౌశికుఁడు
కరుణ లేక సృజింప కలగొన శేఁగి
నలి రెండు మూఁడును నాల్గు వాలములు

---

టినుండి పైకిలేచి, మిన్నుతల=ఆకాశప్రదేశము, ఆఱని తేజము = తీసిపోవనిప్రతాపము, అతుల=సాటిలేని, అగలనిసత్వము = తఱుఁగనిబలము, తెగనిరాజసము=నశింపనిప్రాభవము, దొప్పనదోఁగి=మిక్కిలితోఁగి, వఱదపెన్నీట=వెల్లువయొక్క గొప్పజలమునందు, రువ్వెడు=విసరెడు, దరికొని=పూని, నిజాంకము=

గల వృశ్చికములును గ్రమమున మఱియు
నిరువదియును నూఱు నిన్నూఱు తలలఁ
బరఁగుపన్నగములు పది నూఱు వేల
వాఁడికోఱలు గలవన్యమృగములఁ
బోఁడిమి బహుకోట్లఁ బుట్టించి పెక్కు
భూతగణంబులఁ బొరి నంప నవియు
భూతలాధీశు సంపూర్ణ ప్రతాపు — 2070
నఱిమఱి మెయి ముట్టి యందంద గుట్టి
కఱచి కాటులను రక్తముఁ గ్రమ్మఁ జేసి
వెఱపించుచును బహువిధముల నొంప
సరభసోద్వృత్తి జర్ఝరితాంగుఁ డగుచు
భుజగకంకణుఁ దలపోసి మహోగ్ర
భుజగవృశ్చికములస్ఫురణ వారించి
శరభ దేవునిఁ గోరి సన్నుతిఁ జేసి
శరభాదిమృగములసంరంభ మడఁచి
భూతనాయకుపాదములు సంస్మరించి
భూతసంఘములయుబ్బులు జబ్బు సేసి — 2080

---

తనయొడి, కలగొనన్ = సందడిగా, సరభస ఉద్వృత్తి = ఉరవడితోఁ గూడినయుద్ధతి, జర్ఝరితాంగుఁడు = ప్రిదిలిన-అనఁగా పటుత్వముతప్పిన యవయవములుగలవాఁడు, భుజగకంకణున్ = సర్పములుకడియములుగాఁగల శివుని, మహోగ్ర=మిక్కిలిభయంకరములైన, భుజగవృశ్చికములస్ఫురణ= పాములయు తేళ్లయు తోఁపిక, శరభ=ఎనిమిదికాళ్లమృగము, సంరంభము= అదటు, శరభదేవుఁడు=శివుఁడు, భూతనాయకుఁడు=శివుఁడు, భూతసంఘములయుబ్బులు! = పిశాచసమూహములనిక్కులు, జబ్బుసేసి=మట్టుపఱిచి, విసుతు

విసుకుపెల్లునఁ గ్రాఁగి వేగ యీరీతి
నెసఁగుకౌశికు మాయలెల్లను గడచి
బలసిననీహారపటలంబుఁ బాసి
వెలుఁగుబాలార్కునివిధమున వెలుఁగు
మనుజనాథునిధైర్యమహిమకు గాధి
తనయుండు నెఱఁగంది తనలోనఁ గుంది
'మలఁగక నాపన్నుమాయ లన్నియును
గొలుపవు వీనిపైఁ గ్రొవ్వి నే నకట
ఘోరప్రతిజ్ఞఁ గైకొని బేల నైతి
నేరమిఁ జెడిపోయె నేఁడు **నాతపము** 2090
ప్రల్లదంబున నిట్టిభంగంబు నొందెఁ
జెల్లుఁ గా కింక వసిష్ఠునిపూన్కి'
యని తన నేరమి కాత్మలో వగచి
మనమునఁ దెలివి గ్రమ్మఱ నూలుకొలిపి
'మోస మెవ్వరి యందు మొలవదు మిగులఁ
జేసినపని కింతఁ జింతింప నేల
మనసు ద్రిప్పక పెక్కుమతముల వీని

---

పెల్లునన్ = విసుగుటయొక్క అతిశయముచేత, క్రాఁగి=తపించి, బలసిననీహారపటలంబున్ = క్రమ్మినమంచుసమూహమును, మలఁగక = వెనుదీయక, నాపన్నుమాయలు = నేనుగావించునట్టిమాయలు, కొలుపవు = పనికిరావు, బేలను=మోసపోయినవాఁడను, నేరమిన్ = నేరకుండుటచేత, ప్రల్లదంబునన్ =దుష్కృత్యముచేత, భంగంబు = అవమానము, పూన్కి = పూనినప్రతిజ్ఞ, వగచి=చింతించి, నూలుకొలిపి=నిలిపి, మోస..... మొలవదు = ఎవ్వరియందు మోసముపుట్టదు - మోసపోనివారెవ్వరు? అనుట, మిగులన్ చేసినపనికిన్ =మించిపోవునట్టుచేసినయైనకార్యమునకు - మితిమీఱిజరగిపోయినకార్యమునకనుట, పె

వెను వెంట నంటి యేవిధమున నైన
బొంకునంతకు మళ్లి పోరుదుఁ గాక
నింక నేమైనఁ బో నీ'ననునంతఁ  2100
గలువలపగవాఁడు గాములఱేఁడు
జలజంబులకుఁ బొందు జక్కవ విందు
మూఁడుమూర్తుల నిట్ట మ్రొక్కుల గుట్ట
వేఁడివేలుపు ప్రభవించెఁ దూర్పునను
బటుబుద్ధి నప్పు డాపార్థివేశ్వరుఁడు
వటమూల మటు వాసి వలనొప్పఁ జనుచు
ముందట నళిబృందములు భ్రమియింపఁ
గెందమ్మికొలను వీక్షించి మోదించి
వెర వొప్ప సంధ్యాదివిధు లందుఁ దీర్చి
పరువడి నాయూయిపల్లెల నడిగి  2110
భిక్షాశనముఁ దెచ్చి ప్రేమతోఁ దొలుత
నక్షత్రకునకుఁ బూర్ణంబుగా నొసఁగి
కడమయన్నము దానుఁ గొంతయు సుతుఁడు
నెడపక ప్రతిదినం బిట్లు భుజించి
పురములు దేశముల్ పుణ్యతీర్థములు

---

క్కమతములన్ =అనేకములైనవిధముల, కలువలపగవాఁడు = కలువపూవులకు విరోధి, గాముల ఱేఁడు=గ్రహాధిపతి, జలజంబులకున్ పొందు = తామరలకు పొందయినవాఁడు, జక్కవవిందు=చక్రవాకములకు పండుగువంటివాఁడు, మూఁడుమూర్తులనిట్ట=త్రిమూర్తులస్థానము, మ్రొక్కులగుట్ట=నమస్కారముల కొండ-నమస్కారములు ప్రోవులుగాఁ జేయఁబడుదేవుఁ డనుట, వేఁడి వేలుపు= సూర్యుఁడు,అళిబృందములు=తుమ్మెదగుంపులు, భ్రమియింపన్ = తామరలందలి

నరనుతం బగునూళ్లు నాళ్లును గడచి
చనుచున్న నారాజుఁ జలపట్టి చెఱుప
మనమునఁ దలపోసి మఱియుఁ గౌశికుఁడు
నమితతపశ్శక్తి నయ్యగ్ని దేవు
నమర నాకర్షించి యతనితో ననియె 2120
'నో పావకుఁడ నీ మహోగ్రప్రతాప
మేపారఁ జుట్టిరా నెరగలి ముట్టి
సుదతితోఁ గూడ నీక్షోణీతలేశుఁ
బ్రిదిలి పోవఁగ నీక పేర్చి దహింపు
మనిలుని నీకు సహాయమై యెసఁగఁ
బనుపుదుఁ జను'మన్నఁ బనిపూని పేర్చి
యురవడి విసరుమహోగ్రవాయువుల
గరగర నొరయుశాఖలకాఁకఁ బొడమి
నెరయఁ గాలినచిఱునిప్పులు నెరసి
పొరిఁబొరిఁ గారాకుఁ బ్రోవులు పొగిలి 2130

---

తే నెకుఁగాను చుట్టిముట్టితిరుగఁగా, నరనుతంబు=మనుష్యులచేస్తోత్రము చేయఁబడినది. నాళ్లను=దేశములును, చేలపట్టి=చలముపట్టి, ఆకర్షించి=బలాత్కారమున రావించి, పావకుఁడ=అగ్ని దేవుఁడా, మహోగ్రప్రతాప = మిక్కిలిభయంకరమైనమగఁటిమి-లేక వేఁడిమి, ఏపు ఆరన్ = విజృంభించునట్లు, చుట్టిరాన్ =నలుప్రక్కలక్రమ్ముకొనిపయినిరాఁగా, ఎరగలిముట్టి=కార్చిచ్చుతగిలి, సుదతితోఁ గూడన్ = స్త్రీ-అనఁగాభార్యతోఁగూడ, ప్రిదిలి=తొలఁగి, పేర్చి=చెలరేఁగి, గరగరన్ =గరగరయని, ఒఱయుశాఖలకాఁకన్ =ఒఱసికొనుటచేకొమ్మలయందుఁబుట్టినవేఁడిమిచేత, నెఱయన్ గాలినచిఱునిప్పులు=పూర్ణముగా కాలిఅయినట్టిచిన్ననిప్పులు, నెరసి=వ్యాపించి-వ్యాపింపఁగాననుట, పొరిన్ పొరిన్ =మాటిమాటికి, కారాకుప్రోవులు = ఎండాకులకుప్పలు, పొగిలి=రాఁజుకొని,

కుఱుచమంటల జీబుకొని యున్నకసవు
చుఱచుఱఁ గమరంగ సురసుర పుట్టి
దరికొని పొదరిండ్లు దళముగా మండి
తరుపంక్తులకు నిక్కి దళములు మునుఁగఁ
గమరి పువ్వులు మ్రందఁగాఁ జివ్వ రనుచుఁ
జిమిడి కాయలు నేలఁ జిటపొట రాల
నురుధూమతతులు బిట్టూఁదర లిడిన
పరుసునఁ దొఱటలఁ బాములు మడియఁ
బృథులశాఖలు గాలి పెళపెళ విఱిగి
పృథివిపై మ్రాఁకులు పెల్లుగాఁ గూలఁ 2140
బులుఁగులు బిట్టు వాపోవుచు నెగసి
పెలుచ ఱెక్కలు మాఁడి పెటపెటఁ బ్రేలఁ
గరి సింహ శరభాది ఘనమృగపంక్తు
లురువడి జ్వాలల నొరలుచు మడియ

---

కుఱుచమంటలన్ = అయెండాకులు రాఁజుకొని పుట్టినచిన్నమంటలచేత, జీబుకొనియున్నకసవు = జొంపముగానున్నట్టికసవు, చుఱచుఱన్ కమరంగ = చుఱచుఱమని కాలఁగా, సురసుర = సుడిగాలి, దరికొని = నిప్పంటుకొని, దళముగాన్ = దట్టముగా, తరుపంక్తులకు = చెట్లవరుసలకు, దళములు = ఆకులు, మునుఁగన్ కమరి = పూర్ణముగా కాలి, మ్రందఁగా = సోలినశింపఁగా, చివ్వ రనుచు... రాలన్ = కాయలుచివ్వరనిమాఁడి చిటపొటయనిక్రిందరాలఁగా, ఉరుధూమతతులు = గొప్పపొగలసమూహములు, బిట్టు = మిక్కిలి, ఊఁదరలు = (ఎలుకలు మొదలైనవి చచ్చుటకుఁగాను వేసెడి) పొగలు, ఇడినపరుసునన్ = వేసినవిధమున, తొఱటలన్ = చెట్లతొఱ్ఱలందు, మడియన్ = చావఁగా-పైకి లేచినపొగలు చెట్లతొఱ్ఱలలోనుండు పాములకు ఊఁదరవేసినట్లుండెననుట, పృథులశాఖలు = పెద్దకొమ్మలు, వాపోవుచున్ = కూయుచు, ప్రేలన్ =

నలవార్ధిజలము చుం యన నింకఁ గ్రోలి
బలసి లోకములెల్ల భస్మీకరింప
నడరెనో బడబాగ్ని యనఁ జుట్టు ముట్టి
పుడమియు దిశలు నభోమండలంబుఁ
గప్పి మండుచు వచ్చుకార్చిచ్చు రాక
తప్పక వీక్షించి ధరణీవల్లభుఁడు **2150**
జాలి నెక్కొన నక్కజంబునఁ జింతఁ
దూలుచుఁ దనదేవితోడ నిట్లనియె
'నీవనవహ్ని నిం కేవిధిఁ గడచి
పోవచ్చుఁ జావక పోరాదు మనకు
నంకించి మునితోడ నాడినమాట
బొంకు గాకుండ నాపూనిన నాఁటి
మితికి ఋణం బెల్లఁ మేలుగాఁ దీర్చి
మృతిఁ బొంద లే నైతి మృగనేత్రి వినుము
వావిరిఁ బుట్టినవారికి నెల్లఁ

---

పేలఁగా, ఒరలుచున్ = తోలుచు, వార్ధిజలము = సముద్రపునీరు, 'చు'ం యనన్ = చుం అని, ఇంకన్ గ్రోలి = ఇంకిపోవునట్లుత్రాఁగి, అడరెనో = తలపడెనో - సముద్రపునీళ్లంతయు త్రాగి తీఱఁగా పిదపలోకములనెల్ల చుట్టుక్రమ్మి నీఱుసేయుటకు బడబాగ్ని తలపడినదో యన్నట్లు, నభోమండలము = ఆకాశము, కారుచిచ్చు పుట్టినవిధ మెట్లనఁగా;- మొదటబిట్టుగా వాయువులు వీవఁగా చెట్లకొమ్ములు ఒరసికొని వేఁడిమిపుట్టి దానివలన చిఱునిప్పులు గలిగి యవి కారాకుగుంపులంబడి రాఁజిచిన్నమంటలు పుట్టి యామంటలు కసవుజొంపము నంబడి కాలిక్రమముగా పొదరిండ్లు రగులుకొని మండి చెట్లకుఁదగిలి పెనుజ్వాలలుగా చుట్టుక్రమ్ముకొన్నదయ్యెననుట. నెక్కొనన్ = కలుగఁగా, అక్కజంబు = మిక్కుటమైనది, అంకించి = పూని, నాపూనిననాఁటిమితికి = నేను ప్రతిజ్ఞ చే

జావక పో రాదు చర్చించి చూడ 2160
ధరణీశుఁ డగునాకు దర్ప మేర్పడఁగఁ
బరబలంబులు సొచ్చి బలువిడిఁ గడచి
వెస నురస్థలిఁ గాఁడి వీఁపున వెడలు
నిశితాస్త్రములఁ జచ్చి నెఱి నిందు నందు
వినుతి కెక్కుట మాని విన సైఁప రాని
వనవహ్నిఁ గాలంగ వలసె నీరీతి
నాతి నాదుర్మరణమునకు వగవ
బ్రాఁతి యైనట్టియీపట్టికి వగవ
గురుభక్తి మేకొని ఘోరాటవులకు
నరుదెంచి మనతోడ నలజడిఁ బొంది 2170
కడపట నేఁ డిట్లు కాలాగ్ని చేత
సుడివడు మునితనూజునకు నే వగతు
నీమహాపాతకం బేమిటఁ బాయుఁ
గామిని నా కింక గతి యొండు లేదు
కన్నుల నీపాతకము గనుంగొనక
మున్నె యిచ్చెదఁ బ్రాణముల వహ్ని కనుచు
మనసులో శివు నిల్పి మంటకు నెదురు
చను చున్నయాహరిశ్చంద్రునిఁ జూచి
నిగుడుశోకము మది నిల్పి నవ్వుచును

---

సిననాఁటిగడువునకు, కాఁడి=దూసికొని, నిశితఅస్త్రములన్ = వాఁడిబాణములచే, ప్రాఁతి= గారాబు, పట్టి=బిడ్డఁడు, మేకొని=సమ్మతించి, సుడివడు= చిక్కుకొన్న-తబ్బిబ్బుపడు, మునితనూజునకున్ = మునికుమారునకు, నిగుడుశోకము=పయిపయి రేఁగుచున్నదుఃఖము, మదినిల్పి=మనస్సులో నేయడఁచి, నవ్వు

దెగువమైఁ జంద్రమతీదేవి వలికె 2180
'దేవ మీ కిట్లైల ధృతి దూలి పలుక
భావింప నసమానభాగ్యసంపదల
లలితమంగళసూత్రలక్ష్మి నిక్కముగఁ
దలఁచెదుచో నాకు దైవ మెంతయును
బగ గాని యిటు నగుఁబాటు గావింప
వగల నొక్కించుక వడి నిన్నుఁ బాసి
కడులోల నై యుండఁగా నెట్టు లోర్తు
జడియక పదివేలజన్మంబులందుఁ
బతి నీవ కాఁ గోరి పడి వహ్నిఁ గాలి
మృతిఁ బొంది పొందుదు మీఁద నీపొందు 2190
సమ్మద మార నీచన విచ్చి నన్నుఁ
బొమ్మని యానతీ పోదు వే వేగ'
యనిన భుగాలున నడరుశోకాగ్ని
మనసు సుఱుక్కని మనుజేశుఁ డనియె
'జలజాక్షి నీకిట్టిసాహసకృత్య
మలవడ నోపునే యక్కటా నీవు
తొడిబడఁ జచ్చినతోడనే బెగడి

---

చును=దుఃఖాతిశయముపట్టలేక నవ్వుచును, లలితమంగళసూత్రలక్ష్మి=ఒప్పుచున్న మంగళసూత్రముయొక్క సంపత్తిని-మంగళసూత్రపుబలిమి ననుట, నగుఁబాటు =నవ్వులాటసేయఁగా- నామంగళసూత్రము వ్యర్థము కానిదని తలఁచియుండఁ గా దైవమేయిట్లునన్ను అగడుసేయు నేని యనుట, వగలన్ = దుఃఖములచే, సమ్మదము ఆరన్ =సంతోషమునిండఁగా, ఈచనవు = నేను ముందగ్నిలోఁబడి మృతిఁబొందెడిస్వాతంత్ర్యము, ఆనతీ=ఆనతిమ్ము, తొడిఁబడన్ = తొందర

విడివడఁ బ్రాణముల్ విడుచు నీశిశువు
సుతుఁడు నీవును జావఁ జూచి ప్రాణంబు
ధృతి నిల్పి యెట్లు వర్తింపఁగ వచ్చు 2200
వచ్చునే నో రాడి వాక్రుచ్చి నిన్నుఁ
జిచ్చులోఁ బడు మని చెలఁగి వీడ్కొలుపఁ
గరుణామాలినయట్టికఠినాత్ముఁ డైన
నరునిఁ బల్కినరీతి నయ మేది నన్నుఁ
బలికితి పలు'కని బాష్పపూరంబు
నెలమి ఱెప్పల నిల్పి యేఁగుచు నున్న
మనుజేశునకుఁ జంద్రమతి సాఁగి మ్రొక్కి
ఘన మైనభక్తితోఁ గరములు మొగిచి
'నలినాప్తకులనాథ నావిన్నవించు
పలుకు వేఱొకటిగా భావింప వలదు 2210
దలముగా నలుదిశల్ దలకొని మండఁ
జలిచీమ కొఱవిపైఁ జనుదెంచినట్లు

---

పాటుతో, బెగడి=బెదరి, ధృతిన్=ధైర్యముతో, నోరాడివాక్రుచ్చి=నోరు కదల్చి చెప్పి, 'నిన్ను... చిచ్చులోఁబడు మని నోరాడి వాక్రుచ్చి చెలఁగివీడ్కొలుపవచ్చునే' అని యన్వయము. కరుణ... ...నరునిన్=దయలేక కఠిన హృదయుఁడైనమనుష్యునితోఁ జెప్పినట్లు, నయముఏది=మెత్తనవిడిచి, 'నన్నుఁ బలుకు పలికితి' అని అన్వయము, దలముగా ..చనుదెంచినట్లు = నలుప్రక్కల దట్టముగా కార్చిచ్చు క్రమ్ముకొని వచ్చుచుండఁగా చలిచీమ తప్పించుకొనుటకై నడుమనున్నయొక కొఱవిపైనెక్కి ప్రాఁకినట్లు నక్షత్రకుఁడు తమ్ము నండగొని యొదిఁగియున్నాఁడనుట. తమ్ము కొఱవిగా రూపించుటచే తాము ను ఆకార్చిచ్చులో కొఱవివలెఁగాలనుండుట సూచితము. చలిచీమ కొఱవి నాశ్రయించుట యెట్లువ్యర్థమో అట్లేకాలనున్నత మ్మాశ్రయించుటయు వ్యర్థమనుట, ఉలికి=భ

వలయంబుగా మండి వచ్చు కార్చిచ్చు
కులికి యొందును వెళ్ల నుఱికి పోరాక
సుడి వడి మనలోనఁ జొచ్చి వాతెఱలు
దడుపుచు నున్న యీతపసికుమారుఁ
గొంకక వెస నెత్తుకొని వెరవైన
వంకగా నీవహ్నివలయంబు గడపు
మీవు గల్గినఁ దీఱు నీమునిఋణము
నీవు గల్గినఁ గల్గు నెలఁతలపొందు 2220
నీవు గల్గినఁ బుత్రనివహంబు గలుగు
నీవు గల్గినఁ గల్గు నిత్యసౌఖ్యములు
నీవు గల్గినఁ గల్గు నిత్యధర్మములు
నీవు గల్గినఁ గల్గు నిఖిలభోగములు
నీవు గల్గినఁ గల్గు నిత్యసంపదలు
నీవు గల్గినఁ గల్గు నిఖిలరాజ్యములు
నెడ లేదు భాషింప నిదె చేర వచ్చె
మిడుఁగుఱు లడరఁగ మిన్నంది వహ్ని
తెగువ లేకున్నను దెగుట నిక్కంబు
సుగుణాత్మ తొలుత నేఁ జొచ్చినపిదప 2230
భగవంతుఁ డొనరించుపద్ధతి జరుగు

---

యపడి, వెళ్లనుఱికి=వెడలదూఁకి, సుడివడి=తబ్బిబ్బుపడి, వాతెఱలు=పెదవులు, వెరవైనవంకగా=వీలయినదిక్కుగా, నివహము=సమూహము, ఎడలేదు భాషింపక=మాటలాడుటకు అవకాశము లేదు, మిన్నంది=ఆకాశముముట్టి-మిక్కిలిపొడవుగా పెరిఁగియనుట, తెగువలేకున్నను తెగుటనిజంబు=సాహసము చేయనియెడల చచ్చుటనిశ్చయము, తొలుత.....జరుగు=మొదట నేనగ్ని

తగవు మీఱంగఁ దెంపు దయ సేయు' మనుచు
వేఁడినఁ దల వ్రేల వ్రేసి నిట్టూర్పు
వేఁడి యై నృపతి నివ్వెఱ నూర కున్న
వసుధీశు నతిభక్తి వలగొని మ్రొక్కి
మసలక చనుచంద్రమతి వెంటఁ దగిలి
'యమ్మమ్మ నీ విపు డగ్నిలో నుఱుక
సమ్మదం బొదవంగఁ జనియెద వేని
వత్తు నేనును నన్ను వదలక తిగిచి
యెత్తికొ' మ్మనుచుఁ బె ల్లెసఁగుదైన్యమునఁ 2240
గిదుకుచుఁ జిన్ని కెంగేలఁ బైకొంగుఁ
గదియించి బుడిబుడి కన్నీరు దెచ్చి
మోహ మేర్పడఁ గుచంబుల మోము రాచు
లోహితాస్యునిఁ జూచి లోనన పొక్కి
యక్కునఁ గదియించి యాదల నివిరి
చెక్కిలి నొక్కి యాచిన్నారిబొజ్జఁ
బుడికి చక్కిలిగింత పుచ్చి కన్నీరు
దుడిచి ముద్దులచుంచు దువ్వి మూర్కొనుచు
'నాయన్న నాకూన నాముద్దుపట్టి
మాయయ్య యీపేర్చుమంటఁ జల్లార్చి 2250
వత్తు వేవేగ రావలదు నా తోడఁ
జిత్తె మూరఁగ నీకుఁ జేకూరు శుభము'

---

లోఁ బ్రవేశింపఁగా పిదప దైవము కావించుదారి కాఁగలదు, తెంపుదయసేయుము= తెగువచేసి యగ్నిలోఁబడుటకు అనుమతియిమ్ము, నివ్వెఱ=మిక్కిలిభయము, వలగొని=ప్రదక్షిణము సేసి, కిదుకుచు=మెల్లగాశబ్దించుచు, చిన్నికెంగేలఁ =

లని యెట్టకేలకు నాలోహితాస్యు
మనుజేశుకడ నిల్పి మఱి యొండుదలఁపు
మది లేక నిల్చి యమ్మగువ ప్రాణేశుఁ
బదిలంబుగా మనఃపద్మంబునందు
ధృతి నిల్పి చంద్రమతీదేవి భక్తిఁ
బ్రతిముఖంబై యగ్నిభట్టారకునకుఁ
దరుణప్రవాళసుందరకాంతిఁ దనరు
కరపల్లవంబులు గర మొప్ప మొగిచి 2260
'వరద వైశ్వానర వరదయాలోల
దురితసముత్కరతూలవాతూల
మదిలోన వాక్కున మఱి చేఁతలందు
వదలక పతిభక్తి వఱలుదు నేని
నరలోకనుతుఁడైన నాకూర్మివిభుఁడు
పరమసత్యంబు దప్పక మను నేని
పరమశీతలుఁడవై ప్రాణదానంబుఁ
గరుణమైఁ దొలుత నతపుత్రున కొసఁగి
మునినాథుఋణమున మునిఁగి పోకుండ
మనుజేశుఁ గొడుకును మఱి కావు' మనుచుఁ 2270
జెచ్చెర రాయంచ చెంగల్వకొలనుఁ
జొచ్చినగతిఁ జిచ్చుఁ జొచ్చి యానడుమఁ

సొగసైన చిన్నరొట్టని చేతితో, తరుణప్రవాళసుందరకాంతిన్ = లేఁతచిగుళ్ల వంటిసొగసైనకాంతితో, దురిత...తూల- దురితసముత్కర=పాపసమూహము నెడి, తూల=దూదికి, వాతూల=గాలియైనవాఁడా-గాలి దూదిని పింజెలుగా నెగురఁగొట్టునట్లు పాపసమూహమును నాశము సేయువాఁడాయనుట, కలయఁ

గలయఁ బూసినకింశుకంబులలోనఁ
జెలువారు చున్న రాచిలుకచందమునఁ
ప్రబలసంధ్యారాగపటలంబునందు
సొబ గొందు క్రొన్నెలసోగ బాగునను
మలసి మండెడుపెనుమంటలలోన
నిలిచి మైదీఁగెకాంతికి వన్నె నిగుడ
దీపింప రానిపాతివ్రత్యమహిమ
కేపార వెఱఁ గంది యెల్ల దేవతలుఁ 2280
బొరిఁ బొరి నుతియింపఁ బువ్వులవాన
గురిసె నప్పుడు వహ్ని గొబ్బున నడఁగ
నిగుడుకీలలు మాని నివుఱు పైఁగప్పి
పొగులుట లుడిగి నిప్పుకలు సల్లారె
నావిధంబునను దావాగ్ని సల్లారి
పోవుటయును మహాద్భుతముగా మెఱసి
తలపువ్వు వాడక తరుణీలలామ

---

బూసినకింశుకములు-అంతటను ఎఱ్ఱగా పూచియున్న మోదుగుచెట్లు, ప్రబల... పటలమునందు = దట్టమైన సంజకెంజాయలసమూహమునందు, సొబగు ఒందు= అందగించునట్టి, క్రొన్నెలసోగ బాగునను=లేఁతయు నిడుదగానున్న చంద్రరేఖ విధమున - ఇట చెంగల్వకొలను, పూచినమోదుగుచెట్లు, దట్టంపుసంజకెంజాయలు అగ్నికిని, రాయంచ, రాచిలుక, క్రొన్నెలసోగయనునివి చంద్రమతికి ని జెప్పినాఁడని తెలియునది. మైదీఁగె...నిగుడ-తీఁగవంటి మేనికాంతికి యా యగ్నియందు మఱింతకాంతి హెచ్చఁగా, నిగుడుకీలలన్ = సాఁగుచున్న జ్వాలలను, నివుఱు పైఁగప్పి=మండుటతీసి పైని నివుఱు గ్రమ్మి, పొగులుట=కుములుట. తలపువ్వువాడక=తలయందలి పువ్వు సైతము కందక-ఇంచుకైనను కసుగందక

యెలనవ్వు సిగురొ త్త నెప్పటి యట్టు
లలవడఁ జేతు లల్లార్చుచు నెదుర
నలరి యానందనృత్యముఁ జూపు చున్న 2290
యాలోహితాస్యుని నక్కునఁ జేర్చి
పాలు చన్నులఁ జేఁపి పయ్యెద దడియ
జడిగొని హర్షాశ్రుజలముల మేనిఁ
దడిపి ముద్దాడుచు ధవునకు నర్థి
నిలఁ జాఁగి మ్రొక్కిన 'సింతి నీ యట్టి
కులసతి నాకుఁ గల్గుటఁ గాదె యిట్టి
యాపద లెడఁబాసి యలరంగఁ గలిగె
నీపుణ్యవర్తన నెగడె లోకముల
నే రట్టుఁదిట్టు నా కెసఁగక యుండ
బోరన మునిపుత్రుఁ బ్రోచితి గాన 2300
నీనిమిత్తంబున నెలఁత నా కింకఁ
బూని కౌశికుబుణంబును దీర్పఁ గలుగు'
నని యుచితోక్తుల నమ్మహీవిభుఁడు
తనదేవి ప్రియ మారఁ దగ గారవింప
నప్పు డాకౌశికుం డవ్విధం బెల్లఁ
దప్పక వీక్షించి తద్దయు నలిగి
'కాలాగ్నిఁ బోనియీకార్చిచ్చు చేతఁ
గాలి వే భస్మంబు గాక తా నిలిచి
పతియును దాను నెప్పటియట్ల కలసి
సుతుని ముద్దాడుచు సురలు నుతింప 2310

యనుట - ఇది భాషాశైలి, ఎలనవ్వు=చిఱునవ్వు, రట్టు=అపవాదము, సీమంత

నున్నది కళ్యాణి కొక్కింత నైనఁ
జెన్నటి యుండదు సీమంతవీథి
యలికంబు సెమరింప దలకలు గమర
వెలనవ్వు గడివోవ దెసఁగదు దప్పి
చిలుకదు కన్నీరు జిగి దప్పి మేను
సొలయ దేమియుఁ బొగచూరదు వలువ
పసిమి దప్పదు కమ్మపసపు లేఁబూఁత
కసుగంద వడుగులుఁ గమరవుఁ జేతు
లీతగ వీతెంపు నీవెంపు సొంపు
లీతెఱం గీమేర లీదిట్టతనము 2320
లెందు మహాశ్చర్య మేమన వచ్చు
నిందుకళాధరుం డెఱుఁగు నొక్కరుఁడు
బాపురే నా తపోబలమునకంటె
దీపించు దీనిపాతివ్రత్యమహిమ
పతిభక్తి సతులకుఁ బరమశీలంబు
పతిభక్తి సతులకు భాగ్యమూలంబు
పతిభక్తి సతులకుఁ బరమభూషణము
పతిభక్తి సతులకు భాగ్యపోషణము
పతిభక్తి సతులకు భయనివారణము

---

వీథి=పాపటరేక, అలికము=నెత్తి, అలకలు=ముంగురులు, కమరవు=కాలవు, కడివోవదు = వాసనపోవదు-చెడిపోదు. చిలుకదు = తొరఁగదు-కన్నీరు కాఱదనుట. సొలయదు=బడలదు, పొగచూరదు వలువ=వస్త్రము మాఁడి పోగయదు, కమ్మపసపులేఁబూఁత=మంచిపసపు పలుచగాఁబూసినపూఁత, కసుగందవు=కొంచెమైనను వాఁడవు, ఇందుకళాధరుఁడు =శివుఁడు, బాపురే =

పతిభక్తి నిఖిలశోభనకారణంబు 2330
పతిభక్తి నింతికిఁ బడయంగ రాని
యతులితపుణ్యంబు లవి యెందుఁ గలవు
వెఱపింపఁ బోయి తా వెఱచినయట్టి
తెఱఁగయ్యె నింక నే తెఱఁగిట మీఁద'
నని తలపోసి హా యని వెచ్చ నూర్చి
మనమునఁ జలముఁ గ్రమ్మఱ నూలుకొల్పి
యడరెడు తనరూప మన్యు లెవ్వరికిఁ
బొడ గాన రాకుండఁ బొందుగాఁ గదిసి
వక్షంబు మోము మోవఁగఁ గౌఁగిలించి
నక్షత్రకునకుఁ దిన్నఁగ నిట్టు లనియెఁ 2340
'జయ్యన బహువేదశాస్త్రపారీణు
లయ్యున్న నా శిష్యు లందఱిలోన
వెలయునష్టాదశవిద్యలయందు
బలవంతుఁ గావించి పాటింతు నిన్ను
నేచందమున నైన నీ వధూమణికి
నీ చక్రవర్తిపై నెసఁగినకూర్మి
వీడి పోవఁగఁ బల్కి విరిపోటు సేసి
జోడుఁ బాపుము దాన సురసమై జరుగుఁ
గైకొని నా సేయుకపటకృత్యములు

---

సెబాసు, వెఱపింపఁబోయి... తెఱఁగయ్యె- ఒకరిని భయపెట్టఁబోయి తుదకు తానే భయపడినట్లు, చలము=హఠము, మోము మోవఁగఁ = మొంగము వఱకు- మోమును వక్షమును ఒండొంటికి తగులునట్లుగా, విరిపోటు= పీడ్పాటు-ఎడఁబాటు, జోడు=జంట 'దాన నా చేయుకపటకృత్యములు సురసమై జరగు'

లేకున్నఁ గొన సాఁగ లేవు నిక్కువము 2350
సేయు మీపని కార్యసిద్ధి నా కొదవు
పోయి వచ్చెద'నని పోయె నమ్మౌని
యంత నక్షత్రకుం డామహారాజు
కాంతాశిరోమణిఁ గాంచి దీవించి
'దేవి నీ దైన పాతివ్రత్యమహిమ
వేవేల దెఱఁగుల వినుతింప నరిది
యనలకీలావళి కాహుతి యైన
ననుఁ బ్రాణములు గాచి నయమునఁ బ్రోచి
తీక్షితి స్త్రీలలో నెన్నఁగా మొదలి
పక్ష మేర్పడఁగ లోపాముద్ర నెన్ని 2360
యాయరుంధతిఁ జెప్పి యనసూయఁ బొగడి
శ్రీ యలరార శచీదేవిఁ దలఁచి
యలవడఁ గొనియాడ నగుఁ గాక యున్న
పొలఁతులు నీతోడఁ బురుడింపఁ గలరె
కరుణమై నీ యుపకారంబు నాకుఁ
బరఁగఁ జేసిననీకుఁ బ్రత్యుపకార
మొనరఁ గావించెద నొకమాట వినుము
చనవుమైఁ గౌశికసంయమి వేఁడి

---

ననియన్వయము. సురసమై=మిక్కిలి రసవంతముగా, అనల కీల ఆవళికిన్ =అగ్ని జ్వాలలవరుసకు, ఆహుతి=బలి, మొదలిపక్షము = మిక్కిలి మేలయినతరగతి, ఏర్పడఁగాన్ = తేటపడునట్లు, మొదటఅరుంధతి మొదలుగా శచీదేవివఱకుఁ గలపతివ్రతల నెన్ని వారితో పాటిగా నిన్నును ఎన్నవలయునుగాని, ఉన్న పొలఁతులు = తక్కియున్న కేవల స్త్రీలు, పురుడింపన్ = సరిపోల,

క్రమ్మఱ నాకుఁగాఁ గైకొని రాజ్య
మిమ్ముల నీ కిచ్చి యీ లోహితాస్యుఁ 2370
బట్టంబు గట్టింతుఁ బరఁగ నీ ముద్దు
పట్టిఁ దోడ్కొనుచు నీ పట్టణంబునకు
రమ్ము నీ కిది పొందు రాదన వలదు
నమ్ముము మృష గాదు నా మాట లతివ
యెలమిమై నటు గాక యీరాజు వెంట
నలయక వర్తింప నాశించె దేని
వనహుతాశనమహాజ్వాలాకరాళ
ఘనతరవిస్ఫులింగముల నంగములు
గమరక పోవచ్చుఁ గాక కల్పాంత
డమరు నిష్ఠుర ధమధమ రవ స్ఫురిత 2380
పటుతర బ్రహ్మాండ భాండ చండీశ
చటుల రౌద్రాకృతి సమకొనఁ బేర్చు

కౌశికసంయమి = విశ్వామిత్రమునిని, 'నాకుఁగా రాజ్యము క్రమ్మఱఁ గైకొని నీకిమ్ములనిచ్చి' అని యన్వయము, పొందుగాదు=ఉచితముగాదు. మృష=కల్ల, వన...హుతాశన...విస్ఫులింగములన్ - వనహుతాశన = అడవినిప్పుయొక్క, మహాజ్వాలా= గొప్పమంటలయొక్క, కరాళ = భయంకరములైన, ఘనతర విస్ఫులింగములన్ = మిక్కిలిగొప్పవైన మిడుఁగుఱుల చేత, కల్పాం...రౌద్రాకృతి-కల్పాంత=ప్రళయమందలి, డమరు=డమరువాద్యముయొక్క, నిష్ఠుర= కఠోరమైన, ధమధమరవ=ధమధమయనుశబ్దము చేత, స్ఫురిత=అల్లలార్పఁబడిన, పటుతర=మిక్కిలిపటువైన, బ్రహ్మాండభాండ = కుండలవంటి బ్రహ్మాండములుగలవాఁడైన-తనడమరు మ్రోఁతలచేత బ్రహ్మాండముల నల్లలార్చువాఁడైన యనుట, చండీశ-శివునియొక్క, చటుల=మిక్కుటమైన, రౌద్రఆకృతి=భయంకరమైన ఆకారము, సమకొనన్ =జతపడునట్లుగా, కుటిలకౌశికు= వంచకుఁడైన

కుటిలకౌశికుతీవ్రకోపాగ్ని శిఖలఁ
బెట పెటఁ బ్రేలక ప్రిదిలి పో వశ మె
యదియును గాక నేఁ డాదిగా నింకఁ
బదిదినంబులు సిక్కెఁ బలికినమితికి
మునినాథుధన మెట్లు ముందఱఁ జెల్లు
వెనుకఁ జెల్లిన దఱివీసంబు లేదు
లే దుపాయం బింక లేశమాత్రంబు
మేదినీపతి కిట మీఁద నూహింప 2390
నోదవు పేరాఁకట నుదరి హా యనుచుఁ
గదియుబెబ్బులివలెఁ గౌశికుఁ డలిగి
తడయక వచ్చి మాధనముఁ దె మ్మనుచు
నడిగి యట్టాని బి ట్టదలించె నేని
కడువడి గర్భంబు గదలి కంపించి
సుడివడి నిన్ను నీ సుతుని నక్కఱకుఁ
బోయినంతకు నమ్మి పుచ్చు భూవిభుఁడు
తోయజానన నాకుఁ దోఁచినబుద్ధి'
నావుడుఁ జెఱునవ్వు నవ్వి యారాజు
దేవి నక్షత్రకు దెసఁ జూచి పలికె 2400
'సతి కేడుగడయును జర్చింపఁ బతియె

---

విశ్వామిత్రునియొక్క, పెట పెటఁ బ్రేలక = పెట పెటమని మాఁడక, ప్రిదిలిపోక = జాఱితప్పించుకొనిపోవుటకు, నేఁ డాదిగాన్ = నేఁడు మొదలుకొని, చిక్కెన్ = మిగిలెను, మితికిన్ = గడువునకు, ముందఱన్ = ఇఁకమీఁద, వెనుకన్ = ఇంతకు ముందు, ఉదరి = చలించి, అట్టు అని = మెడపట్టుకొని, సుడివడి = తబ్బిబ్బుపడి, అక్కఱకున్ = ఆవశ్యకతకు - లేక - ఆవశ్యక కార్యమునకు, ఏడుగడ = స్వామి,

పతియ చూ దైవ మెబ్బంగుల సతికి
బలవంత మగువిధి ప్రాణేశుఁ బాప
వలవంతఁ జెందినవరవధూమణికి
భారంబు హారంబు భాసురగంధ
సారం బసారంబు సారకాసార
తీరంబు దూరంబు తీవ్రసల్లాప
కీరంబు క్రూరంబు కిన్నరమంజు
నాదంబు ఖేదంబు నవచంద్రకాంత
వేదులు సూదులు విరచితోద్యాన 2410
చూతంబు భూతంబు సురభికస్తూరి
పూఁతలు రోఁతలు పూర్ణచంద్రికల
మెఱపులు వెఱపులు మెత్తని దూది
పఱుపులు మఱుపులు పరభృతసమితి

చర్చింపఁగ్ =విచారింపఁగా, పాపఁగ్ =ఎడఁబాపఁగా, వలవంతఁ =దుఃఖమును, వరవధూమణికిఁ = ఉత్తమురాలైన స్త్రీరత్నమునకు, హారము, భారంబు = బరువు, భాసురగంధసారంబు=మనోజ్ఞమైనచందనము, అసారంబు=పసలేనిది, సార కాసారతీరంబు=శ్రేష్ఠమైనసరస్సుయొక్క గట్టు,దూరంబు=దవ్వయినది-పోవనొప్పనిది, తీవ్రసల్లాపకీరంబు=వడిగలపలుకులుగలచిలుక, క్రూరంబు=కటువైనది,కిన్నరమంజు నాదంబు= కిన్నెరవీణయొక్కయింపయినధ్వని, ఖేదము= దుఃఖము-దుఃఖకరమనుట. నవచంద్రకాంతవేదులు = క్రొత్తలై చంద్రకాంత శిలలయరుఁగులు,సూదులు=సూదులవలె నొప్పించునని, విరచిత ఉద్యానచూతము=చక్కఁగా నేర్పరుపఁబడిన ఎలతోఁటయందలి మామిడి, భూతంబు=భూతమువలె భయంకరమైనది, సురభి కస్తూరి పూఁతలు=వాసనగల కస్తురిపూఁతలు, రోఁతలు= అసహ్యములు, పూర్ణచంద్రికల మెఱపులు=పండు వెన్నెలప్రకాశములు, వెఱపులు=భయంకరములు, మఱుపులు=మఱపునకుపాత్రములు- మఱ

కూఁతలు ఘాతలు గోదమతుమ్మెదల
మ్రోఁతలు వ్రేఁతలు ముద్దురాయంచ
మురువులు పరువులు మోహంపుఁజెలుల
సరసముల్ విరసముల్ చందనానిలపు
మెలఁకువ యలఁకువ మేల్మిచెంగావి
జిలుగులు సిలుగులు చివురుఁజప్పరపుఁ 2420
బొంతలు వింతలు పూఁబొదరిండ్ల
క్రంతలు వంతలు కమనీయసరసి
బిసములు నుసములు పృథుమకరంద
రసములు విసములు రమ్యహిమాంబు
పూరంబు గాదు కర్పూరంబు సేఁదు
వీరుండు మారుఁ డీవిధమును గాక
ముదమునఁ గులశీలములు మదిఁ గోరి

---

చిపోవఁబడునవియనుట, పరభృతసమితి = కోవెలలసమూహము, ఘాతలు=దెబ్బలు-దెబ్బలవలెగడుసైనవి, వ్రేఁతలు=దెబ్బలు, మురువులు=నడలమురిపములు, పరువులు=పరుగెత్తిపోవునవి-దూరముగా పలాయితములగుననుట, చందనఅనిలపు=చందనపుఁగొండనుండి వీచుగాలియొక్క, మెలఁకువ=సంచారము-వీచుట, అలఁకువ=ఆయాసము-ఆయాసకరమనుట-జిలుగులు = సన్నవస్త్రములు, సిలుగులు=ఉపద్రవములు, చివురు చప్పరపు పొంతలు=చిగురుటాకులతో పన్నినచాకపుపందిరియొక్క సమీపములు, వింతలు= ఆశ్చర్యము-అనుభవించుటయరుదనుట, క్రంతలు=రచ్చలు-స్థానములనుట, వంతలు=దుఖములు-దుఃఖకరములనుట. కమనీయసరసి=మనోహరమైనకొలనుయొక్క, బిసములు=తామరతూండ్లు, నుసములు=కనరులు, పృథుమకరందరసములు=గొప్ప పూఁదేనెద్రవములు, రమ్యహిమాంబుపూరంబు=మేలైన పన్నీటిముంపు, కాదు=ఇష్టముగాదు, మారుఁడు వీరుండు=మన్మథుఁడో పరాక్రమశాలి-పురుషునిఁ బాసిన స్త్రీకి మన్మథునిపరా

బ్రదుకుపతివ్రతారత్నంబులకును
బతి లేనిరాజ్యసంపద లవి యేల
పతి లేనిసుతు లేల బంధువు లేల 2430
పతి లేనిహితు లేల ప్రాణంబు లేల
మతిఁ దలపోయ నీ మానవేశ్వరుఁడు
నా కూర్మి నిలుకడ నా తోడునీడ
నా కన్న పెన్నిధి నా నోముఫలము
నా మేలిచెలికాడు నా పట్టుఁగొమ్మ
నా మెచ్చువలరాజు న న్నేలురాజు
చిక్కనే కౌశికుచిక్కులఁ దగిలి
వెక్కురువడుగ యీ వెడమాట లుడుగు
నీవు నీ గురుఁడును నిఖిలనిర్జరులు
వేవేలదెఱఁగుల వినుతులు సేయ 2440
జగ మెఱుంగఁగ హరిశ్చంద్రభూవిభుఁడు
నెగడుసత్యవ్రతనియతిఁ బెం పొంది

---

క్రమమునోర్చుట కష్టమనుట, ఈవిధమునుగాక = ఈప్రకారమే కాక - అనఁగా నింతవఱకుపతినిబాసిన స్త్రీకి వలపుచేఁగలుగునట్టిబాధలుచెప్పియిప్పుడు పాతివ్రత్యధర్మమునుబట్టి కలుగు నభోగ్యములను జెప్పుచున్నది, నాకూర్మినిలుకడ = నాప్రేమము ఎడతెగక నెలకొనియుండు స్థానము, నాతోడునీడ=నన్నుతోడు నీడవలె నెడఁబాయనివాఁడు, నాకన్న పెన్నిధి=నాకుదొరకిన పెద్దలిబ్బి- పెద్ద నిధివలెనాకుఁ బెంపుసొంపులన్నియుఁ జేయువాఁడు, నానోముఫలము= నేను నోఁచిననోములకు ఫలముగానుండువాఁడు, నా మేలిచెలికాఁడు = నాకు మేలయినస్నేహితుఁడు, నాపట్టుఁగొమ్మ=నాకు అధారభూతుఁడు, నా మెచ్చువలరాజు= నేను మెచ్చిన మన్మథుఁడు, 'కౌశకు చిక్కులఁ తగిలిచిక్కనే' అని యన్వయము. కౌశికుఁడు పెట్టుసంకటములందుఁ బడియు నియమముతప్పఁ

వెలయ సప్తాదశద్వీపసంధులను
నెలమిమైఁ గ్రమ్మఱ నేలు నిక్కముగ'
ననుటయు 'నిది తథ్య' మని వినువీథి
ననువొంద భాషించె నశరీరవాణి
యది విని మదిని సత్యాశ్చర్య మంది
కొదుకుచు సత్పుత్రకుం డూరకుండె.

ప్రథమభాగము సమాప్తము.



డనుట, వెడమాటలు=పిచ్చిమాటలు, నిఖిలనిర్జరులు=సమస్తదేవతలు, నెగడు సత్యవ్రతనియతిన్ = ప్రకాశించుచున్న సత్యమే పలికెడి నియమముయొక్క నిలుకడచేత, పెంపు=ఐశ్వర్యము, కొదుకుచున్ =సంకోచించుచు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ద్విపద

### ద్వితీయ భాగము.

---

మనుజేశు డంత నమ్మగువ నీక్షించి
'మనకు నేఁ డిచ్చోట మసలుట దగదు
ముందఱ నున్నది ముయ్యేఱునేల
యం దున్నజనులు మహాజను' లనిన
వనిత యిట్లనుఁ బ్రాణవల్లభుఁ జూచి
'వెను పొందు తత్పురిపే రేమి దేవ
యొనరంగ నేలెడియొడయుఁ డెవ్వాఁడు
మన కెవ్వ రందు సంబంధబాంధవులు
మనయప్పు తెగటార్ప మది వేఁడువారి
వినిపింపు వారల విమలాత్మ' యనినఁ  10
జందనగంధి కాజననాథుఁ డనియె
'నిందుకళాధరుం డేలు నప్పురము
నావిశ్వనాథుఁడే యాత్మబాంధవుఁడు
దైవంబుఁ ద్రాతయు దాతయు మనకు

---

ముయ్యేఱునేల='త్రిస్రోతాః' అన్నట్లుమూఁడుప్రవాహములుగా గంగానదిప్రవహించు స్థలము, మహాజనులు=గొప్పవారు-పుణ్యాత్ములనుట, ఒనరంగన్=ఒప్పునట్లుగా, ఒడయుఁడు=ఏలిక-ప్రభువు, ఇందుకళాధరుఁడు=శివుఁడు, త్రాత=

నగలక మునినాథునప్పన కొక్క
తెగసేయ వలయు నో దేవి యె ట్లైన'
నని కుమారునిఁ దనయాన మెక్కించు
కొని యట పోవుచోఁ గొంత దవ్వులకు
నరుణారవిందంబు లడుగులు గాఁగ
దరుల గ్రుమ్మరువనదంతావళముల 20
యురుతరతుండంబు లూరులు గాఁగ
సరససైకతసీమ జఘనంబు గాఁగ
సురుచిరం బగు మేటిసుడి నాభి గాఁగఁ
గర మొప్పుచిఱుతరఁగలు వళుల్ గాఁగ
నునుఁదీఁగనాచు లేనూఁగారు గాఁగ
నెనయ జక్కవలు పాలిండ్లును గాఁగఁ
జెలువంపుబిసములు సేతులు గాఁగ
వెలిదమ్మి వదనారవిందమ్ము గాఁగఁ
గలికిబేడిసలు వాల్గన్నులు గాఁగ
నెలకొన్నజలవేణి నెఱివేణి గాఁగ 30

---

రక్షకుఁడు, అగలక=వెనుదీయక, తెగ=విధము, అంసము=మూఁపు, అరుణఅరవిందంబులు=ఎఱ్ఱదామరలు, దరులన్=గట్టులందు, వనదంతావళములు=అడవిమేనుఁగులయొక్క, ఉరుతరతుండములు=మిక్కిలి గొప్పవైన తొండములు, ఊరులు గాఁగన్=తొడలు కాఁగా, సరససైకతసీమ=ఒప్పిదమైనయిసుకదిబ్బపట్టు, జఘనము=కటి, సురుచిర=అందమైన, మేటి=గొప్ప, చిఱుతరఁగలు=చిన్నయలలు, వళుల్=కడుపుమీఁదిముడుతలును, నునుఁదీఁగనాచు=నిద్దమైనపాఁచితీఁగ, లేనూఁగారు=లేఁతయైననూఁగారు, చెలువంపుబిసములు= అందమైనతామరతూండ్లు, వెలిదమ్మి=తెల్లదామర, కలికిబేడిసలు= ప్రకాశించుచున్న బేడిసచేఁపలు, వాల్గన్నులు=నిడుదలైనకన్నులు, నెలకొన్నజలవేణి = నిశ్చలముగానున్న నీటి

సరవిఁ బెల్లెసఁగెడు జలకణ పంక్తు
లరుదారుమౌక్తికహారముల్ గాఁగ
నవలఁ గ్రీడించు రాయంచలరవము
నవహేమనూపురనాదంబు గాఁగఁ
బెనుపొంద నెరసిన ఫేనంబుదెలుపు
దనరారు చున్నచందనచర్చ గాఁగఁ
గూలావనీరుహకుసుమపరాగ
జాలంబు చిత్రవస్త్రంబుగా మెఱయ
జనలోకపావని జాహ్నవి గంగఁ
గనుఁగొని హస్తపంకజములు మొగిచి 40
నుదుటఁ గీలించి సన్నుతు లొప్ప భక్తిఁ
గదిసి నందనుఁడును గాంతయుఁ దాను
నాపుణ్యవాహినియం దవగాహ
మోపికఁ గావించి యుచితాహ్నికములఁ
గ్రమమునఁ దీర్చి యక్కడఁ గొంత సేపు
శ్రమము దీరఁగ నిల్చి జననాథతిలకుఁ

---

వెల్లువ, నెఱివేణిగాఁగఁ = నిండారుజడగాఁగా, పెల్లు = మిక్కిలిగా, జలకణపంక్తులు = నీటిబొట్లవరుసలు, అరుదారుమౌక్తికహారముల్ = వింతయైనముత్తెపుసరులు, నవహేమనూపురనాదము = క్రొత్తబంగారందియచప్పుడు, పెనుపు = పెంపు, నెరసిన ఫేనంబు దెలుపు = వ్యాపించిన నురుఁగుతెల్లఁదనము, చర్చ = పూఁత, కూలా... జాలము - కూల = గట్టునందలి, అవనీరుహ = చెట్లయొక్క, కుసుమపరాగ = పుప్పొడియొక్క, జాలంబు = సమూహము, గంగను ఇంతవఱకొక స్త్రీగావర్ణించినాఁడు. జనలోకపావని = భూలోకమును పవిత్రముచేయునది, జాహ్నవి - జహ్నుమునివలనఁబుట్టినది, నందనుఁడు = కొడుకు, పుణ్యవాహిని = పవిత్రమగు నది, అవగాహము = స్నానము, ఉచిత ఆహ్నికముల = తగినట్టిపగటికర్మములను,

డట చని ముందట నా వేల్పుటేటి
తటమున నురుతరద్వారకవాట
వాపీతటాకోపవనసముత్తుంగ
గోపుర ధ్వజ మణి కుడ్య విచిత్ర 50
తోరణ ప్రాసాద తురగ మదాంధ
వారణ రథ భట వ్రాత సామగ్రిఁ
జెన్నొందు చున్న కాశీపురిఁ జేరి
కన్నులు విలసిల్లఁగా మహీవిభుఁడు
ముదమునఁ దనదేవిమోము వీక్షించి
మదిరాక్షి యిందులమహిమ వర్ణింపఁ
బదినూఱుముఖములఫణియును జాలఁ
డిది వేదవిఖ్యాత మిది ముక్తిమార్గ
మిది స్వర్గసోపాన మిది సిద్ధసేవ్య
మిది దోషచయదూర మిది తీర్థసార 60
మిది భుక్తిముక్తిద మిది సత్యచరిత

---

వేల్పుటేటితటము- దేవనదియైనగంగగట్టు, ఉరుతర... సామగ్రిన్ - ఉరుతర= మిక్కిలిగొప్పదైన, ద్వారకవాట=ద్వారపుతలుపులును, వాపీ=నడబావులును, తటాక=చెఱువులును, ఉపవన=తోఁటలును, సముత్తుంగగోపుర = పొడవైన గోపురములును, ధ్వజ=ధ్వజములును, మణికుడ్య = రత్నమయమైనగోడలును, విచిత్ర= వింతలైన, తోరణ=ముఖద్వారములును, ప్రాసాద= మేడలును, తురగ =గుఱ్ఱములు,మదాంధవారణ=మదముచే కన్నుఁగానని యేనుఁగులు, రథ=రథములును, భటవ్రాత= బంట్లసమూహములును, సామగ్రిన్ = వీనియొక్క సంపూర్ణతచేత, దోషచయదూరము=దోషసమూహములకుదవ్వయినది-దోషములనెల్ల పోఁగొట్టునది. తీర్థసారము=శ్రేష్ఠమైనతీర్థము. భుక్తిముక్తిదము= భోగమోక్ష

మిద శంకరక్షేత్ర మిట్టిచిత్రంబు
కంతునికోఱ రోసి కన్నులు మూసి
చింత లొక్కటిఁ జేసి శివుఁ దలపోసి
యల సంతతోల్లాస మందెడువాసి
గలిగించునీకాశి ఘనపుణ్యరాశి
వామాక్షి విప్రుని వధియించునతఁడు
కామాంధుఁడై తల్లిఁ గదిసినయతఁడు
నుడుగక సురఁ ద్రాగు చుండెడునతఁడుఁ
దొడరి సువర్ణంబు దొంగిలునతఁడు 70
వనితల శిశువుల వధియించునతఁడుఁ
గినుకమై ధేనువుఁ గెడపినయతఁడుఁ
గొండీఁడు గృహదాహకుఁడు గరదుండుఁ
జండాలు డఖిలదూషకుఁడును మఱియుఁ
గ్రిమి పశు మృగ పక్షి కీటాది జంతు
సముదాయ మైన నిచ్చట మృతిఁ బొంది
మిన్నేఱుజడలును మిక్కిలిగన్నుఁ
గ్రొన్నెలపువ్వును గుత్తుకనలుపుఁ
బులితోలు కాసెయుఁ బునుకకంచంబు

---

ములనొసఁగునది. కంతునికోఱ=మన్మథునితక్కువ, సంతతఉల్లాసము=ఎడతెగని యానందము, వాసి=మేలిమి-ఆధిక్యము, సుర=కల్లు, సువర్ణము=బంగారు, కెడపిన=చంపిన, కొండీఁడు=కొండెము చెప్పువాఁడు, గృహదాహకుఁడు=ఇంటికి నిప్పుపెట్టెడువాఁడు, గరదుండు=విషము పెట్టెడివాఁడు, అఖిలదూషకుఁడు=అందఱిని దూషించువాఁడు, మిన్నేఱుజడలు=ఆకాశగంగగలజడలు, మిక్కిలికన్ను=మూఁడవకన్ను, క్రొన్నెలపువ్వంబు=క్రొత్తచందురుఁడనెడితలపువ్వును, కుత్తుకనలుపు=గొంతునందలినీలిమ. పునుకకంచము=తలపుఱ్ఱపాత్ర. వలుఁద=వెడలు

వలుఁదశూలము నస్థి వనమాలికయును 80
గలయితఁ డాతఁ డై కమనీయరత్న
కలిత మై తలఁచినకడలనే మెలఁగు
నతులవిమానంబు నందు' దన్నెలమిఁ
బ్రతిదినంబును ససంభ్రమముగాఁ గదిసి
యొనపరివన్నెలు నోరచూపులును
ముసిముసినగవులు మొగడచన్నులును
నసియాడునడుములు నలసయానములు
రస మొల్కుబింబాధరంబులుఁ గలిగి
యలరువిల్తుని మోహనాస్త్రంబు లనఁగ
నలరారురుద్రకన్యాసహస్రములు 90
వివిధభంగులఁ గొల్వ వినుతికి నెక్కి
శివలోకమున సుఖస్థితి నుండఁ గాంచు'
ననుచుఁ జిత్రంబుగా నచ్చటిమహిమ
మన మార నాచంద్రమతికిఁ జెప్పుచును
ధవళగోపురచతుర్ద్వారబంధురము

అస్థివనమాలిక=ప్రేవులమాల, ఇతఁడు ఆతఁడై = ఇచట మృతిఁబొందినవాఁడు శివునిలక్షణములను బొంది ఆశివుఁడేయై-శివసారూప్యమును బొందియనుట, కమనీయరత్నకలితము= మేలయినమణులతో పొదుగఁబడినది, తలఁచినకడలనే = తలఁచుకొన్నచోట్లనే, ఒనపరివన్నెలు = సింగారపువగలు, మొగడచన్నులు=మొగ్గలవంటిపాలిండ్లు, అసియాడు=జవ్వాడు, అలసయానములు= మెల్లనినడలు,బింబాధరములు=దొండపండువంటి పెదవులు, అలరువిల్తుని మోహనాస్త్రములు = మన్మథుఁడు జగత్తును మోహింపఁజేయుటకై వేయుబాణములు, ధవళ...బంధురము—ధవళగోపుర= తెల్లనిగోపురముల చేతను, చతుర్ద్వార=

ప్రవిమలముక్తాతపత్రసుందరము
నరుణవితానరమ్యమును సమీర
తరళితవృషభకేతనభాసురంబు
మణిరంగవల్లికామంటపోజ్జ్వలము
ప్రణుతగుగ్గులుధూపపటలవాసితము 100
పటహా భేరీ శంఖ పణవ మృదంగ
పటు ఘంటికానేకబహువాద్యరవము
కాంతాసమర్పితకర్పూరశకల
కాంతనీరాజనకాంతి శోభితము

---

నాలుగు హజారముల చేతను, బంధురము=మనోజ్ఞమైనది. ప్రవిమల...సుందరము—ప్రవిమల=మిక్కిలి తెల్లనైన, ముక్తా ఆతపత్ర = ముత్యపుగొడుగు చేత, సుందరము=అందమైనది, అరుణవితానరమ్యము = ఎఱ్ఱని మేలుకట్లచే సొగసైనది, సమీర...భాసురంబు—సమీర = గాలిచేత, తరళిత = కదల్పఁబడిన, వృషభ కేతన=ఎద్దుపడఁగ చేత, భాసురము=మనోజ్ఞమైనది. మణి...జ్వలము—మణి=రత్నముల చేతనైన, రంగవల్లికా = ముగ్గులతోఁగూడిన, మంటప = మంటపములచే, ఉజ్జ్వలము=ప్రకాశించుచున్నది. ప్రణుత...వాసితము - ప్రణుత=మిక్కిలినుతింపఁబడిన,గుగ్గులు ధూపపటల = గుగ్గిలపు ధూపములసమూహముచే, వాసితము=వాసనగలదిగా చేయఁబడినది. పటహా...రవము - పటహా=తప్పెట, భేరీ=నగారాలు, శంఖ=చిందములు, పణవ=చిన్నతప్పెటలు, మృదంగ=మద్దెలలు, పటుఘంటికా = గొప్పగంటలు, అనేక = పెక్కులైన, బహు=నానావిధములైన, వాద్య=వాద్యములయొక్క, రవము=ధ్వని, గలది. కాంతా...శోభితము - కాంతా = స్త్రీలచేత, సమర్పిత = అర్పింపఁబడిన, కర్పూరశకల = కప్పురపు తునుకలచేత, కాంత=మనోజ్ఞమైన, నీరాజన = నివ్వాళులయొక్క, కాంతి=ప్రకాశము చేత, శోభితము=ఒప్పునది. అగణిత...

నగణితకనకకుంభాభిరామంబు
నగు విశ్వనాథమహాదేవునగరుఁ
జేరి యాదేవునిశ్రీలింగమూర్తిఁ
గోరి సద్భక్తి నెక్కొనఁగ దర్శించి
ధరణిఁ జాఁగిలి మ్రొక్కి తనమోడ్పుఁగేలు
గర మొప్ప ఫాలభాగంబునఁ జేర్చి 110
జయ భక్తమందార సజ్జనోద్ధార
జయ సద్గుణాధార సంసారదూర
జయ సత్కృపాలోల శాతత్రిశూల
జయ హుతాశననేత్ర జలజాక్షమిత్ర
జయ మేరుకోదండ జయ విష్ణుకాండ
జయ నిర్జితానంగ శశిధవళాంగ
చారుకోమలహాస చతురవిలాస
గౌరీమనోల్లాస కాశీనివాస
యీకాశికునిబుణం బీకాశిలోన
దీకొని తీర్పఁగాఁ దెరువు గల్పింపు' 120

---

రామంబు - అగణిత=లెక్కింపరాని, కనకకుంభ=బంగారుకలశముల చేత, అభిరామంబు=మనోజ్ఞమైనది, భక్తమందార=భక్తులకు కల్పవృక్షమువంటివాఁడా, సజ్జన ఉద్ధార=సత్పురుషులను ఉద్ధరించువాఁడా, శాత=వాఁడియైన, హుతాశననేత్ర=నిప్పుకన్నుగలవాఁడా, జలజాక్షమిత్ర=విష్ణువునకు చెలికాఁడా, మేరుకోదండ=మేరుపర్వతము విల్లుగాఁగలవాఁడా, విష్ణుకాండ=విష్ణువుబాణముగాఁగలవాఁడా, నిర్జితఅనంగ = జయింపఁబడిన మన్మథుఁడుగలవాఁడా, శశిధవళాంగ = చంద్రునివలె తెల్లనిఅంగములు గలవాఁడా, చారుకోమలహాస = సొగసై మృదువైన నవ్వుగలవాఁడా, దీకొని=ఎదుర్కొని-పూని, తెరువు=మార్గ

మని సన్నుతులు సేసి యచ్చోటు వాసి
మనమార నా చంద్రమతియును దాను
భుక్తి ముక్తులు రెండుఁ బోలంగ నొసఁగు
భక్తవత్సలుఁ గాలభైరవుఁ గొలిచి
భసితత్రిపుండ్రంబు ఫాలలోచనము
నిశితత్రిశూలంబు నీలకంఠంబు
భోగీంద్రహారంబుఁ బునుకకప్పెరయు
నాగకంకణమును నల్లనిమేను
మరులుకెంజడలును మణికుండలములుఁ
జిఱుగజ్జెమొలనూలు సింగినాదంబు 130
డాకాలిపెండెంబు డమరువుఁ గత్తి
రాకాసితలలతోరపువనమాల
సెలవిపైఁ జిఱునవ్వు చిలికెడుమోముఁ
గలిగి యుజ్జ్వలరత్నఖచితంబులైన
యోగవాగలు మెట్టి యొకపాద మూఁది

---

ము ఉపాయము, భసితత్రిపుండ్రంబు = బూదిమూఁడురేకలు, ఫాలలోచనము = నొసటికన్ను, నిశితత్రిశూలంబు = వాఁడియైనత్రిశూలము, భోగీంద్రహారంబు = సర్పశ్రేష్ఠుఁడైన వాసుకి అనెడుహారము, పునుకకప్పెర = కపాలపాత్ర, నాగకంకణము = సర్పముల కడియము, మరులు కెంజడలును = మోహముగొలిపెడు ఎఱ్ఱనిజటలును, చిఱిగజ్జె = చిన్నగజ్జెలు, సింగినాదంబు = పొడదుప్పికొమ్ముతో చేయఁబడిన యోగుల సుషిరవాద్యవిశేషము, డాకాలిపెండెంబు = ఎడమకాలిపెండేరమును, డమరుగము, రాకాసి...వనమాల-రాకాసితలల = రాక్షసుల శిరస్సులచేతనైన, తోరపు = పెద్ద, వనమాలయు, సెలవి = పెదవిమూల, ఉజ్జ్వలరత్నఖచితము = ప్రకాశించురత్నములచే పొదుగఁబడినది. యోగవాగ

బాగుగా నొసపరిబాగు ఘటించు
నాదేవదేవుని యానందమూర్తి
మోదంబుతోఁ జిత్తమున నిల్పి మ్రొక్కి
మఱియు నచ్చట మణిమంత్రౌషధములఁ
గఱవక యుండ వాకట్టి సింహముల 140
శరభంబులను ఘోరశార్దూలములను
వెరవారఁగా నెక్కి విహరించి యజిన
విరచితాసనభద్రవిన్యాససరణి
నరుదుగా నాసీను లై యణిమాది
సిద్ధులు గలిగి ప్రసిద్ధు లైనట్టి
సిద్ధుల నిష్టార్థసిద్ధిగాఁ గొలిచి
మగుడి భూవిభుఁ డొక్కమఠముపొంతకును
దగఁ జేరి యున్నయత్తఱి నిప్పు లురుల
వీక్షించి యమ్మహీవిభునితో ననియె
నక్షత్రకుఁడు మది నయమింత లేక 150
'యచ్చుగా మాగురుం డవనీశ నీకు
నిచ్చినమితి నేఁడు నెల్లియుఁ జిక్కెఁ
బచ్చపైకము గూడఁ బడినది లేదు

లు=యోగసిద్ధులుమెట్టుపాదుకలు, ఒసపరిబాగు=శృంగారవంతునివిధము, వాకట్టి=నోరుబంధించి, శరభము=ఎనిమిదికాళ్లమృగము, శార్దూలము=పెద్దపులి, అజిన...సరణిన్=అజిన-కృష్ణాజినముచేత, విరచిత=చేయఁబడిన, ఆసన=ఆసనముయొక్క, భద్ర=శుభమైన, విన్యాస = రచనయొక్క, సరణిన్=విధమున, నిప్పులు ఉరులన్ = కన్నుల నిప్పుకలురాలఁగా, నయము = మెత్తఁదనము, ఇచ్చినమితిన్ = పెట్టినగడువులోపల, నేఁడును ఎల్లియున్ చిక్కెను = నేఁడు రేపున్న మిగిలెను, పచ్చపైకము = బంగారుపైకము, కూడఁబ

తచ్చులు పచరించి తటమటించెదవు<br>
యిప్పు డేమటిపాట నిటకు నేతెంచి<br>
ముప్పిరి గొనుకోపమునఁ గౌశికుండు<br>
నన్ను వీక్షించి యీనరనాథుమీఁద<br>
మిన్నక తరుపుండి మితివ్రాక మున్నె<br>
పన్నుగాఁ దెమ్మన్న పసిఁడిచౌకముల<br>
నెన్నము నీవన్న నెచట నేఁ దెత్తుఁ      160<br>
బసిఁడిఁ దెమ్మనుచు నేఁ బలుమాఱు వేఁడ<br>
మిసుగ వేనుఁగుగవ్వ మీటినయట్లు<br>
చదువు నంతరమాయెఁ జాలు నీజాగు<br>
తుద లేదు పీనుఁగుతోడిజాగరము<br>
బోయబొంకులు బొంకి పోయెదో లేక<br>
మాయప్పు నేఁటితో మాన్పి పుచ్చెదవొ<br>
నిను నేఁడు ముఖమున నెత్తురు ద్రావిఁ<br>
కొని గుల్ల పఱుపక కొలికికి రావు

---

డినది=కూడినది - స్వార్థమునఁబడు. తచ్చులుపచరించి = జిత్తులునెఱపి, తటమటించెదవు=మోసపుచ్చెదవు, ఏమటిపాటు=పరాకుగా-అదాటున, పన్నుగాక్ = ఒప్పిదముగా, పసిండిచౌకముల=కఱువరాలు - నాలుగురూపాయలవరా చౌకమనఁబడును. మిసుకవు=కదలవు, ఏనుఁగుగవ్వమీటినయట్లు=పెద్దగవ్వను ఎగఁజిమ్మినను కదలనట్లు కదలకున్నావనుట. చదువును అంతరమాయె=విద్యాభ్యాసమునకును (అడ్డికలిగెను, పీనుఁగుతోడిజాగరము=పీనుఁగుతోఁగూడ మేలుకొనుట-పీనుఁగుతో ఎంతసేపు మేలుకున్నను తుదిలేనట్లు నీజాగునకును తుదిలేదనుట. బోయబొంకులు=కటికిబొంకులు, నెత్తురుఁ ద్రావికొని=మొగమున నెత్తురులేకుండునట్లు చేసి- అవమానభయాదులవలన మొగమున నెత్తురు లేకపోవుట ప్రసిద్ధము. గుల్లపఱపక=గుల్లవలె తెల్లఁబాఱనీయక, కొలికికిరావు=పరిపాకమునకు రా

పట్టి గుత్తని నిన్నుఁ బ్రజలు వీక్షింపఁ
జట్టు మోయించెద సర్వథా చూడు'
మనుచు నక్షత్రకుం డంతరంగమును
మునుకొని చిల్లులు వ్రావ నాడుటయు
జననాథుఁ డాత్మలోఁ జాలఁ జింతించి
తనయుండు నాలును దానును దక్క
నితరధనంబు లొండేమియుఁ గలుఁగు
మతము గానక చంద్రమతిదిక్కుఁ జూచి
గుడిగుడి కన్నీరు గ్రుక్కుచు నొండు
నుడువ నాలుక రాక నులివేఁడియూర్పు
లందంద నిగుడ మో మరవాంచి యున్న
చందంబుఁ జూచి యాసాధ్వీలలామ
దీపించుపతివక్త్రదృష్టివిచేష్ట
లేపార నింగితం బెఱిఁగెడియట్టి
చదురాలు గాన సంశయలేశ మైన
మదిలేక పల్కె దీమసము పెంపునను
'భూచక్రి మెల్ల నేర్పున నేలినట్టి
రాచవేల్పవు నీవు ప్రాకృతు నట్లు
పాయనిచింత విభ్రాంతిఁ గుందెదవు

170

180

---

వు- కార్యము తీర్పవనుట. గుత్తని=గుత్తయని, చట్టు=బండఱాతిని, చిల్లులువో వఁ=తూటులుపడునట్లు, నులివేఁడి=నులివెచ్చ, వక్త్రి=మొగము, దృష్టి=చూపు, చేష్టలు=వ్యాపారములు, ఇంగితము=మనస్సునందలి యభిప్రాయము, చదురాలు=నేర్పుకత్తె, దీమసము=ధైర్యము, రాచవేల్పవు=రాజురూపమైన దేవతవు, ప్రాకృతునట్లు=పామరునివలె, దాయంబుశల=విపత్తుసమయమున, ఒండొ

దాయంబుతల నిట్టిదైన్యంబు దగునె
మఱిఁ బూని నీ సత్యమహిమ పెంపొంద
మితి రెండు దినములు మీఁద నుండఁగనె 190
చొప్పడ నప్పు దీర్చుట మేలు దినము
లొప్ప నొండొక టెక్క నొక్కటి దఱుఁగు
నుడితప్పు వాతప్పు నుసలక సత్య
మెడలింపఁ గనిపెట్టు నెపుడుఁ గౌశికుఁడు
శిశువులు వాపోవఁ జెక్కిలి మీటి
విశదాత్మ పాలుఁ ద్రావించుచందమున
నుసలక మనవెంట నుండి యీయప్పు
కసటు వాపఁగ నేఁడు గలిగె నీ వడుగు
నింటివేలుపు మన కితఁ డింక నెన్ని
కంటకంబులు వల్కఁ గా కేమి దీనఁ 200
బేద నేనని నోరఁ బ్రేవులుఁ జూపఁ
బోదు రే ఋణముఁ దెంపునఁ గొనువారు

---

కటిఎక్కన్ = ఒక్కొక్కటి జరుగఁగా, ఒకటి తఱుఁగున్ = ఒక్కొక్క దినము గడువులోఁ దగ్గును, నుడితప్పు = మాటతప్పు, వాతప్పు = నోటితప్పు, చెప్పినమాట తప్పుటయు, చెప్పరానిమాట చెప్పుటయు నని రెండుతప్పులు, నుసలక = ఆలస్యము లేక, సత్యము ఎడలింపన్ = సత్యమును తప్పించుటకై నుడితప్పును వాతప్పును గనిపెట్టుననుట. చెక్కిలిమీఁటి = చెంపపుడికి, అప్పుకసటు = ఋణదోషము, వడుగు = వటుఁడు, ఇంటివేలుపు = గృహదైవము, గృహదేవతవలె దగ్గఱనేయుండి శుభములిచ్చువాఁడనుట. కంటకములు = కఠినవాక్యములు, పల్కఁగాక = పలికినను పలుకనీ, ఏమిదీనన్ = దీనివలన నేమిగలుగఁగలదు, పేద నేనుఅని నోరన్ ప్రేవులుచూపన్ = నేను పేదవాఁడను అని కడుపులోని ప్రేగులు దెలియునంత విడివిగా నోరుదెఱచి బతిమాలుకొన్నను, పోదురే ఋణము తెంపునఁ గొను

జపములు దపములు సకలదానమ్ము
లుపవాసవిధులు దేవోపచారములుఁ
గ్రతువులు నొనరించి కాంచుపుణ్యంబు
లతులితసత్యవాక్యమునకు సరియె
కావున నిప్పు డక్కఱ వాపి కొనఁగ
నేవిధంబున వెర వేమియుఁ గాన
మెడపక నను విక్రయించి చెల్లింపు
కడఁబడుఁ గొంతైనఁ గౌశికుఋణము ‍ 210
కడమకు నొకతెగఁ గల్గు నెల్లిటికి
గుడిఁ జుట్టి వచ్చినకొలఁది మేలౌదవు
నఱమఱలేక లె'మ్మనుటయు గుండె
మెఱుఁగుఁగైదువుఁ గ్రుచ్చి మెఱమి నట్లైన
నులికి భూపాలుఁ డాయుగ్మలిఁ జూచి
పలికె బాష్పములు ఱెప్పల నప్పళింప
'మదిరాక్షి యీవేఁడిమాట నా చెవులఁ
గదియించి పాపంబు గట్టుకోఁ దగునె

---

వారు=అప్పను కటువుగా పుచ్చుకొనువారు విడిచిపెట్టిపోదురా, అక్కఱ=నిర్బంధము, ఎడపక=ఆలస్యముచేయక, కడఁబడుర్ కొంతైనర్ కౌశికుఋణము=విశ్వామిత్రునియప్పు కొంచెమైనను తగ్గును, కడమకు=మిగతయప్పునకు, ఒకతెగ=ఒకదారి,గుడి... కొలఁది=గుడి ప్రదక్షిణము చేసినంతిమాత్రమునకుఁ దగినట్టి, మేలు=శ్రేయము, గుండెర్=గుండెయందు, మెఱుఁగుఁగైదువు=పదనుపెట్టఁగా తళతళ మెఱయు వాఁడియాయుధము, మెఱమినట్లు=నాటినదానిని ఇటు నటు మెదల్చినట్లు,ఉలికి=అదిరిపడి,ఉగ్మలి=స్త్రీ),అప్పళింపర్=ఆక్రమింపఁగా, కదియించి=పొందించి - వినిపించి,ఏవగింపక్=అసహ్యపడుకోఁగా, మా

పతి యెట్టికష్టంపుఁబని సేసి యైన
సతిఁ బ్రోచు టిది ధర్మశాస్త్రసమ్మతము 220
యాలి నమ్మినకష్టుఁ డనుచు నెల్లెడలఁ
జాల నిందించుచు జను లేవగింప
వదనాంబుజము వంచి వసుధఁ బెక్కండ్లు
బ్రతికెడియావాలబ్రతు కేటిబ్రతుకు
పడతి నేఁ డిట్టు నిన్ బతిమాలి యమ్మి
పడయఁగాఁ దగు నింద్రపదవైన నొల్ల
లెక్కింప నపకీర్తి లేనిజీవనము
నిక్కంబుగా నొక్క నిమిషంబె చాలు
నొఱలంగఁ బ్రాణుల నొత్తి కుత్తుకలు
గఱగఱ దఱిగెడికటికవాఁ డైన 230
దయ లేక తనకళత్రము నమ్ము కొనునె
నయ మేది దీనికి నా మది సొరదు
ధనమునకై పత్ని దాసిగా నమ్మి
చనునె భర్తకుఁ గూడు చవి యని కుడువ
మరణంబు మేలు నెమ్మది దీనికంటెఁ
బరికింప' ననుడు నప్పుడఁతి యిట్లనియె
'నాపద వచ్చినయప్పుడే మున్ను
దాఁపినధన మిచ్చి తగుఁ బత్నిఁ గావఁ

---

లబ్రతుకు=అతినీచపుబ్రతుకు, ఒఱలంగన్ =విలపించునట్లుగా. కళత్రము=భార్య, నయముఏది=మెత్తనవిడిచి, చనునె గుడువ -'భర్తకుఁ గూడుచవియని కుడువఁజనునె' అనియన్వయము. ఆపద ... గావఁ జనును = విపత్తు కలిగినసమయమందే ముందు తాను దాఁచిపెట్టుకొన్న ధనమిచ్చి తనభార్యనుగాపాడఁదగును. ప

జనుఁ బత్నినైనను జట్టిగా నమ్మి
తనకు వచ్చినబారిఁ దప్పింప వలయు' 240
నని చెప్పి 'నీతివాక్యస్థితిఁ గొంత
మనమునఁ దలపోయుమా చలమేల
సతి నమ్మియైన దోషముఁ బాసి పుణ్య
గతి కేఁగుసద్విధి గలిగినఁ జాలుఁ
బంకజహితవంశ పాఱున కిచ్చి
బొంకినపాపంబు పోలియ దేమిటను
బొంకిన మొగసిరి ఫెలియు నాయుష్య
మింకుఁ దేఁకువ దప్పు నెడ తెగుఁ గీర్తి
నమ్మిక మాలు మానము దూలపోవు
వమ్మగుఁ బుణ్యంబు వచ్చు నాపదలు 250
ధర నానృతాద్దుష్కృతం పర మనుచు
నురువడి మ్రోయుచు నుండు వేదములు

---

త్నినైనను...వలయును - తనకే బాధకలిగెనేని తనభార్యనైనను వెలకునమ్మి దానిని తప్పించుకొనవలయును. జట్టి=వెల, సతి...జాలు - భార్యనువిక్రయించి యైనను తనకుఁగలుగుదోషమును దొలఁగించుకొను పుణ్యగతికిఁబోయెడు మంచి విధి ఆచరించినఁ జాలును-భార్యనైనను అమ్మవచ్చునుగాని సద్గతిగూర్చు ధర్మని ధిని దప్పరాదనుట. పాఱు...పాపంబు - బ్రాహ్మణునకిచ్చెదనని చెప్పి వెనుకలే దని కల్లలాడుటవలనఁ గలుగుపాపము. పోలియదు ఏమిటను=ఏద్దానిచేతఁగాని నశింపదు, మొగసిరి=పురుషత్వపుసొంపు, తేఁకువ=బెట్టు, ఎడ తెగు=విచ్ఛిన్న మగును - నడుమ నశించిపోవును. నమ్మికమాలు=తనయందు ఇతరులకుఁ గలనమ్మ కము చెడిపోవును, తూలపోవు=చెడును, వమ్ము=వ్యర్థము, నానృతాత్ దుష్కృ

నాలును బిడ్డలు నర్థంబు నెపుడుఁ
గాలిసంకెల లెల్లకడలను బతికి
మఱచియు వీనిపై మక్కువ సేయ
రెఱుక గల్గినధీరు లెల్లకాలంబు
వక్రంబుగా నాడ వలదు నన్నిపుడు
విక్రయింపఁగ వేళ విచ్చేయు' మనుచు
ముదమునఁ జాఁగిలి మ్రొక్కి హస్తములు
గదియ మొగుడ్చు నాకళ్యాణిఁ జూచి 260
వనజాక్షి నిను నాఁడు వనవహ్నిఁ గూల
ననుమతించిననాకు నవఘళం బెద్ది
నాకతంబున నిట్టి నలఁకువ వచ్చె
నాకతంబున నిట్టి నగుఁబాటు వుట్టె
సారిదిఁ బెంపెసఁగురాజులదేవు లెల్లఁ
బరువడిఁ గనుసన్నఁ బనులు గావింప
నురువైభవంబుల నుండుని న్నిట్టి
వరవుగ నమ్మికో వలసె నే మందు
నీయట్టికులసతి నీయట్టిసాధ్వి
నీయట్టిప్రియురాలి నేఁటితోఁ బాప 270
నమకట్టెనే పాపజాతిదైవంబు
కమలాక్షి నాపూర్వకర్మ మెట్టిదియొ

---

తంపరమ్=అబద్ధమునకంటె మించిన పాపము లేదు, వక్రంబుగాన్=ఏనగా, అవఘళంబు=లక్ష్యము, నలఁకువ=పీడ, నగుఁబాటు=అపహాసము, కనుసన్నన్ పనులుగావింపన్=నీయొక్క కనుసైగలచేతనే తెలిసికొని నీకువలయు ఊడిగములు చేయఁగా, ఉరువైభవంబునన్=గొప్పయైశ్వర్యములతో, వరవు=దాసీత్వము,

లక్కయై కరఁగదు లలన నాకిట్టి
చిక్కు వచ్చుటకో నా చిత్తంబు మిగుల
ననదవై నిన్నిప్పు డమ్ముకో మ్మంచు
ననుమతిఁ జేసెద వకట నా గుండె
తూలదు వీలదు తునియలై పోవ
దోలంపుముద్ద గా దోపువ్వుబోఁడి
వనజాక్షి నినుఁ గూడి వర్తించు ఘోర
వనములు శృంగారవనములు నాకు 280
మగువ నీ వున్నకోమలతృణశయ్య
తగుహంసతూలికాతల్పంబు నాకుఁ
గలకంఠి నీ పొందు గలగిరిగుహలు
సలలితమణిచంద్రశాలలు నాకు
మలయజగంధి ప్రేమమున నీ వొసఁగు
ఫలకందమూలముల్ బహువిధాన్నములు
జలజాక్షి నేఁడు నాసామ్రాజ్యలక్ష్మి
తొలఁగి పోయినరీతి దోఁచుచున్నదియు'
ననుచు నాందోళింప నతనిఁ గ్రోధమునఁ
గనుఁగొని మఱియు నక్షత్రకుం డనియె 290

---

'లక్కయై... నాచిత్తంబు'-లలన నాచిత్తంబు నాకిట్టి చిక్కువచ్చుటకో లక్కయైకరఁగదు-నామనస్సులక్కవలె కరఁగకున్నది; నేనిట్టి చిక్కుపడ వలసియున్నందువలన నేమో అదియట్లు కరఁగకున్నది. అనదవై = అనాథవై, తూలదు=చెడదు, వ్రీలదు=పగులదు, ఓలంపుముద్ద గాదు= గంధపుముద్ద గాదు. గిరిగుహలు=కొండబిలములు, సలలితమణి చంద్రశాలలు = మేలయినరత్నములతోఁగట్టఁబడినమిద్దెటిండ్లు, మలయజగంధి=చందనమువంటి వాసనగలదానా, ఆందోళింపన్ =మిణుకరింప, ఆజానుబాహులును=మోఁకాలివఱకు నందు చేతులు

'భూమీశ మాటలఁ బ్రొద్దుఁ బుచ్చెదవు
తామసం బేల నిత్తఱి వెరవేది
తరుణిఁ బాయఁగ లేక తల్లడించినను
నురి యుపాయముఁ జెప్ప మాధనంబునకు
జాగు సేయక పత్ని జట్టిగా నిచ్చి
నాగురునాథుధనంబుఁ జెల్లింపఁ
జెచ్చెర లేచి వచ్చెదో మానికడకు
వచ్చెదవో రావు వైళంబె' యనుచు
'నాసల బెట్టి నన్నడఁగింప వలదు
వేసాలు సేయక వేగ లె'మ్మనుచుఁ 300
జేపట్టి తివియ వచ్చిన వాని తెగువ
కావసుధాధీశుఁ డాత్మలోఁ రోసి
నిమిషంబు నచ్చోట నిలువక కదలి
రమణి నమ్ముటకునై రాజమార్గమునఁ
జనుదెంచు నప్పు డాజానుబాహులును
బెను పొందుమూఁపులుఁ బీనవక్షంబు
నురుతరస్కంధంబు నొఱపగు మేను
నరనుతసింహాసనస్థితుభంగి
నరుదార తెప్ప లల్లార్పక చూచి
పురజను లాత్మలోఁ బొదలు వేడుకల 310
నీచంద మీయంద మీరాజసంబు

---

ను, పెనుపుఒందు మూఁపులు=బలుపుగలభుజశిరస్సులు, పీనవక్షంబు=బలుపుగల ఱొమ్ము, ఉరుతరస్కంధంబు=మిక్కిలిగొప్పమూఁపు, ఒఱపు=అందము, నరనుత...స్థితుభంగిఁ=మనుష్యులచే కొనియాడంబడుసింహాసనమరి దున్న వానివలె,

నీచూపు నీయేపు నిట్టితేజంబు
నీపెంపు నీసొంపు నీ ప్రతాపంబు
నీపోఁడి మీవాఁడి మీభుజాబలము
నెందు నెవ్వరియందుఁ నెన్నఁడుఁ గాన
మిందుకళాధరుం డితఁడగు నేని
నందివాహనము పినాకంబు నేది
కటితోలు ఫణులకంకణహారములును
జుఱుకుఁగన్నును వాఁడిశూలంబు నెవ్వి 320
కరిరాజవరదుఁడు గాఁబోలు నితఁడు
కరిరాజవరదుఁ డీఘనుఁ డగునేని
గరుడవాహన మెద్ది ఘనమైనయట్టి
సరసను నిజశంఖచక్రము లెవ్వి
పురుహూతుఁ డీఘనభుజుఁడు గాఁబోలు
పురుహూతుఁ డీఘనభుజుఁ డగునేని
యిర వొందఁగా వెల్లయేనుంగు నేది
కరమొప్పు నలవేయిగన్నులు నెవ్వి
మనసిజుఁ డీమహామహుఁడు గాఁబోలు
మనసిజుఁ డీమహామహుఁ డగునేని 330
ననవిల్లుఁ బుష్పబాణంబులు నెవ్వి

---

ఏపు=విజృంభణము, పోఁడిమి=రూపము, వాఁడిమి=ప్రతాపము, ఇందుకళాధరుండు=శివుఁడు,పినాకము=త్రిశూలము కటితోలు=నల్లగజచర్మము, ఫణులకంకణహారములును=సర్పములకడియములును హారములును, చుఱుకుఁగన్ను=వేఁడికన్ను.- అగ్ని నేత్రము,కరిరాజవరదుఁడు=మేటియేనుఁగునకు వరమిచ్చిన విష్ణుదేవుఁడు, పురుహూతుడు=ఇంద్రుఁడు. వెల్లయేనుఁగు=ఐరావతము, మనసిజుఁ

చనువొప్పఁగాఁ గీరజయవాజి యెద్ది
యెఱుఁగ రా దీతనియెసఁగు తేజంబు
మఱు పడ్డనిప్పుకమాడ్కి నున్నాఁడు
పరఁగ నీవిభుపదపంక్తి జాడలను
బరికింపుఁ డిదె సార్వభౌమచిహ్నములు
మరి చూడరమ్మ యీ మానినీమణిని
దెర పుచ్చునద్దంబుఁ దెగడెడు మోము
జాతినీలపురంగు జడిపించుకురులు
లేఁతచందురుఁ బిసాళించునెన్నుదురు 340
మదచకోరములతో మలయునేత్రములుఁ
గొదమలేళ్లకు సిగ్గుగొలిపెడుచూపు
విరులవిండ్లకు నమ్ము వేసినబొమలు
సరసచంపకము మెచ్చనినాసికంబుఁ
దెలిమొల్ల మొగ్గలఁ దెగడుపల్వరుస
పులకండ మొలికెడుబొమ్మంచుమోవి
చీఁకటి విరియించుచిఱునవ్వు పసిఁడి

---

డు=మన్మథుఁడు, ననవిల్లు=పుష్పధనువు, కీరజయవాజి=చిలుకయనెడు జయప్రద మైనగుఱ్ఱము, మఱుపడ్డ=నివుఱుగప్పిన, పదపంక్తిజాడలను= అడుగులవరుసల జాడలందు, పరికింపుఁడు = చూడుఁడు, తెరపుచ్చునద్దంబు = గవిసెనతీసిన యద్దము, జాతినీలపురంగు= మేలుజాతినీలమణులవన్నెలను, పిసాళించు=పోలు, మలయు=మాఱాడు, కొదమలేళ్లు=చిన్నలేళ్లు, సిగ్గుగొలిపెడు=సిగ్గుఁబుట్టించు, విరులవిండ్లకున్ =పూలవిండ్లకు, అమ్మువేసిన=బాణముదొడిగినట్టి- బాణముదొడు గఁగా వంపుగావంగియున్నపూలవిండ్లవలె బొమలున్నవనుట, సరసచంపకము= మేలైన సంపెఁగమొగ్గను, నాసికంబు=ముక్కు, బొమ్మంచు మోవి = ఎఱ్ఱని

రేకులతో నెదిరించుచెక్కిళ్లు
కంతుసంకుకు బొమ్మ గట్టినగళము
దంతికుంభముల నదల్చుపాలిండ్లు 350
చిగురుటాకుల నిరసించుహస్తములు
గగనంబుతోఁ బరిఘూర్ణించునడుము
తేఁటిపెక్కలదండఁ దెగడునూఁగారు
వాటమై త్రొక్కి నిల్వఁగ వచ్చుపిక్కఁదు
లనటికంబముల గయ్యాళించుతొడలు
ననవిల్తుకాహళల నగుచిక్కుదొడలుఁ
గెందామరల నేవగించుపాదములు
సుందరి గా దిది సొబగురాయంచ
యంచ గా దిది నడ పారుక్రొమ్మించు
మించు గా దిది రాచమెచ్చులప్రతిమ 360
ప్రతిమ గా దిది పచ్చి పగడంపులతిక
లతిక గా దిది నవలావణ్యసరసి
సరసి గా దిది పుష్పచాపునిశరము
శరము గా దిది రతి సవరించుచిలుక

---

పెదవి, పసిఁడిరేకులు = బంగారుతగ్లు, కంతుసంకుకు = మన్మథునివిజయశంఖమునకు, బొమ్మగట్టిన=జయించిన, దంతి=ఏనుఁగు, పరిఘూర్ణించు = మాఱాడు, దండ=సరము, గయ్యాళించు=ధిక్కరించు, చిక్కుదొడలు=పిక్కలు, ఏవగించు =అసహ్యపడుకొను, సొబగురాయంచ=సొగసైనరాజహంసము, నడపారుక్రొమ్మించు=నడకగలక్రొత్తమెఱుఁగుఁదీఁగ, రాచమెచ్చులప్రతిమ= మెచ్చుకొనఁదగినరాచబొమ్మ, లతిక = తీఁగ, నవలావణ్యసరసి = మనోజ్ఞమైన లావణ్యరసమునకుఁ సరస్సుఅయినది. పుష్పచాపునిశరము=మన్మథునిబాణము, రతిసవరించు

చిలుక గా దిది వికసించుచెంగల్వ
గలువ గా దిది చంద్రకళవంటిచెలువ
చెలువ యీ గతి విలసిల్లఁగా వలయు
వలయుఁ గాంతల కిటువలెఁ బుట్టు గలుగ'
నని ప్రజ దర్శింప నారాజు పలికె
'వినరయ్య చెప్పెద విశ్వంబులోనఁ 370
గొనియాడఁ దగుభానుకులమున నేను
జనియించినాఁడఁ ద్రిశంకునందనుఁడ
సార్వభౌముఁడ హరిశ్చంద్రుఁ డన్వాఁడ
సర్వసర్వంసహాచక్రంబు నెల్ల
నాకౌశికున కిచ్చి యతనికి మున్ను
మేకొన్నధనముకై మెలఁత నమ్మెదను
సన్నుతజపహోమవేదశాస్త్రాదికళల
నెన్నిక కెక్కుమహీసురులార
శరణన్న ము న్నెట్టిశత్రువు నైనఁ
గరుణించు నుత్తమక్షత్రియులార 380
కోటికిఁ బడగె త్తి కోరువస్తువులు
పాటించి యొసఁగుసంపన్నులార
మగఁటిమి ననిమొన మార్కొని పోరి
పగఱకు వెన్నీనిభటముఖ్యులార

చిలుక=రతి గోముగాఁ బెంచుచిలుక, భానుకులము=సూర్యవంశము, సర్వసర్వంసహాచక్రంబు=సమస్తమైనభూమండలము, మేకొన్న=ఒప్పుకొన్న, మహీసురులు=బ్రాహ్మణులు, కోటికిన్ ఎడగఎత్తి=ఒకకోటిధనమునకు ఒకపడగఎత్తి-అత్యంతధనికులై, సంపన్నులార=వైశ్యులార, మగఁటిమి=ప్రతాపము, అనిమొన=

కట్టల్క వేటాఱుగా వడి వ్రేయు
రట్టఁడిబిరుదులరాహుత్తులార
పతిహితసాహసబహువిధోపాయ
చతురులై మతి కెక్కుసన్మంత్రులార
చనవరులార యోసామంతులార
ధనపతులార యోతగుదొరలార 390
పసిఁడిగేదఁగిరేకు పస మించుమేను
కుసుమకోమలి నిత్తు కొనరయ్య మీరు
తామరపువ్వు నదల్చునెమ్మోము
కోమలి నమ్మెద కొనరయ్య మీరు
నెరసి క్రొమ్మించు రాణించుగన్నవల
గురుకుచ నమ్మెదఁ గొనరయ్య మీరు
మృగరాజునకు బొమ్మ మెట్టిననడుము
చిగురాకుబోఁడి నిచ్చెదఁ గొనరయ్య
కలహంసలకు నవఘళ మైననడపు
మెలఁతుక మీకు నమ్మెదఁ గొనరయ్య 400
తగవు మీఱఁగ నన్ను దయఁ జూడరయ్య
తెగడక నాకొక్కదిక్కు గారయ్య
యలుగక నామాట లాలింప రయ్య

---

యుద్ధాగ్రము, కట్టల్క=పెనుకోపము, వేటు ఆఱుగా=ఒక్కొక్క వేట ఆఱు దునుకలుగా, రట్టఁడిబిరుదులు=నిందలేని-పొగడ్త కెక్కిన-బిరుదులుగల, పసిఁడి గేదఁగిరేకుపస=బంగారు మొగలిరేకు బాగు, క్రొమ్మించు=క్రొత్త మెఱుఁగు, రాణించు=చెలువుచూపు, గురుకుచ=గొప్పచన్నులుగలది, మృగరాజునకున్=సింహమునకు, బొమ్మ మెట్టిన=గెలిచినట్టి, కలహంస=రాయంచ, అవఘళము=అతిమాత్రము,

చెలఁగి నా యక్కఱఁ జేకొనరయ్య'
యని దైన్య మేర్పడ నమ్మహారాజు
దనపత్ని నమ్ముదుర్దశఁ జూచి పొక్కి
వాడవాడల నెల్లవారలు గుములు
గూడి యశ్రులు జడిగొనఁ దమలోనఁ
'గటకటా యిట్టివెంగలిరాజు గలఁడె
మటుమాయతపసి యేమరులు కొల్పినను 410
నెమ్మదిఁ దనయేలునేలకుఁ దోడు
సొమ్ము లన్నియు నిలుచూఱగా నిచ్చి
యమ్మెదఁ గడమకై యాలిఁ గొండ నెడుఁ
దమ్ము మాలినయట్టిధర్మంబు గలదె
యివ్వసుంధరఁ బుణ్య మెంతయుఁ జేసి
యెవ్వరు బొందితో నేఁగిరి దివికిఁ
జదువులు విని మీఁద జరుగుసౌఖ్యంబు
మది నమ్మి బ్రతుకు బ్రాహ్మణునకు నిచ్చెఁ
బనుపడ మొగిలులోపలినీళ్లునమ్మి

---

గుములు=గుంపులు, అశ్రులు=కన్నీళ్లు, జడిగొనన్=వానవలెఁదొరుఁగగా, వెంగలి=వెఱ్ఱి, మటుమాయతపసి=మిక్కిలి మాయలు చేయుముని, మరులుకొల్పినను=మోహపెట్టినను-తబ్బిబ్బుకలిగించినను, తనయేలు... దోడు = తానుఏలునట్టిభూమితోఁ గూడ, నిలుచూఱ=నిలువుకొల్ల-ఆపాదమస్తకము గలనిలువుసొమ్ములన్నియును కొల్లగాననుట, కడమకై=మిగతయప్పునకై, తమ్మమాలినయట్టి ధర్మము, గలదె=తనకుపయోగింపనట్టి ధర్మమునుగలదా - తన కుపకరింపనిధర్మ మొకధర్మమగునాయనుట, వసుంధర=భూమి, చదువులు=వేదశాస్త్రాదులు, మీఁదజరుగుసౌఖ్యంబు=రాఁబోవు సుఖములు-స్వర్గరంభాభోగాదులనుట, బ్రతుకు=జీవనము-జీవనాధారమైన భూరాజ్యధనదారాదులు,పనుపడన్=గట్టిగా, మొగిలు

దొనసీళ్లఁ జల్లు వేఁదుఱుఁ డెందుఁ గలఁడె 420
యాలు బిడ్డలు దగులని మున్నె రోసి
చాలించి నట్టినిస్సంగుని నైనఁ
జేసిననేరమి చేసేతఁ గుడువఁ
జేసి యీబూమెలు సేసె దైవంబు'
ననుచుండ మఱి కొంద అకట యీ రాజు
నన నేల విప్రుల కవనివల్లభులు
దగినదానము లీరొ ధన మియ్యఁ గొనరొ
పగ గొని యీరీతిఁ బట్టి య ఱ్ఱదిమి
దార లెక్కలకునై తరువులు వెట్టి
దారల నమ్మించి ధనములు గొనెడి 430

=మబ్బు, దొన=కొండమీది నీటిపల్లము, వేఁదుఱుఁడు = వెఱ్ఱివాఁడు-ఇఁక మీఁద మబ్బులు గురియఁగల వాననునమ్మి యిప్పుడు సిద్ధముగా నున్నదొనసీళ్లు వెచ్చించుకొను వెఱ్ఱివాఁడుగలఁడాయనుట- సందేహగ్రస్తమైన వానను నమ్మి నిశ్చితముగానున్న దొనసీళ్లఁ జల్లివైచునట్లు, సందేహాస్పదములైన స్వర్గభోగాదులను నమ్మి యిహసుఖభోగములను పోఁగొట్టుకొనుట వెఱ్ఱితనమేయని భావము; తగులు=తగులము, చాలించినట్టి నిస్సంగునిన్ =సంగము వదలుకొన్నట్టి విరక్తుని, చేసిన నేరమిన్ = నేరక చేసిన తప్పును, చేసేత=ఈచేతి కాచేయిగా-తోడ్తోడ నేయనుట, కుడువఁజేసి=అనుభవింపఁజేసి, ఈబూమెలు=ఈవంచనలు-అలు... దైవంబు=ఈహరిశ్చంద్రుఁడు రాజ్యము సేయుచున్న కాలముననే ఆలుబిడ్డలు బంధకము లని రోసి లోపల సంగమువదలికొనియున్న విరక్తచిత్తుఁడు. ఇట్టి నిస్సంగుఁడనిగూడ తలఁపక, దైవము ఇతఁడు తెలియక చేసిన నేరమును తోడ్తో అనుభవింపఁజేసి యిట్లు వంచనలు చేసినదని యర్థము, అఱ్ఱు అదిమి= మెడఁద్రొక్కి-మిక్కిలినిర్బంధపెట్టి, దారలెక్కలకునై=దానముచేసినదాని లెక్కలు ఒప్పగించుకొనుటకై, తరువులు=తప్పీలు, దారలన్ =భార్యలను, ధనము= ధూ

కఠినచిత్తులు లేరు గాక లోకముల
శర మేల నృపులతో సంయమీంద్రులకు
వెడమతు లైనయీవిప్రులజాడ
వడిముడిగాఁ జొచ్చి వాత వెళ్లుదురు
ఉపకార మొపిక నొనరించువారి
కపకార మొనరింతు రప్పుడే కడఁగి
యలగుజ్జువడుగు మూఁ డడుగుల నేలఁ
దొలితొలి బలి వేఁడి తుది నెట్లు సేసె
మరి కశ్యపాదిబ్రాహ్మణు లిల యెల్లఁ
బరశురాముని చేతఁ బడసి యా ఘనుని 440
నుదధిలోనైనఁ గా లూఁదంగ నీక
కదలి పోఁ దోలరె గజిబిజి సేసి
యివి యన్ని యేటికి నీకౌశికుండు
తివిరి విప్రుఁడు గాక తిరిగెడునాఁడు
సొలపు దీరఁగ వసిష్ఠునియింటఁ గుడిచి
తొలఁగి పోవుచు నెన్నిదొసఁగులు సేసె
నిదె మహీతలమెల్ల నేలునీరాజు
చెదరక యిట్లేడుచేట్లను జెఱిచి
పోనీక బందెలఁ బొరలించి తపసి
దానవుం డై నల్ల ద్రావు చున్నాఁడు 450

---

త్త్వము, సంయమీంద్రులకున్ = మునిశ్రేష్ఠులకు, వడముడిగా- వెళ్లుదురు= భయంకరముగా నోటిలోఁజొచ్చి తిరుగనోటినుండియే వెడలుదురనుట, గుజ్జవడుగు=పొట్టిమాణవకుఁడగు వామనుఁడు, ఉదధి=సముద్రము, దొసఁగులు=కీళ్లు, ఏడుచేట్లనుచెఱిచి = సప్తవ్యసనములను భంగపెట్టి, బందెలన్ పొరలించి= నిర్బంధములఁజొట్టి, దానవుండై నల్లద్రావుచున్నాఁడు= రాక్షసుఁడై నెత్తురు

కడఁగి పీనుఁగుమీఁదఁ గంచంబు వెట్టి
కుడువగాఁ జూచుఁ గకుర్త్తిగాఁ డీతఁ
డేడ నెవ్వరు లేక యీరాజు తలనె
కూడెనే యీబలుగుత్తంపు టప్పు'
ననఁగ నందొక కొంద'అద్దిరా! చేటు
ధనికుల మని ప్రల్లదంపుఁబెంపునను
రాజులు వాటించురాణివాసముల
నోజతో నూడిగెం బొనరింపఁ దమకు
వరవుడుగాఁ జేసి వరుస వర్తింపఁ
బురిలోనఁ బులుకాసిపురుషుల తరమె 460
కరి రొంపిఁ జిక్కినఁ గ్రమ్మఱ నెత్తె

---

తాగ్రుచున్నాఁడు-ఋషి రాక్షసునివలె పడరాని హింసలు పెట్టుచున్నాఁడ నుట. పీనుఁగు...కకుర్త్తిగాఁడు=పీనుగుపయినికంచము పెట్టి తినుటకుఁగూడ ప్రాలుమాలునట్టివాఁడుగాఁడు-అట్టివాఁడు తనయాఁకటిని దీర్చుకొనుటయే ముఖ్యముగాఁ జూచునేకాని పీనుఁగుమీఁదిదని రోయనట్లు ఈఋషి తనయ క్కఱదీర్చుకొనుటేకాని యీరాజు నిట్టిపాట్లు పెట్టుటకు నసహ్యపడఁడనుట. బలుగుత్తంపుటప్పు=గొప్పదైనదట్టపుఋణము, అద్దిరా చేటు = ఔరా, చేటు =చేటుచెడుచున్నారారాయని యాక్రోశము. ప్రల్లదంపు పెంపునను = ధూర్తత్వముయొక్క అతిశయముచేత-అధికధూర్తత్వముతో, రాజులు...రాణివాసములన్=రాజులు అనుభవించు అంతఃపురకాంతలను, ఊడిగంబు ఒనరింపఁ దమకున్ = తమకు ఊడిగములుచేయుటకై, వరవుడుగాన్ = దాసిగా,పులుకాసిపురుషులతరమె = పచ్చతెక్క-పురుషులకు - అనఁగా అల్పులకు-వశమా, అల్పులైనవారు తమకు ధనమున్నదనిమిక్కిలిధూర్తులై,రాజులకే తగినయంతఃపురస్త్రీలను వెలకుఁగొని తమకూడిగములు చేయంబెట్టుకొన శక్యమగునాయ

కరి యోపుఁ గాక సూకర మెట్లు లోపు
ధర నింతవాని దుర్దశ నివారింప
నరు లోపుదురె విశ్వనాథుండు దక్క'
నని యని వగచుచు నశ్రువు లొలుక
మును చిన్నఁబోయినమోములు వంచి
మరి నిల్వఁ జాలక మందిరంబులకు
నరిగి శోకాగ్నుల నలయుచున్నంత
నాపురిఁ గౌశికునాజ్ఞచే మున్నె
కాఁపురంబుగ నుండి కపటమార్గమునఁ 470
జెనఁటివిప్రునిరూపుఁ జేకొని మిగుల
నను వ్రేందఁ జరియించు నాకలిరాజు
తలఁప నింతిం తనితనధనంబునకుఁ
గొలఁది గాదని సెట్టి గొడుకులు దన్ను
వారక నడుజాము వచ్చి వేఁడినను
కోరిన ధనములు 'గొండు కొం' డనుచు
నక్కఱదండఁ డై యప్పు టప్పటికి
వెక్కసంబున నూర్లు వేలు నప్పిచ్చి
ముట్టఁ జిక్కిన వేళ ముట్టి చేపట్టి
రట్టడై తిరిగి పత్రంబులు గొనుచుఁ 480

---

నుటి. సూకరము=పంది, ఇంతవాని ధుర్దశ =ఇట్టిసార్వభౌముడైనట్టివానిదురవస్థ, చెనఁటివిప్రునిరూపు = కుత్సితబ్రాహ్మణునిరూపము, సెట్టికొడుకులు=కోమటికుమారులు, నడుజాము=అర్ధరాత్రి, అక్కఱగండఁడు= అవసరముతీర్చునట్టిదిట్టఁడు, వెక్కసంబునన్ =మీఁదుమిక్కిలిగా, ముట్టన్ చిక్కినవేళన్ = పూర్ణముగా తనకు చిక్కిన సమయమున-మిక్కిలియప్పులు తీయించి వారియ్యలేక తనకు దొరకినప్పుడు, రట్టడి=రాయిడికాఁడు, పత్రంబులు=దస్తవేజులు

బెట్ట వచ్చిన కల్ల వెనుపులు వెనఁచి
తిట్టి వారును దానుఁ దిరిదీపు లాడు
మటుమాయలాఁడు కంబళపురీషంబు
పటికిరింతలపిల్లి పట్టినదొబ్బ
శుద్ధకష్టుం డని చూపఱ దెగడ
బద్ధకంబునఁ బెక్కు బాసలు సేసి
వృద్ధి మీఱఁగ జక్రవృద్ధిని మాస
వృద్ధిని లెక్కించి వెస నప్పు లెత్తి
కాలకాశికుఁ డనఁగాఁ బేరు వడసి
కాలీచఁ జనుచు శీఘ్రముగ నింటింటఁ 490
బాయక పంచాంగపఠనంబు సేసి
యాయవారము లెత్తి యతిదైన్యవృత్తి
నడిగినధాన్యంబు లవి వేఱువేఱ
ముడిచినబట్టలు మూఁపుపై వ్రేలఁ
దోలు నస్థులుఁ జిక్కి తూఁగాడుమేనుఁ

---

కొనుచు=వ్రాయించి పుచ్చుకొనుచు, పెట్టవచ్చినక్ =అప్పులు చెల్లింపరాఁగా, కల్లపెనుపులు పెనఁచి=దొంగవడ్డీలు వేసిచుట్టి, తిరితీపులాడు =కొట్లాడు, మటుమాయాలాఁడు=మిక్కిలిమాయలు పన్నువాఁడు, కంబళపురీషంబు = కంబళి నంటినమలము-దానివలె అసహ్యమయ్యును తొలఁగింపరానివాఁడు, పటికిరింతల...దొబ్బ=చలము పట్టినపిల్లిపట్టుకొన్న మాంసఖండము- పిల్లిమాంసఖండము పట్టుకొనఁగాఁ దీయఁగూడనట్లు హఠము సాధించునీచుఁడు, బద్ధకమున=బలాత్కారముతో, బాసలు=ఒట్లు, వృద్ధి=వడ్డి, చక్రవృద్ధిని=వడ్డికివడ్డిని, వారవృద్ధిని =వారపువడ్డిని, అప్పులెత్తి= అప్పులుగావించి-అప్పులిచ్చి, కాలీచఁజనుచు=ఈచ కాళ్లతో నడచుచు, ఆయవారము=ధాన్యయాచన, తూఁగాడు=అల్లలాడు, పెడ

బేలు రాలెడుసిగ వెడతలఁ గణితి
పిల్లికన్నులుఁ గుఱుపీఁచుమీసములు
నుల్లిగడ్డంబు నత్యుగ్రదృష్టియును
దళమైనపట్టెవర్ధనములు వ్రేళ్ల
నులిచినదర్భలు నుదుటిపై బొరుసు 500
నొరుగునోరును వెలి కుఱికినపండ్లు
యరవి దోవతియు పంచాంగంబు ముష్టిఁ
బరఁగినకరతిత్తి పత్రాల సంచి
యొరిగినగొడుగును నుసి రాలుకోల
విడువక గోహత్య వ్రేలుచు నలుక
ముడివడ రాఁజుమోమును గల తన్ను
'నదె వచ్చె నడ పీనుఁ'గనుచు నంతంతఁ
గదియుచు మై పొస్తుకంపున కెడసి
తొలఁగుచుఁ బురజనుల్ తుప్పన నుమియఁ
బలుమాఱుఁ గెలఁకులు పరికించుకొనుచు 510
'నెవ్వాఁడు మృతజాతుఁ డెవ్వాఁడు రుగ్ణుఁ
డెవ్వాఁడు దుర్మృతుం డీపురిలోనఁ
బ్రేతవాహకునిగాఁ బిలువ రెవ్వరును

---

తల=తలవెనుక, కుఱుపీఁచు మీసములు=పీఁచువంటినులిమీసములు, ఉల్లిగడ్డము =ఉల్లివంటిగడ్డము, నులిచిన= మెలిఁబెట్టిన, బొరుసు=బుడిపి, ఒరుగు=వంకర, అరవిచోవతి=కరలదోవతి, కరతిత్తి=గీతగీతలుగానుండు చిన్నసంచి, నుసి=పుప్పి, అలుకముడివడన్ =కోపము నెలకొనఁగా, పొస్తుకంపునకున్ =పొస్తుకాయదుర్గంధమునకు, మృతజాతుఁడు=చచ్చినవాఁడు, పుట్టినవాఁడు, రుగ్ణుఁడు=రోగి, దుర్మృతుఁడు=చెడుచావుఁ బొందినవాఁడు-పతనాదులచే అకాలమరణమునొందినవాఁడు, ప్రేతవాహకునిగా=పీనుఁగుమోయుటకై, బాళ్ళిఁతిగాన్ =మిక్కిలి

ప్రాంతిగా వెడలింప బడుగులు లేవు
బ్రాహ్మరాక్షసుల భోజనమ్ములకు
రమ్మని ప్రార్థింప రాఁడొక్కరుండు
పిండివంటలు నెయ్యి బెల్లంబు పప్పు
గండశాంతులఁ దృప్తిగాఁ దిన లేదు
సప్తకంబులఁ బాయసము నెయ్యి పెరుఁగు
తృప్తాస్థ గా జుఱ్ఱి త్రేన్పంగ లేదు 520
కడికడి కొక మాడ గ్రహణకాలమున
వడి వీడ దోవతి వదలించుకొనుచు
బరు లుబ్బఁ బృష్ఠోష్ఠపర్యంతముగను
బెరుఁగువంటకము పేర్పేఁడు దిన లేదు
లేదొ మృత్యువు చంప లేఁడో జముండు
కాదేని చావులు గలిగ వాయె జగతి
నీకొట్టికకు విప్రుఁడెట్లు చేరెడిని
గైకొని బ్రతుక నే గతి గల దింక
మూఁకలై జనులు నిర్మూలమై చనిరొ
కాక నా వీనులఁ గవిసెనో చెవుడు 530

---

గా, వెడలింపన్ = కాటికిఁ గొని పోవుటకు, బడుగులు = చిక్కిన దేహముగలవారు, బ్రాహ్మరాక్షసుల భోజనమ్ములకు = బ్రహ్మరాక్షసులభోజనములకు, గండశాంతులన్ = అపాయనివృత్త్యర్థమైన నివారణములందు, సప్తకంబులన్ = సప్తకాశ్రాద్ధములందు - ఏడుగురినిబిలిచి పెట్టుశ్రాద్ధములందు 'తృప్తాస్థ' గాన్ = 'తృప్తులమైతిమి' అనునట్లుగా, త్రేన్పంగన్ = త్రేఁపులువిడుచుటకు, కడికడికి = ముద్దముద్దకు బరులుబ్బ = ప్రక్కలుబలియునట్లు, పృష్ఠోష్ఠపర్యంతముగను = పెదవిమొదలుకొని వీఁపువఱకును, పేర్పేఁడు = ఒకటిమీఁదనొకటిగా, కొట్టిక = ఊరు, వీనుల ... చెవుడు = చావులు ఈయూరునందు చాలఁగలిగియు నా చెవుడుచే నాకువినరాకున్నదోయ

శ్రుతిసుఖంబుగ మఱి శుష్కరోదనము
వితతంబుగా నేఁడు వినరా దదేల
నని తల యూఁచుచు నా హరిశ్చంద్ర
జననాథుమాటలచంద మాలించి
'చిక్కెఁబో నేఁడు నా చే మత్తికాఁడు
చిక్కులఁ బెట్టి కౌశికుని మెప్పింతు
వెదకఁ బోయినదీఁగ విస్మయం బొదవఁ
బదములఁ దగిలె నాభాగ్యంబుకతన
బెదరించి వీరల భేద మొందించి
యుదరి పోఁ దోలుదు నుర్వీశు నొండె 540
మనసులో దయ వుట్ట మాటలు వన్ని
పనివడ బోధించి భావంబు గలఁచి
యంతి నమ్మిక యుండ నిపుడె మాన్పింతు
నంతట మితి దప్పు నడఁగు సత్యంబు'
నని మడిమెలు మోవ కతి సంభ్రమమునఁ
గునుకుచు సందడిఁ గోపంబు నిగుడ
మూఁగినప్రజఁ గోల మొత్తి దట్టించి
లోఁగక పాయఁ దోలుచుఁ జను దెంచి
తనముమోల నిల్వ నాతనిజన్నిదములు

నుట. శుష్కరోదనము = కన్నీళ్లులేనియేడ్పు, మత్తికాఁడు = వెఱ్ఱివాఁడు - వెదకఁబోయినమనుష్యుఁడు తానే యెదురుపడెననుట, మడిమలు మోవక=మడికాళ్లు ఊనక - అతిత్వరితముగాననుట, కునుకుచు=కునిసినడచుచు, సందడిఁగోపంబు= జనులకలకలమునకుకోపము, దట్టించి=అదల్చి, పాయఁదోలుచున్ =త్రోవయిచ్చునట్లుతఱుముచు, గుఱుకొని=యత్నించి, తెలిసి మఱికాని= తెలిసికొనియేకాక,

గనుఁగొని విప్రుఁడు గాఁబోలు ననుచుఁ 550
జెయ్యెత్తి మ్రొక్కినఁ జిఱునవ్వ నవ్వి
యయ్యవనీశుతో నవ్విప్రుఁ డనియె
'గుఱుకొని నిన్ను నీకులమును దెలిసి
మఱి కాని దీవింప మాకు దోషంబు
నీ వెవ్వఁడవు మరి నీకుఁ బేరేమి
యీవిధి సతి నమ్మ నే యక్కఱ యొదవె
నుడుగక వాతఁ గ్రొవ్వుఱుకంగఁ గుడిచి
గడిపోతువలె మేనికండలు వెంచి
కసవుఁ గట్టెలు మోయఁ గాయ పండ్లమ్మఁ
బసులజంగిలి గాయఁ బాలేరు దున్నఁ 560
గొఱమాలి ముచ్చులఁ గూడి దూరమునఁ
జెఱవట్టి తెచ్చినచెలువ నాలనుచు
మొఱఁగి యీరీతి నమ్ముట మాకుఁ దోఁచె
నెఱిఁగి రేఁ దలవరు లిప్పుడే పట్టి
కొఱతఁ బెట్టుదు రోరి కోమలి విడిచి
పఱచి నీ ప్రాణముల్ బ్రతికించుకొనుము

---

అక్కఱ=ఆవశ్యకత, వాతన్=నోటియందు, క్రొవ్వు ఉఱుకంగన్=క్రొవ్వు వెలికివచ్చునట్లు, కుడిచి = తిని - మిక్కిలి క్రొవ్వుపట్టునట్లుతిని, గడిపోతు=ఆఁబోతు, పసులజంగిలి=పశుసమూహము, పాలేరు= మేఁడిపాలికిదున్నెడు మడఁక, కొఱమాలి=ప్రయోజనములేకపోయి- మిక్కిలి బలసియున్నందులకు కసవుమొదలైనవానిని మోయుటకుఁగాని కాయలు పండ్లు అమ్ముటకుఁగాని పసులను గాచుటకుఁగాని పాలేరు దున్నుటకుఁగాని ప్రయోజనము లేనివాఁడవైయనుట, ఆలు= పెండ్లము, మొఱఁగి=ఏమఱించి, ఎఱిఁగి రేఁ దలవరులు=తలారులు తెలి

కాదేని వరువుడు గా దార వోసి
మోదంబుతోడ నీ ముదిత మా కొసఁగు
మెనయంగ నీతప్పు లేము వహించి
కొని కాచెదము బ్రహ్మకొడుకు వచ్చినను' 570
నని పెక్కుదుర్భాష లాడెడువిప్రుఁ
గనుఁగొని విభుఁ డాత్మఁ గలఁగ కిట్లనియె
'నరసి చూడఁగ నేర వకట దురాత్మ
పరిణామములు బహుభాషలే కాని
జగతిపై సూర్య వంశమునఁ ద్రిశంకు
జగతీశునకుఁ బ్రశస్తంబుగాఁ బుట్టి
యేరాజ్య మొనరించునీకాలమునకుఁ
జోరశబ్దము సెవి సోఁకె నీ చేత
మఱి బ్రాహ్మణుఁడు వచ్చి మఱుగుఁ జొచ్చినను
దఱలక రక్షింపఁ దగుఁ గాక మాకుఁ 580

---

సికొనిరేని, వరవుడుఁ = దాసి, దారవోసి = దానముచేసి, ముదిత=స్త్రీ, ఆ త్మఁ=మనస్సునందు, పరిణామములు=బింకములు. ఏ... కాలమునకు=నేను రాజ్యము సేయుచుండిన యింతకాలమునకు, చోరశబ్దము...నీచేతఁ=నీవుచెప్పఁగా చోరుఁడనుపలుకు నాచెవులఁబడెను. వట్టిశబ్దమే పడెననుటచే నిజముగా చోరుఁడు కలుగనే కలుగఁడయ్యెననియు, ఆశబ్దము ఇంతకాలమున కిప్పుడె వినఁబడెను. ఇంతకుఁ బూర్వము శబ్దమునుగూడ విన్నదిలేదనియు హరిశ్చంద్రుని ధర్మోత్తరపరిపాలన మహిమాతిశయము దెలియునది. నారాజ్యమందు చోరశబ్దమే వినఁబడకుండఁగా రా జగునేనా చోరుఁడనగుదునని కాలకౌశికుని నెత్తిపొడుచుట యూహ్యము. కాలకౌశికుఁడు చంద్రమతిని దొంగలించి తెచ్చితివా యన్నందుల కిదియు త్తరము. ఇఁక కోమలిని మాకు దానముచేసితివేని నీతప్పులను మేమారోపించుకొని నీకపాయములేకుండఁ జేసెదమన్న కాలకౌశికుని వాక్యమున కుత్తరమిచ్చుచున్నాఁడు 'మఱి...చొరబాఱఁదగునె' బ్రాహ్మణుఁడు భ

బరభయంబునఁ జిక్కి పాఱి నీ మఱుఁగుఁ
జొరఁబాఱఁ దగునె యీచొప్పగు నేని
బాణాసనం బేల బాణంబు లేల
ప్రాణంబు లేల కృపాణంబు లేల
ప్రబలమత్తేభకుంభస్థలమాంస
కబళమహోల్లాసకంఠీరవంబు
ముదిసిన నాఁకొన్న ముట్టఁ జిక్కినను
బొదలుమాంసము డించి పులు మేయఁ జనునె
దారుణకరవాలధారాహతారి
వీరకోటీరనవీనమాణిక్య 590
రంగవల్లీ రణరంగవిఖ్యాత
మంగళవిజయరమాకరగ్రహణ

---

యపడి మమ్ము శరణుసొరఁగా మేము కాపాడువారమే కాని మేముభయపడి నీబోఁటివాని మఱుఁగుఁజొచ్చువారము గామనుట, ఈచొప్పఅగు నేని=ఇట్లు నిన్ను శరణుఁజొచ్చుట మాకుఁగలిగె నేని, బాణాసనంబు=విల్లు, కృపాణము=కత్తి, ప్రబల...కంఠీరవంబు - ప్రబల=మిక్కిలి బలవంతమైన, మత్తేభ=మదపుటేనుఁగులయొక్క, కుంభస్థల=కుంభస్థలములందలి, మాంస=మాంసమును, కబళ=మ్రింగుటయందు, మహోల్లాస=మిక్కిలియుల్లాసముగల, కంఠీరవంబు=సింహము, ముట్టఁజిక్కినను=పూర్ణముగా పట్టువడినను, పులు=గడ్డి, దారుణ...ప్రశస్తము - దారుణ=భయంకరమైన, కరవాలధారా=కత్తివాదరచేత, హత=చంపఁబడిన, అరి=శత్రువులయొక్క, వీరకోటీర=వీరసూచకములైన బాహుపురులందలి, నవీనమాణిక్య=క్రొత్తమణులచేతనైన, రంగవల్లీ=ముగ్గులుగల - శత్రురాజుల భుజములను నఱుకఁగా వారిబాహుపురులనుండి రాలినరత్నములచే ముగ్గులు పెట్టఁబడినయనుట, రణరంగ=యుద్ధరంగమనెడి పెండ్లిరంగమందు, విఖ్యాత=ప్రాగ్రత్తకెక్కిన, మంగళ=శుభమైన, విజయరమా=జయలక్ష్మియొక్క, కర

శస్త్రమై నట్టియాక్షత్రియోత్తముని
హస్తమేరీతిని నలవడుఁ గృషికి
వడి నుక్కడాయంబు వచ్చిన ధైర్య
ముడిగిన దైన్యంబు నొందిన నగరె
మున్ను విశ్వామిత్రమునిమఖంబునకుఁ
బన్నుగా నే నొడఁబడుధనంబునకు
మితిఁ జేసి చెల్లింప మేకొని వచ్చి
సతి నమ్మెదను హరిశ్చంద్రుఁ డట వాఁడ 600
జులుము లేటికి నొందుసుద్దులు మాని
తొలఁగుము నాలోనితుందుడు కార్పఁ
గలవాఁడ వేని నిష్కములు వేవేలు
వెలఁదికి విలువగా వేవేగ నిమ్ము
నావుడు విప్రుఁ డానరనాథుఁ జూచి
'భావింప నీవాక్యపద్ధతిఁ గొంత
నిజము గానఁగ వచ్చె నీయెడ మాకు
విజయోఽస్తు భూపాల విను మొక్కబుద్ధి

---

గ్రహాణశస్త్రము=పాణిగ్రహణము చేత పొగడ్త కెక్కినది. ఇది హస్తమునకు విశేషణము. ఇట యుద్ధరంగమును పెండ్లిగాను అందు రాలినరాజుల కోటీరమణులు ముగ్గులుగాను పెండ్లికూఁతురు జయలక్ష్మిగాను రూపితములని తెలియునది. ముగ్గులుగాఁదీరుటకు లెక్కలేనిరత్నములు రాలపలయునుగాన లెక్కలేని శత్రురాజులు హతులగుట సూచితము. శత్రురాజుల ననేకులవధించి జయముగొన్నవాఁడనని భావము. కృషికిన్=దున్నుటకు-దున్నుకొని బ్రతుకరాదా యన్నందుల కిదియుత్తరము. ఉక్కడాయంబు=మిక్కుటమైనయాపద, మితిఁజేసి=గడువుపెట్టి, మేకొని=ఒప్పుకొని, జులుములు=దుండగములు, నాలోనితుందుడు

నప్పులు గొని త్రోచుననువులు గొన్ని
చెప్పెద నా మాటఁ జేసెద వేని 610
తనడంబు దప్పక ధనికులయిండ్ల
కనువునఁ జని వారి కనురాగ మొదవ
రిత్త మ్రొక్కులు మ్రొక్కి ప్రియములు వలికి
నెత్తిఁ జేతులు వెట్టి నిక్కముల్ నొడివి
తెరలఁ దియ్యనిపండ్లతీపులు మరిపి
చరణసేవలు సేసి చనవులు మెఱసి
యిమ్ములఁ దనపేర్మి నెంతయుఁ జెప్పి
నమ్మికఁ బుట్టించి నయములు సేసి
గడుసరిమనసులు గరఁగించి పుచ్చి
జిడికిరింతలు గట్టి చెవి యాన కున్న 620
*బ్రోలుసొమ్ములు లక్కబొదవులు గాజు

---

కు=నామనస్సులోనికొంచెము- తాపమనుట. **అప్పులుగొని త్రోచుననువులు= అప్పులుదీసికొని** యియ్యక మ్రింగి యుబుసుపుచ్చు నుపాయములు, డంబు=ఆటోపము, రిత్తమ్రొక్కులు=మనః పూర్వకము కాని నమస్కారములు, నెత్తిఁ జేతులు... పలికి=నెత్తిమీఁద చేయిపెట్టి తాముచెప్పినదెల్ల నిజములని శపథములు చేసి, తెరలఁ దియ్యనిపండ్ల తీపులుమరిపి= చక్కఁగా మాఁగినపండ్లతీపులయందు వారిని మరిగించి వశము చేసికొని, పేర్మి=పెద్దఱికము, గడుసరిమనసులు=కటువులైనమనములు, చిడికిరింతలు=మోసపుమాటలు, చెవియానకున్నన్=ఇట్లు యుక్తులుచేసి మోసములుపన్నియు తమమాటలు వారిచెవిలో నెక్కకున్నయెడల ననుట, ఇఁక చేయవలసిన మోసపుఁగార్యములను జెప్పుచున్నాఁడు:—లక్కబొదువు

---

* ఈకుండలీకరణములోనిది పెక్కుప్రతులఁ గానరాదు. కనుకఁ బ్రక్షిప్తము గానోపు. ఇది లేకయేయున్నఁ గథాప్రణాళిక మిక్కిలి యొప్పిదముగానుండును.

జాల మాయ పసిఁడిజలపోసనములు
లోహోచితంబు లై లోలత మించు
నేహరంబులు గొన్ని నీలాల నమర
గుప్తంబుగా రాత్రి గొనిపోయి దీప
దీప్తిఁ గ్రొమ్మెఱుఁగుల దీపించు నట్టి
'రాజులచెవిఁ బడి రవ్వ గాకుండ
నోజతో నివి దాఁచు డొండెడ'ననుచు
మొఱుగు మొఱంగిన ముద్రగా ముడిచి
తెఱచుగా లక్కముద్రలు మీఁద నొత్తి 630
యాహికంబులు వెట్టి యవి దక్కమితులు
సాహసంబునఁ బల్కి సాతులఁ బెట్టి
ప్రబలంబుగా వడ్డి పాఱిక మున్న
కుబుసంబులోఁ జే మగుడ్చు చందమున

లు=లక్కబొందులు, మాయపసిఁడి జలపోసనములు=కాకిబంగారు మొలామలు, లోహోచితంబులు-ఇనుముతోఁ జేయఁబడినవి, నేహరంబులు=తావళములు, దీప... దీపింపన్=దీపపు వెలుతురున! తళతళమని క్రొత్తకాంతులు ప్రకాశించునట్లు-బూటకపుసొమ్ములు గావున పగటఁగాక రాత్రులందు దీపము వెలుతురున దానిక ల్లఁదనము వెలువడకుండునట్లు, రాజులు...గాకుండ-రాజులువినిరా యీసొమ్ము బుగయికొందురుగావున వారిచెవిలోఁబడి యల్లరి కానట్లు. దాఁచుఁడు=దాచిపెట్టుఁడు, మొఱగుమొఱంగి=మోసపుమాటపలికి, ముద్రగాముడిచి=కట్టగా కట్టి-విప్పియిచ్చినచో బూటకముబయలుపడుననిభావము, తెఱచుగా...నొత్తి=మిక్కిలియు లక్కగాల్చి విప్పకుండునట్లు ముద్రలువేసి, యాహికములు=కుదువలు, మితులు సాహసంబునన్ పల్కి=గడువులుతప్పితే ఈరోట్టు ఆరోట్టు అని సాహసవాక్యములాడి, ప్రబలముగా ..మున్న=మిక్కిలిగా వడ్డి పెరుఁగకుము నుపె, కుబుసంబులో...చందమున-చేయి చొక్కాలోఁదూర్చి మరలఁ దీయు

నచ్చుగాఁ దీర్తు మీయ ప్పని కొన్ని
యచ్చికబుచ్చిక లాడి పత్రములు
గెంటక యిచ్చి యాక్రియ నూఱు వేలు
గంటఁబిడకలు గట్టి గైకొని పిదప
లంజుబోతులఁ దనలాగు పెఱ లజ్జ
బండలఁ గొందఱఁ బాటించి తెచ్చి 640
టక్కరి పూఁటతాఁటలు సేసి ధనము
చక్కనఁ గైకొని జరిగినపిదపఁ
దనజాడ దెలిసి క్రంతకుఁ దీసిరేని
మనమున బెదరక మానంబు విడిచి
కట్టుఁ గొట్టును బడి కరకరి కోర్చి
చట్టు వెట్టిన మోది సరి యాక నుండు
ఘుటికసిద్ధుఁడు రాయిఁ గొట్టిన గొడ్డ
లటమటకాఁడు మహామాయలాఁడు

---

నట్లు-అతిరహస్యముగాననుట, అచ్చికబుచ్చికలు=కలుపుగోలుతనములు, కంట ...గట్టి=కంటిలో పిడకలుగట్టి-కన్నుఁబ్రామియనుట. లంజుబోతులు=దుండగీండ్లు, దనలాగు పెఱలజ్జబండల = తనవంటిలజ్జమాలిన ధూర్తులను, టక్కరి పూఁటతాఁటలు=జిత్తులమారి పూఁటకాఁపు మోసములు-మోసపుపూఁటకాఁపుతనములనుట- మోసగాండ్రను పూఁటకాఁపులుగా పెట్టియనిభావము. జరిగినపిదప=తానుదీసికొన్న ధనమంతయు వ్యయమైనపిదప, తనజాడ = తానుధనమంతయులేకుండుజాడ, క్రంతకు = రచ్చకు, కరకరి=క్రూరత్వము, చట్టు=చట్రాయి-దండనార్థము పూర్వము చట్టురాతిని అపరాధులపై మోపించుట గలదు, ఆఁక=చెఱ, ఘుటికసిద్ధుఁడు=గుళికగలయోగసిద్ధుఁడు, రాయిఁగొట్టిన గొడ్డలి=రాతిని బగులఁగొట్టినగొడ్డలి, అటమటకాఁడు = మోసగాఁడు, గడుసు

గడుసు తుంటరి జోగి గ్రక్కిన ముడుసు
ముడి దిన్ననక్క మున్మోటు పిసాళి 650
బలు కత్తి రాతికిఁ బాసినగొంటు
ఇలలోన నిట్టి మహేంద్రజాలకుని
చేపడ్డధనములు సేరునే మగుడ
వాపోవునే పిల్లి వడిఁ దిన్నకోడి
విసికితిమని తారె వేసారి యప్పు
లొసఁగినవారెల్ల నొల్లక తొలఁగ
నెమ్మది దానుంట నేర్పది గాక
నిమ్ముల నీరీతి నిల్లాలి నమ్మి
దీనతమైఁ దల దెగి పడి యప్పు
పూని దీర్చెదనంట బుద్ధిలో పంచె 660
పెట్ట లేనని తొట్టు పెట్టి బొంకినను

---

తుంటరి=మొఱకుఁడైన దుష్టుఁడు,జోగి గ్రక్కినముడుసు=భిక్షుకుఁడుమిసనయె ముక, ముడి దిన్ననక్క = బుడిపినిదిన్నట్టినక్క, మున్మోటు = మూఢశిరో మణి, పిసాళి=జిత్తులమారి, బలుకత్తిరాతికిఁబాసినగొంటు=పెద్దనల్లరాతికినలఁ గక తప్పించుకొన్న గొంటువక్క, మహేంద్రజాలకుని = ఇట్టిమహేంద్రజాల ములు సేయువాని-మాయలాని,చేపడ్డ=చేతదొరికిన, చేరునేమగుడఁ = ఇచ్చిన వానికి మరల లభించునా? లభింపవనుట. వాపోవునే...కోడి = పిల్లితిన్నట్టి కోడి అఱచునా-మాయలానిచేతఁబడ్డ ధనము మరల దక్కునా అనుట. విసికి ... నేర్పు-'అప్పులొసఁగినవారెల్ల విసికితిమని తారెవేసారి అడుగనొల్లక తొలఁ గఁగాఁ దాను నెమ్మదినుంటయే నేర్పు'అని అన్వయము. అదిగాక = ఆరీతిని చేయక, తలదెగిపడియప్పుదీర్చెదనంట = తలద్రెంచుకొని యప్పుదీర్చుకొనె దననుట - తలపోయిన వెనుక అప్పుతీర్చినను తీర్పకున్నను సమానమేయని భావ ము 'పెట్టలేనని...మునికి'-నీవు ధనము ఇయ్యఁజాలనని రొట్టుపెట్టి అబద్ధమాడి

గట్ట వచ్చునె నిన్నుఁ గౌశిక మునికి
నావుడుఁ జిఱునవ్వు నవ్వి యా రాజు
'వావిరి మీబోఁటి వదరుపెద్దలకు
నుపదేశ మొనరింప నోపుఁ గా కిట్టి
విపరీతబుద్ధులు విన నింపు గావు
బుజ్జగింతలుఁ బొరి బొంకుమాటలును
మజ్జాతు లగువారిమాటలు గావు
జజ్జరి కాడ నీచనుత్రోవఁ జనుము
నెరయ నీఁ గొనలేని నీవను వట్టి      670
పరవమాటలు సహింపవు దల' మనినఁ
గాలకౌశికుఁడు భూకాంతుని సత్య
శీలంబునకు మదిఁ జిత్రంబు నొంది
పలికె నిట్లని 'మహీపాలక నీకు
వల నొప్ప నీదురవస్థలు దొలఁగు
వెరవుఁ జెప్పిన నీకు విరసమై తోఁచెఁ
బరికించి చూడ నీ భాగ్య మెట్టిదియొ

---

నప్పటికిని విశ్వామిత్రునికి నిన్ను బంధింపశక్యమగునా? కావున బొంకి తప్పించుకొనుమనుట, ఓపుఁగాక = శక్యమగునుగాని, బుజ్జగింతలు = బతిమాలుకొని యూఱడించుటలు, బొంకుమాటలు=అసత్యవాక్యములు - అనఁగా, ఇయ్యవలసిన ధనమును ఇయ్యలేనని బతిమాలి బుజ్జగించుటగాని ఆధనమునుతీసికొన్న దేలేదని బొంకు లాడుటగాని యనుట, మజ్జాతులు=నాజాతిగలవారు = క్షత్రియులు, జజ్జరికాఁడ=వంచకుఁడా, నీచనుత్రోవఁజనుము = నీ దారిని నీవుపొమ్ము-లేని జోలి పెట్టుకొనకుమనుట, ఈఁగొనలేనినీవు= నేను ఇయ్యఁగా వెలయిచ్చికొనలేనివాఁడవగునీవు, వట్టి పరవమాటలు = వ్యర్థములైనపలువమాటలు -

మాకుఁ దోఁచిన దోకమాటఁ జెప్పితిమి
కాక నీమతి కింతకంటకం బైన
హితవుఁ జెప్పంగ మాకేల నీకెట్టి 680
గతి పుట్టఁ గల దట్లు గానిమ్ము మీఁద
నాలి నంగడిఁ బెట్టి యమ్మెదునీకు
జాలి లే దఁట మాకు సంతాప మేల
కోరినధన మెల్లఁ గొమ్మని యెల్ల
వారును జూడ సువర్ణనిష్కములు
రూపించి చౌకంబు ద్రోచి చెల్లించి
భూపాలునకు నిచ్చె భూసురోత్తముఁడు
వలనొప్ప ముఖపద్మవాసన కెగరు
కలికితుమ్మెదలతెక్కలగాలిఁ గదలి
తిలకించుచంద్రమతీదేవికురులు 690
బలువిడిఁ గృపమాలి పట్టి రాఁ దిగిచి
పాపట నెఱి దప్పఁ బయ్యెద జాఱ
వీఁపున నెఱివేణి విరిసి తూఁగాడఁ
బదములు దొట్రిల్ల బాష్పముల్ రాల
వదనంబు సెమరింప వాతెఱ గంద

---

లేక ప్రవాహమువలె ఎడ తెగక వదరునట్టిమాటలు, తలము=తొలఁగిపొమ్ము, కంట కంబు=అసహ్యము, నీకెట్టిగతి...మీఁద=నీకుమీఁద ఏగతిరానున్నదో యట్లె యదియగుఁగాక మాకేమి, చౌకంబుద్రోచి = నాలుగేసిగా ఎంచి, ముఖపద్మ వాసన=మోము దామరయొక్క తావి, కలికి=నీటు, తిలకించు = తళుకొత్తు, కురులు=తలవెండ్రుకలు, బలువిడి=బలవంతముగా, తిగిచి=ఈడ్చి, నెఱిదప్పన్ = తీరు చెదరఁగా, తొట్రిల్లన్ = తడఁబడఁగా, వాతెఱ=పెదవి, రాయన్ =

ఘనకుచంబులు రాయఁ గా నసియాడఁ
దను వెల్లఁ గంపింప ధైర్యంబు వదలఁ
దివుటమై బెబ్బులి ధేనువుఁ బట్టి
గవిఁ జేరఁ గొనిపోవుకై వడిఁ దోఁప
నాలు గేనడుగులు నడవ నీడ్చుటయు 700
బాలవత్సము వ్రాలెఁ బాయక వెనుకఁ
దగిలి వాపోవుచుఁ దల్లిఁ బోనీక
బిగియఁ పయ్యెదకొంగుఁ బెనఁచి చే పట్టి
యాకఁటఁ జంటి కట్టాడుచు ముద్దుఁ
గూఁకటి తూఁగాడఁ గునియుచు నున్న
సుతు లోహితాస్యునిఁ జూచి భూపాలుఁ
డతిదుఃఖితాత్ముఁడై యశ్రువు లొలుకఁ
దాలిమి వదలి గద్గదకంఠుఁ డగుచుఁ
గాలకౌశికునితోఁ గదిసి యిట్లనియె
'నెలమి ధేనువు విక్రయించుచోఁ గ్రేఁపుఁ 710
దొలఁగింతు రే తల్లిఁ దొలఁగఁగాఁ జేసి
నాకులభూషణు నాకూర్మి పట్టి
నీకొమారునిఁ గొను మిచ్చెద నీకు
విలువ వీనికి వేయి వేలు నిష్కములు
వల నొప్ప నొసఁగుము వసుధామరేంద్ర

---

ఒకటితో నొకటి యొరసికొనఁగా, ఆసియాడన్ =అల్లలాడఁగా, తివుటమైన్ =కోరికితో, గవిన్ = గుహను, బాలవత్సము=పసిదూడ, వాపోవుచు = ఏడ్చుచు, అట్టాడుచు=ఆతురపడుచు,తూఁగాడన్ =చలింపఁగా,కునియుచున్ = ఆఁకటిచే చక్కఁగానడవలేక కునిసియడుగులు పెట్టుచు, క్రేఁపు=దూడ, తల్లిఁ దొలఁగఁగాఁజేసి క్రేఁపుఁదొలఁగింతురే, అని యన్వయము, విలువ=వెల, విల్వఁ

నావుడు విప్రుఁ డానరనాథుఁ జూచి
'నీవు సెప్పినమాట నిక్క మంతయును
గోవు విల్వఁగఁ జన్నుఁ గుడిచెడి క్రేఁపు
గోవుతోడనె జట్టిఁ గూడి రావలదె
యక్కఱ దీరెడునందాఁక ధనము 720
నెక్కడఁ గొని వత్తు రెవ్వ రెందైన
నోడక నఘముల కోర్చి యీ కల్ల
లాడంగ మా జంఘ లదురు చున్నవియుఁ
జక్క నీ వచ్చినజాడఁ బో మింకఁ
జిక్కఁడు కాలకౌశికుఁడు నీ చేత
యిచ్చి నాచేఁ గొన నీకుండు నోపఁ
డచ్చి నా యెదుర బ్రహ్మకుఁ బోవ రాదు
పురిలోన బందెలపో తీతఁ డనఁగఁ
బరఁగ నాపేరిఁ జెప్పఁగ మున్ను వినవె

---

గన్ =అమ్మఁగా, జట్టిఁగూడి రావలదే = వెలలోఁ జేరి రావలదా - ఆవు వెలలోనే దూడ వెలయుఁ జేరిపోయినదనుట, అక్కఱ,... రెందైనన్ = ఎక్కడఁ గాని ఒక్కరియప్పునిర్బంధము తీఱునంతవఱకును వారికిఁ గావలసినంత ధనము ఎవ్వరు గాని ఎక్కడనుండి కొనివచ్చియియ్యఁజాలుదురు - నీ కెంతయప్పో అంతధనము నా కియ్యఁ దరముగాదనుట, అఘములకున్ = పాపములకు - అబద్ధమాడుటవలనఁ గలుగు పాపములకనుట, జంఘలు=పిక్కలు - నీయొద్దనుండఁ గూడక వేగ పోవలయునని నాపిక్క లదురుచున్నవనుట, చక్కన్ =సరిగా, ఇచ్చి నాచేఁ గొనన్ = నాకు ఒకటియిచ్చివైచి మరలదానిని నాయొద్దనుండి తీసికొనుటకు - నీకొడుకును నాకిచ్చివైచి మరలవానిని దీసికొనిపోవుటకనిభావము, అచ్చి = అప్పపడి, బందెలపోతు= చెఱ పెట్టుస్వభావముగలవాఁడు, కాలదట్టింతు= కాలితోఁ

కాలరుద్రుని నైనఁ గాలుని నైనఁ 730
గాల మృత్యువు నైనఁ గాల దట్టింతుఁ
బురుషుఁ డెవ్వఁడు నీకుఁ బూని నన్నిచట
నరుదుగా నౌను గా దనువాఁడుఁ గలఁడె
వీఁడు నాదాసుఁడు వెలఁది నాదాసి
యేడఁ బుత్రుని నమ్మె దిఁకఁ జెప్పు' మనిన
విని యప్పు డాధూర్తవిప్రునితోడ
మనుజేశుఁ డలుకతో మఱియు నిట్లనియెఁ
'గొనియాడఁ దగువిప్రకులమునఁ బుట్టి
చనునె నీకిట్టియసత్యవాక్యములు
ప్రొద్దున లేచి నీమొగముఁ గన్గొనిన 740
యద్దినంబున వచ్చు నాపద లెల్ల
ని న్నొకవిప్రుని నిందింప నేల
మిన్నక తలపోయ మేదినిలోనఁ
గూడు వడ్డికి నిచ్చి కూర్చెడివారి
జాడ లిట్టివియె యాశ్చర్య మేటికిని
గులము ప్రధానమే గుణము లేకున్నఁ
గలశాబ్ధిఁ బుట్టదె కాలకూటంబు
వెడమాట లన్నియు విడిచి వే యిప్పు
డడిగిన ధనము సయ్యనఁ జౌక మెన్ని

---

దన్నివైతును, నీకుఁబూని=నీకుఁగావచ్చి, ఔనుగాదనెడివాఁడు = లేదుకద్దని చెప్పఁగలవాఁడు, కూడువడ్డికిన్ = కూడెడునట్టివడ్డికి, కూర్చెడివారి= ధనము గూర్చెడివారి, కలశాబ్ధి = పాలసముద్రము, కాలకూటము = హాలాహలము, వెడమాటలు= వెఱ్ఱిపలుకులు, చౌకమెన్ని =నాలుగేసిగా లెక్కపెట్టి, కాఱులు=

కొడుకుఁ గోమలిఁ దోడుకొనుచు నీ యింటి 750
కడ కేఁగెదవా లేక కాఱులు వల్కి
కినిసి బ్రాహ్మణుని శిక్షింప లేరనుచుఁ
జెనఁటికోడిగములు సేసి పోయెదవొ'
నావుడు విప్రుఁ డన్నరపతి కనియెఁ
'గావరంబున నోరు గడవ నాడెదవు
చెడి కల్ల లాడినఁ జేరునే ధనము
కడపట నీకు నక్కఱ దీరదేని
పన్నుగాఁ గత్తియు బలపంబుఁ బూని
కన్న పెట్టుము సిరి గలవారియిండ్లు
నీచాత్మ ప్రొద్దున నీవు నా మొగముఁ 760
జూచితి గాన నాసొమ్ము నీ కబ్బెఁ
దివిరి నాకులము నిందించి నాగుణము
వివరింప నీకేల వియ్యమందెదవొ
నను విప్రుఁ డని కాచినాఁడవు గాక
కినిసి కాకున్న శిక్షింతువే నీవు

---

=రజ్జులు, కినిసి...రనుచు=ఎవ్వరుగాని బ్రాహ్మణుని కోపించి దండింపఁజాలరని. చెనఁటికోడిగములు = వ్యర్థపుతుంటతనములు, కావరమునన్ = క్రొవ్వుచేత, నోరుగడవనాడెదవు=నోరికి మించిమాటాడెదవు - నోటనెంత చెప్పవచ్చునో యంతకు హెచ్చుగాపలికెదవనుట, 'చెడి...ధనము'=ఐశ్వర్యముచెడినవాఁడు అబద్ధములాడి సంపాదింపవలయునన్నయెడల ధనమువచ్చి చేరునాయనుట, అక్కఱ=అప్పునిర్బంధము-పెండ్లమును బిడ్డను అమ్మికూడ అప్పుదీఱదేని, కత్తి = కన్నపుఁగత్తి, బలపము = కన్నపుఱాయి, నామొగము......నీకబ్బె= ఇది హరిశ్చంద్రుఁడు నీమొగముప్రొద్దునఁ జూడరాదన్నందులకు కాలకౌశికుఁడుచెప్పినబదులు, 'కినిసి...నీవు'కాకున్ననీవు కినిసిశిక్షింతువే = బ్రాహ్మణుఁడనికాక

కటకటా వెఱచునె కాలకౌశికుఁడు
కుటిలవిచార నీగూబజంకెనల'
నని యిట్లు బ్రాహ్మణుఁ డామహీవిభునిఁ
గనలి తర్కింప నక్షత్రకుఁ డనియె
'వసుధీశ యీవట్టివాగ్వాద మేల 770
మసలక మీలోనిమలఁకలు వాయఁ
దగవు గావింతుఁ బెద్దలు మెచ్చి పొగడఁ
దగిలి మీ కది సమ్మతం బగునేని
లక్షమాడలు దెచ్చి లంచ మిచ్చినను
బక్షపాతము మాకుఁ బని లేదు గాన
మాట మాటకుఁ బుట్టు మదిని జలంబు
పాటించి చలమునఁ బ్రబలుఁ గోపంబు
ప్రాపించుఁ గోపంబు పాపంపుఁబొత్తుఁ
బాపంబు నరకకూపమునకుఁ దెరువు
గాన నీ మది దురాగ్రహమును గొంత 780
మాని నా చెప్పినమాట గ్రహింపు'
మని చెప్పి ముద మందునా బ్రాహ్మణునకు
మనుజనాథుండు సమ్మతి నిట్టు లనియెఁ
'వటుశిరోమణి భవద్వాక్యంబు మాకుఁ

---

పోయినయెడల కోపించి నన్ను దండింతువా, గూబజంకెనల= గుడ్లగూబలవంటి కంటిబెదరింపుల చేత, మలఁకలు=రచ్చలు-అసమాధానములు, తగవుగావింతున్ = న్యాయముతీర్తును, మసలక ...బగునేని = 'తగవు మీకుసమ్మతంబగునేని తగిలి మీలోనిమలఁకలువాయ అది పెద్దలు మెచ్చిపొగడఁ గావింతు' నని యన్వయము, ప్రాపించు... బొత్తు=కోపము పాపముతోడిసహవాసమును బొందును-కోపము

బటుబుద్ధిఁ దలపోయ బ్రహ్మమంత్రంబు
పన్నినచీఁకటిఁ బాపి వెల్గింప
సన్నపుదీపంబు సాలదే తలఁపఁ
బిన్న వైనను బుద్ధిఁ బెద్దవు నీవు
మన్నించి మాన్యము మావివాదంబు
నీ వెట్లు చెప్పిన నీ చెప్పినట్ల 790
కావింతు' మనిన నక్షత్రకుం డనియె
నిఖలభూజనులకు నిజము నిష్ఠురము
ముఖము ముక్కింతురు మోవ నాడినను
బాడి దీర్చుట దొడ్డపని యగు నైనఁ
గూడదు పోలించి గోళ్లు రాయఁగను
మాకుఁ దోఁచినజాడ మానవాధీశ
యీకాంత విప్రున కీ వమ్మునపుడు
బాలుఁ డీజట్టిలోఁపలివాఁడు గాఁడె
పోలఁ బుత్రున కింతఁ బొలఁతుక కింత
విలువధనం బని వేర్వేఱ చెప్పి 800
తెలియ నాడక జట్టి తీర్చితి గాన

వలన పాపము సిద్ధించుననుట, బ్రహ్మమంత్రంబు = బ్రహ్మమంత్రమువలె పవిత్రమై త్రోసిపుచ్చరానిదనుట, పన్నిన= అలముకొన్న, పెనుచీఁకటిని సన్ననిదీపము పోఁగొట్టునట్లు, మా పెద్దతగవును పిన్నవగునీవే తీర్పనేర్తువనుట, ముఖము... నాడినను= తుదముట్టన్యాయము తీర్చినయెడల మొగమును ముడుఁచుకొందురు. పాడి... నైన=అయినప్పటికిని-అనఁగా ఎవరికెట్లు పడినను, న్యాయమును తీర్చుట యే గొప్పకార్యమగును, కూడదు పోలించి గోళ్లురాయఁగను = నిజమును దెగునట్లు తీర్పుచేయక ఇట్లుఅట్లు పోలికలుచెప్పి మిణకరించుచు గోళ్లురాసికొనుట యొప్పదు, తెలియనాడక= విశదపడునట్లు చెప్పక, దక్కెఁ=కాలకౌశి

సుతునితోఁ గూడ నీ సుందరి దక్కె
వితతంబు గాఁగ నీ విప్రముఖ్యునకు'
నని తనచక్కిఁగా నా ధూర్తవిప్రుఁ
డొనరఁ జెప్పినమాట కుత్సాహ మంది
కాలకౌశికుఁడు నక్షత్రకుఁ గ్రుచ్చి
యాలింగనముఁ జేసి యధిపుకట్టెదుర
వెక్కిరించుచుఁ గోల విసరుచు నోరు
వెక్క సంబుగ విచ్చి వెడనవ్వు నవ్వి
గంతులు వైచుచుఁ గరతాళగతుల 810
నంతంత నాడుచు నంతటఁ బోక
పడుచు లార్వఁగఁ జుట్టుఁ బరువులు వాఱి
కడఁగి చూచెడివారిఁ గదలఁ దోలుచును
బలువిస్వరంబులఁ బనసలు గొన్ని
చెలఁగి త్రప్పలు మీఁదఁ జిలుకఁ జెప్పుచును
జెనఁటిగోఁతికి వీర్లశివ మెత్తి నట్లు
కనుకనిఁ బెక్కు వికారముల్ సేయఁ
జూడ రోయుచు మహీశుఁడు మదిలోన
నేడ ధర్మం బింక నెక్కడితగవు

---

కుని అధీనమయ్యెను, తనచక్కిగాన్ = తనపక్షముగా, కరతాళగతులన్ = చప్పట్లుచఱచుచు, పడుచులు=పడుచువాండ్లు, ఆర్వఁగన్ =పరిహాసముగా కోయని యఱచునట్లు, కడఁగి చూచెడివారిన్ =తాను పరువులు వారుటను పూనిచూచు నట్టివారలను, కదలఁదోలుచును= పోవఁదఱుముచును, బలువిస్వరంబుల= పెక్కువికారస్వరములతో, పనసలు=బుక్కులు, త్రప్పలు=నోటితుంపరలు, చెనఁటి... వీర్లశివము= వెట్టికోఁతికి వీరులయావేశము, కనుకనిన్ - వేవేగ, వంశనా

లెక్కడిదైవ మిం కెక్కడి సత్య 820
మెక్కడిభూసురుఁ డేమి చెప్పెడిది
యెలమిఁ జుట్టమువలె నీ ధూర్త వడుగు
పిలువనితగవుఁ జెప్పెద నని వచ్చి
కాలకౌశికునిపక్షము పల్కె వంశ
నాళపన్నగ మాననము ముట్టి నట్టు
లీద్విజాధమునకు నీ యనాచారి
కీ ద్వేషచిత్తున కీ పిశాచమున
కీ క్రూరకర్మున కీ యేభ్యరాన సి
కీ కష్టచరితున కీ బహుభాషి
కీ పల్లవాధరి నీ కీరవాణి 830
నీ పుష్పకోమలి నీపద్మగంధి
నీ చంద్రబింబాస్య నీనీలవేణి
నీ చకోరాక్షి నీయిభ రాజగమన
పులి మెడ గొటియఁ దెంపునఁ గట్టి నట్టు
లలవున దాసిగా నమ్ముకో వలసె'
నని వెచ్చ నూర్చి హా యని తల వంచి
కనుఁగవ బాష్పంబుకణములు దొరుఁగ

---

శపన్నగము=వెదురు గొట్టములోని పాము, ఆననము ముట్టినట్లు=మొగమునుదాఁకినట్లు - గారడీఁడు వట్టి వెదురుగొట్టమును మొదటఁజూపి పిదప హస్తలాఘవమునదానిని గదల్పఁగా నందున్న కొయ్యపాము మొగమును దాఁకునట్లు. ఇట్లె నక్షత్రకుఁడును ఏమియుఁ గీడు సేయనట్లు తోఁపించి పిదపఁ గీడు చేసినాఁడనుట ఎభ్యరాసి = దుష్టపంక్తిలో చేరినవాఁడు, పల్లవాధరి = చిగుళ్లవంటి పెదవిగలది, కీరవాణి=చిలుకవంటి మ్మాటలుగలది, ఇభరాజగమన = మేటి యేనుఁగువంటినడగలది. గొటియ=గొఱ్ఱె, కడగోరఁ = కొనగోటితో, కా

నెసఁగుశోకాగ్నుల నెరియుచు నున్న
వసుధీశుదీనభావంబు వీక్షించి
పురపురఁ జిత్తంబు పొక్క నందంద 840
కరుణతో నారాజకాంతాలలామ
సుతుఁడును దాను నేడ్చుచుఁ జనుదెంచి
పతిపాదముల మీఁద భక్తితో వ్రాలి
కొడుకు మ్రొక్కించి డగ్గుత్తికఁ బెట్టి
కడగోరఁ గాటుకకన్నీరు మీటి
పాణిపల్లవములు పఱఁగంగ మోడ్చి
'ప్రాణేశ నేఁటితోఁ బాసితే మమ్ముఁ
బాయఁ ద్రోవలు సేసెఁ బ్రతిబంధ మకట
మాయురే కౌశికమాయాపిశాచ
మిది మొద లెందున్న నేమి నీయొద్దఁ 850
గదలవు నామనోగతులుఁ బ్రాణములు
నానోముఫలమున నాథ నీవెలమి
నీనిఖిలోర్వియు నేలెదు మగుడ
నక్షత్రకుండు దుర్నయమున విప్ర
పక్ష మాడుట కాత్మఁ బరితాపపడకు

---

టుకకన్నీరు=కాటుకతోఁగూడినకన్నీరు, మీటి=పోఁజిమ్మి, పాణిపల్లవములు=చిగుళ్లవంటిచేతులు, 'పాయఁ... పిశాచము'= విశ్వామిత్రుఁడనెడి మాయపు పిశాచి మనలను ఎడఁబాయునట్లు మార్గములుపన్నెను, మాయురే = ఔరా! మనోగతులు=మానసవ్యాపారములు, నీయొద్దఁగదలవు=నీపొంతను విడిచిపోవు- నిన్నుఁదప్పమఱొక్కటిని నామనస్సు ఎప్పుడుగాని తలఁచుకొనదనుట, నిఖిల-ఉర్వి=సమస్తభూమి, విప్ర పక్షమాడుట=బ్రాహ్మణునిపక్షముగా తగవుచెప్పుట

సన్మార్గవర్తివై జరుపు నీమీఁద
నున్మాదమున రేఁగి యోహరిశ్చంద్ర
వక్రించెఁ గుశికసంభవరాహు విపుడు
చక్రాయుధుఁడు నీకు శరణమై మనుచు
నక్రంబు పట్టిననాఁడు గజేంద్రు 860
విక్రమంబునఁ గాచి విడిపించినట్లు
తఱలకు ధైర్యంబు దలఁపకు మమ్ము
మఱవకు నీసత్యమహిమంబు' ననుచుఁ
బతిపాదములమీఁద భక్తితో వ్రాలి
సుతుని మ్రొక్కింపఁగఁ జూచి యాసతిని
గాలకౌశికుఁ డౌడు గఱచి నిప్పుకలు
రాల వీక్షించి కరాళించి పలికె
'నోసి నాయెడ భయ మొక్కింత లేక
వాసి మాలినబీదవానిని మ్రుచ్చు
డాసినగతి నిల్చి డాసి నేఁ జూడఁ 870
బాసి రా నేరక భాషించు టెట్లు?
భాషించి మఱి చాఁగఁబడి మ్రొక్కు టెట్లు?
రోష మెట్లొదవ దీరోఁతఁ గన్గొనిన

---

కుశికసంభవరాహువు = విశ్వామిత్రుఁడనెడి రాహుగ్రహము, చక్రాయుధుఁడు = విష్ణుదేవుఁడు, ఈవిశేషణము సాభిప్రాయము - రాహువును విష్ణువు తనచక్రముతో నడఁచినట్లు విశ్వామిత్రునిఁగూడ నడఁచుననిభావము, నక్రంబు = మొసలి, తఱలకు = చలింపకు, ఔడుగఱచి = క్రిందిపెదవిఁ గొఱికి కొని, కరాళించి = భయంకరముగా, వాసిమాలినబీదవానిని=పరువులేనట్టి దరిద్రుని - హరిశ్చంద్రుననుట, మ్రుచ్చు... చూడఁగ=దొంగ సమీపించినట్లు నేను సమీపించి నిలిచి చూచుచుండఁగా, చాఁగఁబడి=చాఁగిలబడి, ఒదవదు=పుట్టదు,

బాపు పతివ్రత బాపురే గోల
బాపురే గుణవతి బాపురే ముగుద
విడువు మీ దేశాలివిద్య లొజ్జలకు
బడితపాఠము దొంగపదరు లన్నియును
నెఱిఁగితి నీ మర్మ మింక నేమఱించి
యుఱికి పోఁ జూచెద వూడ నీవెనుక
దక్కితి వని నమ్మఁ దగదు నిన్నెపుడుఁ 880
గుక్కకూఁతుర మెడఁ గోసి పోఁగలవు
రెండు పోనాడిన రేవనిరీతి
నుండ బాలకు నిన్ను నోరంత ప్రొద్దుఁ
గీలుసంకెలఁ గేలఁ గీలించి వీఁపు
ప్రీలంగఁ గొట్టుదు వెఱపు లేకున్న
గోఁచి గట్టిననాఁటఁగోలె పీనుఁగుల
నోఁచి గడించినమూలధనంబు

---

బాపు పతివ్రత = సెబాసు పతివ్రతయఁట, బాపురేగోల = సెబాసు ఏమి తెలియనిదఁట, బాపురే = సెబాసు గుణములుగలదఁట, బాపురేముగుద = సెబాసు ముద్దరాలఁట, ఈదేశాలివిద్యలు=నీదేశములో కఱచిన యీావిద్యలు, ఒజ్జలకు = నీకుఁ గఱపినవానికి, విడువు=వదలిపెట్టుము - నాయొద్దఁజూపకుమనుట, బడిత పాఠము = చదివినపాఠము, 'దొంగపదరులు అన్నియును బడితపాఠము', అని యన్వయము, దొంగపదటపుమాటలన్నియు నే నీవు నేర్చినచదువులుగాని మఱి మంచివి ఏవియుఁగావనుట, ఊడ నీవెనుక = నీవెనుకను విడిచిపోవును - నిన్ను వెంటనంటుచు నే కాచియుండుననుట, రెండుపోనాడినరేవనిరీతి= రెంటికిఁజెడ్డ రేవనివలె-ఇదియొకసామెత, ఉండక్=ఉండను, ఓరంతప్రొద్దు= రేయుంబగలు, కేలక్ కీలించి= చేతులకుఁదగిల్చి, గోఁచిగట్టిననాఁటఁగోలె= తెలివిపుట్టినది మొదలుగా - మొట్టమొదట పసితనమున తెలివిపుట్టినది మొదలుగాననుట, గడించి

కసి బెండపువ్వులగతి రాసి వ్రాసి
పొసఁగునావాతన పొక్కు లెన్నితివి
చేతితడాఱ దుచ్ఛిష్టపులేమ 890
బాఁతియే నీవంటిబానిస లెచటఁ
గండక్రొవ్వున నన్నుఁ గైకొని రాక
మెండొగ్గెదవు మందెమేలముల్ మాను'
మనుచుఁ బట్టఁ దలంచి యాపువ్వుబోఁడి
తనకు మ్రొక్కుచుఁ బాణితలముల నొగ్గఁ
బెలుచ నెత్తురులు సిప్పిలఁ గోల మొత్తి
తలకొన్నకోప మంతట నిల్ప లేక
వెఱచి వాపోవుచు వెసఁ బాఱె తండ్రి
మఱుఁగుఁ జొచ్చినసుకుమారుఁ గుమారుఁ
గుదికిలఁ బడ రెట్టఁ గుదియించి తిగిచి 900
యదరంట మొత్తి నోరడఁగ జంకించి
పెడమాట లన్నియుఁ బెనుమోపు గాఁగ

---

=సంపాదించినట్టి, నావాతన పొక్కులెన్నితివి = నానోటనే మన్నుగొట్టఁ జూచితివి; చేతితడి ఆఱదు ఉచ్ఛిష్టపులేమ= ఎంగిలిదానా నిన్నుఁదీసి చేపట్టి నచేతి తడికూడ ఆఱిపోలేదు. ఒకరుపెట్టినభోజనముఁదిని కడిగనచేయి తడి యాఱకమునుపే వారియెడ ద్రోహము తలఁచునట్లు నిన్నుఁదీసినక్రొత్త తీయక మునుపే ద్రోహము తలఁచెదవాయనుట, బాఁతియే= హెచ్చా, మెండు ఒగ్గెదవు= మిక్కిలియు ఊఁగెదవు, మందెమేలములు= చనవులు, ఒగ్గన్ = చాఁచఁగా, చిప్పిలన్ =కాఱునట్లు, తలకొన్న= రేఁగిన, అంతట నిల్పలేక = అచంద్రమతిని గొట్టినమాత్రముతో విడువఁజాలక, కుదికిలఁబడన్ = మొగముపైనెత్తుకొని నేల మోవ గొంతుగూర్చుండు, నట్లుఅదరంటన్ =పూర్ణముగా, నోరు అడఁగన్ జంకించి=నోరెత్తి ఏడువకుండునట్లు బెదరించి, పెడమాటలు = పెద్ద మాటలు

మడఁ బెట్టి యాచంద్రమతి నెత్తికెత్తి
"మురిపెంపుఁబని లేదు ముందఱ నింక
నరుగున నింటికి జరుగు లె' మ్మనుచుఁ
దనవెంట విప్రుఁడు తఱుముచు నడవఁ
దనయుముద్దులకేలు దనకేలఁ బట్టి
చెక్కుల సన్నంపుఁజెమ రెక్క నడుము
నుక్కట నొక్కంత నూఁగారు దోఁప
నలరుపయ్యెద జాఱ నలకలు చెదర 910
నులివాళ్లు వాఁడి తనూలత సోల
నలయుచుఁ జనుచున్న యా మచ్చెకంటిఁ
గలయ వాడలఁ బుణ్యకాంతలు సూచి
వగలఁ గుందుచు బాష్పవారిబిందువులు
దెగినముత్యంబుల తెఱఁగునఁ దొరుఁగఁ
'గటకటా! భార మెక్కడ నుండి వచ్చె
గిటగిట నైనయీ కీరవాణికిని
గచభార మోర్వనికంత మీఁదాన్య
నిచయభారమునకు నిలువ నెట్లోర్చె
నేల దీనికిఁ గుంద నిటు చూడ రమ్మ 920
వ్రేలి నొయ్యనఁ బట్టి వెనుకొని వచ్చు

---

మడతఁబెట్టి=మడిచి, మురిపెంపుఁబని=సొగసులుతోఁగూడిన-సుకుమారమైన-పని, నడుమునుక్కటన్ = నడుముయొక్క చల్లనము చేత, నులివాళ్లువాఁఢి = కొంచెమువాఁడి, తనూలత = తీఁగవంటి మేను, మచ్చెకంటి= చేఁపలవంటికన్నులుగలది, గటగిటనైన = మిక్కిలి కృశించిన, కీరవాణి = చిలుకపలుకులువంటి పలుకులుగలది, కచభారము = కురులబరువు, నిచయ=సమూహము, ఏలదీనికిఁ గుందన్ =ఈయాఁడుదానికి దుఃఖింపనేల - అనఁగా దీనికంటె నెక్కువ దుః

వెన్నముద్దకు రూపు వెట్టినమాడ్కి
నున్న మెత్తని మేను నొప్పెడువాఁడు
యెన్నఁడు నెండఁ గన్నెఱుఁగని శిశువు
గన్నుల ముత్యాలు గాఱ నేడ్చెడిని
నే చెల్ల నో యమ్మ యీంచక్కనన్న
రాచ తేజము గలరత్నాల పెట్టె
నడవ నెట్లోర్చెనే నా ముద్దుఁజిలుక
కడుపుఁ జుఱుక్కనుఁ గన్నవారికిని
వీఁ డొక్క తెరబొమ్మ విప్రవృశ్చికము 930
పీడించి వీరి నొప్పించుచున్నాఁడు
కాలఁగాఁ జిక్కినకాష్ఠంబువంటి
కా లీచఁ బోయిన కట్టెఁడి మాల
చందురంబులును బుస్తకమును గోపి
చందనంబును జూచి చనదుసూనమ్మ
యెందును బురిలోన నెప్పుడు మెలఁగు
బందికాండ్రకు నివి పరఁగుచిహ్నములు'

---

క్షింపవలసియున్న యీ బాలునిఁ జూడుఁడనుట, వెన్న... మేను=వెన్నముద్దను దెచ్చి బాలునిరూపముగాఁజేసినట్లు ఈబాలుని మేను మిక్కిలి మెత్తనై నిగనిగ లాడుచు చూచుటకు అతిభోగ్యముగానున్నదనుట, కన్నుల ముత్యాలుగాఱ =ముత్యములవలె కన్నీటిబొట్లు కాఱఁగా, నేచెల్ల = నేనుసహింపనే, రాచ తేజము= రాజతేజస్సు, తెరబొమ్మ=వెఱబొమ్మ, విప్రవృశ్చికము=బ్రాహ్మణరూపముననుండు తేలు, కాలఁగాఁ...కాష్ఠంబు = కొంచెముకాలి కొంచెము కాలకయున్న కట్టె, కాలు ఈచఁబోయినకట్టెఁడి = ఈచబోయిన కాలుగలు కఠినుఁడు, మాల చందురములు=సిందూరములు, బందికాండ్రకు=బందిపోటుదొంగలకు, ముక్కఁ

యని విప్రుఁ దిట్టుచు నావధూజనము
దనమీఁద మెటికె లందఱుఁ బెళ్లు విఱువ
ముఖ మెఱ్ఱనై బొమముడిపాటు గదుర 940
శిఖ వీడ వెస ముక్కుఁజెమరులు నిక్క
నవఘుళంబుగ దండ మల్లార్చి పేర్చి
కవిసి వ్రేసిన మహాకలకలం బెసఁగ
'నదె విప్రభల్లూక మరుదెంచెఁ దలఁకి
పద పద' మనుచు నప్పౌరకామినులు
వెల్లుగా నొండొరుఁ బిలుచుచుఁ గలఁగి
జల్లున గమి విచ్చి సందులు దూఱి
పోవంగఁ జూచి యాభూసురాధముని
వావిరి వెతఁ బెట్ట వడుగులు గదిసి
కుదిచి యొక్కఁడు చేతికోలఁ బోవైచె 950
బెదర నొక్కఁడు శిఖఁ బెఱికి రాఁ దిగిచెఁ
బొడిచె నొక్కఁడు తూటు వ్రోవఁగ నెత్తి
విడిచె దోవతికట్టు వెస నొక్కరుండు
నొక్కఁడు మీసంబు లూడి రాఁ బెఱికె
నొక్కఁడు జంధ్యంబు లొగిఁ ద్రెంచి వైచె
నొక్కఁడు గొడుగు డాయుచుఁ బట్టి విఱిచె
నొక్కఁడు పుస్తకం బొడిసి కైకొనియె
నొక్కఁడు గుదికిల నుర్విపైఁ ద్రోచె

---

జెమరలు=ముక్కురంధ్రములు, అవఘుళంబుగన్ = హెచ్చుగా, అల్లార్చి=ఆడించి, విప్రభల్లూకము=బ్రాహ్మణుఁడనెడి యెలుఁగుబంటు, పౌరకామినులు =పురస్త్రీలు, కుదిచి=గట్టిగాఁబట్టి, గుదికిలన్ = వెల్లకిలఁగా, చీబోతున్ = మన్నుఁ

నొక్కఁడు గన్నుల నొగి మన్నుఁ జల్లె
నొక్కఁడు మొగముపై నుమిసె నాలోన 960
నొక్కఁడు వెస నాఁకె నూర్ధ్వపుండ్రంబు
నొక్కఁడు రాళ్లపై నొనరంగ నీడ్చె
నొక్కఁడు పిడికిట హుమ్మని గ్రుద్దెఁ
బెక్కుగాఁ దోఁడేటిపిల్లలు గూడి
బక్కచీబోతు లంపటఁ బెట్టినట్లు
కాలకౌశికు నిట్లు గారించువిప్ర
బాలుర కెల్లను బ్రణమిల్లి నిలిచి
సన్నుతప్రియవాక్యసరణిఁ బ్రార్థించి
'మన్నింపుఁ'డనుచంద్రమతిమాట కలరి
'నీకుఁ బ్రియంబుగా నీచు నీవిప్రుఁ 970
గైకొని చంపక కాచితి' మనుచు
వడుగు లందఱు వాడవాడకుఁ బోవ
వెడగొడ్డుఁ బులి నాకి విడిచిన ట్లైన
జడిసి తొల్లిటితనజజాట మెల్ల
నుడిగి కోఱలు లేనియురగంబుఁ బోలె
వడి చెడి తల యెత్తి వడుగు లచ్చోట
నుడియ కుండఁగ నోరచూపులు సూచి
దోవతి ధూళి విదుల్చుచు లేచి

---

బోతు, లంపటపెట్టు=శ్రమపెట్టు, కారించు=బాధపెట్టు, వెడగొడ్డుర్ =అల్ప పశువును, జంజాటము=తొడుసు-అడిచిపాటు,ఉరగము=సర్పము,నుడియకుండం గర్ =చుట్టుకొనకుండునట్లు, ఇంటివారి... పాపాత్మురాల=ఇంటివారిని దొంగవ

భూవల్లభుని దేవిముఖము వీక్షించి
'యోసి న న్నిట్టింగి నోడక గ్రుద్ది 980
గాసి పెట్టెడుపలుగాకుల నెల్లఁ
దలవరు లరుదెంచి దండింప కుండఁ
దొలఁగి పోమ్మని పాఱఁ దోలంగఁ దగునె
యింటివారిని లేపి యీవల దొంగ
బంటుకుఁ జెయ్యిచ్చు పాపాత్ము రాల
పరువుగా నిన్నెట్లు వచ్చు నమ్మఁగను
బరుసనిమాటలపని యిప్పు డేల
నిల్లుఁ జేరినమీఁద నీపగ యెల్ల
వెళ్లింప కున్న నే విప్రుండ నఁట వె'
యని పగఁ జాటుచు నాధూర్తవటులఁ 990
గినిసి తిట్టుచుఁ దనగృహమున కేఁగి
తలసాల నిలుచున త్తఱి నెట్టయెదుటఁ
బెలుచఁ దుమ్మిన భీతిఁ బ్రిదులుచు నిలిచి
చింతించు చున్నంత శిష్యుఁడు వచ్చి
సంతసంబున నమస్కారంబుఁ జేసి
నడుఁకుచుఁ జేరి ముందఱ నున్న శిష్యు
వడుగు నల్లప్పటి వడిఁ దుమ్మినట్టి

---

చ్చెనని జాగ్రత్తపఱుప లేపి తుద కాదొంగ చేతికే పట్టియిచ్చు పాపిష్ఠిదానా! పరుసనిమాటలపని=పరుసుగామాటాడవలసినయక్కఱ, వెళ్లింపకున్న=తీర్చుకొనకున్న, ధూర్తవటులు=దుర్మార్గులైనవడుగులు, తలసాల=తలవాకిలి, ఎట్టయెదుటన్=మిక్కిలియెదురుగా, పెలుచన్=గట్టిగా, ప్రిదులుచున్=సడలుచు - బిగితప్పి విరవిరవోవుచు, నడుఁకుచున్=వడఁకుచు, అల్లప్ప......వానరునిన్=తలసాల

యెండి పోయినవాలహీనవానరునిఁ
గుండగోళకునిఁ గర్కోటకుఁ డనెడి
కుటిలజాతుని బందికుక్క నీక్షించి 1000
'తటుకునఁ దుమ్ము పంతముఁ జెప్పు'మనిన
దినము వారముఁ బ్రొద్దు దిక్కును గ్రహము
నొనర నెన్నినరీతి నొకకొన్ని యెన్ని
'కలుగు నిప్పుడు గృహకలహంబు మీకుఁ
దలపోసి చూడఁ దథ్యం' బన్నఁ గలఁగి
'తప్పదు నీ మాట తార్కాణ మాకుఁ
జెప్పితి మును తుమ్ము చేకొన కేఁగి
నా కూర్మిపత్ని చే నడునెత్తి వగుల
రోకట నొకపెట్టు రూఢిగాఁ బడితి
ముండకూఁతురు కిన్క ముక్కునబంటి 1010
గుండె జల్లను నది గోపించె నేని
పడఁతి గాదది నన్నుఁ బట్టి మర్దింపఁ

---

నిలుచున్నప్పుడు వేగతుమ్మినట్టివాఁడును, చిక్కిపోయినతోఁకలేనికోఁతివంటి వాఁడును - దీనిచే వానరమువలె వికారరూపును ధూర్తచేష్టలునుగలవాఁడని తెలియునది, కుండగోళకునిన్. కుండుఁడనఁగా స్త్రీకి మగఁడుండఁగా అంకు మగనికిఁ బుట్టినకొడుకు, గోళకుఁడనఁగా విధవకు అంకుమగనివలనఁబుట్టినకొడుకు -ఇచట కుండగోళకుఁడనుట కేవలనిందామాత్రపరము,కుటలజాతునిన్ =పుట్టుక చేతనే కపటుఁడైనవానిననుట, బందికుక్క = బందిపోటువారలుపయోగించు కుక్కవంటివాఁడనుట - క్రూరత్వమను చౌర్యమునుగలవాఁడనిభావము. తుమ్ము పంతము=తుమ్మినందులకుఫలము, తార్కాణ=మూఁదల- సరిదాఁకునది. చెప్పితి ... కేగి=ముందుతుమ్ముఫలము నీవుచెప్పితివిగాని దానిని పాటింపక నేనులోపలికిఁ బోయి, కిన్కముక్కునబంటి=కోపము ముక్కువఱకుఁగలది, తలపుచ్చుక=త

బుడమిఁ బుట్టిన పెనుభూతంబు గాని
యీయింతిఁ గొని వచ్చు వెఱఁగిన నన్నుఁ
బోయినప్పుడె తలపుచ్చుక మ్రింగుఁ
గావున నిప్పు డీకమలాక్షి వార్త
నీవు ముందఱ నేఁగి నేర్పు సంధిల్ల
జననాథుఁ డొక్కఁ డీసతి దాగ వ్రాసె
నొనర నొజ్జల కని యొడఁబడ మొఱఁగి
నావధూమణికి సంతసము పుట్టించి  1020
వేవేగ నాలోని వెఱపెల్ల మాన్పు'
మని వేఁడుకొనుటయు నవ్వటుధూర్త
మనసులో వే ఱొక్కమతము చింతించి
'విరసంబు పుట్టించి వీనికి వీని
తరుణికి నొకమఱి తలపట్లు చేసి
మొగములు వగులంగ మొత్తులాడించి
నగుచుఁ జూచెదఁగాక నాకేమి' యనుచుఁ
గపట మేర్పడఁగ 'నోఁ గాక'ని పోయి
చపలాత్ముఁ డాయొజ్జసాని కిట్లనియెఁ
'జేరి నీ కొకమాటఁ జెప్ప వచ్చితిని  1030

---

పుట్టె, సంధిల్లన్ =కూడికొనఁగా, జననాథు...జ్జలకు = ఒకానొకరాజు ఈ స్త్రీని ఉపాధ్యాయులకు దానము సేసెను, ఒడఁబడన్ =సమ్మతించునట్లు, మొఱఁగి = ఏమఱించి, వధూమణి=భార్యారత్నము, వెఱపు=భయము, వటుధూర్త =ధూర్తుఁడైనవడుఁగు, వేఱొక్కమతము=మఱియొకయభిప్రాయము - తనగురువు చెప్పినదిగానట్టివేఱుభావమును, విరసంబు...తరుణికిన్ ='వీనికి వీనితరుణికిని విరసంబు పుట్టించి' అనియన్వయము. మొత్తులాడించి = ఒకరినొకరు మొత్తు

నోరు గాచెద నన్న నుడువుదు నీకుఁ
జెప్పిన నొజ్జలచేఁ జావు నిజము
చెప్పకుండిన మాకుఁ జేటు నీచేత
వెడల నాడిన దుర్వివేక మీమాట
కడగి చెప్పినఁ గాని కడుపుబ్బు దిగదు
నాలుక నువుగింజ నానదు నాకు
జాలి నాతోడ నొజ్జలు సెప్పి యున్న
మాట నీ కెఱిఁగించి మదురుగోడైన
దాఁటి పోయెద నింక దాఁపుర మేల
రూపింప వికృతంపురూపు నీ రూపు 1040
నా పత్నికటుగాన నా కిటమీఁదఁ
గమనీయరూపరేఖలు గలకాంత
నమర నొక్కతె వివాహంబు గా వలయు
నని యొజ్జ లిట క్రింద నాడువాక్యములు
వినిపింప నవి నీకు విరస మౌ నంచు

---

నట్లు చేయించి, ఒజ్జసాని=భార్య, నోరుగాచెదనన్నన్ = నీనోరు నేనుజెప్పిన మాటను జెప్పకుండునట్లుపదిలముగాఁ జూచుకొందునని చెప్పితి వేని, వెడలనాడినన్ = వెలిపడునట్లు చెప్పినచో, దుర్వివేకము= వివేకములేమి, కడుపుబ్బుదిగదు=చెప్పకుండినయెడల కడుపు ఉబ్బుట తీసిపోవదు-ఆఱట అడఁగదనుట, నాలుక... నాకు=నాకు నాలుకలో నువ్వుగింజకూడ నిలువదు - ఒక్కమాటయైనను వెలువడకుండ నేరదనుట, జాలిన్ =పరితాపముతో - నిన్నుఁబోలిన పెండ్లముకలిగెనని పరితాపముతో ననుట, మదురుగోడ = చుట్టుపారిగోడ, దాఁపురము = దాఁచిపెట్టుట, వికృతంపు... నాపత్నికిన్ = నా పెండ్లమునకు నీరూపమువలె వికారమైనరూపము, కమనీయరూపరేఖలు = మనోజ్ఞమైన యాకారలక్షణములు, వినిపింప...నంచు= 'నీకువిరసమౌనంచు నవి వినిపింపను' అని యన్వయము.

నిదె నేఁడు సౌందర్య మెల్లను బ్రహ్మ
చిదిమి చక్కనిరూపు సేసిన యట్టి
రాచకూఁతురు గొని రవ్వగా కుండ
దాఁచినమీమూలధన మెల్లఁ బెట్టి
గోఁచికాఁడై దానిఁ గొనుచు నేతెంచి 1050
లాఁచి యున్నాఁడు నీలా గొత్తి చూడ
వాఁడె పో మనతలవాకిట నున్న
వాఁ'డన్న నది మోము వడిఁ జేవురింపఁ
గోపించి పెటపెటఁ గొఱికి దంతములు
వాపోవుచంకటివానిఁ బోవైచి
'కటకటా! కాటికిఁ గాళ్లు సాఁచియును
విటతనంబులజాడ విడువఁ డీబడుగు
కొండంగి వీని వెక్కురుతల దఱుగ
ముండగోష్ఠికి ముక్కుమొగమేడ తనకు

ఇంతవఱకు వినిపింపకుంటిననుట, సౌందర్య......రాచకూఁతురు=బ్రహ్మలోకము నం గలచక్కఁదనమునంతయుఁ దీసికొని చక్కనిరూపుగా సేయఁగానైనట్లున్న యొకరాజకుమారి, గోఁచికాఁడై=ధనమెల్ల రాచకూఁతునకు వెలగానిచ్చి వేయుట చేత కాసుమిగులక కౌపీనమాత్రము మిగిలినట్టి దరిద్రుఁడై, లాఁచియున్నాఁడు నీలాగు ఒత్తిచూడన్=నీవిధము ఏమో చక్కఁగా పరిశీలించుటకై పొంచి యున్నాఁడు, జేవురింపన్=ఎఱ్ఱఁబాఱఁగా, దంతములు = పండ్లు, వాపోవు చంకటివానిన్ = ఏడ్చుచున్నచంకలోఁబిడ్డను, కాటికిఁగాళ్లుసాఁచియును = చావఁబోవ సిద్ధుఁడుగానుండియును-మరణముదాపించినంత ముదుకఁడయ్యెనను టు, విటతనంబులజాడ = జారత్వపుచిన్నెలు, బడుఁగు= బక్కవాఁడు, కొం డంగి=కుటిలుఁడు, వెక్కురుతలదఱుగన్ = వికారపు తలకాయ కోయను, ముండ ... తనకు = ముండలతోడఁగూడుటకు తగినంత ముక్కుమొగముతీరు

బిడ్డల కొసఁగక పెండ్లాము కిడక 1060
వడ్డి కిచ్చుచుఁ జీమ వలెఁ గూడఁ బెట్టి
ధన మంతయును మిండతల కిచ్చె వీనిఁ
గొని పోయి యెన్నఁడు కూలఁ గ్రుమ్మెదరో
బాపురే యనుకొనఁ బని లేదు గాక
రూపింప నాకంటె రూపసి కలదె
యీ ప్రొద్దు వానిఁ గుయ్యాడ శిఖఁ బట్టి
వీఁపుతీటంతయు విడిపించి యెదుట
దక్కించి పోయినధనమెల్ల మగుడఁ
గ్రక్కింప కున్న నేకలహాకంఠిక నె'
యనుచు రోఁకలిఁ గేల నమరించుచున్నఁ 1070
గని రయంబున వెళ్లి కర్కోటకుండు
కడుసంభ్రమంబునఁ గాలకౌశికుని
యడుగులఁ బడి లేచి హస్తముల్ మొగిచి
'విచ్చేయుఁ డింక మీ వెఱ పెల్లఁ బాపి
వచ్చితి' ననుడు నవ్వటుధూర్తుఁ బొగడి
లోనికేఁగెడునంతలోఁ దల్పు మూసి
పూని గొండ్లెముఁ బెట్టి పోయె నా శిష్యుఁ
డత్తఱిఁ జని కాంచె నా రాజు దేవి
చిత్తంబు జల్లనఁ జిడిముడిఁ బడుచు

---

తనకెక్కుడిది, మిండతలకున్ = జారిణులకు, కూలఁగుమ్మెదరో = కూలునట్లు గ్రుద్దుదురో, అనుకొనఁబనిలేదుగాక = నాకు నేనే నాయందమును చెప్పుకొనవలసిన యక్కఱలేదుగాని, రూపసి=అందకత్తె, కుయ్యాడన్ =అఱవఁగా, దక్కించిపోయిన ధనము=తనకువశము చేసికొని కొనిపోయి దారపోసికొన్న విత్తము,

మెదుక పట్టినతల మెడ గండమాల 1080
నుదుటిమీఁదటిసుడి నులిగొన్నబొమలు
బుఱ్ఱ ముక్కును లొట్ట పోయినగన్ను
వెఱ్ఱిచూపును దెగి వ్రేలాడుచెవులు
మిడిపండ్లు చెక్కిలి మీఁదిపుల్పిరియుఁ
బడి వ్రేలుచన్నులు బడబాకినోరు
రోటు పోయినచెయ్యి ఱొమ్ముకంపరము
వాటుఁగాలును ఱోలువలె నున్న నడుము
బద్దుపిక్కలు నంట బలసినతొడలు
మొద్దుపాదంబులు ముడిఁగినవ్రేళ్లుఁ
గఱుకునల్లనిమేను గలిగి దయ్యంబు 1090
మఱపింపఁ దగు నుచ్చమల్లిచందమునఁ
గనుఁగొన రోఁతైనకాలకౌశికుని
వనిత హుమ్మనుబందివాటులమాతఁ
గని దానిఁ గదియ బెగ్గల మంది వెఱచి
వెనుకకు జరుగు నుర్వీవిభుదేవి

---

మొగిచి = మోడ్చి, మెదుకపట్టిన = పిసకగానున్న, నులిగొన్న = చిక్కుపడిన, బడబాకినోరు = పెద్దవెడఁదనోరు, రోటుపోయిన = ఈఁచఁబోయిన, కంపరము = పాడె, వాటుఁగాలు = నడుచునప్పుడు ప్రక్కవాటుగాఁబోవునట్టికాలు, బద్దుపిక్కలు = పలుచనిపిక్కలు, అంటబలసిన = నిలువెల్లబలుపునొందిన - చక్కఁదనమునకు అనుగుణముగా అయ్యాభాగములందు ఎక్కువతక్కువలుగా బలుపునొందక ఒక్కచోటే మొద్దుగాబలసియున్నట్టి యనుట, కఱుకు = బిఱుసైన, ఉచ్చమల్లి = దిస్సమొలతూఁడుది, హుమ్మను బందివాటులమాత = బందివాటుదొంగల తల్లివలె హుమ్మనుచు బెడిదముగానుండునది, బెగ్గలమంది = భయపడి, ఉర్వీవిభుదేవి = రాజుభార్య, చివ్వంగి = సివంగి, బలిభిక్షులవారికి = బలి

సివ్వంగి లేడి వీక్షించుచందమునఁ
గ్రొవ్వునఁ జూచి కర్కోటకు మాట
లన్నియు నిజముగా నాత్మ భావించి
పన్నినకోపంబు బలసి రెట్టింప
బలి భిక్షులవారి బలువిడి మొత్తఁ 1100
దలసాలఁ గట్టినతన వ్రేలుదుద్దు
వడిఁ గేలఁ గైకొని వచ్చునజ్జఱభిఁ
'గడఁగి వీక్షించి యక్కాలకౌశికుఁడు
గుండె భగాలనఁ గొలఁదియై తనకుఁ
'బండె నెక్కడఁ జొరఁబాఱ నె' ట్లనుచు
వెడవెడఁ దన కచ్చ వీడంగఁ బాఱి
వడి మోము వగులఁ గవాటంబు దాఁక
గడియతోఁ బెనఁగి దిగ్భ్రమఁ దత్తఱింపఁ
'బోడువ నీ కెక్కడఁ బోవచ్చు' ననుచుఁ
బెక్కుభంగుల మొత్తఁ బెట్టంగ వెత్తి 1110
కుక్క లోఁబడఁ బట్టి కొట్టిన రీతిఁ
'జేతు లొగ్గుచు మ్రొక్కఁ జేకొను' మనుచు
నాతురంబున వేఁడ నందంద మొత్తి
వడి చెడి దగ దొట్టి వఱదలై చెమట

---

గానిబిచ్చముగాని అడుగవచ్చువారిని, బలువిడిన్ = బలముగా, మొత్తన్ = కొట్టుటకు, వ్రేలుదుద్దు=వ్రేలాడుచున్న దుద్దుకట్టు, జఱభి=దుష్టస్త్రీ, 'గుండె... బండె' గుండెభగాలని యదురునంతమాత్రమై కార్యము ముగిసినది, ఎక్కడఁ జొరఁబాఱనెట్లు = ఎక్కడప్రవేశింపవచ్చును ఎట్లుపాఱిపోవచ్చును అని, వడి చెడి=అలసటచే కొట్టెడియురవడి తీసిపోయి, దగదొట్టి=దప్పినొంది, వఱదలై

గడవ వగర్చు నక్క లహా కంఠికను
గనుఁగొని తలపోసి కాలకౌశికుఁడు
'దినదినంబును మొత్తి దీనిచేఁ జత్తు
హర హరా యిటువలె నడలుట కన్న
మరణ మైనను నొక్క మారైన లెస్స
పంద నందలు బాధపఱుతురు గాని 1120
యెందు సాహసునిది క్కెవ్వరుఁ బోరు
పులి నడుగరు మేకపోతులఁ గాని
బలహీనుఁగాని చంపవు దయ్యములును
దెంపు మీఱఁగ నాశ దెగఁ గోసి దీనిఁ
గొంప లోపల వెళ్లఁ గొట్టుదు' ననుచుఁ
గుదియక కరతిత్తి గొని దాని వ్రేయ
నది చెడిపోవను నందంద మోఁదె
వడి దానితలఁ బట్టి వంచిన విప్రు
నొడిచి గడ్డము పట్టి యూఁచె న వ్వేలఁది
నఖముల వ్రచ్చె నన్నాతి నాద్విజుఁడు 1130
ముఖము ద్రిప్పఁగ నది ముక్కు వ్రేఁగఱచె
విసువక నీ రీతి విప్రదంపతులు
మసలి పోరఁగఁ జంద్రమతి సేరి యనియెఁ
'దగువారు నిందింపఁ దమవారు రోయ
నగువారి నెఱుఁగక నయ మేది యిట్లు

=వెల్లువలై, కడవవగర్చు=మీఁదుమిక్కిలి అలయుచున్న, అడలుట = దుఃఖించుట, ఒక్కమారైనన్ =ఒక్కసారి గామరణ మేకలిగినను, పందన్=పిఱికివానిని, కుదియక=వెనుదీయక, కరతిత్తి=వస్త్రపుసంచి, నయము=నీతి, అభిమానము=మా

మగఁడు నాలుగు నభిమానంబు విడిచి
మొగములు వగులంగ మొత్తు లాడుదురె
పతితోడ సతి మాఱుపడె నేని పుణ్య
గతి కేఁగ నరకంబునఁ గూలు
*(పతిభక్తిమహిమంబుఁ బ్రకటించు నట్టి 1140
యితిహాస మొక్కటి యెఱిఁగింతు వినుము
యను వేంద శరిష్ఠ యనుపుణ్యవతికి
ననుఁగు సుహ్మాత్సేనుఁ డనుపుణ్యపురుషుఁ
డతనికుష్ఠవ్యాధి నరయంగ నలసి
యతని పీఁపున నిడి యర్ధరాత్రంబు
ఘనభూతబేతాళకలకలం బెసఁగఁ
జను త్రోవఁ గొఱ్ఱుపై శవము దాఁకఁగను
నొడలూ వదలు నొప్పి నుగ్రుఁడై మండి
కడఁగి కోపంబునఁ గాంత కిట్లనియె
'నినుఁ డుదయాద్రికి నేతెంచువఱకు 1150
వనితనీపతి తల వ్రయ్యలై పడును'
నని శాప మిచ్చిన నా పూవుఁబోఁడి
ధనపతిచావుకుఁ దలపోసి పోసి
'యిల జీవు లకు నెల్ల నిదె వేగఁ బ్రొద్దు
ఖాలుపేది నాపాలిప్రొద్ద' స్తమించె
భానుండు పెడమ నాపతి ప్రాణహాని

టీక. మాఱుపడె నేని=ఎదిరించె నేని, అనుఁగు=గారామైన, శవము=పీనుఁగు, ఒడలు వదలునొప్పి=దేహమువిడిచిన బాధచే - శవము కర్త, ఇనుఁడు=సూర్యుఁడు, ఖాలుపేది...అస్తమించె=నాపాలిటికి ప్రొద్దుఅయినట్టి నా మగఁడు తీఱిపో

* ఈకుండలీకరణములోనిది పెక్కుప్రతులం గనుపట్టదుగాన ప్రక్షిప్తము.

యేను బతివ్రత నిల నైతినేని
భానుండు మింటను భాసిల్లకుండు
నన విని బ్రహ్మాదు లద్భుతం బంద
నానరంగ దిననాథుఁ డుదయింప నోడె 1160
నిది దివ మిది రాత్రి యిది సంధ్య యనుటఁ
ద్రిదశుల కైనను దెలియ రాకుండఁ
దరుణిపతివ్రతాధర్మంబునకును
హరుఁడు ప్రసన్నుఁ డై యతికృపామూర్తి
'వరము వేఁడుము నీవు వనజాక్షి' యన్నఁ
గరములు మొగిచి యక్కల్యాణి వలికె
'సర్వేశ వరము నీ శవమున కిమ్ము
పార్వతీనాథ నాపతిఁ గావు' మనిన
వామదేవుం డిచ్చె వరము లిర్వురకు
భామ ప్రార్థింపంగ భానుండు వొడమె 1170
గరకంఠు డరిగె నాకైలాసమునకుఁ
దరుణి పతివ్రతాధర్మ మీడేటెఁ)*
బాయని భక్తిమైఁ బతిపాదసేవ
సేయుటఁ గాదె ప్రసిద్ధికి నెక్కె
రాయరుంధతియును నా యహల్యయును
నా యనసూయయు నఖిలలోకముల

యేను. భానుఁడు=సూర్యుఁడు, మింటను భాసిల్లకుండు=ఆకాశమున వెలుఁగకుండుఁగాక - ఉదయింపకుండుఁగాక యనుఁట, దిననాథుఁడు=సూర్యుఁడు, త్రిదశులు=దేవతలు, వామదేవుఁడు=శివుఁడు, గరకంఠుఁడు=శివుఁడు, ఏపరించుచు=

* ఈకుండలీకరణములోనిది పెక్కుప్రతుల లేదు

నేపరించుచుఁ బతి కెదురు భాషించు
పాపాత్మురా లూరఁబందియై పుట్టు"
నని పెక్కు భంగుల నా రాజుదేవి
దను మోవ నాడినధర్మ వాక్యములు 1180
గన లెడుసూదులు గర్ణ రంధ్రములఁ
జొనిపినయట్లైన సురసుర గ్రుక్కి
కండగ్రొవ్వునఁ గాలకౌశికుమీఁద
మండు కోపము చంద్రమతిమీఁద విరిసి
'పాడిఁ జెప్పఁగ నిన్నుఁ బనివడి యిచటి
కేడ ముక్కిఁడి పిల్చె నీఁక నింత నుండి
బాడుగ నీకిచ్చి పతిభక్తి సేయు
జాడ లన్నియు నీదుసంగడి నేర్చి
నీవు వంకలు దీర్ప నీ పంపుపనులు
గావించు చుండెదఁ గాక వేగిరమె 1190
న న్నెఱింగెదు గాక నా పేరు తెలియ
విన్న మృత్యువు కైన వెరవేఁకి వచ్చుఁ
గదలి నే రోఁకలి గైకొన్నవలనఁ
గడలుదు రీవాడగరిత లందఱును
నాపొడ గాంచిన నగరంబు వడఁకు

దుఃఖపఱుచుచు, తనుమోవక = తన్నుఁదాఁకునట్లు, కనలెడు = మండుచున్న, పాడి=నీతి, ఏడ ముక్కిఁడిఁబిల్చె=ఈముక్కిఁడి నిన్ను నీతి చెప్పుటకై యెక్కడఁ బిలిచినాఁడు, ఇంతనుండి=ఇది మొదలుగా, బాడుగ=అద్దె, నీదుసంగడిఁ = నీసాంగత్యమున, వంకలు=తప్పులు, వెరవేఁకి = మిక్కుటపుజ్వరము, రోఁకలిఁ గైకొన్నవలన=రోఁకలి యెత్తికొని కొట్టఁబోయిన దిక్కున, గరితలు= స్త్రీలు

నీపోటువాటున నిపు డిట్లు మమ్ముఁ
బోరించితివి జంత్రిబొమ్మ నా యక్క
నీరఁ జిచ్చెగయింప నేర్చినతల్లి
యెచ్చట నుండి నీ విటు దాపురముగ
వచ్చితి చొచ్చితి వాస మీ'వనుచు 1200
నోడక కురులు బిట్టూడిసి రాఁ దిగిచి
మూడివోఁ దాఁకించి మూఁతులు నులిమి
యెగ్గులుఁ దప్పులు నెన్ని యీ రీతి
పగ్గెల నిచ్చలు బాములఁ బెట్టి
యిడుములఁ గుదియించి యించుక సేపు
నెడపక పనులు సేయించుచు నుండె
నట హరిశ్చంద్రుండు నప్పు డారీతిఁ
గుటిలకుంతలి నమ్మి కొన్న ధనంబు
వ్రయము గాకుండ సర్వంబును ముడిచి
నయ మొప్ప నిచ్చిన నక్షత్రకుండు 1210
వేడుకఁ గైకొని విభుని వేవేల

---

పొడ=ఆకారము, పోటువాటు=పొడుచుట కొట్టుట, జంత్రిబొమ్మ=యంత్రపు బొమ్మ, నాయక్క—ఇది నీచపరముగా చెప్పినమాట, నీరన్ చిచ్చు ఎగయింప నేర్చిన తల్లి=నీళ్లుపోసి అగ్గిని రగులునట్లు చేయ నేర్చినది— చల్లగానే మాకిట్టిజగడము పెట్టించినదాన వనుట. లేక నీటియందు నిప్పుఁ బుట్టింప నేర్చినదనియు నర్థాంతరము దోఁచుచున్నదికాని యిదిసరికాదు. దాపురముగ—ప్రాప్తముగా, చొచ్చితివాసము=నాయిల్లు చొచ్చితివి, బిట్టు=గట్టిగా, మూఢివోఁదాఁకించి=పృష్ఠము అడుగువఱకును తలను వెండ్రుకలుపట్టి యీడ్చివంచి, పగ్గెలన్=సామర్థ్యపు మాటలచేత, నిచ్చలు=తనయిచ్చవచ్చినట్లు, బాములు=బాధలు, ఇడుములు=ఆపదలు, కుదియించి=క్రుసుక్కించి, ఇంచుక సేపు నెడపక=కొంతసేపయి

జాడల దీవించి సమ్మతిఁ బలికె
'గురుఁడు పుత్తేరంగఁ గోరి నీవెంటఁ
దిరుగుచుఁ దరువున్న దినముల కెల్లఁ
జెల్లింపఁ గలబత్తె సెలవుగా నీవు
చెల్లించితివి నాకుఁ జెల్లె ధనంబు
మితితోడ నొసఁగుము మేకొన్న గాధి
సుతునిబుణం బెల్లఁ జొప్పడఁ దీర్చి
షామ్మన్న దీవించి పోదు నీతోడ
దొమ్ములు రేఁపక దొసఁ గెల్ల నుడిగి' 1220
యనుటయుఁ దల యూఁచి యమ్మహీవిభుఁడు
తనలోన నవ్వి యాతని కిట్టు లనియెఁ
'బగ గొని కృప మాలి బందెలు వెనఁచి
తగునె నాచేతి విత్తము రిత్త గొనఁగఁ
దఱలక నా మీఁదఁ దరువుండ నిన్నుఁ
దఱమి పుత్తెంచున త్తఱి భవద్గురుఁడు
సత్తుగా నీకు నిచ్చలును రొక్కించి

---

నను అవకాశములేకుండునట్లు, పుత్తేరంగన్=పంపఁగా, తరువున్న దినముల కెల్లన్=తప్పీలుగానుండిన నాళ్లకన్నిటికిని-ఇట భార్యను బిడ్డను అమ్మినధనము నక్షత్రకుఁడు విశ్వామిత్రునిబుణమునకు చెల్లుగాపెట్టుకొనక తనతప్పీలుండినదినములకు బత్తెసెలవుగా పెట్టుకొన్నాఁడని తెలియునది, మితితోడన్=గడువునకుసరిగా, మేకొన్న=ఒప్పుకొన్న, గాధిసుతుని=విశ్వామిత్రుని, దొమ్ములు=దొమ్మిజగడములు, రేఁపక=ఎత్తిపెట్టుకొనక, దొసఁగు=దోషము, బందెలుపెనఁచి=నిర్బంధములతోఁ జుట్టి, రిత్తగొనఁగన్=వ్యర్థముగా నీబత్తెసెలవునకని పుచ్చుకొనుటకు, తఱమి=బలాత్కరించి, పుత్తెంచు నత్తఱి=పంపునపుడు, సత్తు

బత్తె మిమ్మని నన్నుఁ బలుకఁ డొండేని
నీకు నే నోడఁబడ నేఁ డీధనంబు
చేకూఱఁ గైకొని చిక్కులు వెట్టి 1230
తప్ప నాడెద వసత్యంబున కోర్చి
చెప్ప నే మున్నది శివుఁ డొక్కఁ డెఱుఁగు'
నావుఁ డిట్లని పల్కె నక్షత్రకుండు
'భూవర నీ వెంటఁ బుత్తెంచు నపుడు
నీచేత బత్తెంబు నిచ్చలు గొనఁగ
నాచెవిలోఁ జెప్పినాఁడు మఘుఁడు
నీ వెఱఁబడ నేల నిన్ను వేఁడ నేల
నీవు లేదన నేల నినుఁ బ్రభాతమున
దీవింప వచ్చిన దీనవిప్రుఁడనె
చావ నొవ్వఁగఁ బూని సాహసం బొదవ 1240
నెడపక గిరు లెక్కి యేఱులు దాఁటి
కడు భయంకరమహాగహనముల్ గడచి
కాలు గాలినపిల్లికరణి నీవెంట
నేల నీబంటనై యెల్లెందుఁ దిరిగి
వారక హిమవర్షవాతాతపముల

---

గాఁ=రూఢిగాననుట, రొక్కించి=రొక్కము రూపముగా, ఒండేని=ఒక్కటి యు, చేకూఱఁ=దొరకఁగానే, తప్పనాడెదవు=తప్పి పలికెదవు, ప్రభాతమున=వేకువను, దీనవిప్రుఁడనే=దరిద్ర బ్రాహ్మణుఁడనా - కాదనుట. గహనముల్-చొరరాని యడవులు, కాలుగాలిన పిల్లికరణి = కాలికి చిచ్చుదగిలిన పిల్లి విధమున, నీవెంట నేల = నీవెంబడిచోట, ఎల్లెందుఁ = ఎల్లయెడలను, హిమ...తపములు = మంచువానగాలి యెండలు, తిరిసినపలుగాడు = బిచ్చ

నూరూరిగుడిపంచ నొదిఁగి నిద్రించి
తిరిసినపలుగూడు దెచ్చి నిచ్చలును
వరుస నొక్కొక్కకడి వనరుచుఁ గుడిచి
చదువును సంధ్యయు జపమును వేల్మి
మొదలు ముట్టఁగఁ బోయి మోటనై బడలి 1250
చిడుము గోఁకుచు జరఁ జిక్కినట్లుండి
కడపట బత్తెంబు గాన కేతేర
నడుమఁ జావఁగ నీవు నా తలపుండ్లు
గడిగి రక్షించెదో కఱవుకాలమున
నురిసినపుండ్లపై నుప్పును జల్లి
కెరలఁ జేసెదవు నేఁ గినిసితి నేని
చక్కఁ బెట్టఁగ లేరు సాధువు రేఁగఁ
బొక్కి నిల్వదు తలపాలమునఁ గాని
మే లెఱింగెద వని మితి వచ్చు దాఁక
నాలిని నిన్నుఁ గాపాడితిఁ గాక 1260

---

మెత్తితెచ్చిన పలువిధములైన యన్నము, కడి=ముద్ద, వనరుచున్=కుందుచు, వేల్మి=హోమము, మొదలుముట్టఁగన్ = పూర్ణముగా, మోటనై = మొద్దనై, చిడుము = తీటకురుపు, జరఁజిక్కినట్లు=ముసలితనము వచ్చినట్లు, ఏతేరన్ =రాఁగా, నడుమన్ చావఁగా = దారినడుమఁ జచ్చితి నేని, నాతలపుండ్లు గడిగి - ఇదిజాతీయము=నాకడగండ్లుతీర్చి, ఉరిసినపుండ్లు = పగిలినపుంటికలు. కెరలన్ = మండునట్లు, చక్కఁబెట్టఁగలేరు= నన్నుసమాధానపెట్టి శాంతునిఁ జేయలేరు, సాధువు... గాని = సాదువైనవాఁడు కోపమున విజృంభించెనేని తలపాలమున నేకాని తక్కినచో నిలువఁడు, మేలు ఎఱుంగుదువని = నాకుఁజేయవలసిన ఉపకారము నీకునీవే తెలిసికొందువుగాని నేనడుగవలసినదిలేదని, మితి=

తఱలి పోవఁగ నీక ధర గిఱి గీఁచి
మొఱలు వెట్టఁగ గట్టి మువ్వెతఁ బెట్టి
గుదిగుది గావించి కూరాకు సేసి
యదలించి నిను మేఁకయఱపుఁ గూయింపఁ
జనుఁ దప్పె నది నేఁడు సర్వథా నిన్ను
వెనకముందఱిపగ వెడల మఱల్తు
మఱవకు మిప్పటిమాటల నెల్ల
నెఱేఁగెడు శివుఁడు నా కేటికి బాస'
యనిన హరిశ్చంద్రుఁ డావటు ధూర్తుఁ
గనుఁగొని కోపంబు గదుర నిట్లనియె 1270
'గురుకార్య మొనరింపఁ గోరి నా వెంట
నరుదెంచి తిరిగితి వది నాకు సెలవె
పరదేశులకు గుళ్లపంచలు గాక
యిర వైనసున్నపుటిం డ్లేడఁ గలుగుఁ
బలుగూడు గాక యేపట్టున నైనఁ
గలదె పాయసము భిక్షాం దేహి యనిన
నెవ్వఁగఁ గుందుచు నీరసాన్నములఁ

---

గడువు, ధరగిఱి గీఁచి= నేల గీర గీఁచి, మొఱలు వెట్టఁగఁ గట్టి=నీవు కుయ్యో మొఱ్ఱో యని కూయిడునట్లు ఆగిఱిలో నిలువఁబెట్టి, మువ్వెత= తాపత్రయము, గుది గుది = గుత్తిగుత్తి, మేఁకయఱపుఁగూయింపన్ చనున్ = మేఁకవలె నఱచునట్లు చేయఁదగును, వెనుక ... మఱల్తు = ముందు వెనుక నాకు నీయందుఁగలపగ యంతయుఁదీఱునట్లు సుళ్లఁబెట్టుదును, ఎఱేఁగెడు ... బాస= నేను పగదీర్చుకొందునని యొట్టుపెట్టనేల - నీవు చేసినదానికి శివుఁడేయెఱిఁగి ప్రతిఫలమియ్యఁ గలఁడు. నాకు సెలవె= నాకువ్యయమా - గురుకార్యమునకు వచ్చినందులకు నీకుఁ జేయవలసినవ్యయము గురునిదేకాని నాదికాదనుట. నీరసాన్నములన్ నెవ్వఁగ

గ్రొవ్వి బల్తురె గువ్వగుత్తుక పడక
నివి యెల్లఁ దప్పులు నెగ్గులుఁ జేసి
తివిరి రేఁగెద నన్నఁ దెలుప నా వశమె 1280
తీపారుచక్కెర దిన్న యా నోర
నేపాకు మేసినవిధమున నీవు
చేసి నంతయు మేలు సేసి మఱేల
చేసితి విట్టికుచ్చిత మింకనైనఁ
గుదుకనగోలు గైకొనక నా ధనము
వదలుము మున్ను విశ్వామిత్రుఋణము
మితితోడఁ జెల్లించి మీఁద నెట్లయిన
ధృతిఁ దీర్తు నీ బత్తె దినముల లెక్క'
నావుడు విని నవ్వి నక్షత్రకుండు
'భూవర నీకంటె బుద్ధిమంతుఁడను 1290
దొడిఁబడఁ జేతికి దొరికినధనము
విడిచి మీఁదటఁ గొను వెంగలి గలఁడె
చదువు మీఁదిది దెబ్బ సంగతి గాక
పిదప నొప్పనె మఱి పెక్కు లేమిటికి
విడువ మింతట నుండి విత్తంబుమీఁది
యడియాస పైఁడికిఁ బ్రాణముల్ లంకె

గుందక గ్రొవ్విఁ బల్తురేయనియన్వయము, గువ్వగుత్తుకపడు=ఆఁకటిచే హీనస్వరమగు, రేఁగెదనన్నఁ=విజృంభించెదను అనిచెప్పఁగా, తెలుపనావశమె=తేర్చుట, నాతరమా చేసినంతయు మేలుచేసి = ఇంతవఱకుఁజేసినదంతయు మేలుగానే చేసి, కుదుకనగోలు = వంచన,చదువు . . సంగతిగాక = పిమ్మటిచదువు దెబ్బకొట్టినపుడేగాని పిదప కలుగునా, అడియాస = వ్యర్థమైనయాస, ఈచేతి

విడుతుఁ బ్రాణములైన విడువ ధనంబు
మెడ మెండుకొని త్రెంపుమీ చేతిహేతిఁ
దల ద్రెవ్వ మొత్తి యీధనముఁ గైకొనుము
వెలయంగ నాచావు వెదకుఁ గౌశికుఁడు' 1300
ననిన వీనులు మూసి హరహరా యనుచు
జననాథుఁ డాత్మలో సంతాప మంది
కడుఁబడ్డధూర్త నక్షత్రకు నోరు
దోడుకుట పాపంబు దుర్మార్గుఁ డితఁడు
బల్లిదుచేతిలోఁ బడినధనంబు
పిల్లిపట్టిన దొబ్బ ప్రిదులక పోయె
బొంకు గాకుండ నా పూనినమితికి
నింకఁ గౌశికుఋణ మేమిటఁ దీర్తు'
నని మదిఁ దలపోయ నా మహారాజుఁ
గనుఁగొని కినిసి నక్షత్రకుం డనియె 1310
'నూరక నివ్వెఱఁ గొంది యిట్లున్న
నేరీతి మాధనం బిటమీఁద వచ్చుఁ
జెచ్చెర నొకత్రోవఁ జేసి మమ్మనిపి
పుచ్చినఁ బోదు మీపోరాట ముడిగి
వడి నారఁ గైకొన వచ్చు చట్రాతఁ

---

హేతిన్ = ఈసీచేతిలోనుండు ఖడ్గముచేత, మెడ మెండుకొని త్రెంపుము=నా మెడ విజృంభించి తెగనఱుకుము, నోరుదోడుకుట=నోరు మెదల్పఁజేయుట-మాట లాడించుట యనుట. బల్లిదు...బొబ్బ-బలవంతుని చేతిలోఁజిక్కినధనము పిల్లి పట్టుకొన్న మాంసఖండమువలె మరలఁదీసికొన శక్యముగాదు - ప్రిదులక పోయె = సడలి మరలిరాదయ్యె, వడి...చట్రాత = చట్టురాతినుండి నార

బడయుంగ వచ్చును భస్మతైలంబు
నిసుక వంటకముగా నివిరింప వచ్చు
రసము సేయఁగ వచ్చు రాలు గరంగి
రాదు నీ మనసు మార్దవము నొందింప
మేదినీనాథ యీమేలంబు లేల 1320
లే లెమ్ము ధనము చెల్లింపు నీవనిన
భూలోకనాథుఁ డప్పుడు విచారించి
నక్షత్రకునిఁ జూచి 'నాదుర్గుణములు
లక్షలు వానిఁ బల్కఱు నేన్న నేల
నాలిని బుత్రుని నంగడిఁ బెట్టి
కాలకౌశికుఁ డనుకష్టున కమ్మి
కూర్చిన ధన మెల్లఁ గుదుకన గోలు
నేర్పునఁ గైకొంటి నీకు సిద్ధించె
మునిశిఖామణితోడ మొఱఁగినమితికి
ధనముఁ జెల్లించుచందము డెందమునకుఁ 1330
దలపోసి చూంచితిఁ దక్కొండు గాన
నలవడ దటుగాన నాలస్య ముడిగి
నామీఁద వచ్చుధనం బెల్ల నీకు
నే మానవుం డిచ్చు నీమితిలోన
నతనికి బంటుగా నమ్ముకో నన్ను

దీయవచ్చును, పడయుంగ... తైలము= బూడిదలోనుండి నూనె సంపాదింపవచ్చును, ఇసుక ... నివిరింపవచ్చు=ఇసుకను వంటకముగా కరఁగింపవచ్చును, రసము... గరంగి=రాలుగరంగి రసముఁ జేయఁగవచ్చు'నని యన్వయము. కరంగి=కరఁగించి, మార్దవము=మృదుత్వము, కుదుకగోలున నేర్పున=వంచనయొక్క నైపుణ్యముచేత, అలవడదు=అనువుపడదు, నామీఁదవచ్చుధనము=నన్ను అమ్మగా

మతిలోన వల దనుమానింప' ననిన
నావటుభూ ర్తుండు నట్ల కా కనుచు
వావిరి నారాజవలపలి కేలు
తనపు స్తకపుఁ ద్రాటఁ దగ ముడి వ్రేసి
చనుమంచు నట కొని చని పురిలోనఁ 1340
బొడగన్నవా రెల్లఁ బురపురఁ బొక్క
నడరి పేరె త్తి యిట్లని యమ్మ దొడఁగె
'జనులార వసుధలో సన్నుతి కెక్క
వనజాతబాంధవవంశవర్ధనుని
సారవ ర్తను హరిశ్చంద్రన రేంద్రుఁ
గొరినధన మిచ్చి కొనరయ్య మీర
లరుదుగా బొందితో నమ రేంద్రపురికి
జరిగిన యట్టిత్రిశంకుభూపాలు
కూరిమిపుత్రు సద్గుణవిభూషణునిఁ
గొరినధన మిచ్చి కొనరయ్య మీరు 1350
త్రిజగంబులను మేటిదీవు లనెల్ల
నిజజయ స్తంభముల్ నిలిపి యవక్ర
భూరిపరాక్రమంబున నొప్పు రాజుఁ
గొరినధన మిచ్చి కొనరయ్య మీరు
కలరాజ్య మెల్ల నాకౌశికమునికి
నిల యెల్ల నెఱుఁగంగ నిచ్చితి ననుచు
ధార వ్రాసినమహాదానవినోదిఁ

వచ్చునట్టిరొక్కము, అమ్మఁదొ=అమ్ముకొనుము, వసుధ=భూమి, వనజాతబాంధవవంశవర్ధనుఁడు=సూర్యవంశము వర్ధిల్లఁజేయువాఁడు, అవక్రభూరిపరాక్రమము=వంకరలేని విస్తారమైనవిక్రమము, పొదలు=పెరుఁగుచున్నట్టి, కదియించు=చే

గోరినధన మిచ్చి కొనరయ్య మీరు
బేతాళుతలఁ ద్రెవ్వ వేసి సన్మునుల
భీతి నివారించి పేర్చినయట్టి 1360
వీర శేఖరు జగద్వి ఖ్యాత చరితుఁ
గోరిన ధన మిచ్చి కొనరయ్య మీర'
లని వాడవాడల నమ్మున త్తఱిని
బెను పొందు పేరును బెంపును జెప్పి
యవనీశు మునిపుత్రుఁ డమ్ము వాక్యములు
సెవుల సోఁకుటయు నచ్చెరువంది చెలఁగి
పొదలు పాపంబులు ప్రోఁ దోలి ము క్తిఁ
గదియించు మణికర్ణి కాసమీపమున
మతమారఁ దనతపోమహిమఁ గౌశికుఁడు
పితృవనం బొకటి గల్పించి యా మున్నె 1370
యురుశ క్తి వీరబాహుని పేర జమునిఁ
బరఁగిన చండాలపతిగా సృజించె
కుఱు వెంట్రుకల కోరకొప్పిడి కావి
యఱువుడు తలనిట్టు నట్టును జుట్టి
జేగురుబొ ట్టిడి చెవి సంకుఁ గొడుపు
లాగుగా వ్రేలఁ దెల్లని ముడ్సు నిల్పి

ర్చు, మతమారఁగ=మతము చక్కఁగా ఆలోచించి, పితృవనము=రుద్రభూమి
ఉరుశ క్తిఁగ=గొప్పసామర్థ్యము చేత, వీరబా... సృజించె=యముని వీరబాహుఁ
డను పేరుగల చండాలపతిగా సృజించెను, కుఱు... ప్పిడి=కుఱుచనైన వెంట్రు
కలను ముడిచియోరగా కొప్పవెట్టి, కావియఱువుడు=చింపులుగానుండు కావి
గుడ్డ, సంకుగొడుపులాగుగాఁగ=శంఖము కోపువలె, ముడ్సు=ఎముక, తోలులువో

తోలులు వ్రూయినప్రాఁతతోలును గప్పి
బలుగత్తి మొల నచ్చుపడ నమరించి
కడుమైలపేలికఁ గాసించి నడుము
బడికి వేసిన యరపట్టె బిగించి 1380
యెడమచేఁ బశుమాంస మేర్చినగుదియఁ
గడమచే నినుపయుంగరములగుదియు
గడజాతిగాఁ బూని క్రందుసందడిని
జడియుచు శంబళి శంబళి యనుచు
దళముగా మెఱసెడితనమేనికుష్టు
పొలసుకు జుమ్మని పొలయుమక్షికలఁ
గుంచియతోఁ జోఁపుకొనుచుఁ బెన్నలుపు
మించి కందెన నూనె మేఁగినట్లున్న
మొగమునఁ జీఁకట్లు ముడివడఁ గల్లు
సగము ద్రావినకుండఁ జంకట నిఱికి 1390
మీఱినమదమున మెయి దేల గిలఁగఁ
బాఱంగ వెడపాటఁ బాడుచు బయలు
జాఱుచు నల్లపచ్చనిపొడి మ్రింగి

---

యిన=తూట్లుపడిన, కడుమైలపేలిక=మిక్కిలిమాసిన చింపిగుడ్డ, కాసించి=కాసెగాఁగట్టుకొని, అరపట్టె=ఒడ్డాణము, ఏర్చిన=గ్రుచ్చిన, కడమచేన్ = డాచేత, కడజాతిగాన్ =చండాలజాతికి సూచకముగా, క్రందుసందడిని=అలముకొనుగలబకును, జడియించు=జళిపించు, మక్షికలు=తేనీఁగలు, కుంచియ=కుచ్చు, పెన్నలుపు-కటికినలుపు, కందెన నూనె = బండికీలునూనె, మేఁగిన=పూసిన, మిక్కుటమైన, చీఁకట్లు = చీఁకట్లవంటి నల్లఁదనపు కాంతులు. మీఱినమదమునన్ =అతిశయించిన కావరముచేత, తేలగిలఁగన్ పాఱఁగన్ = తేలికగానుండఁగా, మేనును ఇచ్చవచ్చినట్లు మత్తుచేవిదుల్పఁగాననుట, వెడపాట = సన్ననిపాట, బయలుజాఱుచు = ఇటునటుతొలఁగుచు, నల్లపచ్చనిపొడి =

కోఱమీసము నుల్చి గుడ్లెఱ్ఱఁ జేసి
కెలనివారల బూతు గెరలఁ దిట్టుచును
దొలఁగు రాజెవ్వఁడు దొర యెవ్వఁ డనుచుఁ
ద్రాగిన రోజు మత్తా గొని యిన్ని
లాగుల నల్లనల్లన నృపుఁ గదిసి
యోరువ రాక బిట్టోకిలిం తొదువ
నోరు మద్యముకంపు నూల్కొనఁ బలికె 1400
'నోరి నాపంచినయుడిగ మేమైనఁ
గోరి సేయుచు నొఱగొడ్డెంబు లేక
కొలిచెద వేని యీ గోఁచిబాపనికి
వలచినధన మంతవట్టును నిచ్చి
బంటుగా నేలుదుఁ' బరఁగ నిన్ననినఁ
గంటకం బొదువ భూకాంతుఁ డిట్లనియె
'నోరి చండాలుఁడ యోరకుండెదవె
నోరు వ్రేయఁగ వలెనో పండ్లు డుల్ల
నుడుగక కల్లు గ్రుడ్లుఱుకంగఁ ద్రావి

---

బుక్కాపొడి, నుల్చి = మెలిఁబెట్టి, బూతు = బండమాట, కెరలన్ = మిక్కుటమగునట్లుగా, తొలఁగు...డనుచు = తొలఁగిపో నాకెవ్వఁడురాజు నేనుగాక మఱియెవ్వఁడుదొర, యనుచు-ఇది దారినెదురుపడినవారినుమాట, త్రాగినరోఁజు మత్తా = కల్లుత్రాగుటచే నిట్టూర్పులు పుచ్చునట్టి మత్తు, బిట్టు=మిక్కిలి, ఒదువన్ =కలుగునట్లుగా, నూల్కొనన్ = నెలకొనఁగా, ఊడిగము=పని, ఒఱగొడ్డెము=మనసునొప్పించు వంకరమాట, అంతవట్టును = పూర్ణముగా, కంటకము=అసహ్యత, డుల్లన్ =రాలునట్లు, గ్రుడ్లుఱుకంగన్ = గ్రుడ్లు వెలికి ఉబ్బునట్లుగా, కల్లుద్రావియనుట, బట్టి=అఱవుడు, చింపి =చిని

యొడ లెఱుంగక ప్రేలె దూరక నీవు 1410
కులహీనుఁడవు భానుకులజుని నన్నుఁ
బిలిచి యేలెద నంటి వెఱపింత లేక
కట్టిన దోకబట్టి కప్పింది తోలు
చుట్టిన దోకచింపి సొమ్మెల్ల నినుము
కక్కవచ్చెడి నిన్నుఁ గనుఁగొన నకట
వక్క సేయని లేకి వాఁడవు నీవు
నే నేడ నీ వేడ నెమ్మిఁ గౌశికుని
కే నిచ్చుధన మేడ నీలాగు మెట్టు
మెట్టుకుఁ దఱమిన మెఱమెడుకోప
మెట్టు పుట్టదు విన్న నెవ్వరికైన' 1420
నావుడు వాఁడును 'నామీఁద నలుగ
దేవతులకు నైనఁ దీర దెల్లందుఁ
దప్పు లెల్లను దండధరుఁడనై వెదకి
చప్పుడు గాకుండ జనుల దండింతు
మాటలఁ బని యేల మాకును నీకు
మాటి మాటికి నన్ను మాలవాఁ డంచు

---

గినగుడ్డ, సొమ్మెల్లనినుము = సొమ్ములెల్లఇనుపసొమ్ములు, కక్క = వాంతి, వక్క సేయని...వాఁడవు=వక్కకుఁగూడకొఱగానట్టి అప్రయోజకుఁడవు. లేకి అనఁ గారాలినగింజలు = లేకివాఁడనఁగారాలినగింజ లేర్పఱుచుకొని బ్రతుకువాఁడు, మెట్టు మెట్టుకు=అంచెకంచెకు-పయిపయిని, తఱమినన్ = ఒత్తిమాట్లాడఁగా, మెఱమెడుకోపము = మనస్సునఁగ్రుచ్చుకొన్నట్లు బాధించెడుకోపము ; 'నామీఁద ... తీఱదు' వాపైకోపముచేసికొనుటకు దేవతలకుఁగూడ శక్యముగాదు, 'మాకునునీకును మాటలఁబనియేల' ననియన్వయము. ఒక్కనాఁశెమై=ఒక్క మేలి

నీకు రోయఁగ నేల నీతండ్రి కులము
నాకులంబును నొక్క నాణెమై యుండు
నిప్పుడే నెట్లుంటి నేమి కౌశికుని
యప్పెట్లు దీర్చెద వవుఁ గాదొ చూడు 1430
తులువ నీమది నింత దురభిమానంబు
గలవాఁడ వీముంజిగానిచే నిట్లు
దోసఁగులఁ బడి చిక్కి దొంగ చందమున
వెస కట్టు వడి నీచవృత్తి రానేల?
కినిసి నీతోడఁ దర్కింప నేమిటికి
ధనముఁ బెట్టిన నెందు దాసులు లేరె'
యనిన హరిశ్చంద్రుఁ డాయంత్యజుండుఁ
గనలి తర్కింప నక్షత్రకుం డనియె
'నలినాప్త కులనాథ నాతోడ నీవు
పలికినమాటలపద్ధతి దప్పె 1440
మునినాథుతో మున్ను మునిపినమితికి
ధన మిచ్చువానికి దాసునిఁ గాఁగఁ

---

మై- ఒకేయంతస్తుగాననుట - హరిశ్చంద్రుని తండ్రి త్రిశంకునికి వసిష్ఠశాపమున చండాలత్వముగలుగుట యిట యూహించుకొనునది, ఇప్పుడే నెట్లుంటి నేమి = నేనిప్పుడు ఎట్లుండినను నీకేమి. అవుఁగాదొచూడు = నీచేతనప్పుదీర్చుటకవు నో కాదో చూచుకొనుము - ఇదిచూచుకొనక నన్నునిందింప నేలయనుట, దుర భిమానము=దురహంకారము. ముంజిగాఁడు=వడుగు, దోసఁగులన్ =తప్పులను, తర్కింపన్ = వాదులాడఁగా, మునిపిన=చెప్పినట్టి, వినుతసత్కులజునిన్ = పొగడ్తకెక్కినమంచికులమునఁ బుట్టినవానికి, అంజక = వెనుదీయక, పల్లె... శాస్త్రిమె = మంటిపిల్లియైనను పల్లెత్తిఎలుకలఁబట్టినచో అంతే పిల్లిశాస్త్రిము కోరిన... నాపాలు=అడిగిన ద్రవ్యమిచ్చి నిన్నుఁగొనిపొండనివ్యర్థముగా మొఱ

గొనిపోయి నన్నమ్మకొ మ్మంటి గాని
వినుతసత్కులజుని వెదకి యిమ్మనవు
వీనికులం బేల వీనిరూ పేల
వీనిగుణం బేల వీనివెం పేల
మాలైన నేమి బ్రాహ్మణుం డైన నేమి
తోలు గప్పిన నేమి తులువైన నేమి
గంజాయి దినె నేమి కలు ద్రావె నేమి
నంజక ధన మిచ్చునతఁడె నా మెచ్చు 1450
పల్లెత్తి యెలుకలఁ బట్ట నోపినను
పిల్లిశాస్త్రమె మంటిపిల్లి యే చాలుఁ
గోరినధన మిచ్చి కొన రం డటంచు
నూరక మొఱ వెట్టుచుండ నాపాలు
వారక నినుఁ గొన వచ్చిన వారి
తో రాయిడించి పోఁ దోల నీ పాలె
మలకలు మాని యీమాలని నేల
కలధన మిప్పింపఁ గలవు కాదేని
పెక్కు మాటలు గట్టిపెట్టి సత్యంబు
దక్క బొంకితి నని తలఁగి పోయెదవు 1460
బలువున నినుఁ ద్రాటఁ బట్టి పట్టణము
కలయఁ ద్రిమ్మర నాకుఁ గారణం బేమి
విను నాప్రతిజ్ఞ నీ విత్త మింతటికి

---

బెట్టుచుండుట నాభాగపుపని, రాయిడించి పోఁదోలనీపాలె=కలహించి వచ్చినవారిని పోఁదఱుముట నీభాగపుపనియూ, మలకలు=వంకరనడతలు, త్రాటఁబట్టి=పుస్తకపుత్రాటికిఁగట్టి, కలయఁ = అంతటను, ఇంతటికి నినుమడి పెట్టి

16

నినుమఱిఁ బెట్టిన నింక నొండొకని
కేగతి నిను నమ్మ నితనికే కాని
శ్రీగురునాన కాశీనాథునాన'
యని రాజు మునిపుత్రుఁ డాడువాక్యముల
విని యంత్యజుఁడు మోము వికసింపఁ బలికెఁ
'బరిణమించితి నిన్ను బాఁపనవడుగ
తిరుగక యీమాట తిరముగా నిలుపు 1470
వక్క సేయనిలేకివాఁడని నన్ను
లెక్క సేయక కరాళించె నీ రాజు
వాటమై యీమాట వడి నమ్ము ప్రాలె
నాటి యున్నది నేఁడు నా మనంబునను
గెంటక యీయప్పు గెంటి యీ తులువ
బంటుగా నేలక పాయదు కోప
మప్పు ధనం బింత యని గుఱి నాకుఁ
జెప్పుము చెల్లింతుఁ జేకొను' మనిన
నలరి నక్షత్రకుఁ డతనితోఁ దెలియఁ
బలికె 'నీ భూపాలుపై తరు వనెడి 1480
చేతిసంకెల వీడఁ జేసెద వే ని
దాతవు నాపాలిధర్మదేవతవు

---

న.. నమ్మను = నీవియ్యవలసిన ధనమునకు రెండింత లిచ్చెదనన్నను వీనికిఁదప్ప వేఱొక్కనికి ఏవిధమునను అమ్మను, అంత్యజుఁడు = మాలవాఁడు, పరిణమించితి = మ్రొక్కితి, తిరముగాన్ = స్థిరముగా, కరాళించెన్ = భీష్మముగాపలికెను, అమ్ము = బాణము, గెంటక = వెనుదీయక, గెంటి = తొలఁగించి, గుఱి = కొలఁది - మేర, తరువనెడి చేతిసంకెల = చేతిసంకెలవలెనుండెడినాతప్పీలు,

వేడుక జట్టి గావించి నా పూన్కి
వీడ నాడకు మాకు వి త్త మిం తనిన
లోఁగి యీఁతకుఁ గానిలోఁ తని జట్టి
వీఁగక సర్వథా వినియెద వేని
పురుషు డేనుఁగు నెక్కి పోడవుగా నిక్కి
వరరత్న మెగిరిపో వైచినపొడవు
ధనరాశి మా కిమ్ము తడయక లెమ్ము
విను నిక్క మిది సుమ్ము వీఁడు నీ సొమ్ము 1490
గొను' మన్న వాఁడు నిక్కుచుఁ బల్కె నీకు
ధనరాశి యిచ్చోటఁ దరలక నిత్తు
నొకవిచారము మాకు నొదవె నీ రాజు
సుకవాసి పనిపంద చూపుగుట్టంబు
మామిడి క్రిందిసోమరి మేదకుండు
భూమి తుంటరి యెనుపోతుపై వాన

వేడుకజట్టిగావించి = ఎగతాళికి బేరముమాట్లాడి, నాపూన్కి వీడనాడకు = నీకమ్మవలయునని నాప్రయత్నమును నేనువిడిచిపెట్టినట్లు బేరము మాట్లాడకుము, విత్తమింతనినన్ = మాకు వెలగా నియ్యవలసిన ద్రవ్యము ఇంతయనిచెప్పఁగా, ఈఁతకుఁగానిలోఁతుఅని = ఈఁతకొట్టుటకుఁ దగినలోఁతులేదని- ఇచ్చిన వెలకు తగినంతలాభములేదని యనుట, వీఁగక = వెనుదీయక, నిక్కుచున్ = బిట్టుబిగిసికొనుచు, తరలక = తప్పక, సుకవాసి = సుఖముగాబ్రతికినవాఁడు, పనిపంద = పనులయందు మందుఁడు, చూపుగుట్టంబు = పైచూపునకుఁదోఁచు బచ్చెనగుట్టము, మామిడిక్రిందిపోమరి = మామిడిచెట్టుక్రిందనుండు సోమరిపోతు, మేదకుఁడు = గోలయైనవాఁడు, భూమితుంటరి = భూమినిదున్నువాఁడు, ఎనుపోతుపైవాన = ఎనుపగొడ్డుపైవానపంటివాఁడు - ఎనుముమీఁదవానయెంత గురిసినను దానికి చలిపుట్టనట్లు ఎంత తర్జనభర్జనములుచేసినను వీనియెడ ప్రయోజన

మొండరి చల్లచప్పుడు గోడచేర్పు
చండిపో తనునట్టిజాడ నున్నాఁడు
చెప్పినపని జాగు సేసిన వేళ
ముప్పిరి గొనుకోపమున మొఱ వెట్ట 1500
దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది
జడ్డు వాపినఁ గొల్వు చాలు నా కనుచుఁ
దక్కిపోయిన వెంటఁ దగుల నా వశమె
యుక్కునఁ బెనఁచిన ట్లున్నాఁడు వీఁడు
గొలుసు దప్పినయట్టికోఁతిచందమునఁ
గలధన మీావు రొక్కము గొని పోదు
విల్లాలు పుత్రులు హితులు బంధువులుఁ
దల్లిదండ్రులు నన్నదమ్ములుఁ గలుగు
వాని నెమ్మది నమ్మ వచ్చుఁ గా కిట్టి 1510
వాని నేగతి నమ్మ వచ్చు నా'కనిన
నక్షత్రకుండు భూనాయకుఁ జూచి
'దక్షతఁ జండాలుఁ దగ నొడంబఱిచి
పూఁట పూఁటకు జరుపుడు వుచ్చి చనక

ము లేదనుట. మొండరి=మొండివాఁడు, చల్లచప్పుడు=చల్లచిలుకునప్పటి సద్దువలె గొణఁగువాఁడుకాని చుఱుకుఁదనములేనివాఁడు. గోడచేర్పు=గోడమూలలందుఁ జేరపడియుండు మూఢుఁడు, చండిపోతు = దుండగీఁడు, ముప్పిరిగొనుకోపమునన్ (= మిక్కిలియతిశయించినక్రోధముచేత, దుడ్డునన్ = దుడ్డుకఱ్ఱచేత, కంతులు = కణుతులు, జడ్డు = మొద్దుతనము, ఉక్కునఁ బెనఁచినట్లున్నాఁడు = ఉక్కుతెచ్చి మనుష్యరూపముగా చేసినట్లు వీని యవయవములు మిక్కిలిదృఢములుగాను బలవంతములుగానున్నవి. గొలుసు...కోఁతి=కట్టినగొలుసునుండి తప్పించుకొన్నకోఁతి, జరుపుడు పుచ్చిచనక = ఎట్లోజరిపి

పూఁటకాఁపవె నీవు పొ మ్మని యనక
మితి వ్రేక మున్నె నీ మీఁదిధనంబు
మతమునఁ జెల్లింపు మా కిప్పు' డనుచు
బోధించి పక్కలు వ్రెడుచునవ్వాడుగు
బాధకు నలసి భూపతి మది లోన
నెడపక ధనముఁ బ్రో విడి 'నేఁటితోడఁ
గడతుఁ గౌశికు మాయఘట్ట మే'యనుచు 1520
వీరబాహుని జూచి విను మని పలికె
'నీరీతి నపనమ్మి కేల నా మీఁదఁ
జాల నీతని కుల్కి సత్యంబు కొఱకు
నూలిపోఁగునఁ జిక్కి నుసల కున్నాఁడఁ
దల్లి సత్యము నాకుఁ దండ్రి సుజ్ఞాన
మెల్లెడ సోదరుఁ డెసఁగు ధర్మంబు
చెలువార ధైర్యంబు చెలికాఁడు శాంతి
కులసతి వినయంబు కొడుకు చర్చింప
నే సత్యమునకుఁగా నిప్పుడు నీకు
దాసుఁడ నై జట్టి దక్కుచున్నాఁడ 1530

పోక, పూఁటకాఁపవే=నీవు నాకుమధ్యస్థుఁడవాయని చెప్పక, పక్కలువొడుచు=కడుపుప్రక్కలందు పొడిచి నిర్బంధపెట్టు, ప్రోవిడి = రాసిగాఁబెట్టి, కౌశికుమాయ ఘట్టము=విశ్వామిత్రుడు సేయు మాయలమేర, కడతుఁ=దాఁటుదును-అతని మాయలనుండి విడివడుదుననుట, అపనమ్మిక = నమ్మికలేమి, ఉల్కి=భయపడి, నూలిపోఁగున...కున్నాఁడు=నూలిపోఁగంత యీవడుగునకుఁ జిక్కి-సత్యమునుబట్టి చలింపకున్నాఁడను - నూలిపోఁగువలె నాకు విడిపించుకొనుట అతిసులభముగా నుండినను సత్యమునకుఁగట్టువడి యందుఁజిక్కియేయున్నాను; ఇట్లుండఁగా నిన్నుఁగూడ నతిక్రమింతునా యని భావము. జట్టిదక్కుచున్నాఁడ = బేరమునకు లోనగుచున్నాఁడను, అట్టిసత్యము...

వట్టి సత్యంబు నేఁ డగు నాకుఁ బూఁట
గట్టిగాఁ జేపట్టి కలఁక పో విడువు
నీయాజ్ఞఁ దల మోచి నీ కనుసన్నఁ
బాయక నీపంపుపను లొడఁ గూర్తు
నలఁగక నా చేయునంతకాలంబు
నలసిన సొలసిన నటు నిటుఁ జనిన
మఱచిన వెఱచిన మఱి నీ ధనంబుఁ
జెఱచినఁ బఱచినఁ జేయఁ లే ననిన
విసికిన గసికిన వెడనిద్ర నొంది
నుసలిన మసలిన నొప్పిఁ జెప్పినను 1540
మెఱుఁగులు గ్రమ్ము నామేటిఖడ్గమునఁ
దఱిఁగి రక్తము గాఱఁ దనతలఁ ద్రెంచి
నీపాదములమీఁద నిలుపుదు నిదియె
నాపూని కనిన నంతట సమ్మతించి
వీరబాహుఁడు తనవెంట నేతెంచు
ఘోరమూర్తుల నతిక్రూరవర్తనులఁ
దనకింకరులఁ బంపి ధనముఁ దెప్పించి
ఘనతరపర్వతాకారంబు గాను
బెనురాసి వోయించి ప్రియము రెట్టింప
మునికుమారున కిచ్చి మ్రొక్కి 'పో'మ్మనిన 1550
నక్షత్రకుండు నానందంబు నొంది

---

పూఁట=సత్యమే నాకు పూఁటకాఁపు- నిన్ను తిరస్కరింపననుట, కసికినన్ = కనుకున్నను, వెడనిద్ర=కొంచెమునిద్ర, నుసలినన్ =తొలఁగినను, తఱిఁగి= కోసి, ఘోరమూర్తులన్ = భయంకరాకారులను, ఒడఁబడ్డ= ఒడంబడిక చేసి

లక్షభంగుల నృపాలకుని దీవించి
'యుర్వీశ మాకు నీ వొడఁబడ్డధనము
సర్వంబుఁ జెల్లె నీశ్వరసాక్షిగాను
విచ్చేయు మిఁక' నని వీరబాహునకుఁ
జెచ్చెర నప్పన సేసెఁ జేసేఁత
దివినుండి కనుఁగొని దివిజులు మెచ్చ
యవనీతలేశున కాఁకలి దప్పి
లొదవ కుండఁగ వరం బొసఁగి రావేళ
సదయుఁడై యంతటఁ జని యంత్యజుండు 1560
ముద మారఁ దనగృహంబునకుఁ బోవచటు
గదలి సగర్వంబుగాఁ దనచేతఁ
బట్టినపశుమాంసభారంబు చంకఁ
బెట్టినమద్యంపుబిందియు నిచ్చి
'కొని రమ్ము నీ'వన్నఁ గువలయేశ్వరుఁడు
వినయసంభ్రమములు వెలయ వహించి
యే సిడిముడిపాటు నే వికారంబు
నేసిగ్గు రోఁతయు నెసఁగక వానిఁ
గొలిచి సంగడిఁ జనుగోసంగిబంట్లఁ
గలసి తా నటు చని కలయ నెల్లెడలఁ 1570
బడి యున్న ముడుసులు పసరంపుఁ దలలు
బడికి ద్రేయఁగ నెండఁ బఱచినతోళ్లుఁ

---

కొన్న, అప్పనసేసెన్ = అప్పగించెను, చేసేఁతన్ = చేతిలోచేయివైచి, దివిజులు = దేవతలు, అంత్యజుఁడు = మాలవాఁడు, మద్యంపుబిందియ = కల్లుకుండ, చిడిముడిపాటు = తొట్రుపాటు, సంగడిన్ = తవతోజతగా, కోసంగిబంట్లు =

గఱచి కుక్కలు పీఁకఁ గాఁ బెను కొమ్ము
లొఱఁగఁ దీసినరీతి నున్న డొక్కలును
వఱదలై నెత్తురు వడియుకుత్తుకలు
తఱిఁగిన గోవులు తలు పైనపచ్చి
మురియలు సెదరినముఱికి నంజుళ్లు
నఱచుకాకులుఁ గలయామాలవాడ
వడిఁ జొచ్చి ప్రేవులు వాతి కేతేర
నడరుదుర్గంధంబు కను మాత్ర మైనఁ 1580
గింకరిపడక శంకింపక ధైర్య
మింకక చండాలునింటికి నేఁగి
యడరంగ భూపాలుఁ డామాల దన్నుఁ
గడఁగి పంపుచు నున్నకష్టంపుఁబనులు
నెలకొని నిమిషంబు నిలిపినకాలు
నిలుపక సొలవక నిద్దుర వ్రాక
కలఁగక నన్నోదకములపై నాస
గొలుపక వ్యపగతక్షుత్తృష్ణుఁ డగుచు
మొగము స్రుక్కింపక ముడుఁగక రేయుఁ
బగ లన కమ్మహీపాలుఁ డొనర్ప 1590

---

వికారపురూపుగల పనివాండ్రు, పసరంపు=పశువులయొక్క, బడికివ్రేయఁగన్ = పదనుపెట్టుటకు, ఒఱఁగ దీసినరీతిన్ = వాలునట్లు విలవిలరాచుకొన్నవిధముగా - కుక్కలుఁ పీఁకఁగానొప్పికి కొమ్ములు ఒఱగునట్లు నేలరాచినరీతిగానే యున్నమృగముల బొందులనుట, మురియలు=ఖండములు నంజుళ్లు=మాంసములు, ప్రేవులు వాతికే తేరన్ =అసహ్యమైన దుర్గంధమునకు ఓకిలింతపుట్టి కడుపులోని ప్రేఁగులు నోటికిరాఁగా, కింకిరిపడక=రోఁతపడక, వ్యపగతక్షుత్తృష్ణుఁడు=పోయినట్టి ఆఁకలిదప్పులుగలవాఁడు, స్రుక్కింపక=ముడుఁగక, నెరసులు=

నెరసులుఁ దప్పులు నెమకుచు నొక్క-
వెరవు చిత్తంబున వెదకి 'సత్యంబు
తెరలంగ వీని ప్రతిజ్ఞఁ దప్పించి
కరమిష్ట మొనరింతుఁ గౌశికమునికి'
నని నిశ్చయము సేసి యావీరబాహుఁ
డానరంగ నొకరాత్రి యుర్వీతలేంద్రు
తొడలపైఁ బదములతుదఁ జాఁపి భక్తి
నడుగు లొత్తుచు నున్న నతనిమనంబు
నోరయ మాయా నిద్ర నొంది రే యెల్లఁ
జరణసేవ యొనర్చుజననాథుఁ జూచి 1600
'యోరి నీదెస నాకు నుల్లంబునందు
వారక కొంతవిశ్వాసంబు వొడమెఁ
బన్నుగా నాసేయుపనులపై నిన్ను
మన్నించి నిలిపెద మది నఱ లేక
వినుమది చెప్పెద వివరంబు గాఁగఁ
బెనుపొంద నీ పురిప్రేతవనంబు
నా గుత్తగాఁ జేసినాఁడ నీ వచటి
కేఁగి పీనుఁగుఁ గాటి కెవ్వరేఁ దెచ్చి
కైకొని తమయిచ్చ గాఁ గాల్చి మరలి
పోకుండ నాయానఁ బొడిచి యాశవము 1610

---

దోషములు, తెరలంగన్ = తప్పిపోవునట్లు, ఆతనిమనంబునోరయన్ = ఆతని మనస్సునొత్తిచూచుటకు, అఱ = సంకోచము, కాటికిన్ = వల్లకాటికి, ఎవ్వరేన్ = ఎవ్వరైనను, తమయిచ్చగాన్ = తమయిష్టప్రకారముగా - మనయుత్తరువులేక తమయిష్టము చొప్పుననను టు, మరలిపోకుండన్ = తిరిగిపోకుండునట్లుగా,

మొల నున్నవస్త్రంబు మొగము కోకయును
వలనొప్ప నొకమాడ వాతిపాతికయుఁ
బెనుపొంద నాకిచ్చి పిండాశనంబుఁ
దిని నీవు బ్రతుకు మీ దినమునుండి
వీరదాసను పేర వెలయు మీ విపుడు
కోరి పట్టెడుముద్ర గుదియ గొమ్మనుచుఁ
దనచేతి కిచ్చినఁ దగఁ బసి పూని
వినయంబుతో మ్రొక్కి వీడ్కొని పోయి
యత్తఱిఁ గమురుకం పడరి దిక్కులను
మొత్తమై నిగుడుక్రొంబొగలు నంతంత 1620
మండు నొల్కులుఁ జేరి మానవమాంస
ఖండంబు లొండొండఁ గసికిలఁ గ్రుచ్చి
కమ్మగాఁ గాల్చి చంకటఁ బెట్టి మెసఁగి
నెమ్మది నృత్యంబు నెఱపుభూతములు
పగము గాలుచు నున్నశవములఁ బట్టి
తిగిచి గుంపులు గూడి తినుపిశాచములు
నెడనెడ బొక్కల నిడినబాలకుల
వెడలించి భక్షించుబేతాళతతులుఁ
దలకాయలకు మూఁగి తమతమ వనుచుఁ
గలహించుడాకినీగణములు మఱియు 1630

---

పొడిచి=అగపడి - వారికనుట, వాతిపాతిక=వాతికాసును, పిండాశనంబు=తర్పణములప్పుడు పెట్టుపిండము లాహారము, కమురుకంపు= కాలినదుర్గంధము, అడరి=వ్యాపించి, ఒల్కులు=పీనుఁగులు, కసికలు=సలాకలు - శూలములు, ఎడనెడల =నడుమనడుమ, బొక్కలన్ =గుంతలందు - బిడ్డలను సొదపెట్టి కాల్ప

వడి వధ్యశిలలపై వడిసి యందంద
మడువులై పేరినమనుజరక్తములఁ
బుటియల నట మ్రింగి పులిత్రేఁపు లడర
నఱగక పొరలాడి యఱచు రక్కసులు
మునుముగాఁ గొట్టుల మోఁకాళ్ల నూఁది
కొని నిక్కి యా మీఁదఁ గుణపశల్యములఁ
దొడికి దంష్ట్రల నొక్కి ద్రుస్సి రాఁ దిగిచి
కడఁగి క్రక్కెడు జంబుకములఁ దోఁడేళ్లఁ
బిండాన్న శేషముల్ ప్రిదులక మెసఁగి
యొండొండ వ్రాలుచు నున్నఘూకములఁ 1640
గరములఁ గొఱవులు గైకొని పేర్చి
గురులు వాఱెడు పెద్దకొఱవి దయ్యములు
వ్రేకుండ మాయపుఁబూసరల్ దెచ్చి
చేకొని యామంత్రసిద్ధుల కిచ్చి
తొత్తులగతి నుండి తొడరిననరులఁ
బొత్తులఁ దినెడు పెంపుడుదయ్యములును
సరిఁ గూడి ఋగ్యజుస్సామవేదములు

---

కగుంతలు త్రవ్విపూడ్చుటగలదుగనుక నిట్లుచెప్పఁబడినది, వధ్యశిలలు=చంపఁదగినవారినినిలిపి చంపునట్టితాళ్లు, మునుముగాక్=ముందుగా, కుణపశల్యములక్=పీనుఁగుసెమ్ములు, తొడికి=పట్టికొని, ద్రుస్సిరాక్=తెగివచ్చునట్లు, జంబుకములు=నక్కలు, గురులుపాఱెడు=పరువులెత్తెడు, మాయపు పూసరల్=కపటపు పూదండలను, మంత్రసిద్ధులు=మంత్రసిద్ధికైపల్లెకాటిలో జపాదులుచేయువారు, తొత్తులు=పరవుల్లు, తొడరిననరులక్=వారినిమాఱొక్కన్న జనులను, పొత్తులక్=ఒకరిపొత్తునొకరు-నంగడిగా, పెంపుడుదయ్యములు=పెంచినట్టి

పరఁగ గుణించెడుబ్రహ్మరాక్షసులుఁ
గ్రందుగాఁ గలిగి వెక్కసమును వెఱపు
నందంద యొదవించునారుద్రభూమి 1650
నారాజశేఖరుం డటఁ బ్రవేశించి
ధీరుఁ డై నిజఖడ్గదీప్తులు నిగుడఁ
జుట్టి పేరముఁ బెట్టి సుడివడ నొడిసి
పట్టి కూఁతలుఁ బెట్టి బలువిడి మోఁది
యెల్ల భూతంబుల నెల్లడాకినుల
నెల్ల శాకినుల మోహిని పిశాచములఁ
గనుఁగొని 'నేఁ డాదిగా మీరు గూడి
చని వీరబాహునిసదనంబునందు
వెట్టి గొట్టము నీళ్లు వెలయంగఁ గసవు
కట్టెలు నివి యాదిగాఁ గలపనులు 1660
పగ లెల్లఁ జేసి మాపటి కిట వచ్చి
తెగువ మై నీకాడు తిరుగ రా నుండి
యెచ్చట నెవ్వరు నెఱుఁగక యుండ
వచ్చి పీనుఁగుఁ గాల వైచి పోకుండ
నా లీల కొఱవిదయ్యంబుల దివ్వె
కోలల వారిగాఁ గొని గస్తు దిరిగి

---

దయ్యములు, సరిఁగూడి=సరిగా జతలుగూడి; వెక్కసము=వేండ్రము, పేరము =పరుగు - చుట్టు, సుడివడన్=తడఁబడఁగా, వెట్టి=కూలిపని, కొట్టము=పసుల కొట్టము, కాడు=శ్మశానము, తిరుగరానుండి= చుట్టితిరిగి, ఎచ్చట...పోకుం డన్=ఎచ్చటఁగాని ఎవరైనను తెలియకుండునట్లు పీనుఁగును కాలఁబెట్టి పో కుండునట్లుగా, దివ్వెకోలలవారు=దివిటీవారు, పొడచూపక = తమ్ముఅగ

'ప్రొద్దునఁ జనుదెంచి పొడచూప కున్న
గ్రుద్ది యీ దుడ్డునఁ గొట్టుదు' ననుచు
విపులసంపద గలవీరబాహునకు
'జపము సేయుఁడు మంత్రసాధకు' లనియుఁ 1670
జండాలుఁ డనక మాస్వామి దీవించి
రండు నిచ్చలు బ్రహ్మరాక్షసు' లనుచు
గట్టిగా నియమ మీక్రమమునఁ జేసి
నిట్టరాడునుఁబోలె నిలుచున్న వాని
బేతాళు నొక్కనిఁ బిలిచి నీ వింక
ఘాతగా నా కొల్వుకాఁడవై వీరిఁ
గొట్టి యిందఱఁ బనిగొనుచు నిచ్చోటఁ
బెట్టింపు తగు మంచఁ బెంపార' ననిన
వసుధఁ జాఁగిలి మ్రొక్కి వాఁడును నేఁగి
మసలక దిబ్బగా మన్ను వ్రేయించి 1680
సమముగా ఘనశిలాస్తంభముల్ నిలిపి
యమరంగ నొకమంచ యామీఁద వైచి
'విచ్చేయు' మని విన్నవించిన విభుఁడు
వచ్చి యా మంచపై వలనొప్ప నుండి
యడిదంబు తోడుగా నా రుద్ర భూమి
కడు నప్రమత్తుఁడై కాఁపుండె నంత
నట కాలకాశికునాలయంబునను

---

పఱుపక, నిట్టరాడుఁ =ఇంటినడుమపొడవుగానాటినకంబము, ఘాతగా = గట్టిగా, కొల్వుకాఁడు= భృత్యుఁడు, అడిదము = కత్తి, మటుమాయలు = మిక్కుటపుమాయలు, మలకలు=వంకరలు, ఉడుకులు= కొందలములు - తపిం

మటుమాయలను జిక్కి మలకలఁ జొక్కి
యుపవాసములఁ గుంది యుడుకులఁ గంది
యెపుడు చింతల వ్రేఁగి హృదయంబు గ్రాఁగి 1690
కంటకంబుల నొచ్చి కన్నీరు దెచ్చి
కంటసంబులఁ జిక్కి కఱుకులఁ బొక్కి
మురిపెంబు వీడి మోము గరంబువాఁడి
గరువంబు దూలి శృంగారంబు మాలి
విభ్రాంతి మది మీఱి వెలువెలఁ బాఱి
విభ్రమంబులు జాఱి విశ్వేశు దూఱి
బలురాహుముఖమునఁ బడి కాంతి దప్పి
జలదరించెడుబాలశశిరేఖఁ బోలె
నలిగి యందఱు 'హంసనారి' నాఁ బరఁగి
బలుబాములకు నోర్చి పట్టియుఁ దాను 1700
దినమును జంద్రమతీదేవి పసుపు
పనులు సేయుచు నిట్లు పండ్రెండు నెలలు
మునుకొని వర్తింప భూపాలసుతునిఁ
గనుఁగొని యొకనాఁడు కాలకౌశికుఁడు
చేరి 'యో లోహిత చెలఁగి యేప్రొద్దు
నీరీతిఁ జంటిక్రింది దిఱికి యీ తొత్తు

---

చుటలు, క్రాఁగి=క్రాఁగినదై, కంటకములు = విరోధోక్తులు, కంటసంబులు= విప్రలాపములు, కఱుకులు = కాఠిన్యములు, మురిపెంబు=మురువు - నడల యొయ్యారము, గరువము=గొప్పదనము, జలదరించెడు... రేఖ=కంపించుచున్న శ్వేతచంద్రకళ, హంసనారి=ఇదిచంద్రమతికి కాలకౌశికునింటఁగలిగిన పేరు, బలు బాములు= పెనుఇడుములు, చంటిక్రింది దిఱికి = స్తనములక్రింద నేహత్తుకొని - తల్లి

కఱపుల గుడిచాటుకాఁడ వై యిట్లు
తఱలవు వీఁపెల్ల దద్దులు గట్ట
నడువక కా దింక' నని జడ వట్టి
తొడలును జెవులు నెత్తురు లుబ్బ నులిమి 1710
'యిది యాదిగా నింక నీ వాడలోనఁ
జది వెడియాబ్రహ్మచారులఁ గూడి
బుద్ధి దప్పక వనంబునకు నిచ్చలును
బ్రొద్దునఁ జని పదిపుల్లె లాకులును
వేలిమి సమిధలు వెలయ దర్భలును
బాలురపో రుడ్పఁ బండ్లు దోసెఁడును
దులసి పత్రియుఁ బెయ్యా దూడకుఁ గసవు
నలవడఁ గొంచు ర'మ్మని నియమించి
పనిచిన వెలువెలఁ బాఱుచు వచ్చి
తన తల్లి పాదపద్మములపై వ్రాలి 1720
యనయంబు వగచుచు నశ్రువు లొలుకఁ
దన తెఱం గప్పు డంతయుఁ జెప్పుటయును
గడుపులోఁ జెయి వెట్టి కలఁచి నట్లైనఁ
గడు భయంబునఁ బొంది కన్నీరు దొరుఁగ
గురుకుచంబులతోడఁ గొడుకుమో మొత్తి
తరలాక్షి పెదవులు దడపుచుఁ బలికెఁ
'గటకటా! కృప మాలి కాలకౌశికున

---

చన్నులమాటువిడువక యనుట, కఱపుల... కాఁడవై=చెప్పుడు శోభనములు ప్రకటించుచున్నవాడవై, తరలవు=కదలవు, అడువక కాదింక = కొట్టక నిఁక తీఱదు, వేలిమి=హోమము, ఉడ్పఁ=మాన్పించుటకు, పత్రి=బిల్వపత్రి, తలకోరు=

కిటు నిన్నుఁ బని కంప నెట్లు నోరాడె
నడవికి నీ విప్పు డరిగినఁ గాని
తడయక విప్రునితల యేరు దిగదు 1730
పట్టభద్రునికూర్మిపట్టికి వేల్మి
కట్టెలు మోవంగఁ గట్టడే నీకు
గట్టిగా భాగ్యంబు గలవధూ మణికిఁ
బుట్టక నా కేల పుట్టితి కూన
యడవికి నిన్నుఁ బొమ్మనఁ జూచి చూచి
నుడువంగ నే గతి నోరాడు నాకు
నినుఁ బాసి నిమిషంబు నే నిల్వఁ జాల
ననుఁ బాసి పోయెదే నా ముద్దులయ్య
చేకొని యిఁక నేమి సేయ నున్నవియొ
కాక విశ్వామిత్రు కపటవర్తనము' 1740
లని వెచ్చ నూర్చుచు నా పుణ్యసాధ్వి
వినయంబుతో నెల్లవేల్పుల వేఁడి
దనుజదర్వీకరతస్కరభూత
ఘనతరమృగ పక్షి గణములవలన
నవిరళంబుగఁ బ్రాణహాని లేకుండ
వివిధభంగులను దీవించి నందనుని
వలచేత నొకరక్ష వలనొప్పఁ గట్టి

---

తలనొప్పి, పట్టభద్రుని... పట్టిక్ = పట్టాభిషిక్తుఁడైనరాజుకడుపునఁబుట్టినగా రాబుకొడుకునకు, వేల్మికట్టెలు=హోమమునకైనసమిధలు, కట్టడే=నిర్ణయమా, విశ్వామిత్రుకపటవర్తనములు చేకొని యిఁక నేమి సేయ నున్నవియొ కాక అనియన్వయము, దనుజ=రాక్షసులు, దర్వీకర= సర్పములు,తస్కర=దొంగలు, అవిరళంబుగక్ =దట్టముగా, వలను ఒప్పక్ = పొందుమీఱఁగా, మొరత్రోపు

యలుగక 'హా'మ్మని యనుపంగ నడవి
కెలమితో నృపసూనుఁ డేఁగుచు నుండఁ
జలము మీఱంగ విశ్వామిత్రుఁ డంతఁ 1750
దనమంత్రశక్తిచేఁ దక్షకుఁ డనెడి
ఘనపన్నగంబు నాకర్షించి పలికె
'నోయి తక్షక మాకు నుపకార మొకటి
సేయుము నీ కిది చెప్పెదఁ దెలియ
వినుము హరిశ్చంద్రవిభుఁడు వసిష్ఠ
మునిమాట చెల్లింప మోరత్రోపునను
నెట్టన సత్యంబు నెఱపెద ననుచు
నుట్టి గట్టుక త్రేలు చున్నాఁడు వానిఁ
గలఁచి బొంకింప నెక్కడ సందు లేక
తలపోసి యీరీతిఁ దపము చాలించి 1760
తిట్టున కొడిగట్టి తిరుగు చున్నాఁడ
రట్టు దప్పక పొందు రా నున్న వేళఁ
గలయఁ బర్వెడుభవద్గరళకాలాగ్నిఁ
గులగిరులైన నుగ్గులు వాఱఁ గాలు
వసుధలోఁ దక్కినవా రన నెంత
మసలక నీవు నా మతమున నేఁగి

---

నను- ముట్టెత్రోయుటచేత-పందులు మొదలైనవి ముట్టెత్రోనే యవలీలగా చెట్లను పెల్లగింపఁజూచునట్లు - కష్టమయ్యును అవలీలగాననుట, ఉట్టిగట్టుక...చున్నాఁడు=ఒక్కటె దీక్షగానున్నాఁడు, తిట్టునకు ఒడిగట్టి=దూఱుటకును లోనయి,రట్టు...నున్న వేళ=నిందరానున్నవేళ తప్పకవచ్చును, భవత్గరళ కాలాగ్ని = నీయొక్క విషమనెడి కాలవహ్ని, కులగిరులు = కులప

యహికులోత్తమ లోహితాస్యకుమారు
గహనంబులోఁ బడఁ గఱచి ర'మ్మనినఁ
దడయక పనిఁ బూని తక్షకుం డపుడు
వడి నేఁగి యల పితృవనసమీపమునఁ 1770
దళ్లు కొట్టెడిగుంటదరిఁ జాలఁ బ్రబలి
చల్లగా నీడయై చలివెంద్రవ్రాలె
మట్టంపుఁబొడవున మానైనమఱ్ఱి
చెట్టుక్రిందటిపుట్ట చేకొని యుండె
నా తక్షకునిచేఁత కనుకూల మొదవఁ
బ్రీతితో శిష్యులఁ బిలిచి కౌశికుఁడు
'మునికుమారకులార ముదమున మీరు
చని లోహితాస్యుని సంగడిఁ గూడి
వనములోఁ జరియించువానిఁ బ్రేరేచి
కొని పోయి తక్షకు ఘోరవిషాగ్నిఁ 1780
బడఁ ద్రోచి రం'డని పనిచినవారు
తడయక చని రాచతనయునిఁ గాంచి
'యో లోహితాస్య మాయొజ్జలు వనుప
నీ లీల వచ్చి మున్నెప్పుడు నిచటఁ
గడునొప్పుఫలములుఁ గంద మూలములు
నుడుగక కొనిపోవు చుందుము గాన

---

ర్వతములు, నుగ్గులువాఱన్ = చూర్ణమగునట్లుగా, గహనంబులోన్ = చొరరానియడవియందు, పడన్ = నేలఁగూలునట్లు, పితృవనసమీపమునన్ = వల్లెకాటిదాపున, తళ్లుకొట్టెడుగుంటదరి = చినచిన్న యలలుకొట్టుచుండెడికొలనిగట్టున, చలివెంద్ర = చలిపందిరి, మట్టంపుపొడవునన్ = దిట్టమైనపొడవుచేత, మానైన =

గుఱుతులు మే మెఱుఁగుదు మంతటికిని
దెఱఁగొప్ప నీవు నేతెమ్ము మా వెనుక'
ననుచు బోధించి వా రటు గొనిపోయి
మనుజేశసుతుఁడు నెమ్మనమున నలర 1790
ఫలములు దర్భలు పసిమూఁడ కసవు
కలయంగఁ దోడ్పడి కట్టగాఁ గట్టి
సమిధలు దల కెత్తి 'చను'మన్న మొగము
చెమరింపఁ గూఁకటి చీకాకు పడఁగ
దడవడంకులు గొంచుఁ దను వెల్లఁ గంద
నడుగులు దొట్రిల్ల నల్లన నడచి
వచ్చి యల్లప్పటివటమూలమునను
జెచ్చెరఁ దలమోపుఁ జేర్చి రాసుతుఁడు
చల్లని జలము లచ్చటికుంటఁ ద్రావి
యొల్లన మరలి యాయుర్వీరుహంబు 1800
నీడఁ గొండొకసేపు నిద్రించి తన్నుఁ
గూడి వచ్చినవడుగులు దలఁపింపఁ
'మనములో నిందాక మఱచి యున్నాఁడ'
ననుచుఁ బర్ణములు రయంబునఁ గోయ
నొకకాలు పుట్టపై నూఁది యాపాద
మొక కొంత నిక్కి ద్రమ్మా నూఁతగాఁ ద్రొక్కి

---

శాఖైన, ప్రేరేచి= పురికొల్పి, గుఱుతులు ... మంతటికిని=కందమూలఫలాదులుండుచోట్ల గుఱుతులనెల్ల తెలియుదుము, దడవడంకులు = మిక్కిలి కంపమును, అల్లప్పటి=ఆ, తలమోపు=తలమీఁది బరువు, ఒల్లనన్ = మెల్లఁగా, ఊర్వీరుహము=చెట్టు, తలఁపింపన్ = ఆకులు గొనిపోవలయునని తలఁపింపఁగా,

వాలుగొమ్మొక కేల వడి వంచి యున్న
కేలు సాఁపఁగ గమకించునాలోనఁ
గాలకంఠ కఠోర కర కంపితోగ్ర
శూలాగ్ర నిర్గత స్థూల కీలాభ 1810
లోలజిహ్వారుణాలోచనం బగుచుఁ
గ్రాలెడు ఫణము భీకరముగా ముడిఁచి
యాలోన నడఁగిన యమ్మహాభుజగ
మాలోహితాస్యుని నదరంటఁ గఱచె
నా విషవహ్ని భగ్గునఁ బేర్చి మేన
నావహింపక మున్నె 'హా మాత!' యనుచుఁ
జావుతో సరిపోల్పఁ జనుమూర్ఛ నొంది
భూవరపుత్రుండు భూమిపై వ్రాలె
నంత భస్మీభూత మయ్యె నా వటము
నంతియ కాని యాయాదిసర్పంబు 1820

---

వాలుగొమ్మ = వ్రాలియున్న శాఖ, ఉన్న కేలు = తక్కిన చేయి, కాలకంఠ... లోచనంబు - కాలకంఠ = శివునియొక్క, కఠోర = కఠినమైన, కర = చేతి చేత, కంపిత = ఆడింపఁబడిన, ఉగ్ర = భయంకరమైన, శూలాగ్ర = శూలము మొననుండి, నిర్గత = వెడలిన, స్థూల = పెద్దదైన, కీలా = జ్వాలతో, ఆభ = సాటియైన, లోల = చలించుచున్న, జిహ్వా = నాలుకయును, అరుణలోచనము = ఎఱ్ఱనికన్నునుగలది, ఇచట శివుని చేతికిని, పామునడఁగకును, శూలమునకును పాము నాలుకకును, శూలాగ్రమందలి స్థూలకీలకును పాము అరుణలోచనమునకును సామ్యము దెలియునది, ఫణము = పడగ, అదరంటన్ = బిట్టుగా, పేర్చి = విజృంభించి, ఆవహింపక = ప్రవేశింపక, చావుతో... మూర్ఛ = మరణముతో సమానము చేయఁదగిన సొమ్మ, ఆదిసర్పంబు = తక్షకుఁడు, జనని = తల్లి,

పనివడి చంప నోపదు బాలు నతని
జనని పాతివ్రత్యశక్తి వెంపునను
నది చూచి ముని పుత్రు లాశ్చర్య మంది
'మదిలోనఁ దలఁప నీ మను జేంద్రసుతుఁడు
నిగిడినవిషవహ్ని నిలువునఁ గాలి
పొగిలి భస్మము గాక పోలించి చూడ
నలకాలకూటమహాగరళంబు
చెలఁగుచు మ్రింగి మూర్ఛితుఁడైనశివుని
వడువున నున్నాఁడు వాడదు మోము
విడువదు తనుకాంతి వీస మంతయును 1830
బదతలంబులు గాజు వాఱవు నిప్పఁ
జెద లంటునే వలచేతి యీరతు
వెలయ నే మంచు దీవించి కట్టినదొ
తలపోయ మును వీనితల్లి దా' ననుచు
నఱిముఱిఁ బురమున కరిగ యావార్త
తెఱఁ గొప్పఁ జంద్రమతీదేవితోడ
గుఱుతులు సెప్పి వడ్డులు చని రంతఁ
గొఱగానిపలు కనుక్రొవ్వాఁడివేఁడి
మెఱుఁగుఁగైదువు నాటి మెఱమిన గుండె
పఱియలుగా వ్రీలి ప్రాణంబు వెడలి 1840

---

కాలకూట...గరళంబు = హాలాహలమహావిషము, గాజు పాఱవు = గట్టి గావు, కొఱగాని=పసమాలిన, క్రొవ్వాఁడి వేఁడి=మిక్కిలివాఁడియైవేఁడి గానున్న, మెఱుఁగు కైదువు=పదును బెట్టఁగా తళతళ మెఱయుచున్న వాఁడి యాయుధము, మెఱమినక్ = నాటి యిటునటు మెదల్చినచో, పఱియలు=తునకలు

యదరి భూవరుదేవి 'హా పుత్ర' యనుచు
నొదవినపెనుమూర్ఛ నొక్కింతదడవు
తఱిఁగినకదళిచందంబున నేల
నొఱగి చేష్టలు దక్కి యొయ్యన దెలిసి
నేలలు పుడుకుచు నిగిడినవగల
వాలుఁగన్నుల నీరు వఱద లై పాఱ
'నక్కటా యో లోహితాస్య నా కింక
దిక్కెవ్వ రిఁకమీఁదఁ దెరు వేది బ్రతుకు
కీదుఃఖవార్ధి నే నేతెప్పఁ గడవ
నీఁదుదు నీవిధి కే మని వగతుఁ 1850
బతిఁ బాసియును నిన్నుఁ బట్టి నాపట్టి
మతిని నే దిగులును మఱచి వర్తింప
నెక్కడ నుండి నేఁ డిటు వెంటనంటి
తెక్కలి దైవంబు ద్రెక్కొనె నిన్నుఁ
బుట్టక పుట్టినపుట్టుభోగికిని
బుట్టుభోగికిఁ బగఁ బుట్టె నేమిటికి

---

భూవరుదేవి=రాజుభార్య, ఒదవిన=కలిగిన, తఱిఁగినకదళి=నఱుకఁబడినయరఁటిచెట్టు, పుడుకుచు=తడవుచు, నిగిడిన=సాఁగిన- అతిశయించిన, వాలుఁగన్నులు=విశాలములైన నేత్రములు, వఱదలు=ప్రవాహములు, తెరువేదిబ్రతుకుకు=బ్రతుకుటకు దారియేది? దుఃఖవార్ధి=దుఃఖసముద్రము, ఏతెప్పన్=ఏదితెప్పగాఁగొని, -ఎవ్వరిని ప్రాపుగానాశ్రయించి, ఈమహాదుఃఖమును, కడవనీఁదుదును=దాఁటునట్లు ఈఁదఁగలదానను, ఈవిధికి=ఈదైవవ్యాపారమునకు, నిన్నుఁబట్టి=నీవుండుటంజేసి, తెక్కలిన్=వంచనచే, త్రెక్కొనెన్=చంపెను, పుట్టకపుట్టినపుట్టుభోగికిని=లేకలేకపుట్టి పుట్టుక మొదలుగా భోగములనుభవించుచుండువానికి-

నప్పాపజాతిపు ర్వదరంటఁ గఱచు
నప్పుడు నన్ను నే మని తలంచితివొ
వేఁడిమి హృదయ మీవిప్రున కెపుడు
వీఁడు కొండొక వాఁడు విపినభూములకుఁ 1860
గనికరింపక పంపఁగా నెట్లు వచ్చు
ననక కృపాహీనుఁడై నిన్నుఁ బంపెఁ
బంపెఁ బో నీకుఁగాఁ బనిఁ బూని యడవి
కింపెసలార నే నేల పో నైతిఁ
బోవుట గలిగినఁ బుత్ర నిన్ గోలు
పోవుదునే బుద్ధిఁ బురు వెట్లు మేసె
నీపుట్టినప్పుడు నెమ్మి దైవజ్ఞు
లేపార నిల యెల్ల నేలెద వనుచుఁ
గడఁగి పల్కిరి గాని కాలాహిచేత
నడవిలోపలఁ జత్తు వనరైరి తనయ 1870
యడవికి నీ వేఁగునపుడు గన్నీరు
వెడలెడునీవాలు వెడఁదగన్నులును

---

ఆగర్భ శ్రీమంతుఁడగు నీకును, పుట్టభోగికిని=పుట్టయందుండు పామునకును, అప్పాపజాతిపుర్వు= ఆపాపిష్ఠమైనపురుగు-పాము, అదరంటన్ =మిక్కిలిగా, వేఁడిమి హృదయము=మనస్సు క్రూరమైనది, 'వీఁడు...ననక'=వీఁడు పసివాఁడే అరణ్యభూములకు దయలేక యెట్లుపంపవచ్చును అని యెంచక, పంపెఁబో=పంపినను పంపనీ, నీకుఁగాఁబనిపూని=నీకొఱకుపని చేకొని-నీకు పెట్టినపని నేనువహించి యేలపోకపోతిని, పోవుట... పోవుదునే= నేనుపోయియుందునేని, కొడుకా నిన్ను దారపోసికొందునా-దారపోసికొనననుట, బుద్ధిపురువెట్లుమేసె=నాబుద్ధి పురుగేవిధమునఁ దినివైచినది, నాబుద్ధియు నెట్లుముసించినదో యనుట, దైవజ్ఞులు=జ్యౌతిషికులు, కాలాహి=క్రూరసర్పము, వాలు వెడఁదగన్నులు=నిడు

విన్ననై పెదవులు విఱిచి దైన్యమున
నన్ను రమ్మని పిల్చి నలికొట్టుపలుకుఁ
బలుచని చెమటతో ఫాలభాగమునఁ
గలగొన నంటిన కాకపక్షములుఁ
దలసాల వెడలెడుదాఁక నా దెసకు
మలయుచూడ్కులు గలనుంచినీ మోముఁ
గన్నులఁ గట్టినకైవడిఁ దోఁచు
చున్నది యిప్పు డెట్లోపుదు మఱవఁ 1880
బ్రొద్దు నేఁ డిదె క్రుంకెఁ బాలమున నుండి
ముద్దులేఁగలు వచ్చి మొదవులఁ గలసె
మనమున మోహంబు మల్లడి గొనఁగఁ
జనుదేవు నీవేల చన్నులు సేఁపె
నేపరింపుదురె న న్నిట్లు మా యయ్య
నా పుత్రరత్నంబ నా నిధానంబ'
యని పెక్కు భంగుల నడలుభూపాలు
వనితపై నా విప్రవనిత గోపించి
'యోసి యమాంగల్య మొదవ నేడ్చెదవు

---

దలై విఱిచి గానుండుకన్నులు, నలికొట్టుపలుకు=నసకొట్టుమాటపోలేక సడిగొట్టుచుండుపలుకనుట, కలగొనన్=చెదరఁగా, కాకపక్షములు=కూఁకట్లు, తలసాల=తలవాకిలి, మలయుచూడ్కులు=తిరిగితిరిగి చూచుచూపులు, కన్నులఁగట్టినకైవడి=కన్నులలో నే యుండునట్లు, ఎట్లోపుదుమఱవ=మఱవనెట్లు నేర్తును, ముద్దులేఁగలు=ముద్దుగులుకు దూడలు, మొదవులన్=ఆవులను, చన్నులు సేఁపె=చన్నులందు పాలు చేఁపుచున్నది, ఏపరింపుదురె=దుఃఖపెట్టుదురా, భూపాలువనిత=రాజకాంత, కలగొని=ఇటునటువ్యాపించి, చీమలగామలవలెను-ఇది జాతీ

యీసంధ్యప్రొద్దు మాయింటిముందటను 1890
గలగొని చీమల గామల వలెను
జెలఁగుచు ముందర శిశువు లాడఁగను
నీకేల పలవింప నీకుమారునకు
నీకునుగాఁ జెడె నేఁ డిల్లుఁ బెళ్లుఁ
బోకార్చి నట్టి యీ ప్రోడకు నేడ్వ
నాకుఁ బోవదు గాక నా సూత్రధారి
కొడుకు నెక్కడ దాఁగ గుఱుతుగా నంపి
కడునుగ్ర భుజగంబు గఱచిన దనుచు
వెడయేడ్పు లేస్చుచు వెదకుచు నందు
వెడలి పోఁ జూచెనో వేసాలు వన్ని 1900
లోకంబులో లేని లొటతాటకత్తె
నీ కువాడమ్ము లన్నియుఁ దెల్సు మాకుఁ
గైకొని మేఁకలఁ గాచి రా పొమ్ము
నీకంటె మిక్కిలి నెఱజాణ నేను
గొడుకుకు విలపించు కొనుచు నీవున్న
నెడప కెవ్వరు సేతు రీపను లెల్లఁ

---

యము - గుంపులుగా క్రిక్కిఱిసియనుట, నీకుమారునకు... పెళ్లు= నేఁడునాయి ల్లును పెళ్లును నిన్నుండియు నీకొడుకునుండియుఁ జెడినది, పోకార్చి... పోవదు గాక- పోఁగొట్టుకొన్న యీప్రోడబిడ్డకు నేడ్చుట నాకునొప్పదు గాని - ఇట లోహితాస్యుని ప్రోడయనుట పరిహాసపరము - ప్రోడబిడ్డనాయనుట, సూత్ర ధారికొడుకను=సూత్రధారివలె పలువేషములు నేర్చిన యీకొడుకును, దాఁగఁగు ఱుతుగా నంపి=దాఁగికొనుటకు అడియాలము చెప్పిపంపి, కడునుగ్రభుజగంబు= మిక్కిలిభయంకరమైన సర్పము, లొటతాటకత్తె=జిత్తులమారిదానవు, కువాడ మ్ములు=కపటవర్తనములు, నెఱజాణ=మంచి నేర్పుకత్తె, పిసాళింపక=టక్కులు

జాలు లే లెమ్ము పిసాళింప' కనుచు
నాలీల దుర్భాష లాడుచు నున్న
కాలకౌశికుభార్యఁ గనుఁగొని వగవు
లోలోన నడఁచి యాలోలాక్షి పలికెఁ 1910

'తల్లి నామీఁద నిత్తఱి దయ నుంపు
ముల్లంబులో నిది యొండుగాఁ గొనకు
విస మెక్కి చచ్చెనో విపినంబు లోనఁ
బొసఁగంగఁ గొఱప్రాణముల నున్నవాఁడో
చొప్పడ నా పుత్త్రుఁ జూచి రా నొకని
నిప్పుడే పంపు వాఁ డీల్గక మున్నె
మసలక తెప్పించి మందుఁ బోయించి
పసనుగా నొనరింపు ప్రాణదానంబు'
ననుచు దైన్యము దోఁప నా రాజదేవి
తను వేఁడుకొనుచుఁ బాదములపైఁబడినఁ 1920
గలహకంఠిక కనికర మింత లేక
తలమని ముంగలఁ దలఁ బాయఁ ద్రోచి
'తొలుతటిసొమ్ముకుఁ డో డింకఁ గొంత
గెలువఁ జూచెదవు మిక్కిలి జాణ వౌదు
కట్టెలు దెమ్మన్న ఘనభుజంగముల
పుట్ట లెక్కఁగ నేల పోయె నీకొడుకు
చేకొని యిది మేము చేసినతప్పె

---

సేయక, కొఱప్రాణములు=వట్టుసురు, పసనుగాఁ=పొందికగా, తలము=తొలఁగుము, తొలుతటి...జూచెదవు=ముందు మిమ్ముకొన్నందులకు దారవోసినరొక్కమే కాక మఱికొంతరొక్కము నీకొడుకు మందుమాకులకు వెచ్చపెట్టింపఁ

వాకట్ట మైతిమి వసుధఁ బాములకు
మందుల విలువలు మాకేడఁ గలవు
మందు వెట్టఁగ లేము మనఁజేయ లేము 1930
వెదక నంపఁగ లేము వెజ్జుఁ దేలేము
మదిమదితో నుండి మాకేమి శ్రద్ధ
పీడ వాయదు మాకు బిడ్డఁడు నీవుఁ
గూడు గూరకు సడి గొట్టక యడిగి
యున్న మాటలు మాని యూరక వచ్చి
పన్నుగా నీచేయుపను లెల్లఁ దీర్చి
ప్రొద్దు వోయినమీఁదఁ బోయి నీ పుత్రు
సుద్ది నిక్కంబుగాఁ జూచి రమ్మనిన
నుత్తర మొండాడ నులికి యా సాధ్వి
చిత్తంబులో శోకశిఖి మండుచుండ 1940
జాము వోయినదాఁకఁ జాఁగఱ గొట్ట
బాములఁ బొందుచుఁ బను లెల్లఁ దీర్చి
బడలియు మఱి వచ్చి భక్తి దీపింప
నడుగు లొత్తుచు నున్న నా విప్రవనిత
వడి జొల్లు సెలవుల వడియ నూరుపులు
నిడుదలై గొటగొట నిగుడ వెండ్రుకలు

---

జూచెదవు, వాకట్టమైతిమి=నోరుకట్టమైతిమి, విలువలు=వెలలు, మనఁజేయన్ = బ్రతికింపఁగా, వెజ్జున్ =వైద్యుని, మదిమది... శ్రద్ధ=కుదిచి నెమ్మదిగానుండి మాకీ లేనిపోని యక్కఱయేమివచ్చె, పీడ... మాకు=నీబిడ్డఁడు ఏమైతే నేమి మాపీడవదలదు, సడిగొట్టక=నసపెట్టక, సుద్ది=సంగతి, ఉలికి=భయపడి, శోక శిఖి= దుఃఖాగ్ని, చాఁగఱగొట్టన్ = బాధింపఁగా,. సెలవులన్ = పెదవిమూలలం

విరిసి జుంజుఱుదల వ్రేలాడఁ జెమట
దొరుఁగుకక్షంబుల దుర్గంధ మెసఁగఁ
బిసరు గాచినకుండ పేర్పు చందమున
నెసఁగినబాకి నో రెంతయుఁ దెఱచి 1950
కలవరింతల వాడగరితలు బెదరఁ
బెలుచఁ బండ్లను బెటపెటఁ గొఱుక్కొనుచు
నొడలిచీర నెఱంగ కుదరంబు పెద్ద
తడగంబుగతిఁ దోఁపఁ దనప్రక్కలందుఁ
జడుగును బేకయుఁ బలెఁ బడి మునిఁగి
పడుచులు గూర్కంగఁ బందిచందమునఁ
దెప్పున నిద్రఁ జెందిన యటమీఁద
నప్పద్మలోచన యల్లన లేచి
యంధకారమును శోకాంధకారమును
బంధురం బగుచు లోపల వెలుపలను 1960
గిఱిగొని కవయంగఁ గెం గేల నొక్క
కొఱవిఁ గైకొని వడుగులు సెప్పి చనిన
కడకుఁ బోయినత్రోవగా నొక్కతెయును

---

దు, జుంజుఱుతల=పల్లతలయందు, కక్షము=చంక, పిసరు=కడిగినధాన్యములో త్రోపుడుపడినది, కుండ పేర్పు=కుండ పెంకు, బాకి= పెద్ద,తడగము=ఎద్దుమీఁద నీళ్లుతెచ్చెడి తోలుసంచి, పడుగు=వస్త్రపు నేఁతయందలి నిడుపునూలు, పేక =వస్త్రపు నేఁతయందలి అడ్డనూలు, పడుచులు=పిల్లవాండ్రు, బంధురము=అధికము, లోపల శోకాంధకారమును, వెలుపలఅంధకారమును, గిఱిగొని=నెలకొని, కవయంగన్=క్రమ్ముకొనఁగా, పోయినత్రోవఁగా=పోయినదే దారిగా-తాను తెలియకపోయినదారియె దారిగాననుట,వటభస్మ...నుండన్ =కాళ్లకడ

దొడరినపతిభక్తి తోడుగా నరిగి
పొడవైన వటభస్మపుంజంబు గాళ్ల
కడను బుట్ట తలాపికడ నుండ నిట్లు
పడి కన్ను లరమోడ్చి పాదముల్ వీడు
పడఁ జూచి మృదుపాణిపల్లవయుగము
వెడఁదయురంబుపై వ్రేసి గళంబు
కుడి దిక్కు భుజముపైఁ గొండొక వంచి 1970
మొగ మోరగాఁ బెట్టి ముందటిచుంచు
జిగి దప్పి కెంధూళిచే బీదువాఱి
యొక వికారము లేక యూరక తొల్లి
ప్రకటనిద్రావస్థఁ బరఁగుచందమున
నున్న యాలోహితాస్యునిఁ జూచి ప్రాణ
మున్నదో లే దని యువిద మూర్ఛిల్లి
ధర మీఁదఁ బడి పెద్దదడవుకుఁ దెలసి
పురపురఁ జిత్తంబు పొక్క నందంద
చెందమ్మిరేకులఁ జెనకుహస్తముల
ముందలయును మొగంబును మోఁదుకొనుచుఁ 1980
జాలఁ గీ లెడలినజంత్రంపుబొమ్మ
పోలిక మూర్ఛిల్లి పుత్రుపై వ్రాలి

---

మట్టిపొడిరాసియు, తలాపికడపుట్టయును గానుండునట్లు, వీడుపడన్ = వేఱువేఱ ఎడగలుగఁగా, మృదుపాణి పల్లవయుగము = చిగుళ్లవంటి మెత్తనిచేతులదోయి, వెడఁదయురము = విశాలవక్షము, గళంబు = మెడ, చుంచు = కూఁకటి, జిగిదప్పి = కాంతిమాసి, కెందూళిచే బీదువాఱి - ఎఱ్ఱదుమ్ముచేత వన్నెమాఱి, చెఁకు = మాఱాడు = పోలునట్టి, కీలు ఎడలిన = మఱవీడిన, కల్యాణవిహార = శుభమైన నడవడిగవాఁ

క్రమ్మఱఁ దెలివొంది కన్నీరు దొరుఁగ
నమ్మదిరాక్షి యిట్లని యేడ్వఁ దొడఁగె
'హా లోహితాస్య వంశైక విస్తార
లాలిత సౌభాగ్యలక్షణాకార
హా నిర్వికార మహాగుణాధార
భూనుతఘనమణిభూషణోదార
హా సుకుమార కల్యాణవిహార
వాసి కెక్కినచక్రవర్తికుమార 1990
తిన్ననినగ వామతించునీమోము
కన్నులపండువుగాఁ జూడకున్నఁ
బులకండ మొలుకునీ ముద్దులమాట
లలవడ వీనుల నాలింప కున్న
మెఱుఁ గారునీబోదు మేను చిత్తంబు
కఱవు వో నక్కునఁ గదియింప కున్న
నోడలఁ బ్రాణము లుండ వొకనిమిషంబు
నెడముగా నినుఁ బాసి యే నెట్టు లోర్తు
నే తెరువునఁ బోయి యే నెట్లు వత్తు
నాతోడఁ జెప్ప వే నాతోడునీడ 2000
యెచ్చట నుండి నిన్నెలమి నేఁ బిలువ
వచ్చి నన్ బొడగాంచి వదనాబ్జ మలర
నెదురుగా వత్తు నేఁ డేటికి రావు

---

డా, తిన్ననినగవు=చక్కనినవ్వు, ఆమతించు=పుట్టు, పులకండము=కండచక్కెర, బోదుమేను-గోముగాఁ బెరిఁగిన మేను, అక్కునన్=ఱొమ్మున, ఎడముగా = తెఱపి గా-నీకు నాకు చేరిక లేనట్లుగా, ఎచ్చటనుండిన్=ఎక్కడనుండిగాని, మరులు=ప్రే

మది నీకు నా మీఁద మరులెందుఁ బోయె
వడుగులచేత నీ వార్త విన్నపుడె
తడయక నే రానితప్పు పైఁ బెట్టి
యలుకమై ముఖ పద్మ మవ్వాలఁ జేసి
పలుకవు నే నిట్లు పలుమాఱుఁ బిలువ
నో యన్న నే మని యొకమరి కింక
నో యన్న నీ కింక నుడిగి నాలోని 2010
కుం దార్పవే పైఁడికుండలమేడ
లందు రత్నావళి నలరునుయ్యేలల
సుదతులు జోకొట్టి జోలలు వాడ
నిదుర వోయెదునీవు నేఁడు రానేలఁ
బడి నక్కు లఱవ నిర్భయమున నడవి
నుడుగక నిద్దుర నొంది యున్నాఁడ
వే మందు నింక నె ట్లేమందు విధిని
నేమందు వెట్టిన నెసగుఁ బ్రాణమ్ము'
లని యని పలవించి యవనిపైఁ బొరలి
తనయుని ముక్కునఁ దన వ్రేలు మోపి 2020
యుడుగక మెల్లనె యూరుపు లరసి
'యొడలఁ బ్రాణము డాఁగి యున్నది గాని

---

మ, పైఁ బెట్టి=మీఁద మోపి,ముఖపద్మ మవ్వాలఁ జేసి = ముఖారవిందము పెడమఱు గా ద్రిప్పుకొని'ఓయన్న! ఏమిఅని ఒకమరికి ఇంక! ఓయన్న నీకింక! ఉడిగి' అనిఛేదము.ఓయన్నా! నేనుఓయని పిలువఁగా ఇంకవొకసారి ఏమియనిచెప్పి,నీ కోపమునువిడిచి యనియర్థము,కుందు=దుఃఖము, పైఁడికుండల మేడలు=బంగారు కుంభములుంపఁబడిన సౌధములు, రానేల=రాతి నేలయందు,ఏమందు... నెట్లు=

చావఁడు వీఁడని చర్చించి మఱియు
భావించి యిది యేల వలవని యాస
వత్తురే చచ్చినవారును మరల
నిత్తఱి నిటు చావ నిది కట్టడయ్యె
నిన్నియుఁ గల్ల లూహింపఁ గౌశికుఁడు
నన్ను వేదనఁ బెట్ట నలిఁ బన్ని నట్టి
మాయ గా కని దైవమా' యని కొడుకుఁ
బాయనియక్కునఁ బట్టి పాలిండ్ల 2030
నొత్తి 'యో యమ్మ చన్నొల్లఁ' డన్ శోక
మొత్తి యా కఱచినయురగంబు దలఁచి
'శ్రుతిబాహ్యుఁ డిలఁ బుట్టుగ్రుడ్డు తామసుఁడు
గతిచెడ్డ చెడుగు తెక్కలి బొక్కలాఁడుఁ
బదవిహీనుఁడు జగత్ప్రాణభక్షకుఁడు

---

ఇఁక నేనెట్లు బ్రదుకుదును, వలవనియాస=కూడనియాస, కట్టడి=ఏర్పాటు, పాయనియక్కునన్=కొడుకు నెన్నఁడును ఎడఁబాసియుండని తనఱొమ్మునందు, ఓయమ్మ చన్నొల్లఁడు అన్ శోకము=ఓయమ్మా చన్నునొల్లఁడేయనెడి శోకము, ఉరగము=పాము, శ్రుతిబాహ్యుఁడు=చెవులులేనివాఁడని సర్పపరము-వేదబాహ్యుఁడని అర్థాంతరము, పుట్టుగ్రుడ్డు=గ్రుడ్డునఁబుట్టినది, అని సర్పపరము-పుట్టినది మొదలుగా గ్రుడ్డియైనవాఁడని యర్థాంతరము, తామసుఁడు=నీచుఁడు, తామససర్పజాతి, గతిచెడ్డచెడుగు=దారి సరిగాలేక వంకరగానుండుదుష్టజంతువు-దారితప్పినదుష్టుఁడని యర్థాంతరము, తెక్కలి=దొంగ, బొక్కలాఁడు=బొక్కలందుండువాఁడు - దాఁగుపోతని యర్థాంతరము, పదవిహీనుఁడు = కాళ్లులేనివాఁడు - అంతస్తులేనివాఁడని యర్థాంతరము, జగత్ప్రాణభక్షకుఁడు = వాయువునుభక్షించువాఁడు, జగత్తులోనివారి ప్రాణములనుభక్షించువాఁడు.

వెదకి యీవసపాల విత్తు నేమందు'
నని పాము నిందించి యంతరంగమునc
దను దానె యూరార్చి ధైర్యంబు దెచ్చి
'వెల్లువ వారలినవిధిని నీయడవి
మల్లడి గొనువగ మాన కేడ్చినను 2040
సుతునిప్రాణములు వచ్చునె వీనిc బుణ్య
గతికిc బోవ దహించి కాలకౌశికుని
ముదిత మేల్కానకయ మున్నె నేc బోయి
వదలక పని దీర్ప వలయు నిచ్చోటc
దడయుట గా' దని తనచీర బిగిచి
కొడుకు వీcపునc గట్టుకొని కొంత దవ్వ
చని చితికేశాస్థిశకల కపాల
ఘనచర్మ సంకీర్ణఘట జీర్ణశూర్ప
భసిత సముద్భటపటునటద్భూత
విసర బేతాళసంవృత్తమై చూడ 2050
నతిభీకరం బైనయా రుద్రభూమి
ధృతిc జొచ్చి యం దొక్క దెసc బుత్రు డించి

---

వెల్లువ్ వారలినవిధిని=ప్రవాహము ప్రవహించినతీరుగా, మల్లడిగొనువగన్=పెనcగొనుదుఃఖమున - ఒకదుఃఖముతో మఱియొకదుఃఖము పెనcగొను నట్లుగా, బిగిచి=బిగించి, చితి...సంవృత్తమై - చితి=సొదలు, కేశ=వెండ్రుకలు, అస్థి=ఎముకల, శకల=తునుకలు, కపాల=పుఱ్ఱెలు, ఘనచర్మ=పెద్దతోళ్లు, సంకీర్ణఘట=చెల్లచెదరైనకుండలు, జీర్ణశూర్ప=చిరిcగినచేcటలు, భసిత=బూడిద, సముద్భట=మిక్కిలి ఉద్ధతమైనదియు, పటు=బిట్టుగా, నటత్=ఆడుచున్న, భూతవిసర=భూతసమూహములు, బేతాళ=బేతాళుcడును, సంవృత్తము=

పొంత యొల్కులలోనఁ బొడవడి కాలి
కొంత చిక్కినకడకొఱవులు దెచ్చి
కుఱుప్రోఁగుగా నిడి కొడుకు నం దునిచి
కొఱవి నొక్కటఁ దలకొఱవిడఁ బూని
చేతు లాడక మోము చీరతో నొత్తి
యాతురంబున నేడ్వ నా యార్త రవము
విని హరిశ్చంద్రుండు విస్మయం బంది
'ననుఁ గన్గొఱంగి యీనడురేయి నకట 2060
యీ వల్లకాటిలో నీ యార్తరావ
మీవిధి విన వచ్చె నెలుఁగుచందమును
బోలింప సతి గాని పురుషుండు గాఁడు
చాలు నీతలపోఁత సయ్యన నేఁగి
కదిసి చూడక పొందు గాదని ముద్ర
గుదియ మూఁపున నిడి క్రూరఖడ్గంబు
మొల ద్రిండుతో నంట ముడి వేసి బిగిచి
కులగిరిపై నుండి కుంభినిమీఁది
కసమున నుఱుకుసింహంబుచందమున

---

వర్తించునట్టిది, పొంతయొల్కులు=దాపటిపీనుఁగులు, పొడవడి=కనఁబడి, కడకొఱవులు=కాలఁగా మిగిలినకట్టెలు, కుఱుప్రోగు=చిన్నరాసి, కొఱవి...విడన్=ఒక్కకొఱవిచే తలయందు పెట్టుకొఱవిని బెట్టుటకు, మోముచీరతోనొత్తి=మొగమును చీరతోఁగప్పుకొని, కన్గొఱంగి=ఏమఱించి, ఎలుఁగుచందమును బోలింపఁగాన్=కంఠధ్వనితీరును తారకాణచేసిచూడఁగా, సతి=స్త్రీ, చాలు నీతలపోఁత=స్త్రీయోపురుషుఁడోయని యిచట నేయుండి తర్కించుకొనుచుండుట చాలును, పొందుగాదు=తారకాణ యేర్పడదు, మొలద్రిండు=మొలయందలిదట్టి, కుంభిని = భూమి, అసమునన్ = దర్పమున, ఆదట = ప్రేమము,

మసలక యారాజు మంచముపై నుండి 2070
మేదినిఁ బడ దాఁటి మెల్లన వచ్చి
యాదటఁ గనుఁగొనునప్పు డయ్యింతి
నెరసినకురులును నెఱి ధూళిఁ దూలి
విరిసినసీమంతవీథియు వదలి
జాఱినపయ్యెదఁ జన్నులమీఁదఁ
గాఱెడుకన్నీరుఁ గరపల్లవమునఁ
గదిసినచెక్కును గలికిలే నవ్వు
గుదిసినచూపును గొండొక వదలి
మూఁపుపై వ్రేలుక్రొమ్ముడియును వగల
వాఁపోవఁ గెంపారువాలుఁగన్నులును 2080
వెడలునిట్టూర్పులు వెగచు కుత్తికయు
బడలినమేనును బగిలినమోము
మగిడినచనుకప్పు మాసినచీర
పగిలినయధరబింబము నై తలంపఁ
బలుచనిమొగిలులోపలఁ దోఁచుచంద్ర
కళభంగి మాఁగుడు గవిసి మానికపు

---

నెరసినకురులును=చెల్లచెదరైన తలవెండ్రుకలును, నెఱి=ఒప్పు, ధూళిన్=దుమ్ముచే, తూలి=పసచెడి, విరిసిన సీమంతవీథి=విచ్చయిన పాపటరేక, లేనవ్వుగుదిసినచూపు=లేఁతనవ్వు తీసిపోయినదృష్టి, కొండొక=కొంచెము, వగల...వాలుఁగన్నులు=దుఃఖములచే రోదనము సేయఁగా సెఱ్ఱఁబాఱిన విశాలములైన నేత్రములును, వెగచుకుత్తికయు=వెక్కి వెక్కి యేడ్చుచున్నగొంతును, మగిడినచనుకప్పు=తొలంగిపోయిన చన్నులమీఁదిపయ్యెద, పగిలినయధరబింబము=పీఁటలువాఱిన దొండపండువంటిమోవి, పలుచనిమొగిలు=పలుచగానున్నమబ్బు, మాఁ

బొమ్మను మసిపాతఁ బొదిఁగినమాడ్కి
నెమ్మేనిక్రొమ్మించు నిగుడక మాసి
నాకేశుఁ బాసిననాఁటిపౌలోమి
చేకొన్నదుర్దశఁ జెందిన ట్లున్న 2090
భావించి యాత్మలోఁ బలుమాఱు వగచి
భూవల్లభుఁడు దానిముందఱ నిలిచె
నిలిచినఁ గనుఁగొని నివ్వెఱపాటుఁ
గళవళంబును మదిఁ గడలు కొనంగఁ
దొలఁగినపయ్యెద తుంగ స్తనముల
నలవడఁ గప్పి నయ్యబ్జాక్షిఁ జూచి
'వెఱవకు మీవయో వెలఁది యిచ్చోట
నెఱసినచీఁకటి ని ట్లొంటి నున్న
నెఱసాహసివి మఱి నీకేటి వెఱపు
మఱుఁగు పెట్టక చెప్పుమా నీకు నిట్టి 2100
నెగు లింతయును నేమినెపమున వచ్చె
మగువ నీ పేరేమి మగనిపే రేమి
యెచ్చట నుండుదు వీ బాలుఁ డెట్లు
వచ్చె' నావుడు ముఖాబ్జము వ్రేల వైచి

---

గుడుసు=నలుపు - మాలిన్యము, మసిపాఁతన్=మాసినగుడ్డను, నెమ్మేనిక్రొమ్మించు=దేహముయొక్క క్రొత్తకాంతి, నిగుడక=ప్రసరింపక, నాకేశు...దుర్దశన్=దేవేంద్రుని ఎడఁబాసినప్పటి శచీదేవిపొందిన దురవస్థ, నివ్వెఱపాటు=ఆశ్చర్యము, కళవళము=కలఁత, నెఱసినచీఁకటి=నిండుకొన్నచీఁకటి, నెఱసాహసివి=పూర్ణసాహసము గలదానవు, నీకేటివెఱపు=ఇంతటిసాహసముగల నీకుభయమేల, నెగులు=బాధ, విప్రవరునింట=బ్రాహ్మణోత్తముని గృహమునందు, తప్పనా

కన్నుల బాష్పంపుఁగణము లందంద
చన్నుగుబ్బల మీఁద జలజల దొరుఁగఁ
బొరిఁబొరి వగచుచు భూవల్లభునకుఁ
గరుణ రా గద్గదకంఠి యై పలికెఁ
'బురుషవరేణ్య యీపురి నొక్కవిప్ర
వరునింట దాసి నై వర్తించు చుందు 2110
నప్పు దీర్పఁగ నుపాయము మఱి లేక
తప్ప నాడక పతి దన్నమ్ముకొనియె
నాసుతుఁ డితఁ డంసనారి నాపేరు
భూసురుం డడవికిఁ బుత్తేర వేల్మి
కట్టెలకై వచ్చి కడు నుగ్రమైన
కట్టిఁడిభుజగంబు కాటునఁ జచ్చె
ననఘ మీ రెవ్వ రి ట్లనుకంప మీఱఁ
దనశోక ముడుపఁ జిత్తమునఁ దలంచి
విచ్చేసి నట్టియావిశ్వనాథుఁడవొ
నిచ్చలు బహుభూతనివహంబు గొలువ 2120
నిచ్చలుఁ బ్రియ మార నీ రుద్రభూమి
నచ్చుగా విహరించునాభూతపతివొ
యెఱిఁగి యుండితి రేని యేమైన మందుఁ
గరుణ నిచ్చి సజీవిగా వీనిఁ జేసి

డక=లేదుపొమ్మని అబద్ధముచెప్పలేక, తన్నమ్ముకొనియెన్=నన్నమ్ముకొనెను, భూసురుఁడు=బ్రాహ్మణుఁడు, పుత్తేరన్=పంపఁగా, వేల్మికట్టెలు=హోమమునకైనసమిధలు, కట్టిఁడిభుజగము=క్రూరమైనసర్పము, అనుకంప=దయ, తనశోకము=నాశోకము, విశ్వనాథుఁడవో=కాశీ విశ్వనాథుఁడవో, భూతపతివో=శివుఁ

నన్ను రక్షింపుము' నావుడు దాని
సన్నుతప్రియవాక్యసరణిచేఁ దనదు
కులసతి యవుట నిక్కువముగా నాత్మఁ
దెలియక చంద్రమతీ దేవి కనియె
'భూతనాథుఁడఁగాను భువి నెల్ల జనుల
చేత మ్రొక్కులు గొనుసిద్ధుండఁ గాను 2130
వెడఁగుమందులచేత విష మె ట్లడంగుఁ
జెడునోకో చీర రాచినఁ బాముకాటు
మందుఁ బెట్టఁగ నేర మనఁ జేయ నేర
నెందు నిప్పరమున నీ రుద్రభూమి
గుత్తగాఁ గైకొని గురుభుజశక్తి
నొత్తి యెవ్వరినైన నుక్కడఁగించు
బలియుండు చండాలపతి వీరబాహుఁ
డెలమిమై మన్నించి యీ ముద్రగుదియఁ
దగ నిచ్చి యీకాడు తఱలక రేయుఁ
బగలును గావంగఁ బనిచె న న్నిందు 2140
వీరదాసను పేర వెలయుచుండుదును
వారక నడురేయి వచ్చి నీ విట్లు
నన్నుఁ గానక యుండ నందనుఁ దెచ్చి
పిన్ననిఁ జితిమీఁదఁ బెట్టంగఁ దగునె
నెలఁతవు గాన మన్నించితి నిన్నుఁ

---

డవో, చెడునోకో చీరరాచినఁబాముకాటు=పాముకఱచిన విషమును గుడ్డతో రాచి తుడువఁగా తీసిపోవునా, మనఁజేయక=బ్రతికించుటకు, గురుభుజ-

దల ద్రెవ్వ వేయుదుఁ దక్కారుఁడైన
సాద వేర్పఁ దగునంత చోటుకు మాడ
మొదటనే తెచ్చి మాముందటఁ బెట్టి
పిదప దహింతురు పీనుఁగుఁ దెచ్చి
ముదిత యీతగినచొప్పున నీవు దెచ్చి 2150
యీకుమారున కగ్గి ని మ్మిటు పొసఁగ
లేకున్నఁ గాల్చి పోలేవు న న్నేలు
నొడయుఁడు వీరబాహునియగ్గలాన
వెడలి పొ' మ్మనిన న వ్వేలఁది యిట్లనియెఁ
'బరహితచరిత నాపై నొకకొంత
కరుణ సేయక సిరి గలదానివలెనె
యడిగెదవేల న న్నదలించి యిపుడు
యెడపక నీన నీకేమి గూడెడిని
సకలదీవుల నేలుజనపతిపుత్రుఁ
డకట చేరెఁడునేల కర్హుండు గాఁడె 2160
నీ వేమి సేతు పన్నిననునిమాయ
నా వెంటఁ దతిగొని నలఁచి పో నీక
పట్టి యీగతి నేలపై నిడి కాలఁ
బెట్టి ప్రాముచు బుసవెట్టుచుండంగ'

---

శక్తిన్ = గొప్ప బాహుబలముచేత, కాఁడు=శ్మశానము, తక్కారుఁడు=మఱి యొక్కఁడు, సిరి గలదానివలెనే = సంపదలగల స్త్రీవలెనే, నీకేమిగూడెడిని = నీకేమిలాభము ఒనఁగూడఁగలదు, జనపతి పుత్రుఁడు=రాజకుమారుఁడు, తతిగొని=విడువక, నేలపైనిడి కాలఁబెట్టి ప్రాముచున్ = నెలపైఁబెట్టి కాలితోరాచుచు, చాయగాన్ =చూచాయగా - జాడగా తనసంగతి సూచిత

నని యిట్లు చాయగా నాడిన మాట
విని హరిశ్చంద్రభూవిభుఁ డాత్మఁ గలఁగి
తగ విచారించి 'యీ తరుణి నా పత్ని
యగు' నని మనసు సయ్యన మగిడించి
'గట్టిగా నెఱుఁగ కీగతిఁ దలంపే ల
పుట్టె విశ్వేశ నా బుద్ధిలో' ననుచుఁ 2170
బరితాప మంది యప్పడఁతి నీక్షించి
మరి పల్కెఁ 'జోద్యంపుమాట లాడెదవు
నట్టేడుదీవులనము మెల్ల నేలు
పట్టభద్రునికూర్మిప ట్టంట బాలుఁ
డామహీశునిదేవి వఁట నీకు విత్త
మేమియు లే దన్న నెటు నమ్మ వచ్చు
నీకెంత గలిగిన నిన్నదలించి
మాకుఁ గైకొన రాదు మాడకు మిగులఁ
జేకొని యేలిక చెప్పినచొప్పు
గాక నీ పేదఱికము నాకుఁ బొత్తె 2180
పాటలగంధి నీపలు కియ్యకొనఁగఁ

మగునట్లు - 'ఏడుదీవుల నేలు రాజకుమారుఁ'డనుమాట జాడఁగాచంద్రమతీవృత్తాంతమును సూచించినదని భావము. మనసు సయ్యనమగిడించి=మొదటభార్య గాఁదలఁచి పిదప నట్లు తలఁపఁ గాదని మనస్సును త్రిప్పుకొని, గట్టిగానెఱుఁగక =రూఢిగా నన్నియుఁ దెలిసికొనక, పట్టఁట=పట్టియఁట - ఇటనిత్తునకు సంధివిచార్యము, నీకెంతగలిగినను=నీకు ఎంతసంపద యుండినను, మాకు ... మిగులన్ - మాడకంటె నెక్కువగా మాకుఁ బుచ్చుకొనరాదు, నీపేదఱికము నాకుఁ బొత్తె=నీలేమిడితో నాకేమైన సంబంధమా? నీలేమిడిని పాటింపవలసిన యక్కఱ

గాటిపాపని కేల కరుణ నీమీఁద
లే కున్న నాకిచ్చు లెక్కకుఁ జెల్లు
గై కొందు నిమ్ము నీ కట్టినమినుకు'
నావుడు నుల్కి యానాతి చిత్తమున
భావింపఁ దనపతిభ క్తి పెంపునను
బొడగాన రా దన్యపురుషుల కేరి
కొడికమై నామెడ నున్నయీమినుకు
యితఁడె హరిశ్చంద్రుఁ డిఁక నేమి శంక
మతిలోన ననుచు నమ్మానవాధీశుఁ 2190
డున్నదుర్దశకు బిట్టుల్లంబు గలఁగి
తన్నుఁ దా నెఱుఁగక ధరమీఁద వ్రాలి
ధృతి నెట్టకేలకుఁ దెలసి 'హా నాథ
సతతదయాలోల సత్యసంశీల
హా హరిశ్చంద్ర రావయ్య నీ పుత్రు
లోహితాస్యునిఁ బద్మలోచనుఁ జూడు
ముందు నీతొడలపై ముదమున నిద్రఁ
జెందినగతి నేఁడు చిత్తంబు పొక్కఁ
బన్నినచితిమీఁదఁ బడి దీర్ఘనిద్ర
నున్నాఁడు మేల్కొనఁ డొకమరి యైన 2200
నా పుత్రరత్నంబు నా పాటుఁ జూడ

నాకు లేదనుట, కాటిపాపనికి=వల్లెకాటిలోని వానికి, నీపలుకియ్యఁ గొనఁగఁ గాటిపాపనికి నీమీఁదఁ గరుణయేల అనియన్వయము. చెల్లు-చెల్లుగా, మినుకు=తాళి,బొట్టు, నావుడున్=అనఁగా, ఉల్కి=అదిరి, నాతి=స్త్రీ), పొడగాన రాదు=కనుట కలవిగాదు, ఒడికమై=మనోహరమై, బిట్టు=మిక్కిలి, ఉల్లంబు=

నోపక వచ్చి తా నున్నవాఁ డిచటఁ
గాటిలోఁ గానరికన్నుల నున్న
చోట ని న్నిబ్భంగి శోకాబ్ధి ముంపఁ
దలఁచి మ మ్మిటుఁ దెచ్చి దైవంబు నీకుఁ
దెలిపెనే' యనుచు నద్దినకరకులుని
యడుగుల పై వ్రాలి యశ్రువు లురిలి
మడుఁగు గట్టఁగఁ జంద్రమతి విలపించు
'నో సార్వభౌమ నీ వున్నయీమంచ
భాసురరత్నసభామంటపంబె 2210
పటుభూతబేతాళపంక్తులు వీర
భటపరివారకప్రకరంబె నీకుఁ
బెను పొందుచితివహ్నిభీకరశిఖలు
ఘనతరకరదీపికాసహస్రములె
చదలఁ గ్రిక్కిఱిసినశవధూమపుంజ
మది భవత్కేళినీలాతపత్రములె

---

మనస్సు, నా పాటు...నున్న వాఁడిచట=నేను పడుపాట్లను జూడఁజాలక యిచ్చటికి వచ్చియున్నవాఁడు అని యుత్ప్రేక్ష. కానరికన్నుల నున్నచోట=వెలుపలిసంగతు లొక్కటిని దెలిసికొన కుండునట్టి కన్నులతోనున్న యిచ్చోట-వెలుపలజరుగు సుఖదుఃఖములు పాటింప వీలులేక నీవిచ్చటనుండఁగా ననుట. శోకాబ్ధిన్=దుఃఖసముద్రమునందు, మడుఁగుగట్టఁగన్=మడుఁగులుగా ఏర్పడఁగా-వెల్లువలుగా కాఱఁగా ననుట, ప్రకరంబె=సమూహమా, పెనుపు...శిఖలు=వర్ధిల్లుచున్న సొదనిప్పుల భయంకర జ్వాలలు,ఘనతర...సహస్రములె=మిక్కిలి గొప్పవైన వేనవేలు చేదివ్వెలా, చదలన్=ఆకాశమున, క్రిక్కిఱిసిన...పుంజము= దట్టముగా పర్విసపీసుఁగు పొగలసమూహము, భవత్ కేళినీలాతపత్రములే=నీయొక్క విలాసార్థమైన నల్లని గొడుగులా, శూల...జాలం

శూలకీలితనరస్థూలశిరోజ
జాలంబు లాఖేటసమయచామరలై
కరమర్థి నరశిరఃకఠినపాత్రములు
సరసతమంగళాచారకుంభములై 2220
జ్వలనప్రదేశనిజవ్యజనములు
ధళధళ మనుచిత్రతాళవృంతములై
ప్రజతండములు బరాబరి సేయ మత్త
గజములు నీవెంటఁ గదిలి రావేల
నోజతోఁ బడివాగె నొప్పుసాంబ్రాణి
తేజీలు నీవెంటఁ దిగిచి రావేల
వలనొప్ప దండెల వజ్రాలమించు
దొాలఁకాడు చున్నయాందోళిక లేవి
పసిఁడితీఁగల కీలుపంజుల డాలు

---

బులు=శూలమందుఁ గ్రుచ్చఁబడిన మనుష్యుని పెద్దతలవెండ్రుకల సమూహము లు, ఆఖేటసమయ చామరలై=వేటకుఁ బోవునప్పటి చామరములా, నరశిరఃకఠినపాత్రములు=మనుష్యుల తలలనెడి-అనఁగా పుర్రెలనెడి-కటువైన పాత్రములు, జ్వలన ప్రదేశ నిజవ్యజనములు=అగ్గినిమంట పెట్టుచోటనున్న యీవిసనకఱ్ఱలు, చిత్రతాళ వృంతములై=వింతలైన విసనకఱ్ఱలా, ప్రజతండములు=జనసమూహములు, బరాబరిసేయన్=హెచ్చరిక సేయఁగా, పడివాగె=ఎక్కుటకాయిత్తపఱచునపుడు సవరించెడు గుఱ్ఱపుసవరణ, సాంబ్రాణితేజీలు=మేలైన గుఱ్ఱములు, ఇచట 'రావేల మదనిర్ఝరావేల పరిమళలోభలుబ్ధాళి భద్రేభఘటలు। తగవేల చూడఁ గ్రొత్తగ వేలసంఖ్యలై పడివాగెఁ బఱతెంచుప్రౌఢహరులు' అని హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందలి రచనతోడి సామ్యమూహించునది. దండెలన్=అడ్డకొయ్యలందు, వజ్రాలమించు దొలకాఁడు=మగరాలకాంతి ప్రసరించు, అందోళికలు=అందలములు, పసిడితీఁగల = బంగారుజరీతీఁగలయు,

పసనైనముత్యాలపల్లకీ లేవి 2230
యాతేజ మారూప మాభుజాగర్వ
మాతెల్వి యాభాగ్య మారాజసంబు
నెక్కడ నుడివోయె నెక్కడ నడఁగె
నెక్కడఁ దుదమొద లీదురవస్థ
కక్కటా' యని యేడ్చు నతివచిత్తంబు
వ్రక్కఁ గౌఁగిటఁ జేర్చి భూవల్లభుండు
ముప్పిరి గొనుమూర్ఛ మునిఁగి యొక్కింత
తెప్పిఱి ధైర్యంబు దిగజాఱఁ దన్నుఁ
గప్పినపుత్రశోకంబున మునిఁగి
విప్పారుకన్నుల వెస నశ్రు లొలుకఁ 2240
గొడుకురూపంబును గుణవిశేషంబు
నడుపును ముద్దును నగవుఁ దేజంబుఁ
బలుమాఱు నంకించి పలవించువిభునిఁ
దెలుపుచుఁ జంద్రమతీదేవి పలికె
'భానుకులేశ యీపగిది నిద్దఱముఁ
బూని యేడ్చుచు నున్నఁ బొసఁగ దీమీఁద
వివరింపు మిదె ప్రొద్దు వేగుజా మయ్యెఁ
గదిసినచిమ్మచీఁకటి వెల్లఁబాఱె

---

కీలుపంజాల=కీలుగల దివటీలయు, డాలు పసనైన=కాంతి నీటుగులుకునట్టి, ఉడివోయెన్=తీసిపోయెను, 'ఈదురవస్థకు తుద మొదలెక్కడ?' అని యన్వయము, విప్పారుకన్నులన్=విశాలత నిండిన కన్నులందున్=పూర్ణవైశాల్యముగల కన్నులందనుట, అంకించి=పొగడి, వివరింపుము=వివేచింపుము, ప్రొద్దువేగుజాము=సూర్యుఁ డుదయించు సమయము, ఏతేక=రాక, ఏలికసాని=

నినుఁ డుదయాద్రికి నేతేక మున్న
చన కున్న నేలికసానిచేఁ జావు 2250
చెప్ప మే తెఱఁ' గన్నఁ జింతించి తగవు
దప్పక నధిపుఁ డత్తన్వి కిట్లనియెఁ
'జెలువ యీబాలునిఁ జిచ్చునఁ ద్రోయ
వలసిన నేలినవానిలాభంబుఁ
దప్పించి సత్యంబు దప్పి మోమోట
నిప్పని కియ్యకో నేరీతిఁ బొసఁగుఁ
బొసఁగ వీపలుకులు వ్రోయి ని న్నేలు
వసుధామరునిఁ గాంచి వదలక వేఁడి
వలయుమాడయు మఱి వాతిపాతికయు
వలనొప్పఁ గొని రమ్ము వడి నిట' కనినఁ 2260
దనప్రాణనాథుసత్యవ్రతంబునకు
మనమున నలరి యమ్మహిపతికాంత
తనయు నక్కడఁ బెట్టి తగ నప్పగించి
మనుజేశునకు మ్రొక్కి మసలక మరలి
పురవీథి నేఁగునప్పుడు కౌశికుండు
తరలాక్షిఁ జంపింపఁ దలఁచి యాక్షణమె
మొఱకువెంద్రుకలును ముదురు మీసములుఁ
గఱకునల్లనిమేనుఁ గలచోరు నొకనిఁ

దొరసానియైన కలహకంఠిక, చిచ్చునఁ ద్రోయవలసినన్ =నిప్పునందు వేయవలసి యుండినయెడల, ఏలినవాని లాభంబు దప్పించి= నాఏలికయైన వీరబాహునికి వచ్చు వాతిపాతిక మొదలైన యాదాయమును బోఁగొట్టి, ఇయ్యకోన్ =సమ్మతించుటకు, వసుధామరునిన్ =బ్రాహ్మణుని, ధాత్రీతలేశు పడఁతిన్ =రాజు భా

దడయక పుట్టించి ధాత్రీతలేశు
పడఁతిఁ జంపింప నుపాయంబుఁ గఱపి 2270
పోరిఁబోరిఁ 'బ్రాహ్మణ్నఁ బోయి తలాట్కావి
చిర ముండ్ల బంతియు సెలకట్టె కత్తి
బలపంబు భ్రమరాలఁ బట్టినక్రోవి
యొలికి లోపలిభూతి యొగి మైలమందు
కుఱునీలికాసెయుఁ గొంకి నారసము
నొఱపుగాఁ బూని వాఁ డుక్కున నేఁగి
యావారణాసిపురాధీశు నగరు
వావిరిఁ గన్నంబు వడి వేసి చొచ్చి
మిసమిస మనుచుఁ గ్రొమ్మెఱుఁగులు వాఱు
పసిఁడికుండలమేడపై నంద మైన 2280
తూఁగుటుయ్యాలలోనఁ దొలుకారుమెఱుఁగుఁ
దీఁగబాగున నొప్పి దీపించు దాది
చెలువమై మించిన సిబ్బెంపుగబ్బి
వలుఁదపాలిండ్లలో వదనాంబుజంబు
గదియ నిద్రించుచక్కనిరాచపట్టి
కదలక మెదలక కాలున నూఁది

ర్యను, తలాట్కావిచిర=తలయందు కావి చీర, ముండ్లబంతి=ముండ్లుపరుసగాఁగ లచెండు, సెలకట్టె మొదలైనవి దొంగసాధనములు, భ్రమరాల క్రోవి = దీప మార్పెడిపురుగులుగల గొట్టము, ఒలికిలోపలి భూతి=కాలిన పీనుఁగుసొదలోని బూది, మైలమందు = స్త్రీరజఃకృతమై వశీకరణసాధనమగు నౌషధము, తొలుకారు = తొలుకరి కాలము, సిబ్బెంపు గబ్బివలుఁదపాలిండ్లు=సబ్బెములు గలిగి బటువులై విఱివిగల చన్నులు, కదలక మెదలక కాలుననూఁది=కాలుచే

కుదియంగ వెసఁ బట్టి కుత్తుకఁ బిసికి
తోరంపుదివియలతో మాఱు మండు
హారమణీశోభితాభరణములఁ
గళవళం బందక కైకొని పోయి 2290
మలఁగుచు నాచంద్రమతి సనుదెంచు
తెరువున కడ్డంబు దిగ్గన వచ్చి
గరువంబు మీఱఁ దస్కరుఁ డిట్లు లనియె
'నీవేళ నీ వెంట నెవ్వరు లేక
నీవేల నీరీతి నేఁగెద వొంటి
నలుగక చెప్పు తె' మ్మన్నఁ జిత్తమునఁ
గలఁగుచు నిలిచి యక్కమలదళాక్షి
వెగచి యేడ్చుచుఁ దన వృత్తాంతమెల్లఁ
దగఁజెప్పటయు లేనిదయఁ దాల్చి వాఁడు
'నా చెల్లెలవు నీవు నలినదళాక్షి 2300
యీచందమునఁ గుంద నేల కొ'మ్మనుచుఁ
బన్నుగాఁ దనచేతిపసిబిడ్డ తొడవు
లన్నియు ముడిగట్టి యం దిచ్చునంత
దాది మేల్కని రాచతనయునిఁ గాంచి
మదిలోన శోకంబు మానక యపుడు
చనుదెంచి యంతయు జననాథునకును

---

త్రొక్కి పట్టి కదలక మెదలకుండునట్లు చేసి, తోరంపు...భరణములన్ = పెద్ద దీపములతో పాటిగా వెలుఁగుచున్న హారరత్నములను శోభితములైన తక్కిన యాభరణములను, కళవళము=కలవరపాటు, గరువంబు=పెద్దఱికము, వెగచి=వెక్కి, తొడవులు=భూషణములు, కుదియంగన్ =కీడ్వడునట్లుగా, వె

వినిపించినను గడు విస్మయంబంది
కడువేగమునఁ బుత్రుకడకు నేతెంచి
కడకతోఁ దనదు దుఃఖములెల్ల విరియఁ
'గొనకొన వీనిని గుదియంగఁ బట్టి 2310
వనరంగఁ జంపినవాఁ' డెవ్వఁ డనుచు
వల నొప్పఁగాఁ దలవరులఁ బిల్పించి
వెలయ వారలకు నవ్విధ మెఱిఁగింప
మెఱుఁగుఁగైదువులఁ గ్రొమ్మెఱుఁగులు దిశల
నెఱసినచీఁకట్లు నెడలంగ జడియు
కాలకింకరులు బింకపుఁదలవరులు
కోలదివ్వెలవారిఁ గొంచు నవ్వీథిఁ
'బదపదఁ డిదె దొంగపదపంక్తి చొప్ప
వదలకుం' డని వచ్చువారికి మున్నె
'దొంగ నాచేతికి దొరికె మీ రేల 2320
వెంగళులై జాడ వెదకెద' రనుచు
వడిఁ జోరకుఁడు తలవరులలోఁ గలసి
తొడిఁబడఁ గృప మాలి తోయజనేత్రి
వెడకేలు బిగఁ బట్టి వెలుచ నందంద
పిడికిళ్లఁ బొడుచుచు బిట్టు తిట్టుచును
బ్రిదులక గొనిపోయి భీషణుం డనెడి
మొదలితలారిసమ్ముఖమునఁ బెట్టి

---

ఱుఁగు గైదువుల=తళతళలాడు ఆయుధముల, నెఱసిన=నిండిన, ఎడలంగ = తొలఁగిపోవునట్లు, కోలదివ్వెలు=దివ్వటీలు, వెంగళులై = వెట్టివారై, బ్రిదులక =

సూడిద వెట్టి దా నురఁగె నా చోరుఁ
డప్పుడు భీషణుం డాచంద్రమతిని 2330
నిప్పులు గన్నుల నిగుడ నీక్షించి
కోఱమీసము నుల్చి కొని 'తన బారిఁ
బాఱి పొమ్మ నుచు నుద్భటవృత్తి లేచి
జంకించి చేవాలు జళిపించి వ్రేయ
నుంకించి శంకించి 'యువిద వధించు
రట్టు నా కేటికి రాజు ముందరనె
పెట్టెదఁ గా'కని పేరోలగమునఁ
గొడుకుకుఁ బలవించు కొనుమహీపాలు
కడ నిల్పి నవరత్నకాంతుల మించు
తొంగలించెడుబాలుతొడవులమూట 2340
ముంగల నిడిన 'హా ముద్దులపట్టి
హా కుమారక' యంచు నట వతుమందు
దాకొన నొత్తి నేత్రముల నం దం ద
తొరుఁగునశ్రులఁ దొప్పదోఁగి శోకాగ్ని
నెరియుచు విలపించు చెట్టకేలకును
గొంత ధైర్యము దెచ్చుకొని హరిశ్చంద్రుఁడు
కాంతాశిరోమణిఁ గనుఁగొని పలికెఁ

---

తప్పించుకొననట్లు, మచ్చుంబుగా=గుఱుతుగా, సూడిద=కానుక, సురఁగె=మఱుఁగయ్యెను. నుల్చికొని= మెలిఁబెట్టికొని, తనబారిఁబాఱి పొమ్ము=నాదానుండి పరుగెత్తిపొమ్ము, నవరత్నకాంతులమించు = నవరత్నముల కాంతులయొక్క ప్రకాశము, తొంగలించెడు = ప్రకాశించెడు, తొడవులమూట = సొమ్ములమూట, దాకొనన్ = కదియునట్లు, దొడికి = తెగించి, అతివలు = స్త్రీలు,

గటకటా నిన్ను నెక్కడి దురాత్మకుఁడు
'కుటిలుఁడై యిటు సేయఁ గోరి పుత్తెంచెఁ
దొడవులకై తెంపుతోఁ బ్రాణములకు 2350
దొడికి ముద్దులపట్టిఁ దునుమ నేమిటికి
నను వేఁడుకొనిన నింతకు మేలిమైన
వినుతభూషణములు వెలఁది నీ కిడనె
సుకుమారు నత్యంతసుందరాకారు
నకట చంపఁగఁ జేతు లాడెనే నీకుఁ
బురుషులకంటెను నెప్పుడు నాఱుగుణము
లరయ సాహస మెక్కు డతివల కనిన
యమరిననీతివాక్యము నిజ మయ్యె
రమణిరో దానవురాలవు గాక'
యని చాలఁ గోపించి యప్పు డారాజు 2360
'ననుమానమే ల సయ్యాన ధర్మమెన్న
దీనితోఁ భాషింప దీనిఁ గన్గొనిన
నూనుఁ బాతక'మ ని యుర్వీశుఁ డాత్మ
నంతంత నడరుశోకావేశమునను
వింతగా 'భీషణ విను' మని పలికెఁ
బడఁతుక నా కన్నపట్టిపాదముల
కడ నిల్పి యీబాలఘాతుకిశిరము
వెసఁ ద్రుంపు మని చెప్పు వీరబాహునకు

---

దానవురాలవు = రాక్షసివి, ధర్మమెన్న... పాతకము = ధర్మము నాలోచింపఁగా నిట్టిఘాతుకితో మాటాడుటయు దీనిని గన్నెత్తిచూచుటయు నే పాతకముగావచ్చును, నాకన్నపట్టి= నేనుగన్నట్టి బిడ్డనియొక్క, 'యుమ్మరంబుగ వగ

మసలకు మిదియె ముమ్మాటికి సెలవు
పొమ్మన్న నప్పు డాభూపాలు దేవి 2370
'ముమ్మరంబుగ మది ముప్పిరి గొనఁగ
వగపు లన్నియుఁ బాయ వరమి చ్చె దైవ
మగలనేటికిఁ జావు' కని తలపోసి
తల వాంచి తనకల్లఁదనము దీపింప
నిలిచి యూరక యుండె నేల వ్రాయుచును
పొఁడిగా నత్తఱి భువనముల్ పొగడ
నేఁడు హరిశ్చంద్రనృప శేఖరుండు
శ్రీకరనిజరాజ్యసింహాసనంబు
నీక్రియ విలసిల్ల నెక్కె నన్నట్లు
లాలితనిజమండలస్ఫూర్తి మెఱయ 2380
బాలభానుఁడు తూర్పుపర్వతం బెక్కె
నంత నాభీషణుఁ డనుతలారియును
బంత మేర్పడఁగ నాభానుకులేశు
కాంతఁ దోడ్కొని పోవఁగా రాజవీథి
నంతంత డగ్గఱి యాపౌరసతులు
గమి గూడి చూచి యక్కట దాది చన్ను
నిముక నేరనిచిన్ని నెత్తురుఁగందు
బంగారువంటిపాపని మెడఁ బిసికి

---

పులన్నియు మది ముప్పిరిగొనఁగఁ బాయ దైవమువరమిచ్చె' నని యన్వయము. అగలనేటికి = చింతింప నేల, దీపింపన్ = ప్రకాశించునట్లుగా. ఈక్రియ = ఈవిధము, లాలిత ... స్ఫూర్తి = మనోజ్ఞమైన తనబింబముయొక్క తోఁపిక. దాది ... నెత్తురుఁగందు = దాదిచంటిలో నిముడ నేరనంత చిన్నిజొత్తుపాప, బిడ్డ.

క్రింగ నెచ్చటనుండి మృత్యువై వచ్చె
నాఁడుదొంగలు దఱుచైరి యీ భువిని 2390
ఖోఁడిగా బిడ్డలఁ బొరుగిండ్ల నుంచి
నిదుర వోవఁగఁ బాసె నేఁటితో మనకు
నిది మహాపద పుట్టె నీపట్టణమున
వదలక నిటువంటివారికి నెల్ల
బెదరుగా దీనిఁ జంపినఁగాని పిదప
ధాక గా'దనువారు 'తగ దాఁటదాని
నేకల్ల సేసిన నిటు పట్టి చంప
నొలికి ద్రిప్పుడు మేను నొకచోటు గోసి
తలఁగి పొమ్మందురు తనభూమి వెడలి
యీలోకకల్యాణి కీమానవతికి 2400
నేలీల నీనింద యొసఁగెనో కాని
పరికించి చూడ నేపట్టుననైనఁ
బరమాణువంత పాపము గాన మెన్నఁ
డులుకుచు దొంగ దా నొకచోట నుండు
నొలయ నవిశ్వాస మొకచోట నుండు
నాఁటదానికి వశమమ్మ యీమేటి

నేఁటితో మనకు = బిడ్డలను పొరుగిండ్లకేని పంపినను వారచట నెమ్మదిగానుం దురనునమ్మికతో నిదురపోవుటమనకు నేఁటితో తీఱెననిభావము-పొరుగిండ్లకుం గూడఁబంపరాదయ్యె ననిభావము. ధాక = భయము-హద్దు, ఆఁటదానిఁ = ఆడుఁదానిని, ఒలికి ద్రిప్పుచుఁ = పీనుఁగునుజంపి ద్రిప్పఁగా, మేనునొకచోటఁగోసి = దేహములో ఏదేనొకభాగమునుగోసి, ఉలుకుచు...నుండు = దొంగయులుకుచు తానగపడక యొకచోటనుండును. అపనమ్మకము దొంగకానట్టి మఱొకచోరి

కోటలు దాఁటి యాగోడలు దాఁటి
తాళంబు లెడలించి తలుపులు దెఱచి
కేళిమై రొప్పుజాగిలముల మొఱఁగి
దాది వాకట్టి భూతలనాథుపట్టి 2410
నాదట నీరీతి నట్టొత్తి చంప
నూహింప నెవ్వఁడో యొకకన్నగాఁడు
సాహసంబునఁ బోయి చంపి యాతొడవు
లను వెంటఁ గొనిపోవ నంత నారెకులు
తను గూడ ముట్టినఁ దరలాక్షిమీఁదఁ
జొప్పు పుట్టంగ నాసొమ్ములు వైచి
తప్పించుకొని పోయెఁ దనప్రాణభీతి
నేరము దనమీఁద నెరసిన లజ్జఁ
గూరి భూపాలునికొలువులోపలను
నిలిచి భాషింపఁగ నేరక చావు 2420
కలుగక చనుచున్న' దనువారు గొంద
'ఱిది బాలఘాతుకి యెద నెన్ని చూడ
నిది వధూవధ దీన నెట్లాడ నెట్లొ

---

యందుండును, ఎడలించి = ఊడునట్లు చేసి, జాగిలములు = వేఁటకుక్కలు, మొఱఁగి = ఏమఱించి, ఆదటన్ = ఆసక్తితో, అట్టొత్తి = మెడఁబట్టి, ఆరెకులు = తలారులు, కూడ ముట్టినన్ = కూడునట్లువచ్చి పైకొనఁగా, చొప్పుపుట్టంగన్ = దొంగజాడకలుగునట్లు, నెరసినన్ = వ్యాపింపఁగా - మోపంబడఁగాననుట, లజ్జఁగూరి = సిగ్గునొంది, ఇది... నెట్లొ = ఒకప్రక్క చూడఁగా, నిది బాలఘాతుకిగాన వధింపఁదగును. మఱియొకదృష్టినిజూడఁగా ఇది స్త్రీగాన స్త్రీవధముదగదు. కనుక తగును తగదు అని ఎట్లుచెప్పితే నేమివచ్చునో మనకీ

దోష మేవెంటను దొడరునో చనదు
దూషింప భూషింపఁ దుది నెంతవట్టు
తప్పను నొప్పను దైవ మెఱుంగు
నొప్ప నూరక చూచుచుం'టనువారు
పలువు రీరీతిని బలుచందములను
బలుకంగ నావీరబాహునికడకు
వదలక కొనిపోయి వసుధీశుఁ డాత్మ       2430
జెదరక మును మూడు సెలవులు నొసఁగి
యీన తిచ్చినచందమంతయుఁ దెలియ
వానికిఁ జెప్పి యవ్వనజాక్షి నపుడు
బెడిదంపు బావురుఁబిల్లివాతికిని
ద్రొడిఁబడ రాచిల్కఁ ద్రోయుచందమునఁ
దగ నప్పనము సేసి తలవరుల్ దాను
మగిడి భీషణుఁ డేఁగె మనుజేశుఁ గొలువ
వీరబాహుండును విభునాజ్ఞ సేయఁ
గోరి చయ్యన నతిక్రూరవర్తనులఁ
గ్రొవ్వాఁడిమృత్యువుకోఱలు వ్రాలె       2440

---

జోలియేల, దోష మే ... దొడరునో= ఎట్లు చెప్పి తేదోషము గూడవచ్చునో, చనదు దూషింపభూషింపక్ =దూషించుటయు భూషించుటయు రెండును ఒప్పదు. తుది ... మెఱుఁగు=కడపటనీవిషయమున తప్పెంతమాత్రమో ఒప్పెంతమాత్రమోదైవమే యెఱుఁగును. ఒప్పనూరక చూచుచుంట=ఊరక చూచుచు మాత్రముండుటయేతగును. మూఁడు సెలవులునొసఁగి=ముమ్మాటికిఆజ్ఞ చేసి, అప్పనముచేసి =అప్పగించి, అతిక్రూరవర్తనులక్ =మిక్కిలిక్రూర మైన నడవడిగలవారిని, క్రొవ్వాఁడిమృత్యువుకోఱలు=మిక్కిలివాఁడియైనమృత్యువుయొక్క కోఱపండ్లు, మ

మవ్వంపుమెఱుఁగులమాడ్కి మేలైన
బిత్తరంబులు సిమ్ముబెడిదంపువాలుఁ
గత్తులు గలభయంకరులఁ గింకరుల
వీక్షించి 'మీరెల్ల వెసఁ బ్రేతభూమి
కక్షీణగతి నేఁగి యచ్చోట నున్న
వీరదాసునెఱవీరుని చేతి
కీరమణీమణి నిచ్చి చంపింపుఁ'
డనుటయు వార లయ్యతివఁ దోడ్కొనుచుఁ
జని వీరదాసునిసన్నిధి నిలిపి
పతియానతియు వీరబాహునిపంపు 2450
నతిచిత్రముగఁ జెప్ప నది విని యలికి
వెఱఁగంది 'బాపురే విధిచేతఁ గడువ
నెఱవాదు లెవ్వరు నిఖిలలోకముల
నేటితోఁ గడముట్టెనే కౌశికుండు
గాటంబుగా సల్పుకపటనాటకము
వెఱచినవానిని వెన్నిచ్చి యోడి

---

వ్వంపుమెఱుఁగులు=లేఁత మెఱపుఁదీఁగలు. ఈరెండును బెడిదంపువాలుఁగత్తులకు విశేషణములు, వాలుగత్తులుబెడిదములగుటకు క్రొవ్వాడిమ్మత్త్యుపుకోఱలునుబిత్తరములుచిమ్ముటకు మవ్వంపుమెఱుఁగులును ఉపమానములు, బిత్తరములు=బెళబెళకాంతులు, బెడిదంపు=భయంకరమైన, అక్షీణగతిన్ = కొఱవడనినడతో - వేగముగా నడచి, విధిచేతన్ = దైవకృత్యమును, కడవన్ = అతిక్రమించుటకు, నెఱవాదులు= నేర్పరులు, కడముట్టెనే=ముగింపునొందినదా. గాటముగాన్ =కఠినముగా, కపటనాటకము=బూటకములుపన్ని యాడించునాట- నేఁటితో ముగింపు నొందెనాయనుట, చంద్రమతి వధింపఁబడనున్నది గనుక వధించుటతో

పఱచినవానిని భయమునఁ బూరి
గఱచినవానినిఁ గైదువుఁ బూన
మఱచినవానిని మఱిదిక్కు లేక
మఱుఁగుఁ జొచ్చినవాని మదిలోనఁ గరుణ 2460
నెఱయఁ బ్రోచుట నాకు నియమవ్రతంబు
పరికింప నిట్టిచో బడలినయబలఁ
దెరలక ఘోరాసిఁ దెగవ్రేయు మనుచు
నాకడ కంపించినాఁడు నా స్వామి
నా కేల వగ పన్న నా కేలు సాఁగ
దీకీడుఁ గావింప నిది తప్పుత్రోవ
యే క్రియ గల దింక నేమి సేయుదును
సుతుని దుర్మృతికి నేడ్చుచు మఱి కూర్మి
సతిఁ గృపాణాహతిఁ జంపఁ బాలయ్యె'
నని యశ్రు లొలుక మోము వంచి యున్న 2470
మనుజేశునకుఁ జంద్రమతి యిట్టు లనియె
'నినకులాధీశ నీవెఱుఁగనియట్టి

---

విశ్వామిత్రునిబూటకములన్నియుఁ దీఱిపోవుననిభావము. పూరిగఱచినవానిని= కసవునోటఁబెట్టుకొన్నవానిని, కైదువుఁ బూనన్ = ఆయుధమునుదాల్చుటకు, పరికింపన్ = విచారింపఁగా, బడలినయబలన్ = అలసియున్నస్త్రీని, అలయకయున్నపురుషునే శరణుఁజొచ్చినచోఁ బ్రోవవలసియుండఁగా అలసినస్త్రీని కత్తితోనఱకుట యెట్లుఅనిభావము, నాకడకు అన్నన్ =నాయేలిక నాచెంతకుఁ జంపుమనిపంపినాఁడుగాని నేనె చంపఁదీసికొనిరాలేదు కాఁబట్టినాకుదీనినిగుఱించి విచారమెందుకు అన్నచో, నాకేలు సాఁగ దీకీడుఁగావింపన్ = ఈచెఱుపుసుజేయుటకు నాచేయి నిగుడఁజాలదు.ఇది తప్పుత్రోవ=నాచేయి సాగకుండుటయు తప్పుమార్గము, కృపాణాహతిన్ = కత్తివాటున, పా

వినుతధర్మంబులు వేఱొండు గలవె
మున్ను స్వామిద్రోహి మోవ లే ననుచుఁ
బన్నగతల్పుతోఁ బలికె భూదేవి
తన్ను మోచినచోటఁ దగ వట్టె పెట్టి
మిన్నక నురిఁగిన మెత్తురే జనులు
నీపురీశ్వరుఁడు ని న్నేలినసామి
యీపని విధియించె నిది గాక నాకు
రూఢిగా రాకుమారునిఁ జంపె ననెడి 2480
యాడిక తలగూడె యభిమాన మెడలె
నటు గాన ననుఁ జంప నర్హ మీవేళ
కటకటా నీవేల కరుణఁ దాల్చెదవు
తక్కనినీచవర్తనులచేఁ జావ
కిక్కడ నాజీవితేశుఁడ వైన
నీచరణంబులు నెమ్మితోఁ గొల్చి
నీచేత మృతిఁ బొంది నీపొందు మీఁద
నే పొందఁగాఁ గంటి నెట్టిసౌఖ్యంబు
లీపొందు రా వింక నెడ సేయనేల

---

లయ్యెన్ = పాలుపడవలసి వచ్చెను, పన్నగతల్పుతోన్ = శేషుఁడు సెజ్జగాఁగల విష్ణునితో, తన్ను మోచినచోట = తన్ను పోషించి భరించునట్టిస్వామియెడల౹ తగవు అట్టె పెట్టి మిన్నకసురిఁగినన్ = ధర్మమును జేయక యట్లె దిగవిడిచి యూరక మఱుఁగుపడినయెడల, రూఢిగాన్ = గట్టిగా, ఆడిక = నింద, తలగూడెన్ = సంభవించెను, అభిమానమెడలె = గౌరవము తీసిపోయెను, నిందపాలై గౌరవము గోలుపోయియున్న నేను బ్రతుకుట యుక్తముగాదు గాన నన్నుఁజంపుట యుక్తము, మీఁదన్ = ఉత్తరకాలమందు - లేక పరలోకమందు - లేక జన్మాంతరమ

నరులును మునులుఁ గిన్నరులును సురలు 2490
నరుదంది యిందును నందును బొగడఁ
దలఁ దెంపు'మని తెంపు దలకొనఁ బలికి
జలజాక్షి తనచీర చక్క నమర్చి
ప్రాణేశు వలగొని పదముల కెరగి
పాణిపల్లవములు భక్తితో మొగిచి
యనుదినరక్తపంకారుణం బగుచుఁ
గనుపట్టి జేవురుగట్టుచందమున
నున్న యా వధ్యశిలోపరిస్థలిని
జెన్నారి చిఱునవ్వు సెలవిఁ దళ్కొత్తఁ
బద్మాసనంబునఁ బడఁతి గూర్చుండి 2500
పద్మినీవల్లభుపైఁ జూడ్కి నిలిపి
'లోకలోచన సర్వలోకైకవంద్య
నాకు వేవేల జన్మంబులయందు
సతతపుణ్యుని హరిశ్చంద్రభూవిభునిఁ
బతిగా నొనర్పు మీపార్థివేశ్వరుని
యాపద లన్నియు నడఁచి సత్యంబు
దీపింపఁ జేయు మీ తెఱఁగున'ననుచు
వినయంబు నెక్కొన వేఁడి చిత్తంబు
తనపతిపైఁ జేర్చి తలఁ పొందు లేక

---

దు, తెంపుదలకొనక్ = సాహసము పుట్టఁగా, అనుదిన రక్తపంకారుణము=ప్రతిదినమును నెత్తురు రొంపిచేత నెఱ్ఱనైనది, జేవురుగట్టు=ఎఱ్ఱనికొండ, సెలవి=పెదవిమూల, పద్మినీవల్లభుపైక్ = సూర్యునిపై, నెక్కొనక్ = మీఱఁగా, బంధ

నున్నంత బంధంబు లూడ్చిపో వైచి 2510
యన్న రేంద్రుఁడు జగదాశ్చర్య మెసఁగు
బహుసరిత్సాగరపర్వతద్వీప
మహితమహామహీమండలభార
మురుతరలీలఁ గేయూర విభాతి
భరియించునపసవ్యబాహుదండమున
సకలవిరోధిరాజన్యకోటీర
నికరకీలితమణినికషణదీప్త
శాతధారాభీలచటులఖడ్గంబు
భూతముల్ భీతిల్ల ముష్టి నమర్చి
చండమార్తాండదుస్సహదుర్నిరీక్ష 2520
మండలప్రభలతో మార్కొని మండు
మెఱుఁగు లుగ్రంబుగా మిన్నులఁ బర్వ
నోర వాయఁ బెఱికి మహోగ్రతఁ బూని

---

ములు=క్షేమాద్యనుబంధములు, ఊడ్చిపోవైచి=బొత్తిగాఁ దొలఁగించుకొని, బహు...భారము-బహు = అనేకములైన, సరిత్=నదులచేతను, సాగర=సముద్రములచేతను, పర్వత=కొండలచేతను, ద్వీప=ద్వీపములచేతను, మహిత=పెద్దదైన, మహామహీ మండలభారము=గొప్ప భూమండలముయొక్క బరువు, కేయూరవిభాతి=బాహుపురి లీలగా, భరియించు=తాల్చునట్టి, అపసవ్య బాహుదండమునన్=దక్షిణ భుజాదండమునందు, సకల...ఖడ్గంబు=సమస్త శత్రురాజుల బాహుపురుల సమూహములందు పొదుఁగబడిన రత్నములతో నొఱపెట్టుటవలన మెఱుఁగెక్కిన వాఁడివాదరచే భయంకరమైన పెనుగత్తి, చండ...ప్రభలతో=ప్రచండమైన సూర్యునియొక్క సహింపశక్యము కానట్టియుఁ దేఱిచూడరానట్టియు బింబముయొక్క కాంతులతో, మార్కొని=ఎదిరించి, మండు

జళిపించి జీవితేశ్వరి మెడ మోపి
కలఁగక తెగ వ్రేయ గమకించునంతఁ
గ్రమ్మఱ నెడ సొచ్చి ఖడ్గంబుఁ బట్టి
యమ్మనుజేశుతో ననియెఁ గౌశికుఁడు
'చాలు నోహో యిట్టి సాహసకృత్య
మేల కైకొంటి నరేశ్వర నిన్ను
వీక్షింప దోషంబు వివరింప మనుజ 2530
రాక్షసుండవు గాక రాజవా నీవు
వ్రాలువైరులమీఁద వాలునీవాలు
వాలుఁ గంటులఁ ద్రుంప వాఁడె యీ వాలు
భామలఁ జంపఁ బాపము లే దటంచు
నేమించెనే మున్ను నిను వసిష్ఠుండు
క్రమమున ధర్మార్థకామమోక్షములు
నమర నీకీఁ దగునట్టియీసాధ్వి
జననుతసౌందర్యసంశోభితాంగి
నినుపముల్కికి నేల యీఁ దలంచెదవు
భువనవిఖ్యాత మై పొలుపొందునట్టి 2540
రవివంశమునఁ బుట్టి రాజసం బుడిగి
బతిమాలి వెనుమాలబంట వై నీచు

---

మెఱుఁగులు=జ్వలించుచున్న కాంతులు, నిన్ను వీక్షింప దోషంబు=నిన్నుఁ జూచుటయే పాపము, మనుజరాక్షసుఁడవు=మనుష్యరూపమున నున్నట్టి రాక్షసివి, వ్రాలువైరులమీఁదన్=అతిశయించుచున్న శత్రువులపై, వాలునీవాలు=వ్రాలునట్టి నీకత్తి, వాలుఁగంటులన్=స్త్రీలను, ఇనుపముల్కికి=కత్తి యినుపసలాకునకు, రవివంశము=సూర్యవంశము, నందనున్=కొడుకును, నాతిన్=

గతిఁ గాదు గాచుసీకష్టంబు దగునె
కులసతితలఁ దెగఁగొట్టి యేలోక
ముల కేఁగి సౌఖ్యంబుఁ బొందఁ జూచెదవు
యాలికై దక్షుని నడఁపఁడే శివుఁడు
పోలింప నీకంటె బుద్ధిహీనుండె
సతి లేనిగృహ మేల సౌఖ్యంబు లేల
సతి లేనిసుతు లేల సంపద లేల
సతియుఁ గల్గినఁ గల్గు సకలధర్మములు 2550
సతియుఁ గల్గినఁ గల్గు సకలపుణ్యములు
సతి గల్గినను గల్గు సత్పుత్రచయము
సతి గల్గినను గల్గు సద్గతిత్రోవ
యటు గాన విడువు మీయాగ్రహబుద్ధిఁ
గటకటా నీ వివేకం బెందుఁ బోయె
నాబుద్ధి వినక నందనుఁ జంపుకొంటి
నాబుద్ధి వినక నీ నాతి నమ్మితివి
మాను మీగుణ మన్న మానక దురభి
మానంబె పెంచెదు మానవాధీశ
నామాటఁ గైకొని నాకొమారితల 2560
నామాలమగువల నర్థి వరింపు
నీ సుతుప్రాణంబు నీరాజ్యసుఖము
నీ సతితోఁ బొందు నీ తొంటిపెంపుఁ
బడయు మీ వింక నీపదును దప్పినను
గడపట నీవు తెక్కలిఁ జత్తు' వనుచుఁ

---

స్త్రీని, పదును=సమయము, తెక్కలిక్=వంచనచే, భవసాగరంబుక్=సంసార

బెక్కు చందమ్ములఁ బ్రియమును భయము
నెక్క బోధించుమునీంద్రునిఁ జూచి
పకపక నవ్వి 'యీభవసాగరంబు
నొకదరిఁ జేర్చుచు నున్నాఁడు శివుఁడె
యితరునివలె నది యిది యని కాని
గతులు నీచేతఁ దార్కాణింపఁబడెడు
రాసి నీకెదు రుత్తరంబులు వల్క
నాసరోజాక్షుండు నలుకు నేనెంత
మును నీవు చెప్పినబుద్ధులె కాక
వినఁ గ్రొత్త లేడివి వివరించి చూడ
వీరబాహునిమది విశ్వాస మొదవఁ
గోరి నేఁ జేసిన ఘోరప్రతిజ్ఞ
మఱచి సత్యము మట్టుపఱిచి లోలోన
జరిగి పోనిత్తునె స్వామికార్యంబు
సుతు నొల్ల సతి నొల్ల సురలోక మొల్ల
బతిమాలి నీ విచ్చుపడఁతుల నొల్ల
సత్యంబు గలిగినఁ జాలు వేయేల
సత్యమే జయ మని చాటు వేదములు
విడువు ఖడ్గం బింక వేంచేయు మిట్టి
యెడ నుండఁ జనదు మునీశ నీ వింక' 2570

---

సముద్రముయొక్క, ఒకదరిన్=ఒకగట్టును, ఇతరునివలె=సామాన్యుఁడైన యొక నివలె, ఇదియదియని కానిగతులు నీచేతఁ దార్కాణింపఁబడెడు =ఇదిమంచిది అది చెడ్డది యని సరికానట్టి పద్ధతులు నీవు సూచించుచున్నావు, రాసిన్ = తెగువతో, సరోజాక్షుఁడు=విష్ణువు, పొంకంబు చెడి=పసగుంది, ఉవిదలు=స్త్రీలు,

నావుడు వెఱఁగంది నరలోకనాథు
పావనసత్యసంపద కాత్త నలరి
బొంకించునాసలఁ బో వీడి మాని
పొంకంబు చెడి తలపోయుచు నుండె
నప్పుడు దేవత లంబరవీథి 2590
నుప్పొంగువేడ్కల నువిదలుఁ దారు
బహురత్నదీప్తుల భాసిలుచున్న
మహనీయదివ్యవిమానంబు లెక్కి
వెఱఁగంది క్రందుగా వీక్షించుచుండ
నెఱదెంపుమై ధారుణీతలేశ్వరుఁడు
భిదురంబుకంటెను బెడిదమై చదల
నదరులు సెదర భయంకరలీల
వాలువా లెత్తి యా వామాక్షికంఠ
నాళంబు తెగ వేయ నది కలుక్కనఁగఁ
దాఁకినవ్రేటు పూ దండయై చెన్నుఁ 2600
గైకొని పూబోఁడిగళమున నున్నఁ
దల యూఁచి సతిఁ జూచి తనకేలునెత్తి
ధళధళ మనుఖడ్గధార వీక్షించి
'దాటె దప్పెనో కాక ధవళాక్షి కిప్పు

---

క్రందుగాన్ = గుంపులుగొని, భిదురంబు కంటెను = వజ్రాయుధముకంటెను, బెడిదమై = భయంకరమై, చదలన్ = ఆకాశమునందు, అదరులు = మిడుంగురులు, వాలువాలు = అతిశయించుచున్న కత్తి, కంఠనాళంబు = గొంతుక్రోవి, కలుక్కనఁగ...దండయై = కలుక్కని తగిలినదెబ్బ పూదండగా మాఱినదై, చెన్నుగైకొని = అందమునొంది, గళమునన్ = మెడయందు, ఈతోయము = ఈసారి, అసివో

డీరీతి కౌశికునింద్రజాలంబొ
వా తప్పితినొ చేతివడి దప్పి చనెనొ
చూత మీతో యమీచోద్య మీలీల
నని పోవ వచ్చునాయసి పోక' యనుచు
వెసఁ బూన్చి మఱియును వ్రేయఁ జూచుటయు
శ్రీవిశ్వనాథుఁ డాశ్రితపారిజాతుఁ 2610
డావేళఁ గరుణ నిండారుచిత్తమున
వడి గొని మూఁడుత్రోవలఁ బాఱునేఱు
తొడరి కెంజెడలలోఁ దుంపురుల్ గురియఁ
జెన్నుగా నొదలఁ జేరినమించు
క్రొన్నెలతళ్కు చకోరాళిఁ బిలువ
నుఱక పువ్వులవిల్తు నొకజుట్టఁ గొన్న
చుఱుకుచూపులకన్ను చోద్యమై మెఱయఁ
దనర నేనుఁగుమోముతనయునిఁ గన్న
వనజాక్షి డాపలివంక శోభిల్ల
మేలి మువ్వన్నెలమెకము మైతోలు 2620
చేల గట్టినకాసెచెఱఁగు దూలాడఁ
బోఁడిగా మెఱుఁగులపోల్కి దీపించు
మూఁడుముల్కులవాలు ముష్టిచే నమర

---

పవచ్చు నాయసిపోక = నాకత్తిహాటు వ్యర్థముకావచ్చునా, మూఁడుత్రోవలఁ బాఱునేఱు = త్రిపథగ - గంగ, మించుక్రొన్నెలతళ్కు = ప్రకాశము గల్లేత చందురునిరేక, ఒకజుట్టఁ = ఒక్కపీల్పుగా, చుఱుకుచూపుల కన్ను = అగ్నినేత్రము, ఏనుఁగుమోము తనయుని గన్నవనజాక్షి = విఘ్నేశ్వరునిఁ గన్నట్టి పార్వతి, డాపలివంకక్ = ఎడమప్రక్క, మేలి మువ్వన్నెల మెకముమైతోలుచేల = మేలైన జింకమేనితోలనెడి వస్త్రము, మూఁడు ముల్కులవా

వెస ఖణిల్లున అంకె వేసి కుప్పించు
బసవరాయని నెక్కి పార్శ్వభాగమునఁ
బాలును నీరు నేర్పఱచువాహనపు
వేలుపు డగ్గఱి వింజామ రిడఁగఁ
దివిరి నెమ్మదిఁ దూర్పుదెస నేలురాజు
ధవళాతపత్త్రంబు ధరియించి నడువ
ముట్టి వేల్పులఁ గొట్టి మొనసినబిరుదు 2630
పట్టెంబువీరుండు పడవాలు గాఁగఁ
గిన్నరగంధర్వగీర్వాణయక్ష
పన్నగవరులును బ్రమథులుఁ గొలువ
శుక కుంభసంభవ సుబల కణ్వాది
సకలసన్మునిగణసంస్తుతు లెసఁగ
ననుపమభూతిలిప్తావదాతాంగ
జనిత నిర్మలకాంతిచంద్రికవలన
నయ మార నఖిలవిజ్ఞానివిశాల
నయనోత్పలముల కానంద మెసంగఁ
బరమయోగీంద్రులు భావంబునందుఁ 2640
బరికించి కానని పరమాత్మమూర్తి
యావేళఁ దనకుఁ బ్రత్యక్షమై 'సైఁచు

---

ఱ = త్రిశూలము, బసవరాయనిన్ = వృషభరాజును - నందిని, పాలు...నువేలుపు = హంసవాహనుఁడైన బ్రహ్మ, తూర్పుదెస నేలురాజు = ఇంద్రుడు. బిరుదు పట్టెంబు వీరుఁడు = గొప్ప కత్తినిదాల్చిన వీరుఁడైన కుమారుఁడు, పడవాలు = సేనాపతి, అనుపమ...చంద్రిక వలనన్ = సాటిలేని బూదిచే పూయఁబడిన తెల్లని యవయవములవలనఁ బుట్టిన యచ్ఛమైన కాంతియను వెన్నెలవలన, అఖిల...త్పలములకున్ = సమస్తజ్ఞానుల విశాలములైన నేత్రముల

భూవర' యనిన నద్భుతముఁ దత్తఱము
భయము సంభ్రమమును భక్తియు నయముఁ
బ్రియమును బెనఁగొనఁ బెల్లుగా మేనఁ
బులకలు గొబ్బునఁ బొడమ నానంద
కలితాశ్రుకణములు గన్నులఁ దొరుఁగ
నవనిఁ జాఁగిలి మ్రొక్కి యడుగుల కెరఁగి
సవినయంబునఁ గరజలజముల్ మొగిచి
'కాలకంధర లయకాలాగ్నిరుద్ర 2650
కాలసంహార మహాకాళీనివాస
వాసుదేవప్రియ వాసుకివలయ
వాసవార్చిత కృత్తివాస మహేశ
నాగశోభితహస్త నాగాసురారి
నాగనాగాంతక నాగేంద్రవంద్య
కమలాసనస్తుత్య కమలాప్తనేత్ర
కమలారి సురసరిత్కమలకపర్ది

---

నెడి కలువలకు, సైఁచుభూవర=తాళురాజా, కాలకంధర=నల్లని కంఠముగలవాఁడా, లయ...రుద్ర=ప్రళయకాలాగ్నివలెరౌద్రుఁడైనవాఁడా, కాలసంహార=యముని నిగ్రహించినవాఁడా, మహాకాళీనివాస=పార్వతికాటపట్టయినవాఁడా, వాసుదేవప్రియ=విష్ణువునకుప్రియుఁడైనవాఁడా, వాసుకివలయ = వాసుకి కడియముగాఁగలవాఁడా, వాసవార్చిత = ఇంద్రునిచేతఁ బూజింపబడినవాఁడా, నాగశోభితహస్త= జింకతోలుచేనొప్పుచున్న చేయిగలవాఁడా, నాగాసురారి = గజాసురునకు శత్రువైనవాఁడా, నాగనాగాంతక= గజాసురాంతక, నాగేంద్రవంద్య= ఆదిశేషునికి వందింపఁదగినవాఁడా, కమలాసనస్తుత్య = బ్రహ్మకుస్తోత్రము సేయఁదగినవాఁడా, కమలాప్తనేత్ర=సూర్యుఁడు కన్నుగాఁ గలవాఁడా, కమలా...కపర్ది = చంద్రుఁడు గంగానదితామరలునుగల జ

గిరిశరాసన రౌప్యగిరిశృంగనిలయ
గిరికన్యకాప్రియ గిరిభేది జనక
వేదమస్తకముల వెలయునీదివ్య 2660
పాదపద్మములు నాఫాలంబు సోఁక
నరయఁ గృతార్థుండ నైతి లోకముల
దురితంబు లన్నియుఁ దొలఁగింపఁగంటి'
నని పెక్కుభంగుల నభినుతి సేయ
జననాథువలనఁ బ్రసన్నుఁడై శివుఁడు
'రాజేంద్ర నీవంటిరాజు నాయేలు
నీజగంబులలోన నెవ్వఁడు లేఁడు
మేలు నీసత్యంబు మేలు నీతెంపు
మేలు నీ ధైర్యంబు మెచ్చితి నడుగు
వరములే మిటి వేఁడు వలసిన'వ నుచుఁ 2670
గరమున మే నంటి గారవం బమరఁ
గలకంఠములచాయ గల దనగూర్మి
కలకంఠివంకకై కడకంటిచూపు
నిగిడించుటయు సిగ్గు నెక్కొని విభుఁడు

---

టాజూటముగలవాఁడా, గిరిశరాసన = కొండయే విల్లుగాఁగలవాఁడా, రౌప్యగిరిశృంగనిలయ=కైలాసశిఖరము వాసస్థానముగాఁగలవాఁడా, గిరికన్యకాప్రియ=పార్వతికివల్లభుఁడైనవాఁడా, గిరిభేదిజనక = క్రౌంచపర్వతమును భేదించిన కుమారునికి తండ్రియైనవాఁడా, వేదమస్తకముల్ = వేదశిరస్సులగు ఉపనిషత్తులందు, దురితములు= = పాపములు, కలకంఠ...వంకకై = కోకిలములవన్నెగల తన గారాబుపడఁతి దెసకై -నల్లనిచాయగల గౌరిదిక్కు అనుట, సిగ్గు నెక్కొని విభుఁడు=రాజు సిగ్గునొంది, మునుకుచు=మిణకరించుచు, సొదలనీఱు

మొగము వ్రాలఁగ వైచి మునుకుచు నున్న
వానితలంపు భావంబున నెఱిఁగి
యానీలకంధరుం డనియె నవ్వుచును
'సొదలనీ ఱలఁది యచ్చుగఁ దోలు గప్పి
పొదివి నిచ్చలు బహుభూతముల్ గొలువ
నీవల్లకాటిలో నిటు విహరింప 2680
నావంటివాఁడ వై నాఁడవు నీవు
నిది గాధిపుత్రుమహేంద్రజాలంబు
విదితంబుగా నీకు వివరింతు వినుము
మసనంబు గాదిది మఘశాల గాని
యెసఁగు శల్యములు గా విధ్మముల్ గాని
పడినపుర్కలు గావు పాత్రలు గాని
యడరునెత్తురులు గా వాజ్యంబు గాని
యొలయుకొఱ్ఱులు గావు యూపముల్ గాని
తలవెంట్రుకలు గావు దర్భలు గాని
వెఱవక నిన్నేలుపీరబాహుండు 2690
మఱియుఁ గాలుఁడు గాని మాలఁడు గాఁడు
వినుము నీకూర్మిదేవిని నేలుచున్న
యనఘుండు కౌశికునను నుతి నిలిచి

=చితియందలిబూడిద, పొదివి=చుట్టుకొని, 'బహుభూతమునిచ్చలుపొదివి కొలువఁ' అని యన్వయము, నావంటివాఁడవు= నేనెట్లు వల్లకాటిలో పూర్వోక్తవిధములనుందునో యట్లే నీవునున్నాఁడవనుట, మసనంబు = వల్లకాఁడు, మఘశాల=యజ్ఞశాల, ఇధ్మముల్=కట్టెలు, ఆజ్యము=నెయ్యి, యూపముల్ = యూపస్తంభములు, కాలుఁడు=యముఁడు, దుర్గోహ... కారంబు = చెడ్డయ

కలఁగక కపటమార్గమునఁ జరించు
కలిరాజు గాని తాఁ గాఁడు బ్రాహ్మణుఁడు
మతి నింక నీకనుమాన మేమిటికి
ధృతిఁ జూడు' మని దివ్యదృష్టి నిచ్చుటయు
నంతయు విస్మయం బడర వీక్షించి
సంతోషమునఁ బొంది సతియును దాను
నొక్కట సాష్టాంగ మొనరించి భక్తి 2700
నెక్కొన 'పరమేశ నీప్రసాదమున
నరిగె దుర్మోహమదాంధకారంబు
పరఁగె సమ్యగ్జ్ఞానభాస్కరోదయము
నీభవబంధంబు లిన్నియుఁ బాపి
నీభక్తుగా నేలి నీసేవ మరిపి
నన్ను మన్నింపవే నమ్రవిధేయ
నన్ను రక్షింపవే నాగకేయూర
నీకు మ్రొక్కఁగఁ గంటి నినుఁ జూడఁ గంటిఁ
బ్రాకటంబుగ జన్మఫల మబ్బె నాకు
నిందునెమ్మది నిన్ను నిలుపుట దక్క 2710
నొండువరంబు నే నొల్ల నీ యాన'
యనునప్పు డారాజునర్ధాంగలక్ష్మిఁ

---

జ్ఞానమనెఁడు గొప్పచీఁకటి, సమ...దయము=మంచిజ్ఞానమనెడి సూర్యోదయము, నమ్రవిధేయ = అడఁకువతో భజించువారికి పరతంత్రుఁడైనవాఁడా, నాగకేయూర = సర్పములు బాహుపురులుగాఁగలవాఁడా, 'నిందునెమ్మది నిన్ను నిలుపటదక్క' = నాపూర్ణహృదయములోనిన్ను నెలకొలుపుటతప్ప, అర్ధాంగలక్ష్మిఁ=భార్యను-చంద్రమతిని, కాత్యాయని=పార్వతి, శాములఁ

దనకృపాదృష్టిఁ గాత్యాయని చూచి
'రా చంద్రమతి పతివ్రత వౌదు వీవు
నీచరిత్రంబు వర్ణింప నచ్చెరువు
సుదతి నీమంగళసూత్రంబు గాదె
పదివేలబాములఁ బాపె నీపతికి
సౌభాగ్యవతివి గా సకలసామ్రాజ్య
వైభవంబుల మించి వసుధ నేలుచును
బెద్దగాలమునకుఁ బ్రియుఁడును నీవు 2720
నొద్దిక వచ్చి మాయొద్దనే యుండుఁ'
డని కుస్తరించి 'నీ వడిగినవరము
కొను మిత్తు' మనిన నక్కొండరాచూలి
పదముల వ్రాలి 'భూపాలబాలకుని
బ్రదికించి నానిందఁ బాపి రక్షింపు
సకలజగన్మాత శాంభవి' యనుఁడు
వికసితవదనారవింద యై గిరిజ
'నీచిత్తశుద్ధికి నెఱయ మెచ్చితిని
రాచపాపఁడు మున్న బ్రతుకు లోహితుని
ప్రాణ మిచ్చితి హరు పంపున' ననిన 2730
మాణిక్యకీలితమంజుమంజీర
కంకణకింకిణీకాంచనవలయ
ఝుంకృతు లొలయ వజ్రపుటంటుజోడు

---

=ఆపదలను, కుస్తరించి=బుజ్జగించి, కొండరాచూలి=పర్వతరాజైనహిమవంతు నికూఁతురగు పార్వతి, భూపాలబాలుకుని=కాశిరాజుబిడ్డను, హరుపంపునన్ =శివునియాజ్ఞ చేత, మాణిక్య...ఝుంకృతులు=రత్నములు పొదుఁగఁబడిన సొగసైన యందెలు కడియములు, చిఱుగజ్జెలు, మొలనూలు, వీనిఝుంకారధ్వనులు, నేవ

తళుకులు మెఱయునద్దంపుఁజెక్కిళ్లఁ
దళుకు దళుక్కని తఱుచుగా మెఱయఁ
గదలుబంగారుచిల్కలరావిరేక
పొదలి నెన్నుదుట సొంపుగ నటియింప
గోమేధికపుఁబులిగోరు నేవళము
ప్రేమమై యురమునఁ బెనఁచి తూఁగాడఁ
బరఁగ నుంగరములపచ్చనిడాలు 2740
బెరసి ముద్దులవ్రేళ్లఁ బెనఁగ నేతెంచు
సుతు లోహితాస్యునిఁ జూడ నాచంద్ర
మతికిఁ జన్నులు సేఁపె మమత నాయింతి
యానందబాష్పంబు లందంద రాల
గా నక్కతో నొత్తి కౌఁగిటఁ జేర్చి
ముద్దాడుచుండ నప్పుడు కౌశికుండు
తద్దయు లజ్జించి తలవంచుకొనుచుఁ
గడుఁ జిన్నఁబోయి యాగ్రహ మెల్లఁ బోవ
విడిచి శంకించుచు వెఱఁగున మునిఁగి
'తపమనుదనమూలధనము ప్రతిజ్ఞ 2750
నెపమునఁ జెడిపోయె నేఁడు నాకకట
పాకశాసనుఁ డేల ప్రశ్న గావించె
నాక్రియ మును లెల్ల నట్లూరకుండఁ
బాఱెడిబండ్లకుఁ బదములు సాఁచు

---

శము=హారము, ఉరమునఁ బెనఁచి=ఱొమ్మునందుగీలుకొని, తపమను తనమూలధనము=మూలధనమువలె సంతరించిన తనతపస్సు, పాఱెడి... వీటఁడిసగిది=పరుగెత్తుచున్న బండ్లను పోనీయకుండ నిలుపనెంచి తనకాళ్లడ్డముగాఁజాఁపి తు

వీటఁడిపగిది వివేకంబు మాలి
పని లేనిజగడంబు పైకి రాఁ దిగిచి
యనఘు వసిష్ఠమహామునిసింహుఁ
గలఁచి నాదెస కేల గవియించుకొంటి
వల దని సుర లైన వారింపరైరి
జగతిలోపల హరిశ్చంద్రభూవిభుఁడు 2760
పొగడొందె నేమి తాఁ బొగడొందఁ డేమి
బొంకకుండిన నేమి బొంకిన నేమి
కింకరిపడి పరికింప నాకేల
నేలకు నింగికి నెఱి సూత్రపెట్టఁ
జాలెడునాబుద్ధి సమసె నేఁ డనుచు
నొగి వ్రేటు దప్పుటయును జోహా రనెడు
పగిది సన్నిధి యైనభర్గాదిసురులఁ
గని మ్రొక్కి పార్థివుఁ గౌఁగిటఁ జేర్చి
మనమున హర్షించుమాటలు వలికి
'బడలితి వెంతయు భానుకులేశ 2770
జడమతిఁ బూని నీసత్యంబు పెంపు
సొలవక నొరసి నేఁ జూచుట కిట్లు

---

దకుసానిని నిలుపలేక తానే బాధనొందునట్టి వెఱ్ఱివానివలె, కవియించుకొంటి =ఎదిరించునట్లు చేసికొంటి, కింకిరిపడి=కోపపడి, పరికింపన్=పరీక్షింప, నేలకునింగి... నాబుద్ధి=భూమికి ఆకాశమునకు సరిగా సూత్రము పెట్ట సమర్థమైన నాబుద్ధి-భూమ్యాకాశముల కవలీలగావ్యాపించునట్లు అతివిస్తీర్ణమైన నాబుద్ధి యనుట, సమసె=నశించెను, వ్రేటు...పగిదిన్=వ్రేటు తప్పిపోఁగా జోహారని మ్రొక్కునట్లు-అందినచోతలయును, అందనిచో కాళ్లును పట్టుకొనునట్లు, లేక వ్రేటు తప్పఁగానే జోహారన్నట్లు తటాలున, పార్థివున్=రాజును, ఒరసి=ఒత్తి,

నలఁకువఁ బొందించి నాతిని నిన్ను
వేవేల విధముల వెతలఁ గుందించి
కావరంబునఁ జాలఁ గల్ల చేసితిని
లోలత నా తప్పు లోఁగొని మనసు
జాలిఁ బో విడిచి యీసామ్రాజ్యలక్ష్మి
నెమ్మదిఁ గైకొని నెఱి మహీప్రజల
నిమ్ముల రక్షింపు మిఁక' నన్న నవ్వి
'యకట మునీంద్ర యి ట్లానతీఁ దగునె 2780
సకలజగన్నుతచరితుండ వీవు
నీకేటి తప్పులు నిఖిలలోకముల
నీకతంబున మించె నేఁడు నా కీర్తి
ఘన మైననీయనుగ్రహమునఁ గాదె
చనుదెంచె ననుఁ బ్రోవఁ జంద్రావతంసుఁ
డీదేవతలు మును లీయోగివరులు
నీదయఁ గాదె మన్నించిరి నన్నుఁ
జల్లనినీకటాక్షంబు నామీఁద
నుల్లంబులో మోద ముప్పొంగఁ జేసెఁ
బరితాపముల నెల్లఁ బాపె సౌఖ్యములఁ 2790
బురికొల్పె నింక నోమునిచంద్ర నిన్ను
వెఱచుచు నొకమాట వేఁడెద నేను
మఱచియు రాజ్యంబు మళ్లి కొమ్మ నకు
మెలమితో ము న్నొక్కఁ డిచ్చినదైనఁ

నలఁకువ=ఒరిపిడి, నాతిని=స్త్రీని - నీభార్యయైన చంద్రమతిని, చంద్రావతంసుఁడు=శివుఁడు, మున్నొక్కఁడు... కడపినట=ఒకఁడు ముందు దానిచ్చినట్టిగాని

బొలుపొందఁ దా దార వోసినదైన
సూది మోపెడునంతచోటు నాభూమి
లే దని కడపిన లెక్కింప వాఁడు
ఘనతర మగునరకమున వేయేండ్లు
మునుఁగుచుఁ గ్రిమిరూపమున వసియించు,
వసుధర్మశాస్త్రివాక్యార్థంబు గొంత 2800
మనమునఁ దలపోయుమా మునినాథ
యేకాతపత్రమై యెసఁగునీవసుధ
నీ కిష్ట మగువారి నిలిపి యేలింపు'
మనుటయు 'మే లయ్యె నట్ల చేసెదను
జననాథ నాకు నీసకలరాజ్యంబు
నీచేత నేలింప నిక్కంబు వేడ్క
నా చిత్తమునఁ జాల ననిచిన దిపుడు
బొంకితి నని పొమ్ము పో కున్న వట్టి
శంకలు మాని నాజాడనే రమ్ము
దేవేంద్రుఁ డాదిగా దేవసంఘములు 2810
నావామదేవా దులైనసన్మునులు
సెవులార విన మున్ను సేసినప్రతిన
శివశివ తప్పనే చెచ్చెర నిన్ను
నిల నెంతగాలంబు నేలింతు ననుచుఁ
బలికితి నందాఁకఁ బాలింపు వసుధ

---

ధారపోసినట్టిగాని భూమిలో సూదిమోపెడునంతిమాత్రముభాగము ఇయ్య లేదనిచెప్పి జరపిపుచ్చినయెడల, ఏకాతపత్రము=ఏకచ్ఛత్రము, ననిచినది=పుట్టినది, బొంకితివనిపొమ్ము=అబద్ధము చెప్పితివనిచెప్పి తప్పించుకొనిపొమ్ము, పోకున్న...రమ్ము = అట్లుచెప్పిపోనియెడల నావెంటనే వచ్చి నాపంపుసేయుము,

మఱి మీఁద దేవేంద్రుమాఱటగద్దె
నెఱి నెంతగాలంబు నిలుపుదు నంటి
నంతగాలము నుండు మమరలోకమున
వింతగా దీమాట విశ్వేశునాన'
నావుడు నొండాడ నలికి భూనాథుఁ 2820
'డే వెంట నేదోష మెసఁగునో' యనుచుఁ
జింతింపు చున్నంత శిష్యులు గొలువ
సంతోషచిత్తుఁ డై చయ్యన వచ్చి
తన తేజ మెల్లెడఁ దనర వసిష్ఠుఁ
డనుపమభక్తి భర్గాదిదేవతలఁ
గని మ్రొక్కి ప్రస్తుతిఁ గావించి యప్పు
డినకులాధీశుని నీక్షింప నృపుఁడు
మ్రొక్కి చేతులు మోడ్చి మునినాథ నీవు
మిక్కిలికరుణ నామీఁదఁ గావించి
తోడిఁబడఁ బరుసంబుతో నిన్ను సోఁకి 2830
కడువడి మేల్మిబంగార మైనట్టు
లీతని నన్నుఁ బరీక్షింపఁ జేసి
ఖ్యాతి నొందించితి గాదె నీ విపుడు
ఘనతపోధనుఁ డైనగాధేయుతలఁపు
మనమున నెఱిఁగి సమ్మతిఁ బ్రోవ నిందు
వచ్చితి గాన జీవము వచ్చె నాకు

---

మాఱటగద్దె=ప్రతియైన సింహాసనమందు, పరుసంబు నిన్ను సోఁకి... బంగారమైన ట్లు=స్పర్శవేదితో నినుముతగిలి మంచి బంగారయినవిధమున, ఇచట స్పర్శవేదికి విశ్వామిత్రుఁడును, ఇనుమునకు హరిశ్చంద్రుఁడును ఉపమేయములు,

నచ్చుగా మీతలం పానతీ వలయు'
ననిన హరిశ్చంద్రు నావసిష్ఠుండు
గనుఁగొని తనవెంపు గాన రాఁ బలికె
'జగతి నిక్ష్వాకువంశజులసత్కీర్తి 2840
మిగులంగ నీచేత మెఱుఁగు వాటిల్లె
నాపురోహితుఁ డని ననుఁ బెద్దఁ జేసి
నాపూన్కి చెల్లించినాఁడ వీ వనఘ
యిట్టిసత్యవ్రత మిట్టియౌదార్య
మిట్టి తెంపును గాన మెవ్వరియందు
నెలమితోఁ గౌశికుం డేపని వనిచె
నలవడఁ గావింపు మదియె నాతలఁపు'
నావుడుఁ దనగురునాథువాక్యములఁ
ద్రోవక గాధిపుత్రునిమాట సేయ
ననుమతించె నరేంద్రుఁ డట శివ శక్ర 2850
వనజాసనుల మునివరుల పంపునను
దివ్యగంధంబుల దివ్యమాల్యముల
దివ్యభూషణముల దివ్యాంబరములఁ
గులపతితోఁ గూడఁ గువలయేశ్వరుని
నెలమి నచ్చర లెల్ల నెమ్మిఁ గైసేయ
నాసమయమునఁ బూర్వాద్రిశృంగాభ
భాసురం బగు చున్నభద్రపీఠమున
రమణీయ మగు హేమరత్నకుంభముల

---

పూర్వాద్రి... భాసురము=తూర్పుకొండశిఖరముతో సాటిగా ప్రకాశించు చున్నది, హేమము=బంగారు, అమరనదీజలంబు=గంగాజలము, బకము=కొంగ,

నమరనదీజలం బమరఁ దెప్పించి
శ్రీకరంబుగ నభిషేకంబు చేసి 2860
'శ్రీకంఠుకరుణావిశేషంబు వలన
ధరణీతలం బెల్లఁ దగ నేలు' మనుచుఁ
గరమొప్పఁ బట్టంబు గట్టి రావేళఁ
గమలాసనుం డాదిగా మునివరులు
నమర దీవించి మంత్రాక్షత లిడిరి
తిరముగా ఘోషించె దేవదుందుభులు
పొరిఁ బొరి వర్షించెఁ బుష్పవర్షములు
పాడిరి గంధర్వభామిను లెలమి
నాడిరి వేఁడుక నప్సరః స్త్రీలు
చల్లనై విభుమీఁదఁ జందనానిలము 2870
నుల్లంబు వికసింప నొయ్యన నొలసెఁ
బరమేశుఁ డప్పు డాపార్థివేశ్వరునిఁ
బరఁగ దీవించి 'నీపట్టణంబునకు
భూనుతవైభవంబున నేఁగు' మనుచుఁ
దానును సురలు నంతర్ధాన మొంది
(*రంత వసిష్ఠసంయమి గాధిసుతుని
పంతంబుమాటలు పచరించి 'మిగుల
నొంచి నాతనయుల నూర్వుర నీవు
ద్రుంచునప్పుడు నింతదుఃఖంబు లేదు
యకట హరిశ్చంద్రు నతికష్టవృత్తి 2880

* ఈపుండలీకరణములోనిది పెక్కుప్రతులం గానరాదు. మఱియునిందు లక్షణదోషములును దక్కిన భాగమునలేనివి గనుపట్టుచున్నవిగాన యిది ప్రక్షిప్తమే.

సకలరాజ్యముఁ గొని చండాలుఁ జేసి
వికృతరూపంబు గావించిననీవు
బకమవై యుండుము పాపాత్మ' యనుచు
శాప మిచ్చుటయు విశ్వామిత్రుఁ డలిగి
యేపున 'నాఁడేలవే యగు'మనుచుఁ
బ్రతిశాప మిచ్చినఁ బరఁగ నక్షణమె
యతులు కొక్కెరయును నాఁడెలు నైరి
వెలయు దీర్ఘము మూడువేలయోజనము
లలరఁ బదాఱువేల నిడివి గలుగు
కొక్కెరయును నతిఘోరరూపమున 2890
నొక్కట ద్వ్యధిక మాయోజనోన్నతిని
నతిభీకరం బైనయాఁడేలు నగుచు
ధృతి యొప్ప భాగీరథీసమీపమున
బలమునఁ బోరెను బక్షిద్వయంబు
చలమును బలమును శౌర్యంబు మెఱయఁ
జరణతాడనతీవ్రచంచుప్రహతుల
నురుపక్షవిక్షేపణోగ్రతాపముల
శిరముల నరములఁ జిక్కని తొడలఁ
దొరఁగురక్తంబులతో శరీరములు
నరుణవర్ణంబులై యతిభీకరముగఁ 2900

---

ద్వ్యధికమాయోజనోన్నతిని=మూఁడుయోజనముల పొడవు చేత, భాగీరథి=గంగ, చరణ...ప్రహతులన్ = కాళ్ల చేఁదన్నుటల చేతను వాఁడిముక్కులతోఁ బొడుచుటల చేతను, ఉరుపక్ష... తాపములన్ = పెను ఱెక్కలను విదుర్చుట చేతఁ గలిగినగొప్పసంతాపముల చేతను, పక్షపదాహతిన్ = ఱెక్కలయు కాళ్లయు కొట్టు

బోరిఁబోరి నుడుగక పోరంగ వారి
పక్షపదాహతిఁ బరఁగంగ జలధు
లక్షీణగతుల నేకార్ణవంబైన
చందంబుఁ గైకొని జనపాలవరుఁడుఁ
జంద్రమతియుఁ దనుజన్ముని భయము
లందంద తేర్చుచు నాసమయమున
నెడఁ జొచ్చి వారింప నింతలోఁ గదియఁ
దడయక నాఁడే లుదగ్రతఁ గదిసి
బకముకంఠముఁ బట్టి బలువుగఁ ద్రెంప
బకము పక్షములచే బలువిడి మోఁద 2910
గిరులు వ్రేళ్లతో తలక్రిందు మీఁదయ్యెఁ
దరులతో మృగపక్షితతులు బిట్టగసెఁ
దెఱలి యా భూదేవి ధృతి దప్పి దివికి
మొఱఁ బెట్టఁ బోయెనో మురవైరి కనఁగ
సురలును నజుఁడు నచ్చోటికి కేతెంచి
యిరవుర యెడఁ జొచ్చి 'యిఁకఁ జాలు' ననుచుఁ
గృపతోడ వారిపక్షిత్వము మాన్పి
'యపగతకల్మషు లగుమీర లిట్టి
ఘోరసంగ్రామంబు క్రూరతఁ జేయఁ
గారణమేమి యీకౌశికు వలన
నాహరిశ్చంద్రున కైనకీ డేమి 2920

---

టచేత, జలధులు=సముద్రములు, ఏకార్ణవంబైన=ఒక్కటే సముద్రమైనట్టి, తనుజన్ముని=కుమారుని, అపగతకల్మషులు=పోయిన పాపముగలవారు - పాపము లేనట్టివారు, సంగ్రామంబు=యుద్ధము, పురికొన్న సంభ్రమంబున=అతిశయించి

యూహించి కనుఁగొని యుడుగు కోపంబు'
ననుచు వసిష్ఠుని నజుఁడు ప్రార్థించి
మునుకొని వారి నిమ్ములఁ గౌఁగిలించి
కొనఁజేసి శాంతిఁ గైకొలిపి వీడ్కొల్పి
చనియె వేల్పులుఁ దాను జలజసంభవుఁడు)
యంత నా వృత్తాంత మానారదుండు
వింతగాఁ జెప్పిన విని సత్యకీర్తి
యానందరసభరితాత్ముఁ డై యపుడు
భూనాయకుని రాక పురిఁ జాటఁ బనిచె 2930
నావార్త వీనుల కమృత మై సోఁక
వావిరిఁ దమతమవాడవాడలను
బురిగొన్న సంభ్రమంబునఁ బౌరసతులు
పరువడి బహువిధభవనమాలికలఁ
దనరుముంగిళుల ముందరిహజారములఁ
గనుపట్టునగరుపంకంబునఁ బూసి
సిరిగందమున నోలిఁజిగు రొప్పఁ జల్లి
సురుచిరకర్పూరసూత్రముల్ నిగుడఁ
బలుచనిచాఁదునఁ బట్టెలు దీర్చి
ధళధళ మెఱయుచిత్తరువు వ్రాయించి 2940
కర మొప్పఁ గమ్మనికస్తూరి నలికి
పరస మాపన్నీట జలకముల్ సల్లి
యాలయంబుల నెల్లనాణెము త్తెముల

---

నసంబరముతో, పౌరసతులు=పురస్త్రీలు, భవనమాలికలు=ఇండ్లవరుసలు, సిరి గంధము=శ్రీగంధము, రంగవల్లికలు=ముగ్గులు, తావుమంజిష్ఠపుట్టములు=చిక్క-

లీలమై రంగవల్లిక లొప్పఁ దీర్చి
ప్రమద మారఁగ నెఱపట్టుపుట్టములఁ
గమనీయ మగుమేలుకట్లుఁ గట్టించి
తావుమంజిష్ఠపుట్టములు తేరులను
తీవి మీఱఁగ సంఘటించి కుంభములఁ
జెలువారఁగా వన్నెచీరలు గట్టి
కలువడంబులు గట్టి కాంచనదండ 2950
కలితపతాకలు గ్రందుగా నెత్తి
విలసిల్లఁగాఁ బురవీథి మార్గముల
స్ఫురదురుకాంచనపూర్ణకుంభములఁ
బరువడి నెత్తి పుష్పంబులు నెరపి
ప్రవిమలరత్నదర్పణతోరణములు
రవిదీప్తులకును మార్పడ నమరించి
కర మొప్పు పురము శృంగారించి రంత
నరయంగ వివిధవాద్యంబులు మ్రోయఁ
దేరులఁ గరులను దేశాలిభటుల
శూరుల వీరులఁ జుట్టాల హితుల 2960
దొరల సామంతుల దుర్గాధిపతుల
సరసుల సత్కవీశ్వరులఁ బౌరకుల
నందఱఁ దోడ్కొని యానత్యకీర్తి

---

నైనమంచి యెఱుపువన్నె వలువలు, కాంచనదండకలితపతాకలు = బంగారుదండములతో నొప్పుధ్వజములు, గ్రందుగాన్ = దట్టముగా, ప్రవిమలరత్నదర్పణతోరణములు = స్వచ్ఛమైన రత్నములచేత రచింపఁబడిన యద్దములుగల వెలుపలిద్వారములు, రవిదీప్తులకును మార్పడన్ = సూర్యకిరణములకు ఎదురుపడునట్లుగా-తోరణములందలి రత్నదర్పణములు సూర్యకిరణము లెదురుపడునట్లు

వందిమాగధజయధ్వను లుల్లసిల్ల
నెదురుగా నేఁగి యయ్యినకులేశ్వరుని
పదపంకజములకు భక్తితో మ్రొక్కి
యొనరఁ జేతులు మోడ్చి 'యో హరిశ్చంద్ర
దినకరవంశప్రదీపక నీకుఁ
బ్రతిసేసి కొనియాడ రాజులు గలరె
సతతసత్యవ్రతాచారసంపదలఁ 2970
దొడరి వసిష్ఠునితోఁ గాయిడించి
తడయక తనఘోరతపము పెంపునను
బడయ దుర్లభ మైనబ్రహ్మఋషిత్వ
మడరంగఁ గైకొని యఖిలలోకములఁ
బొగడొందు కౌశికముని వెఱఁగంద
నెగడించి మించితి నీ సత్యమహిమ
వసుమతీవల్లభ వన్నె రెట్టించె
నెగడె నీకతమున నీవంశ మెల్ల
సన్నుతం బైననీసామ్రాజ్య లక్ష్మిఁ
బన్నుగాఁ గైకొని ప్రజలఁ బాలింప 2980
విచ్చేయుఁ డీఁక' నని విన్నవించుటయు
నచ్చుగా దరహాస మల్లన యొలయ
సమయోచితప్రియసంభాషణములఁ
గొమరార మంత్రిముఖ్యుని నాదరించి
సన్నుతకాంచనాచలమును బోలె

---

విలిపి మిక్కిలి ధగధగ ప్రకాశించునట్లుగా ననుట, తేజీలు=గుఱ్ఱములు, ప్రతి
సేసి=పాటిచెప్పి, కాయిడించి=మాఱొడ్డి-కలహించి, కాంచనాచలము=బంగా

నున్నతం బై మించునొక్కరథం బెక్కి
చతురంగబలము లసంఖ్యలు గొలువ
మితి లేనివాద్యముల్ మిన్నంది మ్రోయ
మానితమాగధమధురగానములు
వీనుల కింపుగా విలసిల్లి పొలయఁ 2990
దలకొని వందిబృందములు నుతింపఁ
జెలఁగి పుణ్యాంగనల్ సేసలు చల్ల
వెన్నెల వెదచల్లువింజామరములఁ
బన్నుగా డగ్గఱి భామలు వీవ
వాలారుఁగన్నులవారకామినులు
లీలమైఁ బసిఁడిపళ్లెరములలోనఁ
గమనీయమణిదీపకళికలు మెఱయ
నమరించి మెయిదీఁగె లల్లన పొలయ
ఘనకుచంబులు నిక్కఁ గరములరుచులు
గనుపట్ట దరహాసకాంతులు నిగుడఁ 3000
గలికిచూపుల మించుగములు రాణింప
నిలిచి నివాళింప నిండారువేడ్కఁ
బురముఁ బ్రవేశించి భూప్రజ లెల్లఁ
బరువడి జయ వెట్టఁ బార్థివేశ్వరుఁడు
వసుమతి నిజరాజ్యవైభవలీల
మెసగంగఁ జిరకాల మేలుచు నుండె
ననుచు మార్కండేయుఁ డాధర్మజునకుఁ

---

ఉక్కొండ, మణిదీపకళికలు= మొగ్గలవంటి రత్నదీపములు, దరహాసకాంతులు= చిఱునవ్వు మెఱుఁగులు, మించుగములు=మెఱపుల సమూహములు, భ్రమరా

బెనుపొంద మున్ను సెప్పిన మార్గమునను
సత్యసంధుఁడు హరిశ్చంద్రునిచరిత
నిత్యసత్కీర్తులు నెగడ రచించె 3010
భ్రమరాంబప్రసాదసంప్రాప్తకవిత్వ
సుమహితసామ్రాజ్యసుఖపరాయణుఁడు
చతురసామాన్యలక్షణచక్రవర్తి
ప్రతివాదిమదగజపంచాననుండు
మతిమంతుఁ డయ్యలమంత్రిపుంగవుని
సుతుఁడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు
కవు లెన్న నుత్తరకథ రచియించె
నెవరు పఠించిన నెవ్వరు వినిన
జనులకుఁ బుణ్యముల్ సమకూడు సిరులు
మునుముగా నాయుష్యములు గొన సాఁగుఁ
దాముఁ బుత్రులు నన్నదమ్ములు సఖులుఁ
దామరతంపరై ధరణిఁ బెక్కేండ్లు
వేమాఱు నోములు వెలయఁ బెండ్లిండ్లు
సేమ మేర్పడ నెరదుఁ జేయుచుందురు.

హరిశ్చంద్రోపాఖ్యానము.

సమాప్తము.

---

...: పరాయణుఁడు = భ్రమరాంబిక యొక్క యనుగ్రహమువలనఁ గలిగినకవిత్వము నెడి మిక్కిలి గొప్పసామ్రాజ్యమునందలి సుఖమునందు నిష్ఠుఁడైనవాఁడు, ప్రతివాది మదగజపంచాననుండు = ప్రతివాదులనెడి మదపుటేనుఁగులకు సింగమైనవాఁడు.

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 21 | 191 | జర్ఝరుల | జజ్ఝఱుల |
| 47 | 619 | మిడ్గురులు | మిడ్గుఱులు |
| 61 | 831 | అవికె | అవిక |
| 70 | 965 | నతిక్రమి[illegible] | [illegible]క్రమ్మి |
| 91 | 1316 | నిలి[illegible] | [illegible] |
| 98 | 1446 | వ[illegible]న | నడి[illegible]న |
| 107 | 1602 | [illegible]రా[illegible] | బీదు[illegible] |
| 184 | 477 | [illegible]అ దందఁడై | నక[illegible]డఁడై |
| 187 | 520 | త[illegible]స | తృప్త[illegible] |
| 206 | 828 | య[illegible]నసి | యె[illegible]సి |
| 212 | 924 | యెన్[illegible]డు | [illegible]డు |
| 214 | 974 | జజాట | [illegible]జాట |
| 268 | 1955 | జడుగును | బడుగును |